# శాసన సంపుటి

(1, 2 భాగములు)

బి. యన్. శాస్త్రి. ఎం. ఏ.

సరస్వతీ నిలయం
నారాయణగూడ, హైదరాబాదు-ఆం. ప్ర.



राष्ट्रपति भवन, नई दिल्ली-4.
RASHTRAPATI BHAVAN,
NEW DELHI-4.

October 26, 1973.

Dear Shri Sastry,

Thank you for your letter and a copy of your book "Sasana Samputi", which I have gone through with interest. The book is instructive and useful. The inscriptions not only throw light on the rise and fall of the early dynasties that ruled over Andhra but also help in the study of the growth and development of Telugu script, language and literature. The book should, therefore, prove to be beneficial both to the historians and the philologists.

I wish your endeavours all success.

Yours sincerely,

V.V. Giri

Shri B.N. Sastry,
3-5-1027,
Narayanguda,
Hyderabad-500029,
ANDHRA PRADESH.

# అభిప్రాయము

దేశ చరిత్ర నిర్మాణమునకుగల ముఖ్యాధారములలో తామ్రశిలాశాసనాలు ప్రథమగణ్యమైనవి. ఇవి అటనట పండిత గృహములలోను, శిథిల దేవాలయప్రాంగణములలోను ఉండి తెలుగువారి నిరాదరణవలన కాల గర్భమున కలియుచున్నవి. కేంద్ర ప్రభుత్వ పురాతత్వ శాఖవారు భారతదేశమునందలి, అన్ని ప్రాంతములలో నిపుణులైన శాసన పరిశోధకులను నియమించి, అనేక శాసనములను సేకరించి ప్రకటించుచున్నారు. వారిచే సేకరింపబడి ఇంకను ప్రకటనకు నోచుకోని శాసనాలు వేల సంఖ్యలో కలవు. కేంద్ర ప్రభుత్వముతో బాటు మైసూరు, ఆంధ్ర ప్రదేశ్‌వంటి రాష్ట్రాలలో ప్రభుత్వ ఆర్షశాఖలవారు అప్పుడప్పుడు శాసనాలను ప్రకటించు చున్నారు. మైసూరు ప్రభుత్వమువారు "ఎపిగ్రాఫికా కర్నాటిక" పేరుతో చాలా కృషిచేసినారు. మన ప్రభుత్వ మువారు ఆరంభించిన "ఎపిగ్రాఫికా ఆంధ్రికా" ఇంకను పురటిలోనే ఉన్నది. వీరికృషి తాబేటినడకతో సాగు చున్నది.

ప్రభుత్వమువారేకాక ఈ రంగములో అభిరుచి అధికారములుగల విద్వాంసులుగూడ వ్యక్తిగతముగ అనేక శాసనాలను పరిష్కరించి విపులవ్యాఖ్యలతో మాస పత్రికలయందు ప్రత్యేక సంచికలయందు ప్రకటించు చున్నారు. కొన్ని ప్రజాసంస్థలుగూడ ఈ కార్యమును చేబట్టి ప్రశంసనీయమైన కృషిచేయుచున్నవి. అట్టి సంస్థ లలో రాజమండ్రియందలి 'ఆంధ్రేతిహాస పరిశోధక మండలి' హైదరాబాద్‌లోని 'లక్ష్మణరాయ పరిశోధక మండలి' పేర్కొనదగినట్టివి. వ్యక్తిగతముగా ఈ రంగమున విశేష కృషిచేసి, నెల్లూరి శాసనములు 3 సంపు టాలుగా ప్రకటించిన కీ. శే. బట్టర్‌వర్తు-వేణుగోపాలచెట్టిగారలు స్మరణీయులు. ఈ విధముగా ఒక్కొక్క జిలా సర్వేచేయించి ప్రతిజిల్లాకు వేరు వేరు శాసన సంపుటాలను ప్రకటించవలసిన అవసరము చాలా గలదు. ఇప్పటికి ఎన్నో తామ్ర శాసనాలు కరిగించబడి నష్టమైనవి. ఎన్నో శిలాశాసనాలు ముక్కలుచేయబడి ఇండ్ల గోడ లకు-పాదులకు వినియోగింపబడినవి. ప్రత్యేకముగా ఇందుకే నియుక్తమైన ఆర్షశాఖ అనవసర విషయాలకు ప్రాధాన్యమిచ్చి అత్యంతావశ్యకమైన శాసన పరిరక్షణ, ప్రకటనలను నిర్లక్ష్యము చేయుచుండుట క్షమార్హము కాదు. వ్యక్తిగతముగా వ్యయప్రయాసలకులోనై శాసన పాఠములను సేకరించి పరిష్కరించి అమూల్య వ్యాస ములతో ప్రకటించుచున్నవారిలో ప్రామాణిక పరిశోధక విద్వాంసులు కీ శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. పరిశోధనా రంగమునకే ఆచార్యపీఠము వంటివారు. వారు పరిష్కృత శాసనములను ప్రకటించినారు. అవన్నియు భారతి మొదలైన పత్రికలలో వచ్చినవి. వ్యక్తిగతముగా పరిశోధనాభిరుచితో వ్యయప్రయాసాలు సహించి ఇంతవరకు అముద్రితములు ఆంధ్రదేశ చరిత్రకు చాలా ముఖ్యములు అయిన తామ్ర శిలాశాసనాలను సేకరించి చక్కని వ్యాసములతో సొంత వ్యయముతో ఈ సంపుటిరూపమున ప్రకటించుచున్న శ్రీ బి. యన్. శాస్త్రిగారి సాహసోత్సాహములు ప్రశంసనీయములు.

శ్రీ శాస్త్రిగారు తెలంగాణమున ఈ రంగంములో కృషిచేయుచున్న కొందరిలో ప్రథమగణ్యులు. వీరికి పరిశోధనలో తగిన అభినివేశము అధికారము గలదు ఎంతో శ్రమకులోనై సేకరించి ప్రకటించిన ఈ సంపుటిలో తామ్రశిలాశాసనములు రెండు భాగములుగా చేయబడినవి. మొదటి భాగమున తామ్ర శాసనాలు 2 విష్ణుకుండి వంశీయులవి. 1 మారర వంశీయులది 2 కళింగ గాంగరాజులకు సంబంధించినవి ఉన్నవి. రెండవ

భాగమునందు 10. కందూరి చోడులవి 12 కళ్యాణీ చాళుక్యుల కాలమునాటివి. కాకతీయులకాలమునకు చెందినవి, ఒకటి గోలకొండ నవాబులకాలపు శిలాశాసనములు ప్రకటించబడినవి ప్రతి శాసనమునకు చక్కని పాఠము, శాసన స్వరూప, లిపి, భాషా విశేష-కాలనిర్ణయ-శాసన విషయాదికములతో గూడిన విపులవ్యాఖ్య ఉండి చారిత్రకులకు, జిజ్ఞాసువులకు మిగుల ఉపయోగకరముగ ఉన్నవి.

తామ్ర శాసనములన్నియు సంస్కృత భాషలోను, శిలాశాసనములు చాలావరకు తెలుగు భాషలోను, కళ్యాణి చాళుక్య శాసనాలు 'హళెగన్నడ' భాషలోను యున్నవి. భాషాదృష్టితో కందూరు చోడుల శాసనాలు కాకతీయ శాసనాలు చాల ముఖ్యములై ఆనాటి తెలుగు భాష వ్యావహారికరూపమును విదితము చేయుచున్నవి. చారిత్రిక దృష్టితో నివి చాల విలువైనవి. ఇంతవరకు లోకమునకు తెలిసిన విష్ణుకుండిన రాజవంశము అమరావతి. విజయవాడ దెందులూరు, వేంగి పురములు రాజధానులుగా ఆంధ్ర దేశము నేలినట్లున్నది వారి మూలస్థానమేదో తెలియుటలేదు ఈ సంపుటిలోని ఇంద్రపాలనగర తామ్ర శాసనములవలన విష్ణుకుండినులు మహబూబ్ నగర మండలములోని శ్రీపర్వత ప్రాంతీయులనియు, ఇక్ష్వాకులకు సామంతులుగనుండి నల్లగొండ జిల్లాలోని ఇంద్రపాలనగరమును రాజధానిగా రాజ్యముచేసినారనియు, అటునుండి క్రమముగా ఆంధ్ర దేశమునంతయు నాక్రమించి 'దక్షిణాపథ పతు' లైరనియు, తెలియుచున్నది తెలంగాణముతో విష్ణుకుండినులకుగల ఘనిష్ఠ సంబంధము బయటపడినది. ఈ వంశములోని రాజులందరినిగూర్చి వారి కాలమునుగూర్చి చేయబడిన చర్చలవలన అనేక నూతనాంశములు వెల్లడియైనవి. అట్లే కళింగదేశము నేలిన మాఠరులు, గాంగరాజుల వంశక్రమములు, వారి వివరాలు పూర్వాంధ్ర చరిత్రకు చాల ముఖ్యమైనవి కందూరి చోడుల శాసనాలలో ఆ వంశీయులు మొదట ఏ ప్రాంతముల నేలిరో? తరువాత ఎవరికి సామంతులై ఏ యే ప్రాంతములను పాలించిరో? మొదలైన విశేష విషయములు వివరింపబడినవి. ఇందు ప్రకటితములైన కళ్యాణీ చాళుక్య శాసనాలు ఆ వంశములో కడపటి రాజుల కాలమునాటివి అప్పటి ఆంధ్రదేశ పరిస్థితులు కాకతీయుల రాజ్యారంభ విశేషాలు కలవు. ఈ విధముగా అనేక నూతనాంశములను వెల్లడించి పశ్చిమాంధ్ర చరిత్రకు అపూర్వప్రకాశమును గూర్చుచున్న అముద్రితశాసనాలను సేకరించి విలువైన వ్యాసములతో ప్రకటించిన శ్రీ బి. యన్. శాస్త్రిగారి నభినందించుచున్నాను, వీరికి ఆంధ్రలోకము చాల ఋణపడియున్నది

విశ్వ విద్యాలయములలో-సాహిత్యముల నభిమాన విషయములుగ గ్రహించి విద్యనభ్యసించుచున్న విద్యార్థులకు, జిజ్ఞాసువులకు ఈ సంపుటి అత్యంతోపయుక్తమైనదనుట అతిశయోక్తికాదు. శ్రీ శాస్త్రిగారివంటి ఔత్సాహికులకు ప్రభుత్వము సహాయము చేసినచో ఈ రంగమున చాల కృషి జరుగగలదు. వీరు ఇట్లే జిల్లా శాసన సంపుటాలను ప్రకటించుటకు ఉత్సాహము, సహాయమును భగవాను డనుగ్రహించుగాత మని ప్రార్థించుచున్నాను.

అలంపూరు

ప్రమాదీచ-ఆశ్వీజము

గడియారం రామకృష్ణశర్మ

# మనవి మాటలు

"ఏ దేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం" అని శ్రీ, శ్రీశ్రీ అన్నారు గాని, కొన్ని దేశాల చరిత్ర చదివినప్పుడు ఆ చరిత్ర మంచి పనులలో మరొక దేశానికి తార్కాణ అయినట్టు తెలిసినప్పుడు, నాబోటి జిజ్ఞాసువుకు చరిత్ర గర్వకారణంగానే కనిపిస్తుంది. ముఖ్యంగా సత్యగవేషణే నిత్యకృత్యమై ఎవరి సహాయ్య సహకారాలు లేక ఏకాంగి వీరులై పరిశోధన రంగంలో ముందుకు ఉరుకు తున్న యువ మిత్రులు శ్రీ బి.ఎన్. శాస్త్రి వంటి వారిని చూచినప్పుడు, వారి పరిశ్రమ ఇయత్త తెలిసినప్పుడు నాకు గర్వం అఖర్వ మవుతుంది; కాలం వింతగా మారినా, ప్రలోభనాలు మేఘాడంబరాలై ఎంతగానో ముసురుకొన్నా, సద్యఃఫలాల విద్యుదాఘాతాలు, కన్నుల మిరుమిట్లు గొల్పినా, సుదూర ఫలమూ, స్వల్ప ప్రయోజనమూ అయిన పరిశోధనవృత్తి శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి వంటి వారి కాలధర్మంతో సమసి పోలేదనే విశ్వాసమూ నా మనసులో మువ్వేట అవుతుంది.

మిత్రులు శ్రీ బి ఎన్. శాస్త్రి, భిన్నూరి నరసింహశాస్త్రి కేవలం 'తాళీ దళ ప్రకర కాంతార సంచారి, శాసన శిలాపత్ర, వాసనా హసితాంతః కరణుడూ కాదు' 'పాపాయి పతకం' వంటి బాలగేయాల సంపుటి మొదలు రాధ, జీవనపథం, తీరిన కోరిక. పరివర్తిన. జీవితం-గమనం వంటి నవలలు తపోభంగం వంటి గేయ కావ్యాలు, నీరాజనం వంటి గేయ నాటికలు, సహకారం గ్రామ జీవనం వంటి నాటికలు, వాకాటక మహాదేవి వంటి చారిత్రక నవలలు, కాశీ ఖండము దాని ప్రాశస్త్యము, ఆంధ్రుల సాంఘికచరిత్రవంటి విమర్శ పరిశోధన గ్రంథాలు మొదలయిన మరెన్నో కృతులతో ఆంధ్రావళిని అలరించి, రచనా వ్యాసంగంలో మునిగినవాడు. ఇలాంటి రచయితకు శాసన పరిశోధన వంటి శిరోవేదన, శిరావేధన వింతగా తోచవచ్చు కాని, ప్రాత స్మరణీయులు ఆదిరాజు వీరభద్రరావు గారన్నట్లు బ్రతి మారుమూల పల్లే ధర్మాపోశీ అయిన తెలంగాణాలో పుట్టిన శ్రీ శాస్త్రి "కవ్వడి" వలె రచన, పరిశోధన, పరిశోధన వ్యాసంగ వ్యసని కావడం నామటుకు నాకు వింతేమీ కాదు.

శ్రీ శాస్త్రి ఇటీవలే స్వర్ణోత్సవంలో ఓలలాడిన "భారతి" లోను, ఇతరత్రాను ప్రచురించిన తాను సేకరించి, సంస్కరించి, వ్యాఖ్యానించి ప్రచురించిన తామ్ర శిలా శాసనాలను ఈ "శాసన సంపుటి" గా ముద్రించారు ఈ సంపుటిలో మొదటి భాగంలో తామ్ర శాసనాలు, రెండవ భాగంలో శిలాశాసనాలు ఉన్నాయి. తామ్ర శాసనాలలో రెండు విష్ణుకుండినులవి, ఒకటి మాఠర వంశీయులది, రెండు కళింగ గాంగులకు సంబంధించినవి ఉన్నాయి. శిలా శాసనాలలో పది కందూరి చోడ రాజులవి, పన్నెండు కల్యాణీ చాళుక్యులకాలంవి, పది కాకతీయుల కాలంవి, ఒకటి గోలకొండ నవాబులది ఉన్నాయి. ఇవన్నీ నూతన విషయాలను ఎన్నింటినో లోకానికి తెలియజేసి, చరిత్రలో విడిపోయిన లంకెలను సమకూర్చి ఇంతవరకు వివాదగ్రస్తమైన విషయాలను పరిష్కరించు కోవడానికి తోడ్పడుతున్నాయి.

శ్రీ శాస్త్రి ఆయా శాసనాల చర్చకు మొదట ఆయా వంశీయుల చరిత్ర క్లుప్తంగా

చెప్పి, కాలాదులు చర్చించి, శాసనం లభించిన వివరాలు తెలిపి, శాసనం లభించడానికి తోడ్పడిన వారికి కృతజ్ఞత తెలిపి, శాసన స్వరూపం, లిపి, శాసన విషయం, కాలనిర్ణయం, శాసన పాఠం, శాసన ప్రతిబింబం ఇచ్చి తమ వ్యాఖ్యలు పొందుపరిచారు. శాసన ప్రతిబింబాలు ఇవ్వడం వల్ల పాఠకులు స్వయంగా వాటిని చదువ గలిగిన వారు చదివి శ్రీ శాస్త్రి వ్యాఖ్యలలోని సాధుత్వా సాధుత్వాలను, ప్రశంసలు అభిశంసలు కురిపించడానికి అవకాశం కలిగింది.

ఆంధ్రదేశ చరిత్రలోని మహోజ్జ్వల ఘట్టాలలో ఒకటి విష్ణుకుండినుల పరిపాలనా కాలం. వీరు శాలంకాయనుల తరువాత ప్రబలులైనట్టివారు. వీరికి వేంగీపురం, అమరావతి, దెందులూరు, బెజవాడ, రాజధానుగా ఉండేవి. కాని వీరి మూలస్థాన మేదో స్పష్టంగా తెలియదు. శ్రీ శాస్త్రి ఇంద్రపాల నగర తామ్ర శాసనాలు ప్రచురించి విష్ణుకుండినుల మొదటి రాజధాని, నల్లగొండ జిల్లా రామన్నపేట తాలూకా, తుమ్మల గూడెం గ్రామం, చెరువు, ఇంద్రపాల గుట్టల మధ్యనగల విశాల ప్రదేశం పూర్వపు ఇంద్రపాల నగరమని, అక్కడినుంచే విష్ణుకుండినులు ఆంధ్రదేశములో విస్తరించి, "దక్షిణాపథపతులు" అయారని, మొదట బౌద్ధమతానుయాయులై, తర్వాత వైదిక మతానుయాయులు శ్రీ పర్వత స్వామి పాదానుధ్యాతులు, క్రతు సహస్రయాజినులు, అయ్యారని విపుల జర్చచేసి, ఈ వంశీయుల మూల పురుషుడు మహారాజేంద్రవర్మ ఇంద్రపాల నగరం స్థాపించి నాడని క్రీస్తు శకం 388-390లో ఉన్నవాడని క్రొత్త విషయం నిరూపించి, చరిత్రకు మహోపకారం చేశారు.

సముద్రగుప్తుని దిగ్విజయ యాత్ర తరువాత కళింగంలో చిన్న చిన్న రాజ్యాలు తల యెత్తాయి. మాఠర వంశీయులు పిష్టపురం రాజధానిగా కొంత తెలుగుదేశాన్ని ఏలారు. వీరిలో మొదటివాడైన శక్తివర్మ తన రాజధానిని పిష్టపురం నుంచి సింహపురాని మార్చాడు. ఈ సంపుటిలోని ఉమావర్మ మాఠరుని హోణరేంగ శాసనము క్రీ.శ. 439 లో వేయబడినదయి వుంటుందని శ్రీ శాస్త్రి నిర్ణయించి, మాఠరుల పరిపాలనా కాలం శక్తివర్మనుండి ఉమావర్మ వరకు 90 సంవత్సరాలని నిర్ణయించారు.

వేములవాడ భీమకవి శాపానికి గురి అయినట్లు చెప్పబడే అనంతవర్మ చోడ గంగదేవుని వంశమైన కళింగగాంగ వంశము దాదాపు వేయి సంవత్సరాలు కళింగ దేశాన్ని పాలించినది. ఈ రాజులు తమ శాసనాలలో తమ విజయరాజ్య సంవత్సరాలు తప్ప శకసంవత్సరాలు ఇవ్వ నందున చరిత్ర కారులకు చాల తికమక కలిగింది. శ్రీ శాస్త్రి కొత్తగా దొరికిన అనంతవర్మ సేవిది తామ్ర శాసనంలోను, అనంతవర్మ చోడ గంగదేవుని తెంబూరు తామ్రశాసనంలోను, ఉన్న వంశ వృక్షాల పరిశీలనతో చాల నూతన విషయాలు తెలియజేశారు.

నేటి నల్లగొండ, ఖమ్మం, మహబూబునగరం జిల్లాల ప్రాంతాన్ని తెలుగు చోడుల శాఖలలో ఒకటైన కందూరి శాఖవారు పదమూడు మంది దాదాపు రెండు వందల యాభై సం వత్సరాలు పాలించారు. వీరు కొంతకాలం పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా, కొంతకాలం స్వతంత్రులుగా, అటు తర్వాత కొంతకాలం కాకతీయ సామంతులుగా పాలించి తెలుగు సంస్కృతికి పోషకులయ్యారు. శ్రీ శాస్త్రి ఈ సంపుటిలో పది కొత్త కందూరి చోడుల శాసనాలు ప్రచురించి తొండరస చోళుడు (1078-1098) మొదలు రామనాథదేవ చోడ మహారాజు (1282) వరకు పాలించిన పదమూడుమందికి సంబంధించిన వివరాలు, కందూరు, కొలనుపాక, వర్ధమాన పురం, పానగల్లు పట్టణాలు రాజధానిగాచేసిన వివిధ సత్క్రియలను, తెలియచేసి తెలుగు చోడ

చరిత్రను సంపన్నం చేశారు. సమైక్యాన్ని మరింత దృఢం చేశారు. ఆగామోతుకూరు శాసనంలోని భాష చూస్తే నాడు తెలుగునాడును తియ్యని తెలుగు ఏలా ఏలిందో నే డెందుకు ఆత్మ ప్రత్యయం లేక అంగలార్చుతున్నదో కనువిప్పు కలుగుతుంది "మోతుకూరి పడుమటి పానుగంటి తెరు వుత్తరానను తాం బెట్టించిన మామిడి తోంట అంగరంగ భోగానకుంను, అంగభోగానకు చలిపందరి కుంట తూర్పునకు వెలివోలము రెండు పుట్లు సేనును యింతవట్టు ప్రవిత్తులును యిచ్చిరి. ఆ స్థానపతులు దేవరకు నడిపి నిత్యపడ్లు రాజనపు బియ్యము ముత్తుము పెసలు ముయ్యాడ, నేయి మూడు తవ్వలు. రెండు పిండివంటలున్ను, పాసముంను, పది మేలోగిరాలుంను, ముయ్యాడ పెరుగుంను, మిరియాలు రెండుంను, యింగువ మూడు సిన్నాల ఎత్తున్ను, మంచి పోంకలు పదేనుంను, మంచాకులు నలుపదేను, గంథము ఎండాదికి, యిరవది తులములును, కస్తూరికిని, కప్పురమూను ఈ ధర్మ దప్పక నడిపేది." (పుట-177)

కల్యాణీ చాళుక్య, కాకతీయ శాసనాలు కూడ కొత్తవే కనుక పెక్కు విషయాలు కొత్తవే చరిత్రకు తెలిశాయి.

ఈ విధంగా శ్రీ బి. ఎన్. శాస్త్రి ఇదివరకు ప్రకటించని కొత్త శాసనాలను పరిశోధించి ప్రచురించి, ఆంధ్రదేశ చరిత్రకే కాక, జాతి సమైక్యానికి చాల తోడ్పడ్డారని నేను విశ్వసిస్తున్నాను. ఈయన పరిశోధన శృంఖలలో దేశాన్ని దిగ్భ్రమగొలపే మరెన్నో అపూర్వ విషయాలు వెలువడగలవని ఆశించే వారిలో నేనే ప్రథముణ్ణని భావిస్తున్నాను.

పత్రికా రచయితగా ఉన్న పరిచయంతో ఇలాటి అపూర్వ పరిశోధన గ్రంథానికి మనవి మాటలు వ్రాసే అవకాశం కలిగించినందుకు శ్రీ శాస్త్రిగారికి ధన్యవాదా లర్పిస్తున్నాను.

69, ఆదర్శనగర్,
హైదరాబాదు-4.
ప్రమాది సంక్రాంతి

భాషాసేవకుడు
తిరుమల రామచంద్ర

# కృతజ్ఞతలు

సుమారు పది సంవత్సరములు ఉపాధ్యాయ వృత్తి నిర్వహించిన పిదప, 1959 వ సంవత్సరములో ఉస్మానియా విశ్వ విద్యాలయమున, ఎం. ఏ. చదువు అవకాశము నాకు కల్గినది. ఎం ఏ. ప్రథమ సంవత్సరము "ఆంధ్రుల చరిత్ర—సంస్కృతి" బోధించునపుడు, శాసన పరిశోధన పై అభిరుచి కలిగించి, నన్ను ప్రోత్సహించినవారు ఆచార్య డా॥ బి. రామరాజుగారు, వారి ఆదరముతో ఎం. ఏ. విద్యార్థులు నిర్వహించిన సెమినార్ వ్యాసములను "మన సంస్కృతి చరిత్ర" అను గ్రంథము గాను, ఎం. ఏ. రెండవ సంవత్సరమున ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి పర్యవేక్షణలో నిర్వహించిన సెమినార్ వ్యాసములను "గోలకొండ" పత్రికా సంపాదకులు, ఇప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష్యులుగా నున్న పూజ్యులు శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి సహాయమున "శ్రీనాథ భార్గవము" గాను ప్రకటించుట జరిగినది. ఈ రెండు గ్రంథములను ప్రకటించిన పిదప, శాసన ప్రతిబింబములను సేకరించి, అప్రకటిత శాసనములను ప్రకటించి, ఆంధ్రదేశ చరిత్ర నిర్మాణమునకు తగిన సాధన సంపత్తిని కూర్చవలెనను భావముతో శాసన పరిశోధనే జీవిత ధ్యేయముగా నిర్ణయించు కొనినాను.

నా అనుభవములో శాసన పరిశోధన కన్న శాసన ప్రతిబింబముల సేకరణ కష్టతరమైనది. తెలంగాణములోని తొమ్మిది మండలములలో సుమారు నాలుగు వేల గ్రామ పంచాయతీలను చూచు అవకాశము నాకు కలిగినది గ్రామ పంచాయతీ సరిహద్దులలో నున్న పురాతన దేవాలయములను చూచినపు డా ప్రాంతమున శిథిలరూపమున నున్న శిలా శాసనముల ప్రతి బింబములను తీయుట జరిగినది. కొన్ని గ్రామములలో ప్రజల మూఢ నమ్మకముల వలన, మూఢాచారముల వలన, శాసన ప్రతి బింబములు తీయుటలో ఇబ్బందులకు గురికావలసి వచ్చినది. భూమిలో పాతుకు పోయిన శాసన శిలలను, త్రవ్వి తీయవలసి వచ్చినపుడు, కూలివారు, గ్రామీణులు, శాసన శిలలను ముట్టుకొనుటకు నిరాకరించుట వలనను, గడ్డపారలు, పారలు ఇచ్చుటకు సుముఖులుగా నుండక పోవుటవలనను, కావలసిన పనిముట్లు కొని శాసన శిలలను త్రవ్వి తీయు పనిని స్వయముగా నిర్వహింపవలసి వచ్చినది. కొన్ని దేవాలయములలో శాసన శిలలకు సింధూరము పూయుటవలన, శాసనాక్షరములు పూడిపోయి యుండ, సింధూరము కడిగివేయుట కొక రోజు, రెండు రోజులు ఆ యూరి పాఠశాలలోనో, గ్రామ పంచాయతి కార్యాలయములోనో నివసింప వలసి వచ్చినది.

సిరికొండ, ఇందంపల్లి, కన్నెకల్లు, మల్లేపల్లి, బొల్లేపల్లి, గ్రామములలో శాసన ప్రతి బింబములను తీయుటకు తోడ్పడిన, గ్రామీణుల ఉత్సాహము, చరిత్రపై వారికిగల అభిమానము నన్ను ఉత్తేజ పరచినవి. బొల్లేపల్లి, దుప్పల్లి గ్రామములలో శాసన పాఠములను వ్రాసి యిచ్చిన నేగాని కదల నివ్వమని పలికిన చరిత్రాభిమానులు కనిపించినారు. శాసన ప్రతి బింబములను తీయుటకు దోడ్పడిన ఆయా గ్రామ పంచాయతీల సర్పంచులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

శాసన పరిశోధనకు నన్ను ప్రోత్సహించి, తగిన సలహాల నొసంగిన పూజ్యులు శ్రీయుతులు డా॥ జి. ఎస్. గాయ్. పి. వి. పరబ్రహ్మశాస్త్రి, డా॥ పల్లా దుర్గయ్య, డా॥ బి రామరాజు, కొంతి అచ్యుతరామయ్య, కీ. శే. డా॥ జి. వి. సీతాపతి మున్నగువారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఈ శాసన సంపుటిలో ప్రకటింపబడిన తామ్ర శిలా శాసనములలో పేరూరు, కందుకూరు శాసనములు తప్ప, తక్కిన శాసనములన్నియు 1965వ సంవత్సరమునుండి 'భారతి' సంచికలలో ప్రకటింపబడినవి. భారతి పత్రికాధిపతులు, సహృదయులు, పూజ్యులు కీ. శే. శ్రీ శివలెంక శంభూ ప్రసాద్ గారికి నా హృదయ పూర్వక నమస్కారములు. వారి ఆదరము, ప్రోత్సాహము, నేను నాలుగు వందల శిలా శాసనముల ప్రతిబింబముల దీయుటకు తోడ్పడినవి. "భారతి" పత్రికాధిపతుల మేలు మరువరానిది.

ఈ సంపుటి మొదటి భాగములో విష్ణుకుండిన శాసనములు రెండు, మాఠర వంశీయుల శాసనమొకటి తూర్పు గాంగ వంశీయుల శాసనములు రెండు ప్రకటింప బడినవి. ఇవి తామ్ర శాసనములు.

రెండవ భాగమున కందూరి చోడుల శాసనములు 10. కల్యాణీ చాళుక్యుల శాసనములు 12. కాకతీయుల శాసనములు 10. గోలకొండ నవాబుల కాలపు శాసన మొకటి, ప్రకటింపబడినవి. ఇవి శిలాశాసనములు.

తెలంగాణమున విష్ణుకుండినులకు సంబంధించిన తామ్ర శాసనములు, మా గ్రామ ప్రాంతములో లభించుట విశేషము. విష్ణుకుండినుల ఇంద్రపాల నగర తామ్ర శాసనములు ''భారతి" మాస పత్రికలో 1965 జూన్, జులై సంచికలలో ప్రకటింపబడిన తరువాత, సుప్రసిద్ధ పరిశోధకులు, డా॥ మారేమండ రామారావు, డా॥ మిరాశి. డా॥ డి. సి. సర్కారు, డా॥ నేలటూరి వేంకట రమణయ్య, డా॥ జి. ఎస్. గాయ్ వంటివారు, విష్ణుకుండిన వంశ నిర్ణయమున, తమ తమ అభిప్రాయములను తెలిపినారు. కొందరు వ్యాసములను ప్రకటించినారు. డా॥ మారేమండ రామారావుగారి "New light on Vishnukundins" అను వ్యాసమును Journal of Indian History Vol. XLIII Part III లో చూచిన పిమ్మట 'భారతి' లో "విష్ణుకుండినులు – కాలనిర్ణయము" అను వ్యాసమును ప్రకటించినాను. పాఠకుల సౌలభ్యమునకై ఈ సంపుటిలో ఆ వ్యాసము చేర్చినాను.

కందూరి చోడులకు సంబంధించిన పది శాసనము లీ సంపుటిలో ప్రకటింప బడినవి. ఇంతకు ముందు ప్రకటింపబడిన శాసనములు, ఈ సంపుటిలోని శాసనములు, కొంతవరకు కందూరి చోడ రాజుల చరిత్ర తెలిసికొనుటకు తోడ్పడును. అట్లే కల్యాణీ చాళుక్య, కాకతీయాది శాసనములాంధ్రదేశ చరిత్ర నిర్మాణమున కుపకరించునను భావముతో ఈ సంపుటిలో చేర్చబడినవి.

ఈ గ్రంథమును చదివి, దయతో తమ అభిప్రాయ మొసగిన భారత రాష్ట్రపతి, పూజ్యులు శ్రీ వి. వి. గిరి గారికి నా హృదయపూర్వక నమస్కారములు.

కోరిన వెంటనే తమ అమూల్యాభిప్రాయ మొసంగిన పూజ్యులు, గురుతుల్యులు, శాసన పరిశోధనలో అగ్రేసరులు, సంస్కృతాంధ్రాంగ్ల కన్నడ భాషలలో పండితులు శ్రీ గడియారం రామకృష్ణశర్మగారికి, 'భారతి' చర్చలద్వారా, లేఖలద్వారా, పరిచయమైన మిత్రులు, సంస్కృత ప్రాకృతాంధ్ర భాషాకోవిదులు, లిపి శాస్త్రజ్ఞులు శ్రీ తిరుమల రామచంద్రగారికి నా కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

గ్రంథ ప్రచురణలో తోడ్పడిన మిత్రులు నాగార్జున ప్రింటింగ్ వర్క్సు అధిపతులు శ్రీ ఎన్. వి నారాయణరావు, కార్యనిర్వాహకులు శ్రీ గండయ్య గారలకు నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథమున నాఅజ్ఞత వలన శాసన పఠనములోను. రచనలోను, దోషములు దొరలియుండ వచ్చును. సహృదయ విమర్శకులు, చారిత్రకులు, సాహితీపరులు దోషములను తెలిపిన మరియొక ముద్రణమున సవరించు కొందునని సవినయముగ మనవి చేయుచు, ఆంధ్ర లోకమున కీ గ్రంథము నందించుచున్నాను.

నారాయణగూడ,
హైదరాబాదు—500029.

—పి. ఎన్. శాస్త్రి.

# విషయ సూచిక

## శాసన సంపుటి—మొదటి భాగము

## తామ్ర శాసనములు

పుట



## శాసనసంపుటి —రెండవ భాగము

## శిలా శాసనములు

# శాసన ప్రతిబింబముల వివరము

1. ఇంద్రపాలనగరము 1. పంచలింగేశ్వరాలయము. 2. వేంకటేశ్వరాలయము. 3. కళ్యాణ మంటపము. 4. రెండంతస్తుల మంటపము 5. మసీదు. 6. అమరేశ్వరాలయము.
2. విష్ణుకుండిన గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్ర శాసనము.
   1-3, రాజముద్రికతోగూడిన కడియము
3. విష్ణుకుండిన విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము 1-7.
4. ఉమావర్మబృహత్ప్రోణరేజ్జ తామ్రశాసనము.
   1-4. రాజముద్రికతో గూడియున్న కడియము, శాసనము స్థూలరూపము.
5 అనంతవర్మ సేనిది తామ్రశాసనము.
   1-4 రాజముద్రికతో గూడియున్న కడియము, శాసనము స్థూలరూపము.
6. (శ్రీ) మదనంతవర్మ చోడగంగదేవుని తెంబూరు తామ్రశాసనము.
   1-12, రాజముద్రికతో గూడియున్న కడియము, శాసనము స్థూలరూపము.
7. సిరికొండ శాసనము 1-3, సిరికొండ దుర్గము, వేణుగోపాలస్వామి ఆలయము.
8. రాచూరు శాసనములు 1-3, మహానాగము.
9. మల్లేపల్లి శాసనము 1-4.
10. పడమటిపల్లి శాసనము 1-2.
11. ఇదంపల్లి శాసనములు 1-4.
12. ఆగామోతుకూరు శాసనములు 1-4.
13. పెరూరు శాసనములు 1-4.
15. కనిగరం శాసనము 1-4.
16. నల్లపయ్య నాయకరు రాచూరు శాసనము 1.
17. తుంగపాడు శాసనము 1-4.
18. ఇర్విన్ శాసనము 1-2.
19. బొల్లేపల్లి శాసనము 1-4.
20 తాడువాయి శాసనములు 1-3
21. దుప్పల్లి శాసనము 1-4.
22 కందుకూరు శాసనము 1-3.
23 కన్నెకల్లు శాసనము 1-2.
24 కనిగరం శాసనము 1-2.

శ్రీ వేంకటేశ్వరస్వామి
పాద పద్మములకు
భక్తితో

—రచయిత

# విష్ణుకుండినులు

ఆంధ్రదేశ చరిత్రలో మహోజ్జ్వలముగ రాణించిన రాజవంశములలో విష్ణుకుండిన వంశ మొకటి. శాలంకాయన వంశమున బలహీనులైన రాజు లాంధ్రదేశము నేలుచున్న కాలమున విష్ణుకుండిన వంశీయులు కృష్ణానదికి ఉత్తరమున నున్న నేటి తెలంగాణములోని నల్లగొండ, మహబూబునగర మండల ప్రాంతములను ఆక్రమించి రాజ్యము నెలకొల్పిరి. ఆ కాలమున దక్షిణాపథ పశ్చిమోత్తరములందు వాకాటక వంశీయులు రాజ్యమును విస్తరింపఁజేసి, శక్తిసమన్వితులై యుండిరి. విష్ణుకుండిన రెండవ మాధవవర్మ వాకాటక రాజకుమార్తెను వివాహమాడెను, విష్ణుకుండినులు బలవంతులైన రాజులతో సంబంధ బాంధవ్యముల నెఱపి తమ రాజ్యమును సురక్షిత మొనర్చుకొని పాలించిరి.

విష్ణుకుండినుల చరిత్ర నిర్మాణమునకు సాధనములనఁదగిన ఆఱు తామ్రశాసనములు[1] ఒక శిలా శాసనము[2] ఇంతవరకు ప్రకటింపబడినది. ఈ శాసనముల వలన విష్ణుకుండినులు "దక్షిణాపథపతి" "త్రికూట మలయాధిప" "శ్రీ పర్వతస్వామిపాదానుధ్యాత" లను బిరుదములు గలవారనియు వారు తమ రాజ్యమును కృష్ణా గోదావరి నదుల మధ్యప్రాంతమునందే కాక దక్షిణమునను విస్తరింపఁ జేసిరనియు తెలియుచున్నది. ఈ వంశీయులకు సంబంధించిన శాసనములు గాని నగరములుగాని తెలంగాణమునం దున్నట్లింతవరకు తెలియదు. వేంగీపురము, అమరావతి, దెందులూరు, బెజవాడ పట్టణములు వీరికి రాజధానులుగ నుండెడివి. ఇవిగాక కొన్ని ప్రసిద్ధ నగరము లాకాలమున నున్నట్లు తెలియుచున్నది. అట్టి నగరములలో నింద్రపాల నగర మతి ముఖ్యమైనది. ఈ నగరము తెలంగాణములో నున్నది.

విష్ణుకుండినుల నాఁటి ఆంధ్రుల యౌన్నత్యమునకు బతాకయై నిలచిన ప్రాచీనాంధ్ర మహానగరములలో నింద్రపాలనగర మొకటి. ఈ నగరము తరతరములనుండి శిథిలమై నేఁటికి నామమాత్రావశిష్టమైయున్నది. శిథిల నగర మిప్పటికిని స్పష్టముగ కనిపించుచున్నది.

---

1. A. ఈపూరుశాసనము E. I. Vol. XVII P. 337.
   B ఈపూరు శాసనము E. I. Vol. XVII P. 334.
   C. రామతీర్థ శాసనము E. I. Vol. XII P. 133.
   D. చిక్కుళ్ళ శాసనము E. I. Vol. IV P. 193.
   E. తుండి శాసనము A. P. Govt. Archaeological Series No. 8.
   F. పొలమూరు శాసనము J. A. H. R. S. Vol. VI P. 17.

2 వేల్పూరు శిలాశాసనము S. I. I. Vol. X No. 1.

**ఇంద్రపాల నగరము :**

నల్లగొండ మండలములోని రామన్నపేట తాలూకాకు ఐదు మైళ్ళ దూరమున భువనగిరి - నల్లగొండ రోడ్డు నానుకొని తుమ్మలగూడెమను గ్రామమున్నది. ఆ గ్రామము నంటియొక చెఱువున్నది ఆసఫ్‌నహర్[1] ద్వారా ఆ చెఱువులోనికి నీరు వచ్చును. చెఱువుకట్ట నానుకొని రెండుమైళ్ళపొడవునను, చెఱువుకట్టకు మూసీనదిని[2] అనుకొనియున్న ఇంద్రపాల గుట్టకును మధ్యగల సువిశాల ప్రదేశములో నీ ప్రాచీనాంధ్ర మహానగర శిథిలము లున్నవి.

ఈ శిథిల నగరప్రాంతమొక ప్రత్యేక స్థలముగ కనిపించుచున్నది చుట్టు వరి పొలములు మధ్య నెత్తుగా నున్న విశాల ప్రదేశములో పెద్ద పెద్ద చింతచెట్లు, జీర్ణ దేవాలయములు, రాళ్ళు, రప్పలు, చిన్నచిన్న గుళ్ళు, దేవతావిగ్రహములు, శిథిలములు, ఇండ్ల అడుగులు, పునాదులు, ఇటుకలు కనిపించును. దూరమునుండి చూచినను శిథిలనగర చిహ్నములను గుర్తింపవచ్చును. శిథిలనగర చిహ్నములను, జీర్ణ దేవాలయములను జూచిన అనాటి వైభవము కన్నులకు గట్టినట్లుండును.

మూసీనదికి నాలుగు ఫర్లాంగుల దూరములో నాగవరమను గ్రామమున్నది. నాగవరమునకు, తుమ్మలగూడెమునకు, మధ్యగల దూరము రెండుమైళ్ళు. నాగవరము ప్రక్క ఆసఫ్‌నహర్ నానుకొని మహాదేవి విహార శిథిల చిహ్నములు కనిపించుచున్నవి. ఇంద్రపాలగుట్ట, శిథిలనగరము, నాగవరము ఇంచుమించు కలిసియే యున్నవి సుమారు మూడు మైళ్ళవరకు వ్యాపించియున్న ఈ నగర శిథిల చిహ్నములు, నాగవరములోను, తుమ్మలగూడెము చెఱువు కట్టకును, ఇంద్రపాల గుట్టకును మధ్యగల విశాల ప్రదేశములోను గుట్టపైనను కనిపించును.

**ఇంద్రపాల గుట్ట :**

నాగవరమునకు ఈశాన్యమునను, తుమ్మలగూడెమునకు, ఉత్తరమునను మూసీనదిని అనుకొనియున్న ఒక ఎత్తైనగుట్ట సుమారు మైలు పొడవునను మధ్యభాగము ఎత్తుగను, గోపురాకారముగను ఉన్నది. గుట్టపైని కోట జాతితో కట్టబడినది. ఇట్టి దానిని గిరిదుర్గమందురు. ఈ దుర్గ మతి పురాతనమైనది. విష్ణుకుండినుల నాటిది. గుట్ట నెక్కుటకు పడమటి దిక్కునుండి మెట్లున్నవి. గుట్టపైకి ఎక్కితిమేని కోట విశాలముగ కనిపించును. కోట మధ్యభాగమున కట్టబడినది. కోటకు పండ్రెండు బురుజులున్నవి. గుట్టపైని పడమటివైపు కోటకు, రెండువందల గజముల దూరములో లోతైన లంద[3] స్వచ్ఛమైన జలముతో నొప్పారుచున్నది. ఈ లందను ఏనుగుల బావి యని అందురు. గుట్టపైని పడమటి భాగమున పెద్దపెద్ద ఇటుకలు, రాళ్ళు, ఇండ్ల పునాదులు, గజము, రెండుగజముల ఎత్తువరకు లేపిన గోడలు, శిథిలములైన భవనములు గదులు ఉన్నవి. గోపురాకారమున నున్న శిఖర మెక్కుటకు, కోట లోపలి భాగమునుండి మెట్లున్నవి. శిఖరము చుట్టు ఒక జాతిగోడ యున్నది. కోటకు పెద్దద్వారము, బురుజులుఉన్నవి.

---

1. ఆసఫ్జావంశీయుల పేర త్రవ్వించిన కాలువ నిజాం నవాబ్ అసఫ్జావంశీయుడు.
2. మూసీనదిని—ముచికుందానది యని వ్యవహరింతురు.
3. కోనేరు.

ఒక పెద్ద రాతిగుండుపై పూజరి శివార్చనకు అర్చన ద్రవ్యములు తీసికొని బయలుదేరుచున్నట్లు చెక్కబడినది. గుట్టపైని ఎల్లమ్మగుడి యున్నది. అచటనే పరశురాముని పాదములున్నవి. గుట్టపైకి వెళ్ళుదారిలో పండ్రెండు స్తంభముల మంటప మున్నది. మంటపములో రెండువైపుల కూర్చొనుటకు వీలుగా నుండునట్లు పెద్దపెద్ద బంకు[1] లున్నవి. మంటప ద్వారము సింహాద్వారము వలె నున్నది.

తూర్పువైపు వ్యాపించియున్న పర్వతభాగము చాల పొడవుగను పల్లముగను, విశాలముగను ఉన్నది. గుట్టపైని శివాలయ మున్నది. అది కొండపైగల పెద్ద రాతిగుండ్లతో దాని యంతట అదే ప్రకృతిసిద్ధముగ వెలసినట్లున్నది. శివలింగము నల్లరాతితో మలచc బడినది. లింగము ఎత్తు రెండు అడుగులు. ఒక రాతిగుండుపై మరియొక రాతిగుండు నిలిచి దేవాలయముగా రూపు దిద్దుకొని అతి సహజముగ నున్నది. ఆలయములో నొక రాతిగుండుపైని తెలుగు శాసనము చెక్కబడి యున్నది.

శివాలయమున కెదురుగా పురాతనమైన మంటపమొకటి యున్నది. మంటపమున కెగువ భాగమునందొక కోనేరు, దిగువ భాగమునందొక కోనేరును ఉన్నవి. శివాలయమున కెదురుగా నొక శిలాశాసన మున్నది. ఈ శాసనము రెండు ముక్కలుగా విరిగి క్రింద పడి యున్నది. శివాలయమునకు తూర్పుగా శిథిలములైన కట్టడములున్నవి. ఆ కట్టడములకు తూర్పున మరియొక దేవాలయమున్నది. అదియును శివాలయమే. ముందు మంటపము, గర్భగుడి చుట్టు ప్రాకారముగల ఈ దేవాలయమున గల శివలింగము భిన్నమైపోయినది. అచటనే మరికొన్ని శిథిలాలయము లున్నవి.

శివాలయమున కుత్తరముగానున్న కోనేరు ప్రక్కనుండి మూసీనది లోనికి దిగుటకు దారి యున్నది. నదిలో స్నానము చేయుటకు వీలైన ఘట్టము లున్నవి. ఇంద్రపాలగుట్టకు ఫర్లాంగు దూరములో మూసీనదిలో గుట్టకు ఎగువ భాగమున ఒక పరుపుబండ పైని నూటఒక్క శివలింగములు చెక్కబడి యున్నవి.

**శిథిల నగరము :**

ఇంద్రపాలగుట్టకు దక్షిణభాగములో గుట్టనానుకొనియున్న విశాల ప్రదేశములో శిథిల రూపములోనున్న ఇంద్రపాలనగర మున్నది. శిథిలమైనట్టివియు జీర్ణావస్థలో నున్నట్టివియునగు ఆలయము లా ప్రదేశమున అడుగడుగున నున్నవి. ఈ యాలయముల శిథిలములు నాగవరము వరకు వ్యాపించి యున్నవి. నాగవరము తుమ్మలగూడెము చెలువు, మూసీనదికి ఉత్తరమున నున్న వలిగొండ, తుమ్మలగూడెమునకు తూర్పుననున్న మల్లన్నగుట్టవరకును, ఇంద్రపాలనగర శిథిలములు కనిపించుచున్నవి. ఈ శిథిల ప్రాంతములను చూచిన పూర్వమీ ఇంద్రపాలనగరము మహానగరముగ ప్రసిద్ది చెంది యుండెనని తెలియును.

**పంచలింగేశ్వరాలయము :**

ఈ యాలయము రాతితో నిర్మింపబడినది. ఆలయ గోపురములు మాత్రము ఇటుక, సున్నము కలిపి నిర్మించినట్టివి. ఆలయ మతి విశాలమైనది. ఐదు ఆలయములు కలిసియే యున్నవి.

---

1. అరుగులు.

నలుబది స్తంభములు గల గర్భగుడి ముందు మంటపము విశాలమై సాధారణ శిల్పసంపదతో నొప్పారు చున్నది. ఆలయమున గల నంది విగ్రహము నల్లసరపు ఱాతితో మలచబడినది. అది మహమ్మదీయుల దురంతములకు గురియైనది దాని తల నరికివేయబడినది. ఆలయ మంతయు జీర్ణించిపోయినది. ఐనను ఆలయత్వమును గోల్పోలేదు. దూరమునుండి చూచినను పూర్వవైభవము చాటుటకు నిలిచియున్నట్లు గంభీరముగ కనిపించును. ముఖ్య ఆలయమున గల శివలింగము మానవనిర్మిత మైనట్టిదిగా లేదు. ప్రకృతిసిద్ధముగా నేర్పడి నట్లున్నది. తక్కిన ఆలయములలోని శివలింగములు భిన్నించినవి. ప్రధాన ఆలయములోని శివలింగము చెక్కుచెదరక నిలిచియున్నది.

ఆలయమున కెదురుగా రెండంతస్తుల మంటపమున్నది. పై మంటపమునకు నాలుగు స్తంభములు క్రింది మంటపమునకు ఆరు స్తంభములు ఉన్నవి. ఆలయమునకు చేరువగా నుత్తర భాగమున నాలుగు స్తంభములతో నిర్మింపబడిన విశాలమైన మంటపమున్నది. అది వివాహ మంటపము. ఆలయమునకు ముందు ఎడమవైపున కోనేరు ఉన్నది. దాని ప్రక్కన శిలాశాసన మున్నది. శాసనము తెల్లఱాతిపైని చెక్కఁబడి యున్నది శాసనాక్షరములు చెదిరి పోయినవి. కోనేరు ప్రక్కన చింతచెట్లు తుమ్మలు పెరిగినవి. కోనేరు పూడిపోయినది. కోనేరు చుట్టు కట్టిన తెట్టె కూలిపోకుండ నేటికిని నిలిచి యున్నది.

పంచలింగేశ్వరాలయమునకు ఈశాన్య దిక్కున వంద గజముల దూరములో మరియొక శిలాశాసన మున్నది. దాని ఎత్తు ఎనిమిది అడుగులు. శాసనాక్షరములు చెదిరిపోయినవి. ఈ శాసనస్తంభమునకు నాలుగు గజముల దూరమున శిలాశాసనమొకటి రెండు తునకలుగా విఱిగి పడి యున్నది.

ఈ శాసన స్తంభములకు తూర్పుదిశలో ఒక మసీదు ఉన్నది. అది నూతనముగా నిర్మింప బడినట్టిది. ఈ మసీదుకు వంద గజముల దూరములో గుట్టకు దగ్గరగా నున్న పొలము ప్రక్కన ఒరము పైని ఒక శిలాశాసన మున్నది. ఇది తెలుగు శాసనము.

**వేంకటేశ్వరాలయము ;**

పంచలింగేశ్వరాలయమునకు, బశ్చిమమున ఫర్లాంగు దూరములో ఉత్తర దిశాభిముఖముగా వేంకటేశ్వరాలయ మున్నది. ఇది జీర్ణావస్థలో నున్నది ఇటుక సున్నముతో కట్టబడిన గోపురము గల ఈ దేవాలయము ఱాతితో నిర్మింప బడినది. ఆలయముయొక్క ముందు భాగము పదునాలు స్తంభములతో నిర్మింపబడినది. ఆలయ సింహద్వారము ఆఱు స్తంభములపై కట్టబడినది. సింహద్వారమునకు తూర్పువైపుగా నున్న మూడు స్తంభములలో మధ్యన నున్న స్తంభమునకు నాలుగు వైపుల శాసనము చెక్కబడినది. శాసనము గల స్తంభమునకు మొదటివైపు గల శాసన భాగమును మరియొక స్తంభము ఆనుకొని యుండుటవలన చదువుటకుగాని ప్రతిబింబము దీయుటకుగాని వీలు లేకుండ నున్నది. ఈ శాసనము విష్ణుకుండినులకు సంబంధించినది. వేంకటేశ్వరాలయమున గల స్తంభములలో రెండు స్తంభములపైని శాసనములు చెక్కబడినవి. ఇవి తెలుగు శాసనములు.

**ఇంద్రపాల ముత్యాలమ్మ గుడి :**

పంచలింగేశ్వరాలయమునకు దక్షిణముగా శిథిలమైయున్న ఇంద్రపాల ముత్యాలమ్మ గుడి యున్నది. దానికి ఏబది గజముల దూరమున పశ్చిమ దిశలో నూతనముగ నిర్మింపబడిన ముత్యా

లమ్మ దేవాలయ మున్నది. ప్రతి సంవత్సరము శ్రావణ మాసమున అచట ఉత్సవములు జరుగును. ప్రత్యేకించి హైద్రాబాదు, సికింద్రాబాదు నగరములనుండి, వందల కొలది భక్తులీ యుత్సవము లను తిలకించుటకు వచ్చుచుందురు.

ఈ ఆలయములే గాక మనకు అడుగడుగున శిథిలాలయముల ఛాయలు గోచరించును. హనుమదాలయములు, భైరవస్వామి ఆలయములు, జాతి విగ్రహములు లెక్కకు మిక్కిలిగా నిచట కనిపించును. తుమ్మలగూడెము చెఱువులో ఈ శిథిలనగరమునకు సమీపము నందొక శివలింగ మున్నది. నాగవరమున కుత్తరముగా ఆసఫ్‌నగర్ కట్ట ప్రక్కన శివలింగమున్నది. ఇట్టి శిథిలాలయ ముల జాడ లచ్చటచ్చట కనిపించుట వలన పూర్వమచట శివాలయము లుండెనని చెప్పవచ్చును.

తుమ్మలగూడెమునకు దూర్పుగా మల్లన్న గుట్ట యున్నది. ఆ గుట్టపై నున్న శివా లయము ఇంద్రపాలగుట్టపై నున్న శివాలయము వలెనే యున్నది. ఇచటి ఆరాధ్యదైవము మల్లన్న దేవుడు లేక మల్లికార్జున స్వామి. ఇది విష్ణుకుండినుల నాటి శివాలయము. ప్రతి సంవత్స రము శివరాత్రి పర్వదినమున చుట్టుప్రక్కల నున్న గ్రామముల నుండి ప్రజలు వచ్చి గుట్టపైని వెలసిన మల్లికార్జున స్వామి నర్చింతురు. ఇచట మూడురోజు లతివైభవముగా తిరునాళ్లు జరుగును.

ఆసఫ్‌నహార్ ప్రక్కగా తుమ్మలగూడెము గ్రామమునకు దూర్పుగా మైలు దూర ములో రామేశ్వరతోటలో నొక శివాలయ మున్నది. ఆలయమునకు ముందు పెద్ద కోనేరు ఉన్నది. ఈ ఆలయమును రామేశ్వరాలయ మందురు. ఇది ఇంద్రపాలగుట్ట మీద నున్న అమరేశ్వరాలయము వలె జాతిగుండ్లతో సహజముగా నేర్పడి యున్నది. శివలింగము పాల జాతితో నిర్మింపబడినది. తుమ్మలగూడెము గ్రామములో వేంకటేశ్వరాలయ మున్నది. ఆంజ నేయస్వామి ఆలయము, కన్యకాపరమేశ్వరి ఆలయము, ఇంద్రపాల ముత్యాలమ్మ గుడి తుమ్మల గూడెము గ్రామములో నున్నవి. కాని శివాలయములేదు. గ్రామప్రజలు శివార్చనకు గ్రామము నకు మైలు దూరములో నున్న రామేశ్వరాలయమునకే వెళ్లుచుందురు.

నాగవరమునకు మైలుదూరమున మూసీనదికి ఆవలిగట్టున వలిగొండ గ్రామమున్నది. ఈ గ్రామ మతి ప్రాచీనమైనది. గ్రామమున శిథిల చిహ్నములు విశేషముగనున్నవి గ్రామము నానుకొని ఆఱు ఎకరముల విస్తీర్ణముగల కోట ఉన్నది. కోట త్రిభుజాకారములో నుండి ఐదు బుఱుజులు గలిగి శిథిలరూపములో కనిపించు చున్నది. ఐదు బుఱుజులలో నొక బుఱుజు జాతితో కట్టబడినది. కోటలో రెండు లోతైన బావులున్నవి. కోటకు దక్షిణ భాగమున జగ్గమ్మతోట యున్నది. ఆ తోటలో నాలుగు పురాతనమైన చేద బావులున్నవి. గ్రామమున అచ్చటచ్చట ఇండ్ల అడుగులు, బావులు, శివాలయ శిథిలములు కనిపించుచున్నవి. గ్రామములో మూసీనదిని అనుకొని కొండ యున్నది. కొండకు పడమటివైపు కైరనులున్నవి.

వలిగొండ గ్రామమున రెండు శివాలయములు, ఒక రామాలయము, గ్రామమునకు రెండుమైళ్ళ విస్తీర్ణము లోపల ఎనిమిది దిక్కులలో ఆంజనేయస్వామి ఆలయము లున్నవి. గ్రామమున నున్న శివాలయముల కెదురుగా కోనేరు లున్నవి.

వలికొండపై వలిఖాషా వెలిసినాడు. మహమ్మదీయులు మొహర్రం పండుగ రోజు లలో వలిఖాషా నర్చింతురు. గుట్టపైని అతి పురాతనమైన శివాలయ మున్నది. శివాలయము నందొక శిలాశాసన మున్నది. వలికొండ నానుకొని మూసీనది ప్రవహించుచున్నది. గుట్టపైకి ఎక్కుటకు మెట్లున్నవి. వలిగొండ, నాగవరము, ఇంద్రపాలనగరము, తుమ్మలగూడెము పూర్వము ఇంద్రపాల నగరముగ నుండెడివి. మూసీనదికి ఇరువైపుల ఈ ప్రాచీనాంధ్ర మహానగరము వ్యాపించి యుండెను ఇంద్రపాల గుట్ట—ఇంద్రపాల నగరము విష్ణుకుండిన ప్రభువుల కావాసమై ఆంధ్రదేశమునం దానాటి మహానగరములలో నొక్కటిగా కీర్తింపబడినది. విష్ణుకుండినుల మొదటి రాజధాని ఇంద్రపాల నగరము. ఇక్ష్వాకు వంశీయులకు సామంతులుగనో, దండనాథులుగనో వ్యవహరించిన విష్ణుకుండిన వంశీయులు, ఏలేశ్వరము, అమరాబాదు, మున్ననూరు, ఇంద్రపాల నగర ప్రాంతముల నాక్రమించి, పాలించుచు, ఇక్ష్వాకు వంశపతనా నంతరము స్వతంత్రులై ఇంద్రపురి లేక ఇంద్రపాలనగరము రాజధానిగా కృష్ణానదికి ఉత్తరమున నున్న ప్రాంతములను పాలించి క్రమముగా ఆంధ్ర దేశమున కేకచ్ఛత్రాధిపతులైనారు.

విష్ణుకుండినుల శాసనములలో ఆఱు తామ్రశాసనము లింతవరకు ప్రకటింప బడినవి. ఈ శాసనమునందలి రాజుల పేళ్లు, శాసన విషయములును, సమన్వయ పరచుకొనిన యెడల విష్ణుకుండినుల చరిత్ర నిర్మాణమునకు ఈ ఇంద్రపాల నగర తామ్రశాసనములు కొంతవర కుప యోగపడు ననుటలో సందేహము లేదు. ఈ ఇంద్రపాల నగర తామ్ర శాసనములను 1965 జూన్, జూలై భారతి సంచికలలో నేను ప్రకటించితిని.

## విష్ణుకుండినుల తామ్ర శాసనములు

1. చిక్కుళ్ళ శాసనము — రెండవ విక్రమేంద్రవర్మ
2. రామతీర్థ శాసనము — మహారాజ ఇంద్రవర్మ
3. ఈపూరు శాసనము — మూడవ మాధవవర్మ
4. ఈపూరు శాసనము — నాలుగవ మాధవవర్మ
5. పొలమూరు శాసనము — నాలుగవ మాధవవర్మ
6. తుండి శాసనము — విక్రమేంద్ర భట్టారకవర్మ
7. ఇంద్రపాలనగర శాసనము — గోవిందవర్మ-I
8. ఇంద్రపాలనగర శాసనము — విక్రమేంద్ర భట్టారకవర్మ

ఈ యెనిమిది తామ్ర శాసనములును ప్రకటింపబడినవి. శాసనములందు పేర్కొన బడిన రాజుల పేళ్లు వంశక్రమమును నిర్ణయించుటకు దోడ్పడుటయే గాక, ఆయా రాజుల కాల నిర్ణయమునకును ఉపకరించు చున్నవి. విష్ణుకుండిన ప్రభువులలో నలుగురు మాధవవర్మలు, ఇద్దరు గోవిందవర్మలు ఉన్నారు. ఈ శాసనములందు పేర్కొనబడిన రాజుల పేళ్లు ప్రత్యేకముగ తెలుప బడుచున్నవి.

# శాసనములందు పేర్కొనబడిన రాజులు

I చిక్కుళ్ళ శాసనము

|

మహారాజ మాధవ వర్మ

|

విక్రమేంద్ర వర్మ

|

ఇంద్రభట్టారక వర్మ

|

విక్రమేంద్ర వర్మ

*II* రామతీర్థ శాసనము

|

మాధవ వర్మ

|

విక్రమేంద్ర వర్మ

|

ఇంద్ర వర్మ

III & IV ఈపూరు శాసనము, పొలమూరు శాసనము

|

విక్రమేంద్ర వర్మ

|

గోవింద వర్మ

|

మాధవ వర్మ

|

మంచన భట్టారకుడు

V ఈపూరు రెండవ శాసనము

|

మాధవ వర్మ

|

దేవ వర్మ

|

మాధవ వర్మ

VI తుండి శాసనము




VII గోవిందవర్మ ఇంద్రపాలనగర శాసనము




VIII విక్రమేంద్ర భట్టారక వర్మ ఇంద్రపాలనగర శాసనము



# విష్ణుకుండిన వంశవృక్షము



ఇక్ష్వాకు వంశ పతనానంతర మాంధ్రదేశములోని కొన్ని ప్రాంతములను పల్లవు లాక్ర మించిరి. విష్ణుకుండినుల రాజ్యస్థాపనము వఱకును, అటుపిమ్మటను కృష్ణానదికి దక్షిణమున నున్న రాజవంశీయులతో పల్లవరాజులు కలహించు చుండిరి బృహత్ఫలాయన ఆనందగోత్రిక రాజులతో పల్లవులు యుద్ధములు చేయుచుండిరి. పల్లవు లాంధ్రదేశముపై నాధిపత్యము వహించుట కువ్విళ్ళూరుచుండ ఆంధ్రదేశ పాలకులగు రాజులు దేశము పల్లవహస్తగతము కాకుండ వారితో యుద్ధములు చేయు చుండిరి.

సముద్రగుప్తుని దక్షిణదేశ దిగ్విజయానంతరము శాలంకాయన, పల్లవ, ఆనందగోత్రి కుల బలము క్షీణించుచున్న సమయమున విష్ణుకుండినులు కృష్ణానది ఉత్తరమున రాజ్యాన్ని స్థాపించు ప్రయత్నములు చేయసాగిరి ఇక్ష్వాకుల సామంతులుగనో, సైన్యాధ్యక్షులుగనో నుండిన విష్ణుకుండిన వంశీయులు దేశపరిస్థితుల ననుసరించి స్వతంత్ర రాజ్యస్థాపనము నాశయ ముగా బెట్టుకొని సమయమునకై ఎదురు చూచుచుండిరి ఆనంద గోత్రికులు జలహీనులై నను పల్లవరాజులతో యుద్ధములు చేయుచుండిరి. కళింగులు, శాలంకాయనులు, పల్లవులు, ఆనందగోత్రికులు, పరస్పరము కలహించు చుండుటవలన విష్ణుకుండినులు స్వతంత్ర రాజ్యమును స్థాపించుట కవకాశము కలిగినది.

### మహారాజేంద్ర వర్మ

విష్ణుకుండిన మహారాజేంద్ర వర్మ ఆంధ్రదేశ పరిస్థితుల నర్థము చేసికొని, శాలంకా యన, ఆనందగోత్రిక, పల్లవరాజులు యుద్ధములందు మునిగియున్న సమయమున ఏలేశ్వరము నల్లగొండ, అమరాబాదు ఇంద్రపాలనగర ప్రాంతములను తన అధికారము క్రిందికి దెచ్చుకొని ఇంద్రపాల నగరమును రాజధానిగా క్రీ. శ. 388 ప్రాంతమున రాజ్యమును స్థాపించెను. ఇతడు, రెండు మూడు సంవత్సరములు పాలించిన యనంతర మీతని పుత్రుడు మొదటి మాధవవర్మ రాజయ్యెను.

### మొదటి మాధవవర్మ

తండ్రి యనంతర మీతడు రాజై సుమారు ఎనిమిది సంవత్సరములు విష్ణుకుండిన రాజ్యమును పాలించెను. ఇతని రాజధాని ఇంద్రపురి, ఏలేశ్వరము, అమరాబాదు, నల్లగొండ ప్రాంతములనే కాక ఈ మహారాజు నేటి మహబూబునగరము, వరంగల్, కరీంనగరము, ఖమ్మము, మండలములను తన అధికారము క్రిందికి దెచ్చుకొని పాలించెను. ఇతని పరిపాలనా కాలము క్రీ. శ. 390-398.

### మొదటి గోవిందవర్మ

ఇతడు మొదటి మాధవవర్మ కుమారుడు. సుమారు నలుబది సంవత్సరములు ఆంధ్ర దేశమును పాలించెను. ఇతడు తన 37వ విజయరాజ్య సంవత్సరమున ఇంద్రపాల నగర తామ్ర శాసనమును వేయించెను. ఈ రాజన్యుడు, బౌద్ధమతానుయాయి. గొప్ప విజేత.

శాలంకాయన హస్తివర్మ యనంతర మాతని తనయుడు నందివర్మ రాజ య్యెను. నందివర్మ ధర్మప్రధానుడు. నందివర్మ తరువాత చండవర్మ, చండవర్మ యనంతరము విజయనందివర్మ శాలంకాయనరాజ్యము నేలిరి. విజయనందివర్మ కాలమున శాలంకాయన రాజ్యము క్షీణింప మొదలిడెను. ఆ సమయమున విష్ణుకుండిన గోవిందవర్మ

విజృంభించి, కృష్ణా, గోదావరినదుల మధ్యప్రాంతమును తన యేలుబడిలోనికి దెచ్చుకొని కృష్ణా నది దక్షిణమున నున్న గుంటూరు మండలములోని కొన్ని ప్రాంతములను జయించెను. ఇతని పరిపాలనా కాలము క్రీ. శ. 398-435.

### రెండవ మాధవ వర్మ

మొదటి గోవిందవర్మ కుమారుడు రెండవ మాధవవర్మ. క్రీ.శ. 435లో రాజై కీ.శ. 470 వరకు పాలించెను. ఇతడు పరాక్రమశాలి, విజేత, వీరుడు, రాజ్యాంగవేత్త. ఇతనికి అనేక సామంత రాజు లుండిరి. ఇతడనేక రాజ్యములను జయించి దక్షిణాపథ పతియై రాజసూయ, అశ్వమేధ, ఏకాదశాశ్వమేధములు, వాజపేయ పౌణ్డరీక, క్రతుసహస్రముల నొనర్చి పురుషమేధము కూడ చేసినట్లు శాసనముల వలన దెలియు చున్నది.

మాధవవర్మ మహారాజు అశ్వమేధ యాగ మొనరించుటకు ముందు పరిసర రాజ్యములను జయించి యుండును. శాలంకాయనులను, పల్లవులను, కళింగులను, ఆనందగోత్రికులను తదితర సామంతులను జయించి వాకాటకులతో యుద్ధమునకు దలపడి యుండును. వాకాటక మహారాజు మాధవవర్మ బలపరాక్రమముల నెఱిగి తన కుమార్తెయగు మహాదేవి నిచ్చి వివాహము చేయుటవలన విష్ణుకుండిన వాకాటక వంశములీ వివాహబంధము వలన కలిసిపోయినవి. వాకాటక రాజులు అశ్వమేధము లొనర్చినవారు. మాధవవర్మ వాకాటక రాజకుమార్తెను వివాహమాడిన పిదప ఆమె ప్రోత్సాహమున యజ్ఞయాగాది క్రతువు లొనర్చి తన వైదికమతనిరతిని ప్రకటించుకొని, "దక్షిణాపథపతి" బిరుదము గాంచుటయేగాక, జగత్ప్రసిద్ధమైన బౌద్ధక్షేత్రమగు, అమరావతిలోని బౌద్ధస్తూపము అమరేశ్వరాలయముగా మార్పు చెందుటకు కారణభూతుడై వైదిక మతాభివృద్ధికి దోడ్పడెను.

మాధవవర్మ మహారాజు కాలమున బౌద్ధమతము క్షీణించినది. శాసనము లందీరాజు "ఏకాదశాశ్వమేధావభృతావధౌత జగత్కల్మశ స్యాగ్నిష్టోమ సహస్రయాజినోనేక సామన్తమకుట మణిఖచిత చరణయుగళకమలస్య మహారాజస్య శ్రీ మాధవవర్మ్మణః"[1] అనియు, "ఏకాదశాశ్వమేధ బహుసువర్ణ పౌణ్డరీక వాజపేయ క్రతూసహస్ర సర్వమేధ రాజసూయ పురుషమేధాద్యాహరహ స్సమ్యగనుమితశ్రుతి విహితాశేష దుష్కరకర్మ్మ కర్మ్మానుష్ఠానస్య..."[2] అనియు వర్ణింపబడినాడు. ఇతడు తన రాజధానిని ఇంద్రపాల నగరమునుండి అమరావతికి మార్చెను.

### దేవ వర్మ :

మాధవ వర్మ కుమారుడు దేవవర్మ. తండ్రి యనంతరము విష్ణుకుండిన రాజ్యసింహాసన మధిష్టించెను. ఇతని పరిపాలనా కాలము మూడు సంవత్సరములు మాత్రమే. దేవవర్మ రెండవ మాధవవర్మ పట్టపురాణి పుత్రుడు. ఈరాజు "క్షత్రియ అవస్కంధ, ప్రవర్తత, అప్రతిమవిఖ్యాత, పరాక్రమస్య" అని మూడవ మాధవవర్మ వేయించిన ఈపూరు శాసనమున వర్ణింప బడినాడు. రెండవ మాధవవర్మ విజయములం దీతడు తోడ్పడెననియు యజ్ఞములు క్రతువులు నిర్విఘ్నముగా

---

1. E. I. Vol. XVII P. 337.
2. భారతి - జూలై, 1965.

కొనసాగుటకు సహకరించెననియు భావింపవచ్చును. ఇతడు పల్లవుల దండయాత్రల నెదుర్కొనినను, వారితో జరిగిన ఒకానొక యుద్ధమున మరణించి యుండును. ఇతని పరిపాలనాకాలము క్రీ. శ. 470-473.

**మూడవ మాధవవర్మ :**

దేవవర్మ యనంతరము మూడవ మాధవవర్మ సింహాసన మధిష్ఠించెను ఇతడు పరాక్రమ వంతుడైన రాజు. పల్లవులు ఆక్రమించిన ఆంధ్ర భూభాగముల నితడు తిరిగి జయించెను ఇతడు సుదీర్ఘమైన కాలము పాలించి విష్ణుకుండిన సామ్రాజ్యమును విస్తృత మొనర్చెను. ఇతని పరిపాలనాకాలము క్రీ.శ. 473—522. ఈ రాజన్యుడు తన 47వ రాజ్యసంవత్సరమున ఈపూరు శాసనమును ఇంద్రశర్మ,అగ్నిశర్మ అను విప్రులకు, మ్రోంతుకలిక గ్రామము నగ్రహారముగా జేసి ఇచ్చెను. శాసనమున "దేవవర్మణః ప్రియపుత్ర స్త్రికూటమలయాధిపతిర్నయవినయ సమ్పన్నోభగ వచ్ఛ్రీ పర్వతస్వామిపాదానుధ్యాతో విష్ణుకుణ్డీ..." అని వర్ణింపబడినాడు. మాధవవర్మ పరిపాలనా కాలమున దేశమున సుస్థిర శాంతిభద్రతలు నెలకొల్పబడి ప్రజలు ప్రశాంత జీవనము గడుపుచుండిరి.

**విక్రమేంద్రవర్మ :**

మూడవ మాధవవర్మకు సంతతిలేకపోవుటవలననో, లేక అతని కుమారులు రాజ్య పాలనకు దగిన వయస్సు వచ్చినవారు కాకపోవుట వలననో, రెండవ మాధవవర్మకు వాకాటక మహాదేవి వలన జన్మించిన విక్రమేంద్రవర్మ విష్ణుకుండిన సింహాసన మలంకరించెను. ఇతడు వృద్ధాప్యమున రాజై క్రీ. శ. 522-528, వరకు పాలించెను. ఇతడు శాసనములందు "మహారాజశ్రీ మాధవవర్మణః ప్రియపుత్రస్యవాకాటక మహాదేవీ సుతస్య మహాకవేః పరమ సౌగతస్య మహారాజశ్రీ విక్రమేన్ద్రస్య'[1] అనియు "ఉభయవంశాత్మజాలంకారభూతః" శ్రీ మాధవవర్మణః ప్రియసూనోర్విష్ణుకుండి వాకాటక వంశద్వయాలంకృతజన్మనః ప్రణామోపనత సకలసామన్తమంజరీ పింజరితచరణ కమలయుగళస్య మహారాజశ్రీ విక్రమేంద్రభట్టారకవర్మణః"[2] అని వర్ణింపబడినాడు.

**ఇంద్రభట్టారకవర్మ :**

ఇతడు విక్రమేంద్రవర్మ కుమారుడు. తండ్రి యనంతరము క్రీ. శ. 528 లో రాజై క్రీ. శ. 556 వరకు పాలించెను. ఇంద్రభట్టారకుడు గొప్ప శూరుడు, రాజ్యతంత్రజ్ఞుడు. విష్ణుకుండిన రాజ్యము యొక్క కీర్తిప్రాభవములను ప్రతిష్ఠించి అనేకములైన యుద్ధములందు విజయుడై సుస్థిరమైన రాజ్యమును పాలించెను. రామతీర్థశాసనమం[3] దీమహారాజు "చతురుదధినృపతి మకుట మణిమయూఖ విచ్ఛురితపాదాంబురుహపరమ మహేశ్వరః శ్రీమానింద్ర వర్మాఖ్యరాజ..." అనియు, విక్రమేంద్ర భట్టారకవర్మ చిక్కుళ్ళ శాసనమున,[4] "...స్ఫుర

---

1. భారతి–జూలై 1965.
2. తుండి శాసనము : A. P. Govt. Archaeological Series No. 8.
3. E. I. No. Vol XII. P. 133.
4. E. I. Vol. IV P. 193.

న్నిసిత నిస్త్రింశ ప్రభావ భాసితాశేషజగన్మండలాధిష్ఠితస్య భ్రూభంగకారవినిర్ధూత సమగ్రదాయాదస్య అనేక చతుర్దంతసమర సంఘట్టద్విరదగణవిపుల విజయస్య యథావిధి వినిర్వ్యాపితఘటికావాప్తపుణ్య సంచయస్య, సతతభూమి గో కన్యాహిరణ్యప్రదాన ప్రతిలబ్ధపుణ్య జీవితోపభోగస్య పరమమాహేశ్వరస్య మహారాజస్య శ్రీ ఇంద్రభట్టారకవర్మ్మణః'' అనియు ఇంద్రపాల నగర శాసనమున[1] "అనేకచాతుర్దన్త విజయాధి గతాశేష చక్రవర్తి క్షేత్రాధిపత్యస్యస్ఫురద్ఖడ్గకర సహస్రావలీ పరిగత స్వభుజదినకర ప్రభావవిధ్వస్తాశేషదాయాద మణ్డల ఘన తిమిర పటలస్య శ్రీన్ద్ర భట్టారకవర్మ్మణః" అనియు వర్ణింప బడినాడు. ఇంద్రవర్మ అగ్రహారములను, బంగారమును, గోవులను, కన్యలను దానము చేసెను. పెక్కు ఘటికాస్థానములను నెలకొల్పి శాంతి యుతముగ దేశమును పాలించెను

విక్రమేంద్ర భట్టారకవర్మ :

ఈ మహారాజు ఇంద్రవర్మ జ్యేష్ఠపుత్రుడు. బాల్యముననే రాజ్యభారము వహించి కడుసమర్థుడైన పాలకుడుగా ప్రఖ్యాతి వహించి పల్లవరాజునోడించి, ఆంధ్రదేశమున సుస్థిర శాంతిభద్రతల నేర్పరచి బ్రాహ్మణులకు దేవాయముల కనేక అగ్రహారముల నొసంగి విష్ణుకుండిన వంశప్రతిష్ఠ నినుమడింప జేసెను. ఈతడు తన పదియవ విజయరాజ్య సంవత్సరమున చిక్కుళ్ళ శాసనమును, పదునొకండవ విజయరాజ్య సంవత్సరమున ఇంద్రపాలనగర శాసనమును, పదునాలుగవ విజయరాజ్య సంవత్సరమున, తుండి శాసనమును వేయించెను. చిక్కుళ్ళ శాసనమున[2] "...మహారాజస్య శ్రీఇంద్రభట్టారకవర్మ్మణః ప్రియజ్యేష్ఠపుత్రో గరిష్ఠః శైశవఏవ సకలనృప గుణాలంకృతస్య సమ్యగధ్యారోపిత సకల రాజ్యభారః పరమమాహేశ్వరో మహారాజః శ్రీమాన్ విక్రమేన్ద్రవర్మ్మణః'' అనియు, ఇంద్రపాలనగర శాసనమున[3] శ్రీన్ద్రభట్టారకవర్మ్మణఃప్రియ సూనుస్తదనురూపశౌర్య్యాతిశయ సమస్తరాజరిపి గుణసంప్రద్యోగ సామర్థ్యా ప్రకృతి మణ్డలేన శైశవ ఏవారోపిత రాజ్యభారః పరమధార్మ్మికో ధమ్మ విజయాపణతానేకసామన్త మకుటమణిమయూఖోద్భాసిత వరచరణ యుగళః శ్రీమాన్విక్రమేన్ద్రభట్టారకవర్మ్మణః'' అనియు వర్ణింపబడుటయేగాక పల్లవ సింహావర్మను జయించిన పిదప తన పదునొకండవ విజయరాజ్య సంవత్సరమున ''ఇటుల్టైలో'' గ్రామము నగ్రహారముగాజేసి బౌద్ధసంఘముల అనుభవముకొఱకు, మహాదేవి విహారమునకు దానమిచ్చి తన పరమత సహనమును బ్రకటించుకొనెను. ఇతని పరిపాలనా కాలము క్రీ. శ. 556-570.

రెండవ గోవిందవర్మ :

గోవిందవర్మ విక్రమేంద్ర భట్టారకవర్మ కుమారుడు. ఇతని అనుజుడు మాధవవర్మ బాల్యమున మరణించుటవలన, తండ్రి యనంతరము గోవిందవర్మ రాజై క్రీ. శ. 570-573

---

1. భారతి-జూలై 1965.
2. E. I. Vol. IV P. 193.
3. భారతి-జూలై 1965.

వరకు పాలించెను. ఇతడు చాల తక్కువ కాలము పాలించెను. గోవిందవర్మ పొలమూరు శాసనమున[1] "అనేక సమరసంఘట్టవిజయినః పరనరపతి మకుటమణిమయూఖావదూత చరణ యుగళస్య విక్రమాశ్రయస్య శ్రీగోవిందవర్మణః" అనియు ఈపూరు శాసనమున[2] "అపరిమిత బలపరాక్రమస్య పరమధార్మికస్య ప్రణత సకల సామంతస్యానేక గోహిరణ్య భూమి ప్రదానస్య మహారాజస్య శ్రీగోవింద వర్మణః" అని వర్ణింప బడినాడు దక్షిణా పథమున గోవిందవర్మ ప్రతిభావంతుడైన రాజుగా కీర్తిని పొందెను.

నాలుగవ మాధవవర్మ :

గోవిందవర్మ కుమారుడు మాధవవర్మ బాల్యముననే సింహాసన మధిష్ఠించి సుదీర్ఘ కాలము వైభవముతో రాజ్యమును ఏలెను. ఇతడు సింహాసన మధిష్ఠించిన తరువాత సామంత రాజుల విజృంభణము నణచవలసి వచ్చెను, ఇతని కుమారుడు మంచన భట్టారకుడు. మాధవ వర్మ వాక్యమును వేదవాక్యముగా ప్రజలు తదితర సామంతరాజులు పాలించుచుండిరి. ఇతడు తన శక్తిసామర్థ్యములతో విశాలసామ్రాజ్యము నేర్పరచి శాంతియుతముగ పాలించెను. ఇతడు రెండవ మాధవవర్మవలె ఏకాదశాశ్వమేధములు వేయి అగ్నిష్టోమములు చేసినట్లు తెలియుచున్నది, ఇతనికి జనాశ్రియుడను బిరుదము కలదు. మాధవవర్మ రాజనీతిజ్ఞుడు. న్యాయ ధర్మాచరణములందు భక్తిశ్రద్ధలు కలవాడు. ఈతడు ఈపూరు శాసనమున[3] "శ్రుతిమతి బలసద్ధ ధైర్యవీర్యవినయసంపన్నః సకలమహీమండల మనుజపతి ప్రతిపూజితశాసన త్రివరనగర భవనగత యువతి హృదయనందనః స్వనయ బలమవిజిత సకల సామంతాతుల బలవినయనయ నియమ సత్వసంపన్న సకలజగదవనిపతి ప్రతిపూజితావదూత జగత్కల్మషః సుస్థిరకర్మణ"..." అనియు వర్ణింప బడినాడు

పొలమూరు శాసనమున[4] "అతుల బలపరాక్రమ యశోదాన వినయసంపన్నో దశశత సకల ధరణీతల నరపతి రవసిత వివిధ దివ్యాస్త్రిపురనగర భవనగతపరమయువతిజన విహారణరతిర నన్యనృపతి సాధారణ దాన మాన దయా ధర్మధృతి మతిక్షాంతి కాంతి శౌర్యౌదార్యగాంభీర్య ప్రభృత్యనేక గుణసంపజ్జనిత రయసముద్ధిత భూమండలవ్యాపి విపులయశో క్రతుసహస్రప్రియాజి హిరణ్యగర్భప్రసూతః ఏకాదశాశ్వమేధావభృధస్నాన విగత జగదేనస్కః సర్వభూతపరిరక్షణ... విద్వద్విజ గురు వృద్ధతపస్వి జనాశ్రయో మహారాజః శ్రీమాధవవర్మా" అని వర్ణింప బడినాడు. ఇతడు తన 37 వ రాజ్యసంవత్సరమున ఈపూరు శాసనమును, 47 వ రాజ్యసంవత్సరమున పొలమూరు శాసనమును వేయించెను. మాధవవర్మ మహారాజు సోమవంశీయుడగు చంద్రగుప్తుని ఓడించి అతని పుత్రికయగు చంద్రాదేవిని వివాహమాడెను. చంద్రగుప్తుడు పాలించిన ప్రాంతము నేటి కర్నూలుమండలములో నున్నది. శ్రీశైల పర్వతము నంటి చంద్రగుప్తుని కోట యున్నది. విష్ణుకుండిన మాధవవర్మ న్యాయపరిపాలనము చెప్పుకొనదగినది. న్యాయము

---

1. J. A. H. R. S. Vol VI P, 17.
2. E. I. Vol XVII P. 334.
3. E. 1. Vol XVII P. 334.
4. J. A. H. R. S. Vol VI P. 17.

చేకూర్చుటకు తన కుమారుని సహితము శిక్షించుటకు వెనుదీయని న్యాయశాలి. కావుననే మల్లికార్జునస్వామి మాధవవర్మ న్యాయమునకు మెచ్చి విజయవాడ యందు కనకవర్షము గురిపించినట్లు స్థానికకథల వలన దెలియుచున్నది ఇతని పరిపాలనాకాలము క్రీ. శ. 573-623. చాళుక్యు లాంధ్రదేశ మాక్రమించు నాటికి మాధవవర్మ వృద్ధుడయ్యెను. ఐనను పౌరుషముతో పోరాడి యుద్ధమున మరణించెను

**మంచన భట్టారకుడు ;**

విష్ణుకుండిన వంశములో మంచన భట్టారకుడు చివరివాడు. క్రీ. శ. 623లో జరిగిన యుద్ధమున మాధవర్మ మరణింప రెండవ పులకేశి తమ్ముడు కుబ్జవిష్ణువర్ధనుడు విష్ణుకుండిన రాజ్యమాక్రమించెను మంచన భట్టారకుడు సామంతుల సహాయమున చాళుక్యులతో పోరు సల్పుచుండెను, జయసింహావల్లభుడు రాజ్యమునకు వచ్చిన ఐదు సంవత్సరముల వరకును చాళుక్యులకు విష్ణుకుండిన వంశీయుడగు మంచనభట్టారకునితో యుద్ధములు జరుగుచుండెను. చివరకు జయసింహావల్లభుడు క్రీ. శ. 646 ప్రాంతమున మంచనభట్టారకుని సంహారించి విష్ణుకుండిన వంశము నంతరింప జేసెను. ఇట్లు అప్రతిహత శాసనులైన విష్ణుకుండినులు ఆంధ్రదేశమును సుమారు రెండున్నర శతాబ్దుల కాలమేకచ్ఛత్రముగ పాలించిరి. చాళుక్యులతో జరిగిన యుద్ధములం దోడి పోవుటవలన ఆంధ్రదేశమున విష్ణుకుండినుల పాలన మంతరించెను.

# విష్ణుకుండిన గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము

## శాసన స్వరూపము

ఐదు రేకులుగల ఈ శాసనము నాగవరము నివాసియగు శ్రీ తమ్మళి అంజనేయులుకు లభించినది. నాగవరము ఇంద్రపాలగుట్ట, శిథిలమైన ఇంద్రపాల నగరము కలిసియే యున్నవి. శ్రీ తమ్మళి అంజనేయులు ఆసఫ్‌నహర్ కాలువ ప్రక్కననున్న చేనిలో పునాది ఇటుకలు తీయించుచుండ మట్టికుండ బయలుపడినది ఆ కుండ మట్టితో పూడియుండుటవలన, మట్టిని తీసివైచి చూడ ఉంక (ఊక) మధ్యన ఈ తామ్ర శాసనము భద్రపరుపబడి యున్నది. కడియముతో నున్న ఈశాసనము నతడు కడిగించి, అక్షరములను చదువుటకు ప్రయత్నించి విఫలుడైనాడు. నాలుగు సంవత్సరము లాతడీ శాసనమును తన ఇంటిలోని దేవునిగూటిలో నుంచి పూజించి నాడు.

శ్రీ పి. రాజారావుగారు నాగవరమునకు దగ్గరలో నున్నకమ్మగూడెపు నివాసి. ఒక పర్యాయ మాయన శ్రీ అంజనేయులుగారింటికి వెళ్ళుట తటస్థించినది. మాటల సందర్భమున శ్రీ ఆంజనేయులుగారు రాజారావు గారికి తమ ఇంటనున్న శాసనముల విషయము చెప్పి వాటిని చూపించినారు. శ్రీ రాజారావుగారా శాసనమును తమ వద్దనుంచుకొని, కారణాంతరమున తమ ఇంటికి వచ్చిన శ్రీ కె. రమామనోహరరావుగారికి నప్పగించినారు. రెండు మాసముల కాల మీశాసనము శ్రీ రమామనోహరరావుగారి వద్దనే యుండెను.

ఒకనాడు శ్రీ రమామనోహరరావుగారు నాతో సంభాషించునప్పుడు "మా ఇంటిలో తామ్ర శాసనములున్నవి" అనినారు. నాకెంతో ఆనందము కల్గినది శ్రీ రమామనోహర రావు గారితో వారి ఇంటికివెళ్ళి దయతో వారొసంగిన రెండు శాసనములను తెచ్చినాను. అవి విష్ణుకుండినుల శాసనములు. ఇంద్రపాలనగరములో నంతకుబూర్వము నేను చూచిన శిలాశాసనములు, అందలి లిపి, భాష, ఈ తామ్రశాసనము లందలి లిపి, భాషలను పోల్చిచూచి సంతోషపడినాను.

**ఆకారాదికములు :**

ఈ శాసనమున ఐదు రాగి రేకు లున్నవి. ఒక్కొక్క రేకు పొడవు 25.8 సెం. మీ వెడల్పు, 5.5 సెం. మీ. ఈ ఐదు రేకులును ఒక రాగికడియమునకు దగిలించి యున్నవి. కడియముయొక్క చుట్టుకొలత 28.5 సెం. మీ. మొత్తము శాసనము తూకము కిలో 4 గ్రాములు.

| | | | |
|---|---|---|---|
| మొదటిరేకు | తూకము | 167 | గ్రాములు |
| రెండవరేకు | తూకము | 165 | గ్రాములు |
| మూడవరేకు | తూకము | 158 | గ్రాములు |
| నాలుగవరేకు | తూకము | 168 | గ్రాములు |
| ఐదవరేకు | తూకము | 146 | గ్రాములు |
| కడియముసీలుతోకూడి | | 200 | గ్రాములు |
| మొత్తము | | 1004 | గ్రాములు |

కడియమునకు బిగించియున్న రాజముద్రిక పై సింహ లాంఛన మున్నది.

ఈ శాసనమున ఐదు రాగిరేకు లున్నను, ఒక రేకు మాత్రము వదిలివేయ బడినది. శాసనము నాలుగవ రేకు మొదటి ప్రక్కతో పూర్తిఐనది. శాసనము, మొదటిరేకు రెండవ ప్రక్క నుండి ప్రారంభింపఁ బడినది. శాసనమున గల పంక్తుల మొత్తము సంఖ్య 32.

| | | |
|---|---|---|
| మొదటి రేకు రెండవ ప్రక్క | 5 | పంక్తులు |
| రెండవ రేకు మొదటి ప్రక్క | 6 | పంక్తులు |
| రెండవ రేకు రెండవ ప్రక్క | 6 | పంక్తులు |
| మూడవ రేకు మొదటి ప్రక్క | 6 | పంక్తులు |
| మూడవ రేకు రెండవ ప్రక్క | 6 | పంక్తులు |
| నాలుగవ రేకు మొదటిప్రక్క | 3 | పంక్తులు |
| మొత్తము | 32 | పంక్తులు |

శాసనపురేకులకు ఎడమవైపున. 1.2 సెం మీ. వ్యాసముగల రంధ్రము లున్నవి.

ఈ శాసనమున రెండవ రేకు మొదటి ప్రక్క ఐదవ వరుసలోని చివరి అక్షరములు. చిలుముపట్టి చెదిరిపోయినవి. శాసనపురేకుల కొసలు అక్షరములను కాపాడుట కంచులుగ తీర్పఁబడి యుండలేదు. విష్ణుకుండినుల శాసనము లన్నియు నిట్లేయున్నవి.

**భాష :**

ఈ శాసనభాష యంతయు సంస్కృతములో నున్నది. శాసనము మొదట శుభప్రతి పాదితమైన 'స్వస్తి' వాచకముతో ప్రారంభింపఁ బడినది. 'జితంభగవతా' అను శ్లోకము తరువాత మూఁడవ రేకు రెండవ ప్రక్కలో ఐదవ వరుసలోనున్న మనుగీతా శ్లోకము వరకు గల శాసన భాగ మంతయు సంస్కృత వచనములో నున్నది. మూఁడు శ్లోకముల తరువాత ముగింపు వచన ములో నున్నవి.

**లిపి**

క్రీస్తుశకము నాలుగైదు శతాబ్దులలో నాంధ్రదేశమున వాడుకలో నుండిన తెలుగు లిపి లేక శాలంకాయనులనాటి వేంగీలిపి ఈ శాసనమున వాడఁబడినది. శాసనాక్షరములు చక్కఁగా చెక్కఁబడినవి. పరిమాణమున కొన్ని వరుసలలో చిన్నవిగను మరికొన్ని వరుసలలో పెద్దవిగను ఉన్నను అక్షరములను శిల్పి కడు జాగరూకతతో చెక్కినాడు.

ఇవి గుండ్రటిత్తు అక్షరములు. ఈ యక్షరములు విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాల నగర తామ్రశాసనము[1] చిక్కుళ్ళ శాసనము[2] ఇంద్రభట్టారకవర్మ రామతీర్థశాసనముల[3]లోని అక్షరములను బోలి యున్నవి. ఈ శాసనమున సంఖ్యాసంకేతములు ప్రాచీన పద్ధతిలోనున్నవి మొదటి రేకు రెండవప్రక్క ఎడమ వైపున నున్నరంధ్రమునకు పైభాగమున 'ఒకటి' గుర్తును, రెండవ రేకు రెండవప్రక్క 'రెండు' గుర్తును మూడవరేకు రెండవప్రక్క 'మూడు' గుర్తును ఉన్నవి.

ఈ శాసనపు రేకులపైని చెక్కబడిన అంకెల గుర్తు క్రింది విధముగనున్నవి.

ఒకటి 𑀿

రెండు

మూఁడు

విష్ణుకుండినుల ఇతర శాసనముల రేకులపైనను ఇట్టి గుర్తులున్నవి. ఈ సంఖ్యాసంకేతముల వలన శాసనపురేకుల వరుస క్రమము తెలియును.

**వర్ణక్రమము :**

సంస్కృత భాషా సంప్రదాయము ననుసరించి శాసనమున వర్ణక్రమ మున్నది.

| | | |
|---|---|---|
| నిర్వాణము | — | నివ్వాణము. |
| మాధవవర్మ | — | మాధవ వమ్మ |
| శౌర్య | — | శౌయ్య. |
| ధైర్య | — | ధైయ్య. |
| వర్ణాశ్రమ | — | వణ్ణాశ్రమ. |
| బలీవర్ద | — | బలీవర్ద |
| సంస్కారపూర్వ | — | సంస్కారపూవ్వ |
| శాస్త్రార్థ | — | శాస్త్రార్త్థ |

---

1 భారతి — జూలై 1965

2 E.I Vol IV P. 193

3 E.I. Vol XII P. 133.

ఇట్లు నిర్వాణము, వర్మ శౌర్య, ధైర్య ఇత్యాదులయందు 'ఱ' వలపలగిలకకు పూర్వాక్షరము ద్విత్వముగ వ్రాయఁబడినది. శాసనమున మూడవరేకు మొదటిప్రక్క ఆరవ పంక్తిలో 'వేణ్కపఱ' అను గ్రామనామమున 'ఱ' వ్రాయ బడినది సంపూర్ణముగా సంస్కృత భాషలో వ్రాయబడిన ఈ శాసనములో 'ఱ'కు ప్రత్యేకత నీయ బడినది. ఆనాడు తెలుగు వర్ణమాలలో శకటరేఫమునకు ప్రత్యేక స్థానముండెను. కళింగ గాంగరాజగు అనంతవర్మ సేవిది గ్రామ తామ్రశాసనము[1] నాగరిలిపిలో చెక్కబడినది. ఆ శాసనమందు శకటరేఫము ప్రత్యేకముగ నున్నది శకటరేఫము తెలుఁగుభాషలోనున్నను సంస్కృతశాసనములు దేవనాగరి లిపిలో వ్రాయబడినను, ఆయా శాసనములందు శకటరేఫము ప్రత్యేకముగా పేర్కొనఁబడుటనుబట్టి ఆ యక్షరమునకుఁగల ప్రత్యేక ఉచ్చారణము తెలియుచున్నది.

**శాసన విషయము :**

దాతయైన గోవిందవర్మ విష్ణుకుండిన మహారాజేంద్రవర్మ పౌత్రుఁడు. (శ్రీమహారాజేన్ద్రవర్మ్మణ సత్పౌత్రేణ) మాధవవర్మ పుత్రుడు. (మహారాజశ్రీ మాధవవర్మ్మణః సుపుత్రేణ) గోవిందవర్మ తన భుజబలోత్సాహముల చేతను, ప్రభావానురాగములచేతను, స్వరాజ్యమందంతటను వ్యాప్తకీర్తియై, శౌర్య ధైర్య ప్రతాపాను భావముల వలన శత్రువులచేత నితరరాజ్యాక్రమణ గలవాఁడై దానమానాదులచేత ననురక్తమగు వర్ణాశ్రమ పరిజనుఁడై గ్రామక్షేత్ర హిరణ్య ద్విరదతురగ గోబలీవర్ద శయనాసన యాన పాన భోజన భాజన భవన వసనాభరణ కన్యాదానములం జేయువాఁడును, వేలకొలది దాసులదానము చేయువాఁడును, అనేక దేవాయతన విహార సభాప్రపా తటాకోదపానారామ ప్రతిసంస్కార పూర్వకములగు నుపకార కార్యములను జేయువాడును, విభూషిత దిగంతరుఁడును భిక్షు ద్విజానాథ యాచకవ్యాధిత దీన కృపణ జనులచే ననుభవింపఁబడు న్యాయార్జిత ధన సమృద్ధిగలవాఁడును, నందఱకు నన్నిటిని దానము చేయువాడును, సకలశాస్త్రార్థ శ్రవణ పరిజ్ఞానము వలన నిహపరములందు సాటిలేని దూరదృష్టి కలవాడును, శూరులకు, కులీనులకును, నాశ్రయభూతుఁడును సకలప్రాణి కోటికిని రక్షణార్థముత్పాదింపఁబడిన—"అనిప్రశంసింప బడినాఁడు

ఈ శాసనము గోవిందవర్మచేత నాతఁడు పాలింపమొదలిడినదిమొద లభివృద్ధినొందు ముప్పది యేడవ సంవత్సరమందు వైశాఖపూర్ణిమ నాడు ఈయబడినది. (మహారాజశ్రీ గోవిందవర్మ్మణాఆత్మనః ప్రవర్ద్ధమాన విజయరాజ్యసంవత్సరే సప్తత్రింశత్కే వైశాఖే పూర్ణ్ణిమాస్యాం.")

"గోవిందవర్మ ముప్పదియేడవ రాజ్యసంవత్సరమున వేయింపబడిన ఈ శాసనము బౌద్ధమతానుయాయియు, చతుర్వైశారద్యవిశారదుఁడును, అష్టాదశవేణికాత్మకమగు బుద్ధధర్మముచే సమలంకృతమూర్తియును, ద్వాత్రింశన్మహా పురుషలక్షణోపలక్షితుఁడును, జరామరణ శోకాది బహువిధ సంసారదుఃఖమునందు పూర్తిగా మునిగిన ప్రాణికోటి నుద్ధరించుటకు అనేక కల్పములనుండి, అసంఖ్యేయముగా జేరిన పుణ్యజ్ఞాన సంభారమను భారముగలవాడును, రాగద్వేష మోహములనుండియు జననమరణాది దుఃఖములనుండియు, తప్పించుకొనినవాఁడును, అప్రతిహతము, ననావరణము (నగు బుద్ధిచే) తెలియ దగినజ్ఞానము నంతయు తెలిసికొనుటవలన నతివిజ్ఞానియునగు దశబలబలియను పూజ్యునికి-పదునాలుగవ ఆర్యసంఘమునుద్దేశించి, తల్లిదండ్రుల ఋణమును దీర్చునట్టియు, సర్వప్రాణులను రక్షించునదియు, సర్వవిధములగు దరిద్రములను, దుఃఖములను,

1. భారతి-ఆగసు 1965

ఉపశమింపఁజేయు నిమిత్తము, తన పట్టమహిషియైన 'పరమమహాదేవిచే' విహారమునకు గంధ పుష్ప ధ్వజపాన భోజన శయనాసన గ్రాస-భైషజ్య ఆదిక్షేమములు కలుగుటకొరకు, ద్వావేమ్బూర దలవేణ్కపలి' అను గ్రామము, నిధులు, దండకరవృష్టులు, ఉచ్ఛిష్టభాగము లన్నిఁటితోగూడ ధారాపూర్వకముగా దానము చేయబడినది.

**కాల నిర్ణయము :**

గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము ననుసరించి విష్ణుకుండినవంశము మహారాజేంద్రవర్మతో నారంభ మగుచున్నది. మహారాజేంద్రవర్మకుఁ బూర్వమతని పితృపితామహులు ఇక్ష్వాకువంశీయుల సైన్యాధ్యక్షులుగనో, సామంతులుగనో నుండియుండవచ్చును. ఇప్పటి వఱకు లభించిన శాసనములనుబట్టి విష్ణుకుండినులు బ్రాహ్మణ మతానుయాయులని చెప్పవచ్చును. వీరు ఏకాదశాశ్వమేధములు, క్రతుసహస్రములు చేసినవారు. ఇంద్రవర్మ రామతీర్థ శాసన మూతని 27వ రాజ్యకాల సంవత్సరమున జ్యేష్టమాస శుక్ల పక్షసప్తమీ తిథినాడు తైత్తిరీయ శాఖా బ్రాహ్మణుడును, ఆంగిరస గోత్రుడును, అయిన నగ్నశర్మకు పలికి రాష్ట్రములోని 'పెరువాడక' గ్రామమును దానము చేసినట్లు తెలుపు చున్నది. పొలమూరు శాసనము ఈపూరు మొదటి శాసనము మాధవవర్మ కావించిన దానములను దెలుపును. పొలమూరు శాసనము మాధవవర్మ తన 47 వ విజయ రాజ్యసంవత్సరము, ఫాల్గుణపౌర్ణిమ సోమగ్రహణ నిమిత్తమున గౌతమగోత్రుఁడైన శివ శర్మకు 'పులొంబూరు', గ్రామమును దానమిచ్చిన విషయమును, ఈపూరు మొదటి శాసనము మాధవవర్మ తన 37వ విజయరాజ్య సంవత్సరమున వత్సగోత్రుడైన అగ్నిశర్మకు 'విలెంబలి' గ్రామమును దానమిచ్చిన విషయమును తెలుపుచున్నది.

రెండవ ఈపూరు శాసనము దేవవర్మ కుమారుడగు మాధవవర్మచే నీయబడినది. ఇతడు తన 47వ రాజ్యసంవత్సరమున వత్సగోత్రులగు అగ్నిశర్మ ఇంద్రశర్మలకు దానమిచ్చెను. ఈ శాసనము వలన విష్ణుకుండిన వంశములోని మూడు తరముల రాజుల పేళ్ళు తెలియుచున్నవి.

చిక్కుళ్ళ, తుండి, తామ్ర శాసనములలో పేర్కొనబడిన దాత విక్రమేంద్ర భట్టారక వర్మ. ఇతడు తన పదియవ రాజ్యసంవత్సరమున సోమగిరీశ్వరనాథునికి చిక్కుళ్ళశాసనము నొసంగెను. ఈ శాసనము వలన విష్ణుకుండిన వంశములోని నాలుగు తరముల రాజుల పేళ్ళు తెలియుచున్నవి.

తుండి తామ్రశాసనము విక్రమేంద్ర భట్టారకవర్మ తన పదునాలుగవ విజయరాజ్య సంవత్సరమున కౌండిన్యగోత్రుడును. ఆపస్తంబ సూత్రుడను. అగు, స్వామిశర్మకు తుండి గ్రామమును దానమొసంగిన విషయమును దెలుపు చున్నది.

విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున అతని విజయరాజ్య సంవత్సరముతో పాటు శక సంవత్సరము సైతము పేర్కొన బడినది. విష్ణుకుండినుల శాసనములందు విజయరాజ్య సంవత్సరము తప్ప శకసంవత్సరమును పేర్కొను ఆచారము లేదు. విక్రమేంద్ర భట్టారకవర్మ వేయించిన ఈ శాసనము వలన ఆతనికి ఉత్తమాశ్రయుడను బిరుదమున్నట్లును, ఆతని తండ్రి ఇంద్రభట్టారక వర్మకు సత్యాశ్రయుడను బిరుద మున్నట్లును దెలియు చున్నది. విక్రమేంద్ర భట్టారకవర్మ శకసంవత్సరము 488 గడిచిన పిదప ఆ దానము గావించినాడు. (సాష్టాశీత చతుశ్శతే శకవతే సంవత్సరాణాంగతే)

విష్ణుకుండిన వంశమునకు మూలపురుషుడు మాధవవర్మయని ఇంతవరకు లభించిన శాసనముల ననుసరించి చరిత్ర పరిశోధకులు విష్ణుకుండిన వంశనిర్ణయము నీ క్రిందివిధముగ గావించినారు.




ఇంతవరకు విష్ణుకుండిన వంశమునకు చెందిన తొమ్మిది మంది రాజుల చరిత్ర ప్రకటింపబడిన శాసనముల వలన. (ఇంద్రపాలనగర తామ్రశాసనములుకాక) తెలియుచున్నది. చారిత్రకులీ వంశీయుల కాలమును ఆయా రాజులు వేయించిన శాసనములందు పేర్కొనబడిన విజయరాజ్య సంవత్సరముల ననుసరించియు సమకాలీన రాజవంశీయుల శాసనముల ననుసరించియు నిర్ణయించినారు. కాని విష్ణుకుండినుల ఇంద్రపాలనగర తామ్రశాసనముల లోని రాజుల పేళ్ళు, ప్రకటింపబడిన ఆరు తామ్రశాసనములలోని రాజులపేళ్ళు కలియుచున్నను గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము విష్ణుకుండిన వంశచరిత్రలో నూతన విషయములను చేర్చుటలో దోడ్పడుచున్నది.

గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము



విక్రమేంద్ర భట్టారక వర్మ-ఇంద్రపాలనగర తామ్రశాసనము




పైని పేర్కొనబడిన ఇంద్రపాలనగర తామ్రశాసనములోని రాజుల పేళ్ళనుబట్టి గోవింద వర్మ తన 37 వ విజయరాజ్య సంవత్సరమున వేయించిన శాసనము, విక్రమేంద్ర భట్టారకవర్మ వేయించిన శాసనముకన్న ప్రాచీనమైనదని తెలియు చున్నది.

గోవిందవర్మ తన 37 వ విజయరాజ్య సంవత్సరమున వేయించిన ఈ శాసనమును బట్టి మొదట విష్ణుకుండినులు, బౌద్ధమతాభిమానము గల్గియుండిరని తెలియు చున్నది. గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున పేర్కొనబడిన 'పేణ్కపఱ' గ్రామము బౌద్ధవిహారమున కొసగ బడినది. మొదట విష్ణుకుండినుల యావాసము తెలంగాణములోని ఇంద్రపాలనగరము. ఈ నగరము వారి మొదటి రాజధాని. కాలక్రమమున సామ్రాజ్యము విస్తరించుట వలన అమరావతి, వేంగీపురము, దెందులూరు, బెజవాడ నగరములు వీరికి రాజధానులైనవి.

ఇంద్రపాల నగరమున లభించిన రెండు తామ్రశాసనముల ననుసరించి పూర్వము ప్రకటింపబడిన శాసనములలోని రాజుల పేళ్ళను, విజయరాజ్య సంవత్సరములబట్టి, విష్ణుకుండినుల కాలమును, వంశమును, నిర్ణయింపబడుచున్నవి.

ఇంతవఱకు లభించిన ఎనిమిది తామ్రశాసనముల ననుసరించి, విష్ణుకుండిన వంశీయులకు మూల పురుషుడు మహారాజేంద్రవర్మయని తెలియుచున్నది. ఇతడు క్రీ. శ. 358 ప్రాంతమున ఇంద్రపాలనగరమును రాజధానిగా రాజ్యముస్థాపించెను. ఇతని కుమారుడు మొదటి మాధవవర్మ, మాధవవర్మ యనంతరము రాజ్యభారము వహించినవాడాతని తనయుడు మొదటి గోవిందవర్మ, ఇతడే తన 37 వ విజయరాజ్యసంవత్సరమున ఇంద్రపాలనగర తామ్రశాసనమును వేయించెను.

విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ, మాధవవర్మ కుమారుడు. రెండవ మాధవవర్మకు తండ్రి, బౌద్ధ విహారమునకు 'పేణ్కపఱ' గ్రామము నగ్రహారముగా నొసంగుచు తన 37వ రాజ్యసంవత్సరమున ఇంద్రపాలనగర తామ్రశాసనము వేయించినవాడు. ఈఇంద్రపాలనగర తామ్రశాసనముల ననుసరించి చారిత్రకు లూహించిన మొదటి మాధవవర్మ,

విష్ణుకుండిన వంశపు రాజులలో నాలుగవ రాజుగా, రెండవ మాధవవర్మగా గన్పట్టుచున్నాడు. ఈ రెండవ మాధవవర్మకు ఇద్దరు భార్యలు. మొదటి భార్య పట్టపురాణి ఆమె కుమారుడు దేవవర్మ. రెండవ భార్య వాకాటక రాజకుమారియైన మహాదేవి. ఆమెకు విక్రమేంద్రవర్మ జన్మించెను. రెండవ మాధవవర్మ యనంతరము దేవవర్మ రాజగుటకు గారణ మాతడు పట్టపురాణి తనయుడగుటయే. దేవవర్మ కుమారుడు మూడవ మాధవవర్మ వేయించిన రెండవ ఈపూరు శాసనమున రెండవ మాధవవర్మ ప్రశంసింప బడినాడు దేవవర్మకు మహారాజ శబ్దమున్నట్లు శాసనమున కాన రాదు. మూడవ మాధవవర్మ యనంతరము విక్రమేంద్రవర్మ తన వృద్ధాప్యమున సామ్రాజ్యాధికారము వహించెను.

## విష్ణుకుండిన వంశము - రాజుల పరిపాలనా కాలము



విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనకాలము, శక సంవత్సరము 488. అనగా క్రీ. శ. 566. విక్రమేంద్ర భట్టారకవర్మ చిక్కుళ్ళ శాసన మాతని పదియవ రాజ్యసంవత్సరములోను, ఇంద్రపాలనగర తామ్రశాసనము పదునొకండవ విజయరాజ్య సంవత్సరములోను, తుండి తామ్ర శాసనము పదునాలుగవ రాజ్య సంవత్సరములోను వేయింప బడినవి. ఐన విక్రమేంద్ర భట్టారకవర్మ రాజ్యమునకు వచ్చిన సంవత్సరము శ. సం. 476 అనగా క్రీ. శ. 554. తుండితామ్ర శాసనము విక్రమేంద్ర భట్టారకవర్మ పదునాలుగవ విజయ రాజ్య సంవత్సరమున వేయించినది. అనగా శక సంవత్సరము 489. (క్రీ. శ. 566). తరువాత క్రీ.శ. 570 వరకు అతడు జీవించి యుండ వచ్చును.

గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము ననుసరించి ఆంధ్ర దేశమున విష్ణుకుండినుల పరిపాలనము క్రీ. శ. 388 నుండి ప్రారంభమైనట్లు తెలియుచున్నది. అనగా శాలంకాయన వంశీయు లాంధ్ర దేశమును పాలించు చుండిన కాలమున విష్ణుకుండిన వంశీయుడగు మహారాజేంద్ర వర్మ ఇంద్ర పాలనగరమును రాజధానిగా తెలంగాణ ప్రాంతమును పాలించెను. మహారాజేంద్ర వర్మ కుమారుడు మొదటి మాధవవర్మ. మాధవవర్మ కుమారుడు గోవిందవర్మ. ఇంద్రపాలనగర తామ్రశాసనమును వేయించినవాడు.

విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున గోవిందవర్మ ప్రశంస కలదు. ఈ గోవిందవర్మ, ఇంద్రపాలనగర తామ్రశాసనమును వేయించిన గోవిందవర్మయు నొక్కరే. గోవిందవర్మ కుమారుడు రెండవ మాధవవర్మ. ఈకడే వాజపేయ, అశ్వమేధ, అగ్నిష్టోమాది యజ్ఞము లాచరించి, శక్తి సమన్వితుడై వాకాటక రాజకుమార్తెను వివాహమాడినవాడు. ఈ రెండవ మాధవవర్మనే చారిత్రకు లింతవరకు లభించిన శాసనముల నాధారముగ మొదటి మాధవవర్మ యనియు, విష్ణుకుండిన వంశస్థాపకుడనియు నిర్ణయించినారు. మాధవవర్మ తరువాతి వంశక్రమమునకు, విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసన మందలి రాజులపేళ్ళు సరిపోవు చున్నవి. కావున విష్ణుకుండిన వంశము మహారాజేంద్ర వర్మతో ప్రారంభ మగుచున్నది.

# గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్ర శాసనము

## శాసనము - మూలము

### మొదటి రేకు - రెండవ ప్రక్క

1. స్వస్తి జితం భగవతా తేన సంబుద్ధేన కృపాత్మనా నిర్వాణ
ప్రాప్తయే యేన సద్యోమార్గః ప్రదర్శితః । సర్వసత్త్వ

2. త్యాగాభిజన నయవినయోత్సాహాది గుణగణసంపదా స్వయ
మధిగతరాజ్యానాం సమ్యక్ప్రజాపాలనాత్ప్ర

3. థితావదాత పృథుయశసాం రాజ్ఞాం విష్ణుకుణ్డినా మమల విపుల
సకల కులతిల

4. కేన శ్రీమహారాజేన్ద్రవర్మణ సత్పుత్రేణ మహారాజశ్రీ మాధవ
వర్మణః సుపుత్రేణ స్వతయ

5. భుజబలోత్సాహ ప్రభావానురాగావాప్త స్వరాజ్యేన శౌర్య
ధైర్య ప్రతాపానుభావాద

## రెండవ రేకు - మొదటి ప్రక్క

1. న్య సామన్తాక్రాన్తరాజ్యాంన్తరేణ దానమానాదిభి రనురక్త వర్ణ్ణాశ్రమ స్వజన పరిజనేన గ్రామక్షేత్ర
2. హిరణ్య ద్విరద తురగ గోబలీవర్ద్ద శయనాసన యాన పాన భోజన భాజన భవన వసనాభరణ కన్యా
3. దాసీ దాససహస్రాణాం దాత్రా అనేక దేవాయతన విహార సభాప్రపా తటాకోదపానా
4. రామ ప్రతిసంస్కారపూర్వ్వకరణేనాలంకృత సకల దిగన్తరేణ భిక్షుద్విజానాధ యాచక వ్యా
5. ధిత దీనకృపణజనోపభుజ్యమాన న్యాయాధిగత విభవ ధన సముదయేనా సకల సకుత్సవ్వ
6. స్వత్యాగినా సకల శాస్త్రార్థ శ్రవణ పరిజ్ఞానాదిహ పరత్ర చానన్య చక్షుషా విద్యచ్చూరమహో

## రెండవ రేకు - రెండవ ప్రక్క

1. కులీనజన సమాశ్రయేణ సకల సత్వధాతూత్రాణా యోత్పాదిత మహాబోధివిత్తేన మహారాజశ్రీ
2. గోవిన్దవమ్మణా ఆత్మనః ప్రవర్ద్ధమాన విజయ రాజ్యసంవత్సరే సప్తత్రింశత్కే వైశాఖే పూర్ణ్ణమాస్యాం భగ
3. వతో దశబలబలినః చతుర్వైశారద్య విశారదస్యాష్టాదశ వేణీకబుద్ధధమ్మ సమలంకృ
4. తమూర్తే ద్వాత్రింశన్మహాపురుషలక్షణ వరోపలక్షితస్య జాతిజరా మరణ శోకాదిషు బహు
5. సంసార దుఃఖనిమగ్న సర్వ్వ సత్వోత్తారణాయానేక కల్పాసంఖ్యే యోపచిత పుణ్యజ్ఞాన సంభారభార
6. స్యాపగత రాగద్వేషమోహా జననమరణ దుఃఖస్యా ప్రతిహతా నావరణ సకలజ్ఞేయజ్ఞానా

## మూడవ రేకు - మొదటి ప్రక్క

1. సమ్యక్సంబుద్ధస్యబుద్ధస్య మార్గ్గమభిప్రపన్నం నిర్వ్విద్వరాగశీల
శిక్షాధృ(ద్ధు)తగుణాద్ధ్యయన శ్రవణ చి

2. న్తన భావనాధ్యాన సమాధి సమాపత్త్యాదిభిగుణగణైరను త్తరం
పుణ్యక్షేత్రం క్రియానయాయినం చాతుర్ద్ద

3. శమార్య్యసఙ్ఘముద్దిశ్య త్యాగపరిభోగాన్వయో మో పధిక (చౌ)
పుణ్యక్రియావస్త్వభినివ్వర్త్త

4. యిష్యతా మాతాపిత్రోః సర్వ్వసత్త్వానామ్ నిఖిల దారిద్ర్య
దుఃఖోపశమహేతోః స్వస్యా అగ్ర

5. మహిష్యా పరమమహాదేవ్యా విహారస్య దీప ధూప గన్ధ పుష్ప
ధ్వజ పాన భోజన శయనాసన గ్రాస

6. భైషజ్య చేణ్డస్ఫుటిత శీర్ణ్ణసంస్కారాది కుశల మూలానుపచ్ఛే
దార్త్థం ద్వావేమ్బ్రుదల పేణ్కపటి

## మూడవ రేకు - రెండవ ప్రక్క

1. నామదేయో గ్రామో ఉదకదానపూర్వ్వకం మతిసృష్టిసనిధిసోపనిధి
సదణ్డకరవృష్టిసోచ్చిష్టభాగ

2. భోగప్రదేయ(ః) వారభటదూత వల్లభరాజపురుషై రప్రవేశ్యో
విముక్త సకల పరిహారో విష్ణుకుణ్డీ

3. కుల వంశ్యై రాజభిస్సంరక్షణీయో సంవర్ద్ధనీయో చాస్తీతి రేషా
స్థాపితస్థిత్యాన్వ్రక్రమే పన్న

4. మహాపాతకయోగః ప్రవృత్త పుణ్యక్రియావిచ్ఛే దేవానత్త
దుఃఖభూయిష్ఠ నరకే తిర్య్యగ్

5. క్ప్రేతగతిష్య నిష్ఠకర్మ్మఫలోపభోగమసభవన్తి॥భవన్తిచాత్రమను
గీతాశ్లోకా ।

6. షష్టింవర్ష సహస్రాణి స్వర్గ్గేవసతి భూమిదః ఆక్షేప్తాచాను
మన్తాచ తాన్యేవ నరకే వసేత్.

## నాలుగవ రేకు - మొదటి ప్రక్క

1. స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసున్ధరామ్ సవిష్టాయాం
క్రిమిభూ౯త్వా పితృ భిస్సహపత్యతాం
౨. బహుభిర్వ్వసుధా తత్తా బహుభిశ్చానుపాలితా యస్యయస్యయదా
భూమి స్తస్య తస్యతదా
౩ ఫలమ్ ॥ భువిమేరూదధీయావద్దిపిన్దురవిమారుతా తావచ్ఛ్రీ
విష్ణుకుణ్డీనాం పృథివీశాస్త్య శాసనం ॥

**శాసనానువాదము**

స్వస్తి నిర్వాణప్రాప్తికొరకు, ఎవడు సద్యోమార్గమును ప్రదర్శించినాడో (చూపినాడో) అట్టి కృపాత్ముడు సంబుద్ధుడు అయిన భగవానుడు జయము పొందుచున్నాడు. అనగా వానికి సర్వదాజయము లేక వానికి జయమగుగాక) సత్యము, సత్వము, త్యాగము ఉన్నత వంశసంజాతత్వము (అభిజాత్యము) నయవినయోత్సాహాది సద్గుణసంపత్తిని స్వపరాక్రమంబున రాజ్యముంబొంది సక్రమ ప్రజాపాలనమువలన కీర్తిగాంచి అనేక దానములవలన విస్తారకీర్తిని బొందిన విష్ణుకుండిన రాజ్యలోకములో నందటికిని తిలకాయమానుడగు శ్రీమహా రాజేంద్ర వర్మ సత్పుత్రుడై, మహారాజశ్రీ మాధవవర్మకు సుపుత్రుడై తన భుజబలోత్సాహముల చేతను, ప్రభావానురాగముల చేతను, స్వరాజ్యమందంతటను వ్యాప్తకీర్తియై శౌర్య ధైర్య ప్రతాపాదు భావములవలన శత్రువులచేత నితరరాజ్యాక్రమణము గలవాడై దానమానాదులచే ననురక్తమగు వర్ణాశ్రమ స్వజన పరిజనుడై గ్రామక్షేత్ర హిరణ్యద్విరద తురగ గో బలీవర్ద శయనాసన యాన పాన భోజన భాజన భవన వసనాభరణ కన్యాదానములం చేయువాడును, వేలకొలది దాసుల దానము చేయువాడును ననేక దేవాయతన విహార సభాప్రపాతటాకోద పానారామప్రతిసంస్కార పూర్వకములగు నుపకార కార్యముల జేయువాడును, విభూషిత దిగంతరుడును, భిక్షు, ద్విజానాథ యాచకవ్యాధిత దీనకృపణ జనులచే ననుభవింపబడు న్యాయార్జిత ధనసమృద్ధి గలవాడును. నందఱకు నన్నిటిని దానము చేయువాడును, సకలశాస్త్రార్థ శ్రవణ పరిజ్ఞానమువలన నిహపరములందు సాటిలేని దూరదృష్టి కలవాడును. శూరులకు కులీనులకు నాశ్రయ భూతుడును, సకల ప్రాణికోటికిని రక్షణార్థ ముత్పాదింపబడిన మహాబోధి విత్తము గలవాడును అగు మహారాజశ్రీ గోవిందవర్మ చేత, అతడు పాలింప మొదలిడినది మొద లభివృద్ధినొందు ముప్పదియేడవ సంవత్సరమందు, వైశాఖ పూర్ణిమనాడు చతుర్వైశారద్య విశారదుండును, అష్టాదశ వేణికాత్మకమగు బుద్ధధర్మముచే సమలంకృతమూర్తియును, ద్వాత్రింశన్మహాపురుష లక్షణోపలక్షితుడును, జరా మరణశోకాది బహువిధ (దుఃఖములందును) సంసార దుఃఖములందును పూర్తిగా మునిగిన ప్రాణికోటి నుద్ధరించుటకు, అనేక కల్పము నుండి, అసంఖ్యేయముగాజేరిన పుణ్యజ్ఞాన సంభారమను భారముగలవాడును రాగ ద్వేష మోహమునుండి జనన మరణాది దుఃఖములనుండియు తప్పించుకొన్న వాడును, అప్రతిహతము ననావరణము (నగుబుద్ధిచే) తెలియదగిన జ్ఞానమునంతను తెలిసికొనుట వలన నతి విజ్ఞానియగు దశబలబలియును పూజ్యునికి నభిప్రపన్నమగు బౌద్ధమార్గము నిర్విరాగ శీలశిక్షాదృ (దృఢ) తములు, మొదలగు గుణముల నధ్యయనశ్రవణ చిన్తన, కీర్తనభావనా ధ్యాన సమాధిసమాపత్తి మొదలగు గుణగణములతో గూడినదై పుణ్యక్షేత్ర

# విష్ణుకుండిన విక్రమేంద్ర భట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము

**శాసనము :**

ఐదు రేకులుగల ఈ తామ్రశాసనము నాగవరము నివాసియగు శ్రీతమ్మళి ఆంజనేయులుకు లభించినది. గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము లభించిన స్థలమందే ఈ శాసనము దొరికినది. రేకులన్నియు చిలుముపట్టి యక్షరములుకొన్ని చెదిరి పోయినవి. ఈ శాసనపు గడియ మెచ్చటను గనిపింపలేదు. శాసనములోని మొదటిరేకు ఎడమవైపు పైభాగము పగిలి పోయినది ఈ శాసనపురేకులు శ్రీ తమ్మళి ఆంజనేయులు ద్వారా శ్రీ పి రాజారావుగారికి, రాజారావుగారినుండి శ్రీ రమామనోహరరావుగారికి, వారినుండి నాకు లభించినవి.

ఈ శాసనము విష్ణుకుండిన వంశీయుడగు విక్రమేంద్ర భట్టారకవర్మ వేయించినది. ఇతడు ఇంద్రభట్టారకవర్మ కుమారుడు. విక్రమేంద్రవర్మ పౌత్రుడు. ఈ శాసనమున విష్ణుకుండిన వంశచరిత్ర గోవిందవర్మతో ప్రారంభ మగుచున్నది.




**ఆకారాదికములు :**

ఈ శాసనమున ఐదు రాగిరేకు లున్నవి. ఒక్కొక్క రేకు పొడవు 18.8 సెం. మీ. వెడల్పు 6.5 సెం. మీ. ఈ రేకులకుగల కడియము, రాజముద్రిక ఎక్కడ పడిపోయినవో తెలియదు. నాగవరమువెళ్ళి శ్రీతమ్మళి ఆంజనేయులుగారిని కడియము విషయమడిగి యుంటిని. వారు

భూమిలో గజములోతు మట్టి తీయించినాము చుట్టుప్రక్కల వెతికించినాము ఎక్కడ కడియము జాడలేదని' చెప్పినారు. నేను ఇంద్రపాల నగర శిథిలములను జూచునప్పుడును, అచ్చటి శిలా శాసనముల ప్రతిబింబములు తీయునప్పుడును ఆ ప్రాంతమందంతటను కడియము గురించి వెతికి విఫలుడ నైతిని.

మొత్తము శాసనపు రేకులు తూకము 1088 గ్రాములు

మొదటిరేకు తూకము 182 గ్రాములు.
రెండవరేకు తూకము 212 గ్రాములు.
మూడవరేకు తూకము 280 గ్రాములు.
నాలుగవరేకు తూకము 209 గ్రాములు.
ఐదవరేకు తూకము 200 గ్రాములు.

మొత్తమైదురేకుల తూకము 1088 గ్రాము లనగా ఒకకిలో 88 గ్రాములు

ఈ శాసన మైదురేకులతో గూడియున్నను ఒక రేకు మాత్రము వదలివేయబడినది. శాసనము నాలుగవ రేకు రెండవవైపుతో బూర్తియైనది. మొదటి రేకు రెండవ ప్రక్కనుండి శాసనము ప్రారంభమగుచున్నది.

ఈ శాసనమందలి పంక్తుల సంఖ్య 45.

| | | | |
|---|---|---|---|
| మొదటి రేకు రెండవ ప్రక్క | 7 | పంక్తులు | |
| రెండవ రేకు మొదటి ప్రక్క | 7 | పంక్తులు. | |
| రెండవ రేకు రెండవ ప్రక్క | 7 | పంక్తులు. | |
| మూడవ రేకు మొదటి ప్రక్క | 6 | పంక్తులు. | |
| మూడవ రేకు రెండవ ప్రక్క | 6 | పంక్తులు. | |
| నాలుగవ రేకు మొదటిప్రక్క | 6 | పంక్తులు. | |
| నాలుగవ రేకు రెండవ ప్రక్క | 6 | పంక్తులు. | |
| మొత్తము | 45 | పంక్తులు. | |

ఐదు రేకులుగల ఈ తామ్రశాసనములోని మొదటిరేకు ఎడమవైపుననున్న రంధ్రము నుండి పై భాగమువఱకు బగిలి పోయినది. మూడవరేకు రెండవ ప్రక్కలోని చివరిపంక్తిలో "తస్సర్వ్వబాధపరిహారేణ ఇరుణ్డైలో నామ గ్రామోదత్తః" తరువాత అంగుళమున్నర చోటు వదలి వేయబడినది. నాలుగవరేకు మొదటి ప్రక్క పైయంచు చిలుముపట్టి యక్షరములన్నియు జెదరిపోయినవి. అట్లే రెండవప్రక్క పైయంచు ప్రక్కగా నున్న యక్షరములలో గొన్ని చెదరి పోయి చదువుటకు వీలుగాలేవు. ఈ నాలుగవరేకు ఎడమవైపుగల రంధ్రము నుండి క్రింది వఱకు బగిలిపోయినది. ఐదవరేకు ఎడమవైపు క్రిందిమూల విఱిగిపోయినది. ఐదురేకులకు.

1. 2. సె. మీ. వ్యాసముగల రంధ్రములున్నవి. శాసనపుకడియము, రాజముద్రిక లభింపకపోవుట వలన శాసనమునకు సమగ్రమైన రూపమేర్పడలేదు. విష్ణుకుండిన గోవిందవర్మ యింద్రపాలనగర తామ్రశాసనపురేకులవలె నీ శాసనపురేకుల కొన లక్షరములను, గాపాడుట కంచులుగా తీర్చబడిలేవు. శాలంకాయన, పల్లవ, బృహత్పలాయన, ఆనందగోత్రికుల శాసనముల అంచులును దీర్చినట్లు లేవు.

**భాష :**

ఈ శాసనము సంస్కృత భాషలో వ్రాయబడినది. శాసనారంభమున "దిక్ప్రాధిజ్మణ్డలం వ్యాప్తం యస్యబాలకర్ణ తేజసః సత్యాశ్రయసుతశ్రీమాత్సజయత్యుత్తమాశ్రయః" అనుశ్లోకమున్నది. నాలుగవరేకు మొదటిప్రక్క మూడవపంక్తిలో "నిఘ్నతాం" అను శ్లోకమునుండి శాసనాంతము వరకు శ్లోకములున్నవి. తక్కిన శాసనమంతయు వచనములోనున్నది. శాసనము చివఅనున్న శ్లోకములు దానఫలమును దెలుపునవి ఇందు శాసనము వేయబడిన కాలమును దెలుపుశ్లోకము కూడ కలదు. "సాష్టాశీతి చతుఃశతే శకపతే సంవత్సరాణాం గతే" అనుశ్లోక మీశాసనమునకు మకుటము వంటిది.

చక్కని సంస్కృతవచనములో వ్రాయబడిన ఈ శాసనమున కాఞ్చప్తి శ్రీమూలరాజు, సత్రపులలో ముఖ్యుడు. ఈ శాసనము సంస్కృతభాషలో వ్రాయబడినదైనను, దానమీయబడిన "ఇరుణ్డెఱో" గ్రామనామము తెలుగు దేశమునకు సంబంధించినది. విష్ణుకుండిన రాజన్యులలో రెండవ మాధవవర్మ బహుయాగముల నొనర్చినవాడు. ఆతని గూర్చిన వర్ణనము, విష్ణుకుండినులకు, సంబంధించిన ఇతర తామ్రశాసనములలోవలెనే యున్నది. ఈ విక్రమేంద్రభట్టారకవర్మ శాసనభాషకు, గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనభాషకు నంతగా భేదముగనిపింపదు. శాసనాక్షరముల యొక్క యాకార పరిమాణములలో మాత్రము భేదమును గమనింప వచ్చును.

**లిపి :**

క్రీస్తుశకము ఆరేడు శతాబ్దులలో నాంధ్రదేశమందు వ్యాప్తిలో నుండిన తెలుగుకన్నడ లిపి ఈ శాసనమున వ్రాయబడినది. వేంగిలిపి అనగా శాలంకాయనుల నాటి లిపి క్రమముగా బరిణామము జెంది తెలుగు కన్నడలిపిగా రూపు దిద్దుకొనినది ఈ లిపి కొలదిమార్పులతో జాళుక్యుల శాసనములందు గనిపించుచున్నది పరిమాణమున నీ శాసనములలోని యక్షరములు జిన్నవిగ నున్నవి. గోవిందవర్మ ఇంద్రపాలనగర శాసనమందలి యక్షరము లీ శాసనాక్షరములకన్న పెద్దవిగా నున్నవి, ఈ శాసనమందచ్చటచ్చట కొన్ని పెద్దవిగా నున్నఅక్షరములును నున్నవి ఇవియును గుండ్రఖత్తు అక్షరములే, కుబ్జవిష్ణువర్ధనుని చీపురుపల్లి శాసనము[1] తిమ్మాపురము శాసనము[2], పృథ్వీమూలుని గోదావరిశాసనము[3] చిక్కుళ్ళశాసనము[4] ఇంద్రభటారకవర్మ రామతీర్థశాసనము[5] లలోని అక్షరములనుబోలిన అక్షరము లీశాసన మందున్నవి. ఈ శాసనమునగల కొన్ని యక్షరములటు శాలంకాయినలిపికిని, ఇటు చాళుక్యలిపికిని మధ్యస్థముగానుండి, లిపి క్రమపరిణామదశను సూచించు

1 I A. Vol XX P. 16.
2. E-1. Vol IX P.318.
3. J.Bo. B. A. S. Vol XVI P.114
4. E I. Vol IV P.193.
5. E. I. Vol XII P. 133.

చున్నవి. మొదటిరేకు రెండవప్రక్క నెడమవైపు సంఖ్యా సంకేతమున్నది. అది 'ఒకటిని' సూచించును. రెండవరేకు రెండవ ప్రక్క ఎడమవైపు 'రెండు' గుర్తును, మూడవ రేకురెండవవైపు ఎడమప్రక్క 'మూడు' అంకెగుర్తును, నాలుగవ రేకు రెండవ ప్రక్క ఎడమవైపు 'నాలుగు' గుర్తునుఉన్నవి. ఈ సంఖ్యా సంకేతములు, ఒకటవ, రెండవ, మూడవ, నాలుగవ రేకుల సంఖ్య సూచించునట్లుగా నున్నవేగాని రేకుల ప్రక్కలను దెలుపునట్లు లేవు. గోవిందవర్మ ఇంద్రపాల నగరతామ్రశాసనమందును ఈ పద్ధతియే యనుసరింప బడినది. ఇందు సంఖ్యాసంకేతము క్రింది విధముగా వ్రాయబడినవి.

ఒకటికి-గుర్తు

రెండుకు-గుర్తు

మూడుకు-గుర్తు

నాలుగకు-గుర్తు

ఈ శాసనములోని నాలుగవరేకు రెండవ ప్రక్కతో శాసనము పూర్తియైనది కావున ఐదవరేకు వదలివేయబడినది.

శాసనమును జెక్కినశిల్పి ఎంతో జాగరూకతతో నక్షరములను జెక్కినాడు. అక్షరములు వరుసలోనుండి చూచుట కందముగా నున్నవి.

**వర్ణక్రమము:**

ఈ శాసనములో వర్ణక్రమమునకు సంబంధించిన విశేషములున్నవి. మొదట సంస్కృత శ్లోకము తరువాత రెండవ పంక్తిప్రారంభమున 'స్వస్తి' యున్నది. 'మండలం' అనుపదము 'మణ్డలం' గా వ్రాయబడినది. బాలార్క-బాలాక్కర్గాను, దుష్కరకర్మ్యకర్మా-దుష్కరకమ్మర్గకమ్మార్గాను, కర్మాద్భుత-కమ్మార్గద్భుతః శ్రీపార్వతేయ పూర్వాపర-శ్రీపావ్వర్తేయ పూవ్వార్గపరలుగాను వ్రాయబడినది.

ఇట్లు అనుస్వారమునకు బదులు అనునాసికాక్షరములు, రేఫమునకు పూర్వాక్షరము ద్విత్వముగను, రేఫమునకు బదులు 'ఁ' వలపలగిలక వ్రాయబడినవి. అనుస్వారమును సూచించుటకు, అక్షరము తలపైని చుక్కనుంచుట సంస్కృతములోవలె పాటింపబడిన ఆచారము. విసర్గ చిహ్నము రెండుచుక్కలతో సూచింపబడినది. ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు, శాసనములో నెక్కువగా గనిపించుచున్నవి. మూడు అక్షరములతో గూడిన అక్షరములును ఉన్నవి. ఇందలి అక్షరములలో, స, య, న, గ అక్షరములు కొలది మార్పులతో నేడు మనము వ్రాయునట్టి అక్షరములను పోలియున్నవి. శాసనమందలి వర్ణక్రమములో దోషములు లేవు. ఈ శాసనమున మూడవరేకు రెండవప్రక్కన చివరిపంక్తిలో "ఇరుణ్డెఱో" నామ గ్రామములో 'ఱ' వ్రాయబడినది. ఈ శకటరేఫము 'ది' వలెనుండిమధ్యన నడ్డుగీత కలిగియున్నది. ముడి గీతపై వరకు నున్నది.

ఈ శాసనమునకు దాతవిక్రమేంద్రభట్టారకవర్మ శ్రీన్ద్రభట్టారకుని కుమారుడు. (శ్రీన్ద్రి భట్టారకవర్మ్మణః పిరియానూను_స్తదనురూపశౌర్యాతిశయ రెండవరేకు మొదటిప్రక్క 6వ పం_క్తి) విక్రమేంద్ర భట్టారకవర్మ "శౌర్యాతిశయములచేతను. సమర్థమగు ప్రజాసమూహము గలదగుటచే.. శైశవముననే రాజ్యభారము వహించినవాడును, పరమ ధార్మికుడును. విజయవంతుండును. అఖిల సామంతరాజులునమస్కరించునపుడు కిరీటములందలి మణుల కాంతులచే ప్రకాశించు పూజనీయ పాదద్వయము కల శ్రీమంతుడు" అని ఈ శాసనమున గీ_ర్తింపడినాడు.

ఈ విక్రమేంద్రభట్టారకవర్మ కు_త్తమాశ్రయుడను బిరుదమున్నట్లు తెలియుచున్నది. మొదటిరేకు రెండవప్రక్క మొదటిపం_క్తి (నాలుగవరేకు రెండవ ప్రక్కమూడవపం_క్తి) ఈతని తండ్రి ఇంద్రభట్టారకవర్మ సత్యాశ్రయబిరుదాంచితుడని శాసనారంభ శ్లోకమునుబట్టి తెలియుచున్నది.

ఈ శాసనము విష్ణుకుండినవంశమున మూడవవాడును, మొదటి మాధవవర్మపుత్రుడును నగు గోవిందవర్మ ప్రశంసకలదు. ఈ గోవిందవర్మ ఇంద్రపాలనగరతామ్రశాసనమును వేయించినవాడు. వాకాటక మహాదేవిని వివాహమాడిన రెండవమాధవవర్మ తండ్రి, విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున విష్ణుకుండిన వంశమునకు జెందిన ఈ క్రిందిరాజుల పేళ్ళు కనిపించుచున్నవి.

విక్రమేంద్ర భట్టారక వర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము

|

గోవింద వర్మ- I

|

మాధవ వర్మ- II

|

విక్రమేంద్ర వర్మ

|

ఇంద్రభట్టారక వర్మ

|

విక్రమేంద్ర భట్టారక వర్మ
( శ. సం. 488 = క్రీ. శ. 566-567 )

|

మాధవ వర్మ

విష్ణుకుండినులలో రెండవ మాధవవర్మ వాకాటకరాజకుమార్తెను వివాహమాడినవాడు. ఇత డేకాద శాశ్వమేధ, బహుసువర్ణ, పౌణ్డరీక, వాజపేయాది క్రతుసహస్రముల నాచరించినవాడును, సర్వమేధ, రాజసూయ, పురుషమేధాది పుణ్యక్రతువులను యథావిధిగా నాచరించినవాడును, వేదో_క్త సమ_స్త దుష్కర పుణ్యకర్మల ననుష్ఠించిన వాడును, తూర్పు, దక్షిణము, పడమటి సముద్రములను, ఉ_త్తరమున రేవానదిసలిలమును సరిహద్దుగాగల భూభాగమునకు ప్రభువైనవాడును" అని కీ_ర్తింపబడినాడు. ఇతని పుత్రుడు విక్రమేంద్రవర్మ. విక్రమేంద్రవర్మకు మహారాజ

బిరుదమున్న ట్లీశాసనమువలన దెలియుచున్నది. ఈ విక్రమేంద్రవర్మ, మాధవవర్మ ప్రియపుత్రుడనియు, వాకాటకమహాదేవి కుమారుడనియు, మహాకవియనియు, బౌద్ధమతావలంబియనియు కీర్తింపబడినాడు (మహారాజ శ్రీమాధవవర్మణః ప్రియపుత్రస్య వాకాటకమహాదేవిసుతస్య మహాకవేః పరమ సౌగతస్య మహారాజ శ్రీ విక్రమేన్ద్రస్య).

ఈ శాసనారంభమున విష్ణుకుండినులు "భగవత్సర్వరూపుడగు శ్రీపర్వతస్వామిపాదకమలములను ధ్యానించుటవలన సకల ప్రజాపరిపాలనాధికారమును బొందినవారును, బ్రహ్మతేజస్సును ధరించినవారును. విష్ణుమూర్తియొక్క పరాక్రమమును, నయసంపదను, గలిగినవారును" అని కీర్తింపబడుటయేగాక, "విష్ణుకుండిన వంశజులలో షడభిజ్ఞప్రతిహారియొక్క దర్శనానుగ్రహమువలన సుగతసిద్ధాంతములందు గౌరవము గలిగినవాడును, సర్వలోకములకు దీపమైన అందముతోగూడిన మహావిహారములను, నిర్మించుటవలన బ్రాహ్మణోపకార జనితంబగు, పుణ్యసంభారమును బొందినవాడగు మహారాజ శ్రీ గోవిందవర్మ" అని రెండవ మాధవవర్మ తండ్రియగు గోవిందవర్మ ప్రశంసింపబడినాడు

విక్రమేంద్రభట్టారకవర్మ గతకాలమును గురించి చింతించువాడై స్వపరవంశముల కలంకార ప్రాయులగు రాజర్షులందరి నుచితరీతి గౌరవించి ధర్మబోధనము చేయుచుండగా దనకీర్తి కనురూపమగు పరాక్రమ ముండుటచే నితర రాజవంశములను దనవిగా జేసికొని (ఆత్మీయులుగా) పృథివీపతిపదమును గైకొనుట వలన నతిశయమగు, మహిమగల శ్రీ మాధవరాజను పేరుగలవానిని మనోహరాకారుని నయపరాక్రమాది గుణములతోగూడిన వానిని పుట్టుకవలన గౌరవార్హమగు విష్ణుకుండిన కులముయొక్క మాహాత్మ్యమును దెలియజేసినవానిని సర్వసామంతకుల తిలకాయమానుడగుటచే, వ్యక్తమొనరించు నాభిజాత్యము గలవానిని, అవికలములైన గుణమణిదీప్తిసమూహముచే దిగంతరాళమును బ్రకాశింపజేయువానిని తన మూలరాజవంశమును దన జన్మచే ననుగ్రహించుటచేత సాగరము లక్ష్మిచేత నలంకరింపబడినట్లు చేయువానిని, ఎదురులేనివానిని కుమారునిగా బొంది పలురకముల నందములైన గొప్పకట్టడపునేర్పుగలిగి అద్భుతములైన స్తూపములు, విహారములనెడు చూడామణులచే నలంకరింపబడిన దక్షిణాపథముయొక్క శ్రీ పర్వతమునకు దూర్పుపడమరభాగములందున్న రాజసమూహములనెడు హారములమధ్య నిరుపమానమగునట్లు ప్రకాశించుటచేత కౌస్తుభమణివలె ప్రకాశించు కీర్తిశరీరము గలవాడును, గుణరూపసంపత్తునందు గోవిందు ననుసరించినవాడై మూర్తిమంతంబగు గోవిందరాజుయొక్క కీర్తిని పెంపొందింపజేయ గోరినట్లుగా ప్రతిష్ఠాపింపబడిన శ్రీమంతంబగు పరమభట్టారికా మహావిహారమునందు అస్మదభిషేకానంతరము వర్తిల్లుచున్న పదునొకండవ విజయరాజ్యసంవత్సరమునందు గార్తికమాసమందలి కృష్ణపక్షమందు నష్టమినాడు నలుదిక్కులందున్న పూజ్యములగు భిక్షుసంఘములయొక్క అనుభవముకొఱకు సర్వదాన సహితముగా సమస్తవిఘ్నములను, దొలగించి 'ఇరుణ్డెఱో' అను గ్రామము దానముజేయబడినది.

ఈ శాసనమున దానముజేయబడినట్లు పేర్కొనబడిన గ్రామము 'ఇరుణ్డెఱో', ఇంద్రపాలనగరమున బౌద్ధవిహార ముండెననుట కచ్చటి శిథిలములే తార్కాణము. ఈ విహారము పరమభట్టారికామహావిహారము. విహారప్రశంస గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమందును గలదు. గోవిందవర్మ 'పేణ్కపఱ' గ్రామము నగ్రహారముగా నీ విహారమునకు దానమిచ్చెను.

ఇంద్రపాలనగరము దొలుత బౌద్ధులకావాసమైయుండెను. బౌద్ధము క్షీణింపమొదలిడిన తరువాత వైదికమత విజృంభణము జరిగినది. శివాలయములు వెలసినవి. ఇంద్రపాలనగరమున శిథిలరూపమున నున్న హనుమదాలయములు, వేంకటేశ్వరాలయము మున్నగునవి తరువాత నిర్మింపబడినట్టివి.

**కాలనిర్ణయము :**

ఈ శాసనమును వేయించిన విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రభట్టారకుని జ్యేష్ఠపుత్రుడు. ఇతడు శ. స. 488 ముగిసినపిదప తన విజయరాజ్యసంవత్సరమున వేయించిన శాసనమిది.. అనగా క్రీ. శ 566. ఈ శాసన మాతని యభిషేకానంతరము వర్ధిల్లుచుండిన పదునొకండవ విజయరాజ్య సంవత్సరమునందు గార్తికమాసమందలి కృష్ణపక్షమం దష్టమినాడు సరియగు శకసంవత్సరమున 488 న వేయబడినది. ఈ శాసనకాలము నాధారముగగొని గోవిందవర్మశాసన కాలమును వివరించు నపుడు విష్ణుకుండినుల కాలనిర్ణయము గావింపబడినది. ఇంద్రపాలనగర తామ్రశాసనములవలన విష్ణు కుండిన రాజ్యస్థాపకుడు మహారాజేంద్రవర్మయనియు, విష్ణుకుండినులు దొలుత బౌద్ధమతాభిమానులనియు ఇంద్రపాలనగరము మొదట బౌద్ధక్షేత్రముగానుండి, కాలక్రమమున శైవమత కేంద్రముగా వర్ధిల్లినట్లు తెలియుచున్నది. ఈ నగరమిప్పుడు శిథిలావస్థలో నున్నది. విష్ణుకుండినుల నగరమగు ఈ ఇంద్రపాలనగరప్రాంతమును త్రవ్వించిన యెడల, భూగర్భమున దాగియున్న శాసనములు, ఆలయములు, వింతలు, విశేషములు, బౌద్ధారామస్తూపవిహారాదులు, నాణెములెన్ని బయల్పడునో పురావస్తుశాఖవారి కృషిఫలితమున తెలియరాగలవని ఆశింపవచ్చును.

# విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్ర శాసనము

( శాసనము - శాసనప్రతిబింబములు )

# విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము

## శాసనము — మూలము

### మొదటి రేకు — రెండవ ప్రక్క

1. దీప్త్యాదిఙ్మణ్డలంవ్యాప్తం యస్యబాలార్కజతేజసః ।
   సత్యాశ్రయ సుత శ్రీమాన్సజయత్యుత్తమాశ్రయః ॥

2. స్వస్తి భగవచ్ఛ్రీపర్వతస్వామి పాదానుధ్యానావాప్త ప్రజా
   పరిపాలనాధికారాణాం బ్రహ్మక్షత్ర

3. తేజోభృతాం విష్ణువిక్రమ నయసమ్పదాం విష్ణుకుణ్డీనాం సుదక్షిణ
   ప్రతిహర్య్యదర్శ

4. నానుగ్రహజనిత సుగతశాసనాభిప్రసాదస్య విబుధ భవన
   ప్రతిస్పర్ధిశోభా

5. సముదయానేక మహావిహార ప్రతిష్ఠాపనాధిగతానన్త బ్రాహ్మణ
   పుణ్యసంభారస్య మహా

6. రాజ శ్రీ గోవిన్దవర్మణః పుత్రస్యైకాదశాశ్వమేధ బహుసువర్ణ
   పౌణ్డరీక వాజపేయ

7. క్రతూ సహస్ర సర్వమేధ రాజసూయ పురుషమేధాద్యాహరవాప్సమ్య
   గనుష్ఠిత శ్రుతి వి

## రెండవ రేకు మొదటి ప్రక్క

1. హితాశేష దుష్కరకర్మ్మకర్మ్మానుష్ఠానస్య ప్రాగ్దక్షిణాపరా
మ్భోనిధిరేవాసరిత్సలిలవల

2. య విభూషణాయా భువోభర్తుర్మ్మహారాజశ్రీ
మాధవవర్మ్మణః ప్రియపుత్రస్య వాకాటక మహా

3. దేవీ సుతస్య మహాకవేః పరమసౌగతస్య మహారాజశ్రీ
విక్రమేన్ద్రస్య సూనో రనే

4. క చాతుర్న్దన్త విజయాధిగతాశేష చక్రవర్త్తిక్షేత్రాధిపత్యస్య
స్ఫురద్ఖడ్గ

5. కరసహస్రావలీ పరిగత స్వభుజదినకర ప్రభావ విధ్వస్తాశేష
దాయాద

6. మణ్డల ఘనతిమిరపటలస్య శ్రీన్ద్రభట్టారకవర్మ్మణః ప్రియ
సూనుస్తదనురూప

7. శౌర్య్యాతిశయ సమస్త రాజర్షి గుణసమ్పద్యోగ సామర్థ్య
ప్రకృతిమణ్డలేన

## రెండవ రేకు - రెండవ ప్రక్క

1. శైశవ ఏవారోపిత రాజ్యభారః పరమధార్మికో ధర్మ్మేణ విజయా
ప్రణతానేక సామన్తమ

2. కుటమణిమయూఖోద్భాసిత వరచరణ యుగళః
శ్రీమాన్విక్రమేన్ద్రభట్టారకవర్మ్మణా

3. గతకాలభావినః స్వపరవంశాలంకార భూతాన్సర్వాన్
నేవ రాజర్షి ననురూపే

4. ణసత్కృత్యేత్థమవబోధయతి యథా ప్రథిత ప్రభావాన్య రాజవంశ
సాక్షి

5 భూత పృథివీపతి పదప్రసహ్యాహరణ వ్యక్త నిరతిశయమహి
మానం శ్రీమా

6. ధవ రాజాభిధానం సుతచ్ఛలేన మనోహరాకార బద్ధం నయ
పరాక్రమాదిగుణసన్దో

7. హామభిప్రజాతాయా విష్ణుకుణ్డికుల బహుమతైక సంబన్ధితాభిఖ్యాత
మాహాత్మ్య

## మూడవ రేకు - మొదటి ప్రక్క

1. మశేష సామన్తకుల తిలకాయమానాభిజన మవికల గుణమణి కిరణనిక
2. రవిచ్ఛురితం విపుల దిగన్తరాలం శ్రీపృథివీమూల రాజవంశ ముత్పత్తి పరిగ్రహేణ
3. శ్రియేవ సాగర మలంకృతవత్యా ప్రతివిషయమతి బహుప్రకార మణరమో
4. దార కమ్మార్గదృతస్తూప విహార చూడామణిభిరలంకృత సకల దక్షిణా
5. పథస్య శ్రీపార్వ్వతేయపూర్వ్వాపరక్షితిపతి పరంపరావిహార మద్ధ్యనిరు
6. పమి విరాజితయా కౌస్తుభాయమాన యశోజన్మనః గుణరూప సంపద్భి

## మూడవ రేకు - రెండవ ప్రక్క

1. రనుగత గోవిన్దస్య శ్రీగోవ్ద[1] రాజస్యమూర్త్తి మతిం శ్రియం ప్రత్యవిషయీకృత మ
2. నోరథయా పరమభట్టారికా మహాదేవ్యా శ్రీమదిన్ద్రపుర వాసైశ్చైరలంకర్త్తు కామ
3. యేవ ప్రతిష్ఠాపితే శ్రీమతి పరమభట్టారికా మహావిహారేస్మా ఖిప్రవర్ద్ధ మా
4. న విజయరాజ్య సంవత్సరై కాదశే కార్త్తికమాసకృష్ణపక్షాష
5. మ్యాంచాతుర్ద్దిశార్యవర భిక్షుసంఘ పరిభోగాయ సర్వ్వ దాన సహి
6. తస్సర్వ్వబాధ పరిహారేణ "ఇరుణ్డెణో" నామ గ్రామోదత్తః

---

1. శ్రీ గోవిన్ద - అని చదువుకొన వలయును

## నాలుగవ రేకు - మొదటి ప్రక్క

1. ...దేవరాజరిషిభిః శ్రుతి స్మృతి సదాచారానువృత్తిభిః—స...
   క్షరి...

2. పాలనీయః యశ్చాత్రలోభ ప్రమాదాజ్ఞాన క్షుద్రపరిహారదోష
   వశాద్ధర్మ

3. విలోపాయ ప్రవర్తితే తస్యేమాని స్మృతివిహితాని పాతకాని
   భవన్తి॥ నిమ్న

4. తాం భర్తృ గోవిప్రబాల యోషిద్విఘ్నకృతః యోగతిస్సాధవేదప్ర

5. త్తిం హరతః శాసనాంకితమ్॥ బహుభిర్వసుధాదత్తా బహు
   భిశ్చాను పా

6. లితా యస్యయస్య యథాభూమిస్తస్యతస్య తదాఫలమ్॥ సప్తిం

## నాలుగవ రేకు - రెండవ ప్రక్క

1. వర్ష సహస్రాణి స్వర్గే తిష్ఠతి భూమిదః ఆక్షేప్తాచాను మన్తా
   చనాన్యేవ

2. నరకేవసేత్॥ కృత్వావల్లి వథంగ పేలవబలం సింహోహ్యయం
   పల్లవం భూత్వా

3. వృత్య యదాగతః ప్రథమతశ్శక్రాభిధానం పురం ప్రాదాచ్ఛాసన
   ముత్తమాశ్రయ

4. ఇతి ఖ్యాత స్తదేదంనృపః సాష్టాశీతి చతుః శతే శకపతే స్సంవ

5. త్సరాణాంగతే॥ యే నోద్ధృతాథత్ర్య కులస్యలక్ష్మ్య రథఖ్య
   త స్తినయ వి

6. క్రమాభ్యాం అజ్ఞాపనాఖ్యాత కులప్రసూతః శ్రీమూలరాజః
   సత్రపేషు ముఖ్యః

శాసనానువాదము :

బాలసూర్యతేజోవిరాజమానుండగు నే రాజుయొక్క కీర్తిచే దిఙ్మండలము వ్యాపింప బడినదో అట్టి ఉత్తమశరణ్యుడును, పూజ్యుడునునగు సత్యాశ్రయుని కుమారుడు విజయము నందుచున్నాడు. స్వస్తి భగవత్స్వరూపులగు శ్రీ పర్వతస్వామి పాదకమలములను ధ్యానించుటవలన సకల ప్రజాపరిపాలనాధికారమును బొందిన వారును, బ్రహ్మక్షత్రతేజస్సును ధరించిన వారును, విష్ణుమూర్తియొక్క పరాక్రమమును, నయసంపదను కలిగిన వారును, నగు విష్ణుకుండిన వంశ్యులలో షడభిజ్ఞప్రతిపాద్య దర్శనానుగ్రహమువలన సుగతసిద్ధాంతములందు గౌరవము గలిగినవాడును, సర్వలోకములకు దీప్తమైన అందముతోగూడిన మహావిహారములను నిర్మించుటవలన బ్రాహ్మణోపకారజనితంబగు పుణ్యసంభారమును బొందినవాడును అగు మహారాజ శ్రీ గోవిందవర్మ యొక్క పుత్రుడైనవాడును, ఏకాదశాశ్వమేధ బహుసువర్ణపౌండరీక వాజపేయాది క్రతూసహస్రముల నాచరించినవాడును వేదోక్త సమస్తదుష్కరపుణ్యకర్మల ననుష్ఠించినవాడును, పూర్వదక్షిణ పశ్చిమ సముద్రములు, మూడువైపులును, రేవానదీజలములుత్తరమునను, రాజ్యమునకు విభూషణములుగా (ఎల్లలుగా) గలవాడును, అగు మాధవవర్మ యొక్కప్రియపుత్రుడును, వాకాటకమహాదేవి కుమారుడును, మహాకవియై బౌద్ధమతావలంబియైన మహారాజ శ్రీ విక్రమేంద్రునియొక్క కుమారుడును, బహుపర్యాయములు దిగ్విజయమొనర్చుటవలన సమస్త చక్రవర్తులయొక్క రాజ్యములపైని నాధిపత్యము గలిగియున్నవాడును, ప్రకాశమానమైన నిజభుజపరాక్రమ సహస్రదీప్తులచే దాయాదిమండలరూపమునున్న సమస్తగాఢాంధకారపటలమును నశింపజేసినవాడగు, శ్రీ ఇంద్రభట్టారకుని కుమారుడు, తదనురూపశౌర్యాతిశయములచేతను, సమస్తరాజర్షిగుణ సదాచార సంపత్తిచేతను సమర్థమగు ప్రజాసమూహముగలదగుటచేత శైశవముననే రాజ్యభారము వహించినవాడును పరమధార్మికుడును, విజయవంతుడును, అఖిల సామంతరాజులు నమస్కరించునపుడు కిరీటములందలి మణుల కాంతులతో బ్రకాశించు పూజనీయ పాదద్వయముకల శ్రీమంతుండగు విక్రమేంద్రభట్టారకవర్మ గతకాలమును గుఱించి చింతించువాడై స్వపరవంశముల కలంకారప్రాయులగు రాజర్షులందఱిని ఉచితరీతిని గౌరవించి ధర్మబోధనము జేయుచుండగా తనకీర్తి కనురూపమగు పరాక్రమముండుటచేత నితరరాజవంశములను దనవిగా (ఆత్మీయములుగా) జేసికొని, పృథివీపతిపదమును బలాత్కారముగా గైకొనుటచేత నతిశయమగు మహిమగల శ్రీ మాధవరాజను పేరుగలవానిని, మనోహరాకారుని, నయము, పరాక్రమము మొదలగు గుణములతోగూడినవానిని పుట్టుకవలన గౌరవార్హమగు విష్ణుకుండిన కులముయొక్క మాహాత్మ్యమును దెలియజేసినవానిని సర్వసామంతకుల తిలకాయమానుడగుటచే వ్యక్తమొనరించు నాభిజాత్యముగల వానిని అవికలములైన గుణమణిదీప్తిసమూహముచే దిగంతరాళమును బ్రకాశింపజేయువానిని తనమూలరాజవంశమును దనజన్మచే ననుగ్రహించుటచేత సాగరము లక్ష్మిచేత నలంకరింపబడినట్లు చేసినవానిని. ఎదురులేనివానిని కుమారునిగాపొంది, పలురకముల నందములైన స్తూపములు విహారములనెడుచూడామణులచేత నలంకరింపబడిన దక్షిణాపథముయొక్క శ్రీ పర్వతమునకు తూర్పు పడమర భాగములందున్న రాజసమూహములనెడు హారముల మధ్య నిరుపమానమగునట్లు ప్రకాశించుటచేత కౌస్తుభమణివలె

ప్రకాశించు కీర్తిశరీరము కలవాడును, గుణరూప సంపత్తులచే గోవిందుని మించినవాడై మూర్తిమంతమగు గోవిందరాజుయొక్క కీర్తిని పెంపొందజేయు కోరికచేత, [illegible] మహాభట్టారికా మహాదేవిచేత ఇంద్రపురము నలంకరింపజేయు కోరునట్లుగా ప్రతిష్ఠాపింపబడిన శ్రీమంతంబగు పరమభట్టారికా మహావిహారమునందు అస్మదభిషేకాన [illegible] వర్ధిల్లుచున్న [illegible] పంచాశండవ విజయ రాజ్యసంవత్సరమునందు కార్తికమాసమందలి కృష్ణపక్షమునందు అమావాస్యనాడు నాలుగుదిక్కులందున్న పూజ్యములగు భిక్షుసంఘములయొక్క అనుభవముకొఱకు [illegible] హిరణ్యముగా సమస్తవిఘ్నములను తొలగించి 'ఇరుణ్డెరో' అను గ్రామము దానము చేయబడినది.

దేవతలచేతను, రాజులచేతను, ఋషులచేతను, శ్రుతిస్మృత్యుక్త [illegible] దానానుష్ఠాన యుక్తులగు వారి చేతను నిధి సంరక్షింపదగినది. ఎవడైనను లోభము, [illegible], అజ్ఞానము, క్షుద్రపరివారము మొదలగు దోషములవలన, ధర్మవిరోధియై [illegible] వానికి వేదోక్తములైన పాతకములు సంభవించును. ప్రభువులకు గోవులకు బ్రాహ్మణులకు, [illegible], శ్రీలకు, [illegible] సులకు నపకారముజేయువాని కెట్టిగతియగునో యట్టిదే [illegible] సగరుడు [illegible] నకును పూర్వము భూమి చాలమందిచే దానము చేయబడినది. ఏయే సమయములలో భూమి ఎవరెవరికి సంబంధించియున్నదో వారివారికి, ఆ భూమియొక్క [illegible] ఫలము చెందును. అరువది వేల సంవత్సరముల కాలము భూదానముచేసినవాడు స్వర్గమున సుఖించును. దాని నాక్షేపము పలుకువాడును, ఆక్షేపము ననుమతించువాడును నరకమందే నివసింతురు. [illegible] (త్రిలోచనపల్లవుని) స్వల్పబలముగల సింహవ్యాయుడను పల్లవుని భంగపఱచి తిరిగివచ్చి, [illegible] పట్టణమును ఉత్తమాశ్రయుడను పేరునకీర్తిగాంచిన రాజు దానముచేసెను. ఈ దానము శక సంవత్సరము సాష్టాశీతి చతుశ్శతమునందు (శా. శ. 488) గడచినపిదప జరిగినది. ఎవరిచేత ప్రభువంశముయొక్క పతనమందుచున్న కీర్తి యుద్ధరింపబడినదో, నయవినయములచే [illegible] లను నందు పుట్టిన సత్రవులలో ప్రముఖుడైన శ్రీ మూలరాజు శాసనమున దూత [illegible]

# విష్ణుకుండినులు - కాలనిర్ణయము

ఈ గ్రంథమున ప్రచురింపబడుచున్న ఇంద్రపాలనగర తామ్రశాసనములలో గోవిందవర్మ తన 37 వ రాజ్యసంవత్సరమున వేయించిన శాసనము[1]ను విక్రమేంద్ర భట్టారకవర్మ తన 11 వ రాజ్యసంవత్సరమున వేయించిన శాసనము[2]ను నేను లోగడ ప్రకటించితిని చారిత్రక దృష్టితో జూచిన నీ శాసనముల కెంతేని ప్రాముఖ్యము గలదు. విష్ణుకుండిన వంశమును గూర్చి నూతన విషయములు తెలిసికొనుటకీ శాసనము లుపయోగ పడుచున్నవి. ఈ వంశీయుల కాలనిర్ణయము నకు విక్రమేంద్ర భట్టారకవర్మ వేయించిన శాసనము మిక్కిలి ఉపయోగముగ నున్నది.

సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు డా॥ మారేమండ రామారావుగారు ఇంద్రపాలనగర తామ్రశాసనముల గూర్చి "New light on Vishnukundins" అను వ్యాసమును Journal of Indian History Vol. XLIII part III లో ప్రకటించి తమ అభిప్రాయమును దెలిపినారు డా॥ మారేమండ రామారావుగారు నాకు గురుతుల్యులు. వారు ప్రకటించిన భావములతో నేనేకీభవింపలేనందులకు జింతిల్లుచు, విష్ణుకుండినుల వంశనిర్ణయమున, కాలనిర్ణయమున ఇంతకు మున్ను 'భారతి' పత్రికలో ప్రకటించిన విధమునే సమర్థించుచు ఈ గ్రంథమున చేర్చుచున్నాను.

ముఖ్యముగా డా॥ మారేమండ రామారావుగారు, విష్ణుకుండినుల రాజ్యారంభ కాలమును, రాజ్యపతనకాలమును, గోవిందవర్మ శాసనమున బేర్కొనబడిన రాజులవిషయమునను నా వాదము నంగీకరింపలేదు. విష్ణుకుండినులు క్రీ. శ. 450 నుండి రాజ్యపాలన మారంభించినట్లు డా॥ రామారావుగారు తెలిపినారు. నేను భారతిలో ప్రకటించిన గోవిందవర్మ శాసనమున విష్ణుకుండిన మహారాజేంద్రవర్మ క్రీ శ. 338 లో రాజ్యము స్థాపించినట్లు తెలిపితిని.

విక్రమేంద్ర భట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన పల్లవ సింహవర్మను క్రీ. శ. 600-630 వఱకు కంచి రాజధానిగా ఆంధ్రదేశ తూర్పుతీరము వఱకు పాలించిన మొదటి మహేంద్రవర్మయొక్క తాతగా, డా॥ మారేమండ రామారావుగారు గుర్తించినారు. ఈపల్లవ సింహవర్మ క్రీ శ. 555-575 వఱకు బాలించినట్లు నిర్ణయించినారు.

---

1. భారతి-జూన్ 1965 P. 14-28.
2. భారతి - జూలై, 1965 P. 2-14

విష్ణుకుండిన వంశవృత్తమును, రాజులు పాలించినకాలమును, విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన శకసంవత్సరము ననుసరించి సిద్ధాయించినారు[1]. డా॥ గోపాలరావు గారు నిర్ణయించినకాలము నంగీకరింపక, విష్ణుకుండిన వంశమునకు, కాలమునకు, సంబంధించిన విషయములను క్లుప్తముగా తెలుపుట సమంజసమని భావించి ఇచట వ్రాయుచున్నాను

ఇంద్రపాలనగర తామ్రశాసనమువలన మనకు విష్ణుకుండిన వంశీయులకు సంబంధించిన నూతన విషయములు దెలియుచున్నవి గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమువలన విష్ణుకుండిన వంశకర్త మహారాజేంద్రవర్మయనియు, అతని కుమారుడు మాధవస్వామి-మాధవవర్మ కుమారుడు గోవిందవర్మయనియు తెలియుచున్నది. గోవిందవర్మ తన 37వ విజయరాజ్య సంవత్సరమున వేయించిన ఈ శాసనమున "సత్వసత్యత్యాగార్జవ నయవినయోత్సాహాది గుణగణ సంపదా స్వయమధిగతరాజ్యానాం, సమ్యక్ప్రజాపాలనాత్ప్రథితావదాన స్నిగ్ధయశసాం రాజ్ఞాం విష్ణుకుణ్డీనా మమల విపుల సకలకులతిలకేన శ్రీమహారాజేన్ద్రవర్మణః సత్పౌత్రేణ మహారాజశ్రీ మాధవవర్మణో..." అని వర్ణింప బడుటవలన విష్ణుకుండినులు స్వపరాక్రమమున రాజ్యమును బొందిరని తెలియుచున్నది. అనగా సత్వము, త్యాగము ఉన్నవారై జనులగ్గించు, నయ వినయోత్సాహాది సద్గుణ సంపత్తిచే స్వపరాక్రమముంబున రాజ్యమును బొంది, సత్ప్రజా పాలనమువలన గీర్తిగాంచి అనేక దానములవలన విస్తార కీర్తింబొందిన విష్ణుకుండిన రాజకులములో నందఱికిని తిలకాయమానుడగు శ్రీమహారాజేంద్రవర్మ సత్పౌత్రుడై, మహారాజశ్రీ మాధవవర్మకు సుపుత్రుడై తన భుజబలోత్సాహముచేతను...మహోద్దీప్తిని గలవాడును అగు మహారాజ గోవిందవర్మ...వర్ణింపబడినాడు.

## ఇంద్రపాలనగర తామ్రశాసనముల వలన దెలియుచున్న ముఖ్యవిషయములు :

1 గోవిందవర్మ శాసనము పేర్కొనబడిన, 1 మహారాజేంద్రవర్మ 2. మాధవవర్మ 3. గోవిందవర్మ

---

1. "..The Commencement of Vishnukundin rule has to be assigned to about the middle of the fifth Century. A. D. and its end to 615 A. D
Taking saka 488 expired. Corresponding to 566-567 A. D. and the regnal years mentioned in the C P. grants as the basis the Chronology of the Vishnukundins may be restated as follows.

| | |
|---|---|
| Vikramendra varma | 450–458 |
| Govinda varma | 458–468. |
| Madhava varman | 468–518. |
| Vikramendra—I. | 518–528. |
| Indra Bhattaraka varman | 528–555. |
| Vikramendra varman—II. | 555–566. |
| Indra varman | 566–570. |
| Madhava varman | 570–575. |
| Govinda varman | 575–615. |

—Journal of Indian History vol. XLIII part III.

II విష్ణుకుండినులు బౌద్ధమతానుయాయులు. బౌద్ధమతాభిమానులు. వైదికమతానుయాయులు శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతలు. - క్రతుసహస్ర యాజినులు

III ఇంద్రపాలనగరము - బౌద్ధవిహారము.

IV విష్ణుకుండినుల కాలనిర్ణయమునకు సంబంధించిన విక్రమేన్ద్ర భటారకవర్మ శాసనమున బేర్కొనబడిన శక సంవత్సరము 488.

V విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున బేర్కొనబడిన గోవిందవర్మ - వాకాటక రాజకుమారిని వివాహమాడిన మాధవవర్మ తండ్రి. విష్ణుకుండినులు బ్రహ్మతేజము గలవారు.

VI విక్రమేంద్రభట్టారకవర్మ కుమారుడు మాధవరాజు.

VII విక్రమేంద్రభట్టారకవర్మ చే నోడిపోయిన పల్లవ సింహవర్మ.

VIII విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున కాజ్జప్తి సత్రపులలో ప్రముఖుడైన శ్రీమూలరాజు.

పైన పేర్కొనబడి విషయముల నొక్కొక్కదానిని గ్రహించి విపులీకరించిన విష్ణుకుండినుల విషయమున గల సంశయములు కొంతవఱకు దీరుననుటలో సందేహము లేదు.

## I గోవిందవర్మ శాసనమున పేర్కొనబడిన 1 మహారాజేంద్రవర్మ 2 మాధవవర్మ 3. గోవిందవర్మ :

విష్ణుకుండినులకు సంబంధించిన ఆరు తామ్రశాసనములు ఒక శిలాశాసనము ప్రకటింపబడినట్లు గ్రంథారంభమున దెలియజేసితిని.

1. ఈపూరు శాసనము
|
మాధవవర్మ
|
దేవవర్మ
|
మాధవ వర్మ
(45వ రాజ్య సంవత్సరము)

రామతీర్థ శాసనము
|
మాధవ వర్మ
|
విక్రమేంద్ర వర్మ
|
ఇంద్ర వర్మ
(27వ రాజ్య సంవత్సరము)













# ఇంద్రపాలనగర శాసనము






1. రామతీర్థ శాసనము 2. చిక్కుళ్ళ శాసనము 3 తుండి శాసనము 4. ఈపూరు శాసనము 5. పొలమూరు శాసనముల ననుసరించి, శాసనములలో బేర్కొనబడిన రాజుల పేళ్ళు, విక్రమేంద్ర భట్టారకవర్మ వేయించిన ఇంద్రపాలనగర శాసములలోని రాజుల పేళ్ళతో సరిపోవు చున్నవి. కాని విక్రమేంద్ర భట్టారకవర్మ శాసనమున బేర్కొనబడిన గోవిందవర్మ పేరు పైని తెలుపబడిన ఐదు శాసనములందు లేదు. పొలమూరు, ఈపూరు శాసనములందు పేర్కొనబడిన గోవిందవర్మ మాధవవర్మ తండ్రిగా చెప్పబడినాడు. విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున పేర్కొన బడిన గోవిందవర్మ సైతము మాధవవర్మ తండ్రిగా తెలుపబడినాడు. ఈ మాధవవర్మలు వేర్వేరని చెప్పుట కవకాశమున్నది. విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున బేర్కొనబడిన మాధవవర్మ గోవిందవర్మ పుత్రుడు. వాకాటక రాజకుమారిని వివాహ మాడినవాడు, ఏకాదశాశ్వమేధములు, రాజసూయ, వాజపేయ, పురుషమేధ, క్రతూసహస్రము లాచరించినవాడు. అతని కుమారుడు - విక్రమేంద్రవర్మ. ఇక పొలమూరు, ఈపూరు శాసనములందలి మాధవవర్మ గోవిందవర్మ కుమారుడు - విక్రమేంద్రభట్టారకవర్మ మనుమడు. మంచనభట్టారకుని తండ్రి. ఈ మాధవవర్మకు జనాశ్రయుడను బిరుదమున్నది. ఇతడు త్రివరనగరభవనగత పరమయువతి జనవిహారణ రతిరనన్య నృపతి సాధారణుడు.

రామతీర్థ శాసనము, చిక్కుళ్ళ శాసనము, తుండి శాసనము, విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర శాసనములందు బేర్కొనబడిన మాధవవర్మ, గోవిందవర్మ కుమారుడు. దేవవర్మ కుమారుడగు మాధవవర్మ తన 47 వ రాజ్యసంవత్సరమున వేయించిన ఈపూరు శాసనమున దేవ వర్మ తండ్రిగా బేర్కొనబడిన మాధవవర్మ పై శాసనములందలి గోవిందవర్మ కుమారుడగు మాదవ వర్మయేగాని అన్యుడుకాడు.

విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున బేర్కొనబడిన గోవిందవర్మ మాధవవర్మ తండ్రి. గోవిందవర్మ షడభిజ్ఞప్రతి పాద్యదర్శనానుగ్రము వలన సుగతసిద్ధాంతములందు గౌరవము కలిగినవాడును, సర్వలోకములకు దీటైన అందముతో గూడిన మహావిహారములను, నిర్మించుటవలన బ్రాహ్మణోపకార జనితంబగు పుణ్యాసంభారమును బొందిన వాడును సైయుండెను.

పొలమూరు శాసనమున బేర్కొనబడిన గోవిందవర్మ "అనేక సమరసంఘట్టవిజయినః పరనరపతి మకుటమణి మయూఖావధూత చరణయుగళస్య విక్రమాశ్రయస్య శ్రీగోవిందవర్మః" అని ప్రశంసింప బడినాడు.

ఈపూరు శాసనమున బేర్కొనబడిన గోవిందవర్మ "భగవచ్ఛ్రీపర్వతస్వామి పాదాను ధ్యాతస్య విష్ణుకుణ్డీనామాపరిమిత బలపరాక్రమస్య పరమ ధార్మికస్య ప్రణత సకల సామంతస్యానేక గోహిరణ్య భూమి ప్రదానస్య మహారాజస్య శ్రీగోవిందవర్మణః" అని వర్ణింప బడినాడు.

గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున గోవిందవర్మ తండ్రి మాధవవర్మ, తాత మహారాజేంద్రవర్మ పేర్కొనబడినారు. ఈ శాసనమును గోవిందవర్మ తన 37 వ విజయరాజ్య సంవత్సరమున వేయించినాడు.

మహారాజేంద్రవర్మ వంశపరంపరగా వచ్చిన రాజ్యమున కధికారి కాడు. ఇతడు "సత్వ సత్యత్యాగాభిజన నయవినయోత్సాహాది గుణగణ సంపదాస్వయమధిగత రాజ్యానాం సమ్యక్ప్రజా

పాలనాత్ప్రథితావదాత పృథుయశసాం రాజ్ఞాం విష్ణుకుణ్డీనా మమలవిపులకుల తిలక స్య శ్రీమహా రాజేన్ద్రవర్మణ'' అని ప్రశంసింప బడినాడు. ఇతని పుత్రుడు మాధవవర్మ మహారాజుగా పేర్కొన బడినాడు శాసనము వేయించిన గోవిందవర్మ "సకల సత్య ధాతూ... యోత్పాదిత మహాబోధివి త్తేన మహారాజ శ్రీ గోవిందవర్మణా" అని ప్రశంసింప బడినాడు. ఇతడు మహాదేవి విహారమునకు 'పేణ్కపఱ' గ్రామమును దానము చేసెను

విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ బౌద్ధమతాభిమాని. శాసనమున "ప్రతివిషయమతి బహుప్రకారమణి మహోదార కరమ్యోద్ధృత స్తూప విహార చూడామణిభి రలంకృతసకల దక్షిణాపథస్య శ్రీపార్వతీయ పూర్వార్ణవ ... పరంపరాహార మధ్య నిరుపమవిరాజితయా కౌస్తుభాయమాన యశోజన్మనః గుణరూప ... దనుగతగోవిన్దస్య శ్రీగోవిన్దరాజస్య మూర్తిమతీం శ్రియం ప్రత్యాసిషయిష్యన్త మహాదేవ్యా పరమభట్టారికా మహాదేవ్యా శ్రీమదిన్ద్రపురముచ్చై రలంకర్తుకామ యేవా ప్రతిష్ఠాపితే శ్రీమతి పరమ భట్టారికా మహావిహారే స్వాభిప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరై కాదశే కార్తిక పూర్ణ పౌర్ణమాస్యా చాతుర్దిశార్యవరభిక్షుసంఘ పరిభోగాయ సర్వ దానసహిత స్సర్వ బాధా పరిహారేణ 'ఇరుణ్డెఱో, నామగ్రామోదత్తః" అనికలదు.

గోవిందవర్మ పైగల అభిమానమువలనను సింహవర్మను జయించుటవలన గలిగిన సంతోషాతిశయము వలనను విక్రమేంద్రభట్టారకవర్మ "ఇరుణ్డెఱో" గ్రామమును భిక్షుసంఘములకు దానమిచ్చినాడు విక్రమేంద్రభట్టారకవర్మ చిక్కుళ్ళ, తుండి శాసనములందు అతని ప్రపితామహ, పితామహ, పితరులు మాత్రమే పేర్కొనబడినారు. కాని ఇంద్రపాలనగర తామ్రశాసనమున ప్రపితామహుడగు మాధవవర్మ తండ్రి గోవిందవర్మ పేర్కొనబడినాడు. ఈ గోవిందవర్మ తండ్రి మాధవవర్మ. గోవిందవర్మ తనతండ్రి పేరును కుమారునికి పెట్టినాడని తెలియుచున్నది. ఈ కారణము వలన విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమును వేయించిన మహారాజేంద్రవర్మ పౌత్రుడును మాధవవర్మ పుత్రుడును నగు గోవిందవర్మ ఒక్కరేయని తెలియుచున్నది. కావున విష్ణుకుండిన వంశకర్త మహారాజేంద్రవర్మ యనియు, అతని కుమారుడు మాధవవర్మ, మనుమడు గోవిందవర్మ యనియు విశదమగుచున్నది. ఈగోవిందవర్మ కుమారుడే, ఏకాదశాశ్వమేధ క్రతుసహస్ర పౌండరీక వాజపేయ పురుషమేధము లొనరించి విష్ణుకుండిన సామ్రాజ్యమును విస్తరింపజేసి, వాకాటక రాజకుమార్తెను వివాహమాడిన మాధవవర్మయని తెలియుచున్నది.

## II విష్ణుకుండినులు బౌద్ధమతానుయాయులు. బౌద్ధమతాభిమానులు, వైదిక మతానుయాయులు. శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతులు. క్రతుసహస్రయాజినులు.

విష్ణుకుండిన వంశస్థాపకుడు మహారాజేంద్రవర్మ. ఇక్ష్వాకు వంశ పతనానంతరము ఆంధ్రదేశమును వివిధవంశములకు చెందిన రాజులు పాలించిరి. అందు బృహత్పలాయన, ఆనందగోత్రిక, శాలంకాయన పల్లవ వంశీయులు ముఖ్యులు. విష్ణుకుండినులు, ఇక్ష్వాకువంశీయుల పాలనాకాలమున మండలాధిపతులుగనో సామంతులుగనో సైన్యాధ్యక్షులుగనో వ్యవహరించియుందురు. కృష్ణానదికి ఉత్తరమున విజయపురికి దగ్గరలో నల్లగొండ మండలములోనున్న ఏలేశ్వరము ప్రస్తుతము

మహబూబునగరమండములోని అచ్చంపేట తాలూకాలోని అమరాబాదు ప్రాంతము విష్ణుకుండినుల కావాసస్థలముగ నుండియుండ వచ్చును. మూసీనది తీరముననున్న ఇంద్రపాలనగరము ఇక్ష్వాకుల కాలమున బౌద్ధ క్షేత్రముగ వర్ధిల్లియుండును. మూసినది నల్లగొండ మండలమున ప్రవహించుచున్నది. వాడపల్లి వద్ద కృష్ణానదిలో సంగమ మగుచున్నది. వాడపల్లి, ప్రాచీన శాసనములందు ఓడపల్లి గా వర్ణింపబడినది.

నల్లగొండ మండలములోనున్న సూర్యాపేటనుండి జనగామ వెళ్ళుమార్గములో నున్న ఫణిగిరి, గాజులబండ, మెదకు మండలములోని కొండాపురము, ఖమ్మంజిల్లాలోని నేలకొండపల్లి అనాడు బౌద్ధుల కావాసమైన నగరములు. కొండాపుర మాంధ్రరాజుల కాలమునందత్యంత వైభవముతోనున్న నగరము. నేటి హైద్రాబాదు నగరమునకు నలుబదిమైళ్ళ దూరమున మెదకు జిల్లాలోని శిధిల చిహ్నములతో గనిపించు చిన్న పల్లెటూరు. నేటి ఖమ్మంజిల్లాలోనున్న నేలకొండ పల్లిలో బౌద్ధులకు సంబంధించిన దిబ్బయున్నది. ఖమ్మం, నల్లగొండ, మెదకు, హైద్రాబాదు, మహబూబునగర్, కరీంనగర్ జిల్లాలానాడు విష్ణుకుండినులు మొట్టమొదట పాలించిన ప్రాంతములు ఇప్పటి క్రిష్ణామండలము విష్ణుకుండినులు తొలుత పాలించిన ప్రాంతమే. జగ్గయ్యపేట, రామిరెడ్డి పల్లి ప్రాంతములందు ఇక్ష్వాకులకు సంబంధించిన శాసనములు లభించినవి. ఇక్ష్వాకుల కాలమున బౌద్ధమత మవలంబించిన విష్ణుకుండినులు బౌద్ధమతానురక్తులైయుండిరని భావింపవచ్చును.

విష్ణుకుండిన వంశీయులలో మహారాజేంద్రవర్మ, అతనిపుత్రుడు మాధవవర్మ, పౌత్రుడు గోవిందవర్మ బౌద్ధమతానుయాయులు. బౌద్ధమతాభిమానులు, రెండవమాధవవర్మ, దేవవర్మ, మూడవమాధవర్మ, వైదికమతానుయాయులు, విక్రమేంద్రవర్మ, బౌద్ధుడు. ఇంద్రభట్టారకవర్మ. విక్రమేంద్రభట్టాకవర్మ బౌద్ధ మతాభిమానులు రెండవ గోవిందవర్మ, నాలుగవమాధవవర్మ, మంచనభట్టారకుడు వైదికమతానుయాయులు.

విష్ణుకుండినులు బౌద్ధమతానుయాయులు, బౌద్ధమతాభిమాను లనుటకు వారిశాసనములందు, గల వర్ణనలేతార్కాణము. ఇంద్రపాలనగరశాసనములవలన ఈ విషయముదెలియుచున్నది. గోవిందవర్మ, "........సజల దిగన్తరేణ భిక్షుద్విజానాధయాచక వ్యాధిత దీనకృపణ జనోప భుజ్య మాన న్యాయాధిగత విభవధన సముదయేనా.........మహాబోధివిత్తేన........." అని వర్ణింపబడినాడు. "విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున గోవిందవర్మ "షడభిజ్ఞ ప్రతిపాద్య దర్శనానుగ్రహ జనితసుగత శాసనాభిప్రసాదస్య విబుధ భవన ప్రతిస్పర్ధి శోభాసముదయానేక మహావిహారప్రతిష్ఠాపనాధిగతానన్తబ్రాహ్మణపుణ్య సంభారస్య" అని వర్ణింపబడినాడు. అట్లేవిక్ర మేంద్రవర్మ "మహారాజశ్రీమాధవవర్మణః ప్రియపుత్రస్య మహాకవేః పరమసౌగతస్య" అని పేర్కొనబడినాడు.

విష్ణుకుండినులలో రెండవమాధవవర్మ, మూడవ మాధవవర్మ వేయించిన ఈ పూరు శాసనమున "ఏకాదశాశ్వమేధావభృధావధౌతజగత్కల్మశస్యాగ్నిష్టోమ సహస్రియాజినోనేక సామన్తమకుటమణిఖచిత చరణయుగళకమలస్యమహారాజస్య శ్రీ మాధవవర్మణః" అనియు, విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర శాసనమున "ఏకాదశాశ్వమేధ బహుసువర్ణ పౌణ్డరీ కవాజపేయ.

---

1. E. I. Vol. XVII P. 337.

క్రతూసహస్రసర్వమేధరాజసూయ పురుషమేధాద్యాహరహస్సమ్యగనుష్ఠితశ్రుతివిహితాశేషదుష్కరకర్మానుష్ఠానస్య..." అనియు వర్ణింపబడినాడు.

మూడవ మాధవవర్మ ఈపూరు శాసనమున తననుగూర్చి భగవచ్ఛీపర్వతస్వామి పాదానుధ్యాతో...'' అని చెప్పుకొనినాడు.

నాలుగవ మాధవవర్మ పొలమూరు శాసనమున[1] క్రతుసహస్రియాజి హిరణ్యగర్భప్రసూతః ఏకాదశాశ్వమేధానబృధస్నా...న" అనివర్ణింపబడినాడు. విష్ణుకుండినులలో మొదటి ముగ్గురురాజులు బౌద్ధమతానుయాయులు. కాలక్రమమున బౌద్ధముక్షీణించుట వలనను బౌద్ధమత గురువులు, బౌద్ధమత సన్యాసినులు, మతాతీత ప్రవర్తన కలవారగుటవలనను, బౌద్ధసంఘారామ విహారములు, సత్కర్మలకు దూరమగుట వలనను, వైదికమతప్రాబల్యమును గ్రహించి రెండవ మాధవవర్మ వైదికమత మవలంబించియుండును, ఈ మాధవవర్మ వాకాటక రాజకుమారిని వివాహమాడిన యనంతరము, బౌద్ధమువీడి, వైదికమతమును స్వీకరించి, వాకాటక రాజులవలె యజ్ఞయాగాది క్రతువులు, అశ్వమేధ పురుషమేధాదులాచరించి. వైదికమతోద్ధరణము గావించినాడు.

## ఇంద్రపాలనగరము – బౌద్ధవిహారము :

ఇంద్రపాల నగరము మూసీనది యొడ్డున నున్నది. ఇంద్రపాల ముత్యాలమ్మగుట్ట, కోట, శిధిలరూపమున నున్న కట్టడములు, నాగవరము-తుమ్మలగూడెము, వలిగొండ, ప్రాంతములందు గనిపించు, శిధిలములు, ఇండ్ల అడుగులు, పునాదులు, మున్నగునవి, పరిశీలించిచూడ ఇంద్రపాలనగర ప్రాంతమున, శాసనములందు వర్ణింపబడినట్లు, మహోద్భుతమైన కట్టడములతో బౌద్ధారామవిహారములు వర్ధిల్లినట్లు తోచుచున్నది. అంతియేకాక విజయపురిలో ఇక్ష్వాకు వంశ మంతరించిన పిమ్మట, శాలంకాయన. పల్లవరాజన్యుల ఏలుబడిలో, కృష్ణకు దక్షిణమున నున్న గుంటూరు మున్నగు ప్రాంతములందు బౌద్ధమతమునకు రాజాదరణము సన్నగిల్లుటవలన తెలంగాణప్రాంతమున బౌద్ధమతము వ్యాపించుట కవకాశము కల్గినది. విష్ణుకుండినులు కృష్ణకు ఉత్తరమున నున్న ప్రాంతమును పాలించుచు ఇంద్రపాలనగరము, జగయ్యపేట, ఫణిగిరి, నేలకొండపల్లి ప్రాంతములందున్న బౌద్ధస్తూపములను, ఆరామవిహారములను రక్షించుచు, బౌద్ధులను పోషించుచుండిరి.

ఇంద్రపాలనగరమున నున్న మహాదేవి విహార మతిముఖ్యమైనది. ఈ విహారమున నున్న బౌద్ధమతాచార్యుడు. ఫణిగిరి, గాజులబండ, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి, నేలకొండపల్లి మున్నగు ప్రాంతములందున్న బౌద్ధారామవిహారములపై నాధిపత్యము నెఱపియుండ వచ్చును. ఈవిహారములందున్న ఛాత్రులకు ఉచిత భోజనవసతులు విష్ణుకుండిన ప్రభువులు కల్పించుచుండిరి. విహారములకు శాశ్వతముగా అగ్రహారముల నొసంగి తమ బౌద్ధమతాభిమానమును ప్రకటించుకొనిరి. బౌద్ధవిద్యలకు నిలయమైన ఈ విహారములానాడు ఆంధ్రదేశమున నున్న తక్కిన బౌద్ధారామ విహారముల కాదర్శ ప్రాయముగ నుండెను. విష్ణుకుండిన గోవిందవర్మ, విక్రమేంద్ర భట్టారక వర్మలు ఇంద్రపాల నగరములోని మహాదేవి విహారమునకు అగ్రహారముల నొసంగినట్లు వారి శాసనముల వలన తెలియుచున్నది. ఆర్ష శాఖవారి కృషివలన మహాదేవి విహార వివరములు తెలియవచ్చునని ఆశింపవచ్చును,

1. J. A. H. R. S. Vol. No. VI P. 17.

## IV విష్ణుకుండినుల కాలనిర్ణయమునకు సంబంధించిన విక్రమేంద్ర భట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన శకసంవత్సరము 488.

విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున "సాష్టాశీతిచతుశ్శతే శకపతే సంవత్సరాణాంగతే" అని యుండుటవలన విష్ణుకుండినుల కాలనిర్ణయమున కీ శక సంవత్సరము 488 తోడ్పడుచున్నది.

ఇంతవరకు లభించిన విష్ణుకుండిన శాసనములలో విజయరాజ్య సంవత్సరములే తప్ప శక సంవత్సరములు పేర్కొన బడలేదు. కావున విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్ర శాసనమున కెంతేని ప్రాముఖ్య మివ్వవలసి వచ్చుచున్నది. విష్ణుకుండినుల వంశనిర్ణయముతోపాటు రాజులపరిపాలనా కాలమిచట పేర్కొన బడుచున్నది.



సముద్రగుప్తుడు దక్షిణాపథముపై దండెత్తివచ్చినప్పుడు దక్షిణభారతమును వివిధవంశీయులు పాలించుచుండిరి. అలహాబాదు శాసనమున హరిసేనుడు సముద్రగుప్తుని దిగ్విజయవృత్తాంతమును వర్ణించునపుడు దక్షిణాపథమున సముద్రగుప్తునిచే నోడిపోయిన రాజులను వారి రాజ్యములను పేర్కొనినాడు.

"కౌసలక-మహేంద్ర, మహాకాంతారక-వ్యాఘ్రరాజ; కౌరాలక-మంత్రరాజ; పిష్టపురక-మహేంద్రగిరికొత్తూరక-స్వామిదత్త; ఎరండపల్లిక-దమన; కాంచేయక-విష్ణుగోప, అవముక్తక-నీలరాజ; వైంగేయక-హస్తివర్మ; పాలక్కాక-ఉగ్రసేన; దైవరాష్ట్రక-కుబేర; కౌశస్థలపురక-ధనంజయ; ప్రభృతి సర్వదక్షిణా పథరాజగ్రహణ మోక్షానుగ్రహజనిత ప్రతాపోన్మిశ్రమహాభాగస్య..."[1] అని సముద్రగుప్తుడుజయించినరాజులపేళ్ళను, వారివారిరాజధానీనగరములమశాసనమునపేర్కొనినాడు.

సముద్రగుప్తుని దక్షిణదేశ దిగ్విజయానంతరము శాలంకాయన, పల్లవ, ఆనందగోత్రీకుల బలము క్షీణించుచున్న సమయమున, విష్ణుకుండినులు కృష్ణానది కుత్తరమున రాజ్యమును స్థాపించు ప్రయత్నములు చేయసాగిరి. విష్ణుకుండిన మహారాజేంద్రవర్మ వలేశ్వరము, మిర్యాలగూడ, నల్లగొండ, ఇంద్రపాలనగరము భువనగిరి, అమరాబాదు ప్రాంతములను దన యధికారము క్రిందికి తెచ్చుకొనెను. ఇంద్రపాల నగరమును రాజధానిగా క్రీ శ. 388 ప్రాంతమున విష్ణుకుండిన రాజ్యమును స్థాపించెను. అప్పటికి అనంతగోత్రీకులు బలహీనులై పల్లవరాజులతో యుద్ధములు జేయుచుండిరి. కళింగులు, శాలంకాయనులు, పల్లవులు, ఆనందగోత్రీకులు పరస్పరము కలహించు చుండుటవలన విష్ణుకుండినులు రాజ్యమును స్థాపించి స్థిరపడుట కవకాశము కలిగినది.

శాలంకాయన హస్తివర్మయనంతర మాతనితనయుడు నందివర్మ ఆంధ్రదేశాధీశుడయ్యెను. ఇతడు ధర్మప్రధానుడు. నందివర్మయనంతరము చండవర్మ, చండవర్మ తరువాత విజయనందివర్మ రాజయ్యెను. ఈతని కాలమున శాలంకాయన రాజ్యము క్షీణింప మొదలిడెను. ఆసమయమున విష్ణుకుండిన గోవిందవర్మ విజృంభించి, కృష్ణకు దక్షిణముననున్న గుంటూరు మండలమును, కృష్ణాగోదావరినదుల మధ్య భూభాగము జయించి విష్ణుకుండిన సామ్రాజ్యమును విస్తృతపరచెను. అటు కళింగమున సముద్రగుప్తుని దిగ్విజయానంతరము శాలంకాయన హస్తివర్మ సామంతులు స్వతంత్ర రాజ్యముల నేర్పరచుకొనుచుండిరి. కళింగమున శక్తివర్మ రాజ్యవిస్తృతికి ప్రయత్నించుచుండెను. పల్లవులు కదంబులతో బోరాడుచుండిరి. ఆ సమయమున విష్ణుకుండిన రాజ్యము వృద్ధిజెందుట కవకాశము కలిగెను. విష్ణుకుండినుల కాలనిర్ణయమునకు విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున పేర్కొనబడిన శక సంవత్సరము 488 ప్రాతిపదికగా తీసికొనినయెడల విక్రమేంద్ర భట్టారకవర్మ వేయించిన ఇంద్రపాలనగర తామ్రశాసనమాతని పదునొకండవ విజయరాజ్య సంవత్సరమును, చిక్కుళ్ళ శాసనము[2] పదియవ విజయరాజ్య సంవత్సరమును, తుండిశాసనము[3] పదునాలుగవ విజయరాజ్య సంవత్సరమును దెలుపుచున్నవి. విక్రమేంద్రభట్టారకవర్మ రాజ్యమునకు వచ్చిన సంవత్సరము. క్రీ.శ. 556. కావున ఇతడు పాలించినకాలము క్రీ.శ 556-570 అని నిర్ణయించబడినది

1. Gupta Inscriptions (C. I. I. Vol. III) No. 1 By Dr. Fleet.
2. E. I. Vol. IV. P. 193-198.
3. Hyderabad Archaeological Series No. 8.

ఇతని కుమారుడు రెండవ గోవిందవర్మ రాజ్యకాలము క్రీ. శ. 570-573. గోవిందవర్మకుమారుడు నాలుగవ మాధవవర్మ, నాలుగవమాధవవర్మ తన 48వ రాజ్యసంవత్సరమున బొలమూరు శాసనమును వేయించినాడు. కావున నాతని రాజ్యకాలము క్రీ. శ. 573-623, అనియు, నాతనిపుత్రుడు మంచనభట్టారకు డొకసంవత్సము పాలించినవాడు కావున నాతని రాజ్యకాలము క్రీ. శ. 623-624 అని నిర్ణయింపబడినది.

విక్రమేంద్రభట్టారకవర్మ తండ్రి ఇంద్రభట్టారకుడు. తన 27వ రాజ్యసంవత్సరమున రామతీర్థ శాసనమును వేయించెను. అతని రాజ్యకాలము క్రీ శ. 528-556గా నిర్ణయింపబడినది. విక్రమేంద్రవర్మ వృద్ధాప్యమున రాజైనవాడు. కావున అతడు క్రీ. శ. 522-528 వరకు పాలించియుండవచ్చును. మూడవ మాధవవర్మ ఈవూరు శాసన మాతని 47వ రాజ్యసంవత్సరమున వేయించినది. కావున మూడవ మాధవవర్మ కాలము క్రీ శ. 473-522

ఇక విష్ణుకుండిన వంశస్థాపకుడు మహారాజేంద్రవర్మ క్రీ. శ. 388-390; అతని పుత్రుడు మొదటి మాధవవర్మ క్రీ. శ. 390-398 వఱకు పాలించియుందురు. మాధవవర్మ కుమారుడు మొదటి గోవిందవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమును దన 37వ రాజ్యసంవత్సరమున వేయించినాడు. కావున గోవిందవర్మ పాలించినకాలము క్రీ. శ. 398-435; అనియు, అతని కుమారుడు రెండవ మాధవవర్మ క్రీ. శ. 435-470; మాధవవర్మ కుమారుడు దేవవర్మ పాలించినకాలము క్రీ. శ. 470-473 అనియు నిర్ణయింపబడినది.

ఐన చాళుక్యుల రాజ్యస్థాపన మాంధ్రదేశమున క్రీ. శ. 610 నాటికే ఏర్పడినట్లు చారిత్రకు లంగీకరించినారు, అప్పటికి విష్ణుకుండిన రాజ్య మంతరించినట్లు భావించుచున్నారు, రెండవ పులకేశి క్రీ. శ. 609 లో రాజై దిగ్విజయయాత్రకు బయలుదేరెను, రెండవ పులకేశి మారుటూరు శాసనము[1] క్రీ. శ. 616లో నీయబడినది. అతడు కొప్పారము శాశనము[2] వేయించుటకు ముందు అనగా క్రీ. శ. 631 నాటికి కుబ్జవిష్ణువర్దను డాంధ్రదేశమునకు బ్రతినిధిగా లేక యువరాజుగా నియమింప బడినాడని భావింపవచ్చును.

కుబ్జవిష్ణువర్దనుడు క్రీ. శ. 616 వరకాంధ్రదేశమునకు రాలేదు. సుమారు 620 ప్రాంతమున నాత 'డాంధ్రదేశమునకు వచ్చి యుద్ధములొనర్చి విష్ణుకుండిన మాధవవర్మనోడించి, క్రీ. శ. 624-641 వఱకు రెండవ పులకేశి మహారాజు ప్రతినిధిగా పాలించెను. పులకేశి మరణానంతరము మహారాజై చీపురుపల్లి శాసనమును వేయించెను. కుబ్జవిష్ణువర్థనుని కుమారుడు జయసింహావల్లభుడు.

---

1. C. P. Inscriptions of A. P. Govt. Museum of Hyderabad. Vol. I. P. 11.
2. E. I. Vol. XVIII P. 257.

విష్ణుకుండిన నాలుగవ మాధవవర్మ పొలమూరు శాసనము[1] జయసింహవల్లభుడు వేయించిన శాసనము ఒకేచోట లభించినవి. ఆ శాసనములోకే వంశీయుల కొసంగబడినవి. శాసన ప్రతిగ్రహీతలు తండ్రి కొడుకులు, వారి వంశవృక్ష మీక్రింద నీయబడినది.







ఈ రెండు శాసనములలో పేర్కొనబడిన ప్రతిగ్రహీతల పేళ్ళు, వారి తాత తండ్రుల పేళ్ళను గుర్తించిన యెడల పొలమూరుశాసన ప్రతిగ్రహీతయగు శివశర్మ కుమారుడే జయసింహవల్లభుని శాసనమును దానముగా బడసినవాడని తెలియుచున్నది. విష్ణుకుండిన నాలుగవ మాధవ వర్మ శివవర్మకు గుద్దవాడి విషయములోని పులుంబూరు గ్రామమును దానమిచ్చినట్లుండ, జయసింహవల్లభు డాగ్రామమునే శివశర్మ కుమారుడగు రుద్రశర్మకు స్థిరపఱచినాడని తెలియుచున్నది. అనగా మాధవవర్మ తన అవసానదశలో నీదానమొసంగియుండును. మాధవశర్మ ఈ శాసనమును ఫాల్గుణ పౌర్ణమి చంద్రగ్రహణ నిమిత్తము వేయించినట్లు తెలియుచున్నది.

చంద్రగ్రహణము ఫాల్గుణ మాసమున వచ్చు సంవత్సరములు క్రీ. శ. 575; 593; 594; 612; 621; శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు మాధవ వర్మ పొలమూరు శాసనమును అతని 48వ రాజ్య సంవత్సరమున అనగా క్రీ. శ. 594 వ సంవత్సరము ఫిబ్రవరి 10వ తేదిన వేయించినట్లు నిర్ణయించినారు.[2] కాని విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనము ననుసరించి, మాధవ వర్మ రాజ్యమునకు వచ్చిన సంవత్సరము క్రీ. శ. 578 అగుచున్నది. అప్పుడు 48వ రాజ్య సంవత్సరమున వేయించిన పొలమూరు శాసన కాలము క్రీ. శ. 621వ సంవత్సరమునకు సరి పోవును.

రెండవ పులకేశి కృష్ణానది దక్షిణప్రాంతమును జయించి తన రాజధానికి వెడలునపుడు ఆంధ్రదేశమున జయించిన ప్రాంతములను పాలించుటకొక ప్రతినిధి నిలిపియుండును. నాల్గవ మాధవ వర్మ కాలమునాటికి, విష్ణుకుండినుల రాజధాని విజయవాడ. రెండవపులకేశి ప్రతిస్పర్థులు పల్లవులు గావున వారితో యుద్ధము చేయుచు, కృష్ణానదికి దక్షిణమున నున్న గుంటూరు, నెల్లూరు మండలములను తదితర ప్రాంతములను జయించియుండును.

---

1. J. A. H. R. S. Vol. VI. P. 17.
2. భారతి - ప్రమోదూత - భాద్రపదము. P. 474,

విష్ణుకుండిన నాలుగవ మాధవవర్మ పులుంబూరు గ్రామ దానమునకును ప్రతి గ్రహీత శివవర్మ జయసింహావల్లభ మహారాజు, శివవర్మ కుమారుడు, రుద్రశర్మకు పులుంబూరు అగ్రహారమునే స్థిరపఱచినాడు. ఇది జయసింహ వల్లభుని ఐదవ విజయరాజ్య సంవత్సరమున జరిగినది. ఈ యగ్రహారము నతడు విజయస్కంధావారమునుండి పునరుద్ధరించెను. జయసింహ వల్లభుని కప్పటివఱకు కృష్ణానది కుత్తరమున నున్న నేటి గోదావరి మండలములోని రామచంద్రపురము తాలూకాలోనున్న పొలమూరు ప్రాంతము వశము కాలేదని స్పష్టమగు చున్నది. విష్ణుకుండిన మాధవ వర్మ కుమారుడు మంచనభట్టారకుని యుదమున జయించి విజయస్కంధావారము నుండి జయసింహవల్లభుడు పులుంబూరు శాసనమును పునరుద్ధరించినట్లూహింపవచ్చును. ఈ రెండు శాసనము లొకేచోట దొరుకుట వలనను, రెండు శాసనములలో ప్రతిగ్రహీతలు తండ్రి కొడుకు లగుటవలనను మాధవవర్మ క్రి. శ. 623 వరకు జీవించి యుండెననుట కవకాశమున్నది.

నల్లగొండ మండలములోని దొండపాడు గ్రామమున 1335వ ఫసలీలో నొక నాణెముల తిందె లభించినది. నాణెముల తూకము 4920 తులములు. ఈ నాణెములపై నోరు తెరచుకొని లంఘించుటకు సిద్ధముగా నున్న భయంకర సింహరూపము, సింహము ముందు అడ్డముగా విచ్చుకత్తియును, సత్యాశ్రయ విషమసిద్ధియను పేరును చెక్కబడి యున్నవి. ఈనాణెములు విష్ణుకుండినులవి. విష్ణుకుండినుల నాణెములపై లంఘించు సింహము, పూలకుండి, సౌధము, చిహ్నములు గలవు. వెండి, బంగారు, రాగి, లోహపు నాణెములు, మిశ్రలోహ నాణెములు కలవు. కుబ్జ విష్ణువర్ధనుడు క్రి. శ. 616 వర కాంధ్ర దేశమునకు రాలేదు. క్రి శ. 620లో నాతడాంధ్రదేశము వచ్చి యుద్ధములందు పాల్గొనెను క్రి. శ. 620-623 వర కాతనికి యుద్ధములతోనే సరిపోయెను. క్రి. శ. 623లో జరిగిన యుద్ధమున విష్ణుకుండిన నాల్గవ మాధవవర్మ నిహతుడు కాగా కుబ్జ విష్ణువర్ధనుడు తెలంగాణా ప్రాంతము సైతము జయించి తన విజయచిహ్నముగ విష్ణుకుండినుల నాణెములపై- సింహము ముందు విచ్చుకత్తి తన పేరును చెక్కించి యుండును. నాల్గవ మాధవవర్మ మరణానంతర మాతని కుమారుడు మంచనభట్టారకుడు సామంతుల, సాయమున చాళుక్యులతో పోరుసల్పుచుండెను. జయసింహవల్లభుడు రాజ్యమునకు వచ్చిన ౯ సంవత్సరముల వఱకును, చాళుక్యులకు, విష్ణుకుండినమంచనభట్టారకునితో యుద్ధములు జరుగుచుండెను. చివరకు, జయసింహవల్లభుడు క్రి శ. 646లో మంచనభట్టారకుని యుద్ధమున సంహరించి, విజయుడై పొలమూరు శాసనమును శివశర్మకుమారుడగు రుద్రశర్మకు స్థిరపరచెను.

## V. విక్రమేంద్ర భట్టారకవర్మ శాసనమున పేర్కొనబడిన గోవిందవర్మ వాకాటక రాజకుమారిని వివాహమాడిన మాధవవర్మతండ్రి. విష్ణుకుండినులు, బ్రహ్మక్షత్ర తేజముకలవారు.

విక్రమేంద్రభట్టారకవర్మ ఇంద్రపాలనగర తామ్రశాసనమున "......బ్రహ్మక్షత్రతేజో భృతాం......మదఖిజ్ఞప్రతిపాద్య దర్శనానుగ్రహజనిత......మహారాజశ్రీ గోవిందవర్మణః ప్రియపుత్రస్యైకాదశాశ్వమేధ బహుసువర్ణ పౌణ్డరీక వాజపేయు...మహారాజశ్రీ మాధవవర్మణః

1. Rep. Arch. Dept. H. E. H. Nizams Dominions 1925-26. Appendix B. pp. 26 ff

ప్రియపుత్రస్య వాకాటకమహాదేవీ సుతస్య మహాశవే పరమ సౌగతస్య......" అని విక్రమేంద్ర వర్మ వర్ణింపబడుటవలన విక్రమేంద్రవర్మ వాకాటకమహాదేవి పుత్రుడనియు, రెండవమాధవవర్మ గోవిందవర్మతనయుడనియు, గోవిందవర్మ బౌద్ధమతానుయాయి యనియు, ఇంద్రపాలనగర తామ్ర శాసనమును వేయించిన గోవిందవర్మ ఇతడే ననియు తెలియుచున్నది. విష్ణుకుండినులు బ్రహ్మ క్షత్రతేజము కలవారని వర్ణింపబడుటవలన పల్లవులవలె వీరును బ్రాహ్మణులని తెలియుచున్నది. శాతవాహనుల యనంతర మాంధ్రదేశమున వివిధ ప్రాంతములను పాలించిన బృహత్ఫలాయన, శాలంకాయన, ఆనందగోత్రిక వంశీయులు బ్రాహ్మణులు. వీరు దేశరక్షణార్థము క్షాత్రమవలంభించి రాజ్యముల నెలకొల్పి పాలించిరి.

## VII విక్రమేంద్రభట్టారకవర్మ కుమారుడు మాధవరాజు

విక్రమేంద్రభట్టారకవర్మ వేయించిన ఇంద్రపాలనగర తామ్రశాసనము వలన, ఈ రాజుకు మాధవరాజను కుమారుడున్నట్లు తెలియుచున్నది. మాధవరాజు బలపరాక్రమ సంపన్నుడు. అందమైనవాడు. తన పుట్టుకచే విష్ణుకుండిన వంశముయొక్క కీర్తిని విస్తరింప జేసిన వాడు. విక్రమేంద్రభట్టారకవర్మ జ్యేష్ఠపుత్రుడు. ఇతడు పిన్నవయసునందే మరణించియుం డును. కావున విక్రమేంద్రభట్టారకవర్మ యనంతర మాతని రెండవ కుమారుడు రెండవ గోవింద వర్మ రాజ్యభారము వహించెను.

## VI విక్రమేంద్రభట్టారకవర్మచే నోడిపోయిన పల్లవ సింహవర్మ.

విక్రమేంద్రభట్టారకవర్మ వేయించిన ఇంద్రపాలనగర తామ్రశాసనాంతరమున "కృత్వా పల్లవభంగ పేలవబలం సింహాహ్వయంపల్లవం, భూత్వావృత్త్యయదాగతః ప్రథమతశ్శ్రీకాభిధానం పురం ప్రాదాచ్ఛాసన ముత్తమాశ్రయ ఇతిఖ్యాత స్తదేదంన్నృపః సాష్టాశీతిచతుశ్శతే శకపతే సంవత్స రాణాంగతే......"అనికలదు. అనగా పల్లవునివలె స్వల్పబలముగల సింహాహ్వయుడగు పల్లవుని భంగపఱచి తిరిగివచ్చి మొదట శ్రీకాభిధానమను పట్టణమును ఉత్తమమాశ్రయుడగు రాజు దానముచేసెను. ఆ దానము శకసంవత్సరము సాష్టాశీతి చతుశ్శతము (488) గడచిన పిదప ఇవ్వబడినది.

విక్రమేంద్రభట్టారకవర్మ జయించిన పల్లవరాజు ఐదవ సింహవర్మ డా॥ మారేమండ రామారావుగారు సైతము క్రీ. శ. 600-630 వఱకు పల్లవరాజ్యమును పాలించిన మొదటి మహేంద్రవర్మ తాతయు, రెండవ కుమారవిష్ణువు కుమారుడగు ఐదవసింహవర్మనే విక్రమేంద్ర భట్టారకవర్మ ఓడించిన సింహవర్మగా గుర్తించినారు. ఈ సింహవర్మ క్రీ. శ. 550లో రాజ్యము నకు వచ్చినవాడు. విక్రమేంద్రభట్టారకవర్మ రాజ్యపాలనాకాల మైదవ సింహవర్మ పాలించిన కాల మునకు సరిపోవుచున్నది. కావున శాసనమున పేర్కొనబడిన సింహవర్మ గురించి సంశయపడ నక్కఱలేదు. పాఠకుల సౌలభ్యమున కిచట పల్లవ వంశవృక్షమీయబడుచున్నది.

## పల్లవ వంశ వృక్షము


సింహ వర్మ
(మంచికల్లు శాసనము - క్రీ. శ. 290)
కుమార విష్ణువు
స్కందవర్మ
(క్రీ. శ. 310)
బుద్ధవర్మ I
వీరవర్మ
బుధ్యాంకుర
స్కందవర్మ-II
సింహవర్మ-II
యువమహారాజ విష్ణుగోపవర్మ
(క్రీ. శ. 350)
ఉగ్రవర్మ
సింహవర్మ-III
విష్ణుగోప-II
స్కందవర్మ-III.
సింహవర్మ-IV
నందివర్మ
కుమారవిష్ణువు-II.
సింహవర్మ
(క్రీ. శ. 550-580)
బుద్ధవర్మ
సింహవిష్ణు
మహేంద్రవర్మ-I
(క్రీ. శ. 660-680)

## VIII విక్రమేంద్రభట్టారకవర్మ ఇందప్రపాలనగర తామ్ర శాసనమున కాఙ్క్షప్తి సత్రపులలో ప్రముఖుడైన శ్రీమూలరాజు.

విక్రమేంద్రభట్టారకవర్మ శాసనమున "ఏనోద్ధృతాభర్తృ కులస్యలక్ష్మీరథభ్యాతస్త్రీ నయవిక్రమాఖ్యాం ఆజ్ఞాపనాఖ్యాత కులప్రసూతః శ్రీమూలరాజః సత్రపేషుముఖ్యః" అని కలదు. శాసనమున కాఙ్క్షప్తి విష్ణుకుండిన వంశముయొక్క పతనమొందుచుండిన కీర్తిని ఉద్ధరించిన వంశమున జన్మించినవాడును, సత్రపులలో, ముఖ్యుడును నైన శ్రీమూలరాజు——. ఈ మూలరాజు విక్రమేంద్రభట్టారకవర్మకు యుద్ధములందు సాయపడి విజయము చేకూర్చుచుండెడి వాడని తలంపవచ్చును.

**మాఠర వంశీయులు :**

సముద్రగుప్తుని దక్షిణాపథ దిగ్విజయానంతరము కళింగమున చిన్న చిన్న రాజ్యములు తలయెత్తినవి. మాఠర వంశీయులు పిష్ఠపురము రాజధానిగా కళింగదేశమును పాలింప దొడగిరి. కాలక్రమమున వీరికి పిష్ఠపురమునకు బదులుగా వర్ధమానపురము, సింహపురములు రాజధానులుగా వర్ధిల్లినవి. ఈ వంశీయులలో మొదటిరాజు శక్తివర్మ.




శక్తివర్మ రాగోలు శాసనము[1] వలన మాఠర వంశీయుల గురించి తెలియుచున్నది. శక్తివర్మ నాలుగవ శతాబ్దమున కళింగదేశా ధీశుడయ్యెను. ఈ శక్తివర్మ వాసిష్ఠీపుత్రుడు; మాఠరకులైక భూషణుడు, కళింగాధిపతియని రాగోలుశాసనమున వర్ణింపబడినాడు. బృహత్ఫలాయన, ఆనందగోత్రిక, శాలంకాయనుల వలె మాఠర కులజులు గోత్రనామమును వంశనామముగా ధరించినారు.

శక్తివర్మ రాజధాని పిష్ఠపురము. శక్తివర్మకు పూర్వము పిష్ఠపురమును రాజధానిగా కళింగదేశమును పాలించిన రాజు మహేంద్రుడు. ఇతడు సముద్రగుప్తునిచే ఓడింప బడినట్లు అలహాబాదు శాసనము వలన[2] తెలియుచున్నది. శక్తివర్మ తన 13వ రాజ్యసంవత్సరమున వేయించిన శాసనము రాగోలు శాసనము. ఇతని రాజ్యపాలనా కాలము సుమారు 15 సంవత్సరములు. శ్రీ భావరాజ వేంకటకృష్ణారావుగారు శక్తివర్మ కాలమును క్రీ. శ. 350-365 గా నిర్ణయించినారు[3]. శక్తివర్మ కళింగవిషయములోని రాకలువ గ్రామమును అగ్రహారముగా జేసి బ్రాహ్మణ కుమారశర్మకు దానిమిచ్చినాడు. ఈ కుమారశర్మ సావర్ణస గోత్రీయుడు. పంచార్షేయ ప్రవర

---

1. E. I. Vol XII p. P-3.
2. Gupta Inscriptions C. i i. Vol III No. 1 By Fleet
3. Early dynasties of Andhra Desa, Page. 385

శాసనము శక్తివర్మ 13వ రాజ్యసంవత్సరము వైశాఖ పూర్ణిమనాడు వేయింపబడినది. శాసనమున కాజ్ఞప్తి శక్తివర్మమహారాజే. ఈ శాసనమును వ్రాసి చెక్కిన వ్యక్తి అమాత్యుడగు అర్జునదత్తుడు.

శక్తివర్మ యనంతరము కళింగమును పాలించిన రాజులు బలహీనమగుట వలన, వీరి రాజధాని పిష్టపురమునుండి సింహపురమునకు మారినది. శాలంకాయనుల దండయాత్రల వలననో లేక వాసిష్టగోత్రికులగు రాజుల వలననో వీరు పిష్టపురమును కోల్పోయి యుందురు.

అనంతశక్తివర్మ సకునక శాసనము[1] నాలుగవ శతాబ్ద్యంతముననో, ఐదవ శతాబ్ద్యారంభముననో వేయించినట్టిది. ఈ శాసన రచయిత అర్జునదత్తుడు. ఇతనికి దేశాక్షపటలాధికృత, తలవర బిరుదములున్నవి. ఈ అర్జునదత్తుని ప్రశంస రాగోలు శాసనమందున్నది, సకునక శాసనమున తలవర బిరుదముగల అర్జునదత్తుడును, రాగోలు శాసనమున పేర్కొనబడిన అమాత్య అర్జునదత్తుడును ఒక్కరే. అర్జునదత్తుడు, అనంతశక్తివర్మ తన 28 వ రాజ్యసంవత్సరమున వేయించిన సకునక శాసనకాలము వఱకు జీవించి యుండవచ్చును. అనంతశక్తివర్మ తండ్రి అనంతవర్మ, తాతగారి పేరు మనుమడికి పెట్టు ఆచార మాకాలమునకూడ నుండెననుటకు, శక్తివర్మ పేరు తార్కాణము. అనంతవర్మ కాలమున మాఠరవంశీయులు దక్షిణకళింగముపై దమ ఆధిపత్యమును కోల్పోయిరి.

అనంతవర్మ కాలమున ఈ వంశీయులు పిష్టపురమును కోల్పోయి, సింహపురమును రాజధానిగా చేసికొని కళింగోత్తర భాగమును పాలించుచుండిరి. సింహపురము సింగుపురముగా ప్రసిద్ధికెక్కినది. నేడది సింగపురముగా వ్యవహరింప బడుచున్నది. సింగపురము శ్రీకాకుళము – నరసన్నపేటల మధ్యనున్నది.

మాఠరవంశ స్థాపకుడగు శక్తివర్మ యనంతరము, రాజ్యమునకు వచ్చిన రాజులు వేయించిన శాసనములింతవరకు ఏడు ప్రకటింపబడినవి. ఈ శాసనములందు రాజులు పితృపాదభక్తులుగా వర్ణింపబడినారు. ఈ శాసనములన్నియు సంస్కృతభాషలో వేయింపబడినవి. ఈ ఏడు శాసనములలో ఉమావర్మ బెక్కలి శాసనము తప్ప తక్కిన శాసనములు విజయసింహపురమునుండి ఈయబడినవి. బెక్కలి శాసనము విజయ వర్ధమానపురము నుండి వేయింపబడినది. ఈ ఏడు శాసనములకు సంబంధించిన విషయము క్లుప్తముగా నిచట వ్రాయబడుచున్నది.

1. Annual report of the Archaeological survey of India. New Delhi 1934-35 Page 65

1. సకునక శాసనము[1] — అనంతశక్తివర్మ
2. తిరిథాన శాసనము[2] — చండవర్మ
3. కోమర్తి శాసనము[3] — చండవర్మ
4. టెక్కలి శాసనము[4] — చండవర్మ
5. బృహత్ప్రోష్ఠ శాసనము[5] — ఉమావర్మ
6. ధవళపేట శాసనము[6] — ఉమావర్మ
7. కోరోషండ శాసనము[7] — విశాఖవర్మ

ఈ రాజన్యులు శాసనములందు "పరమదైవతః" అని చెప్పబడినారు చండవర్మ మహారాజు "పరమభాగవతః" అని చెప్పబడినాడు. అనంతశక్తివర్మ సకునక దానశాసనము విజయ సింహపురము నుండి ఈయబడినది. సింహపురము సింఘపురముగా మారి కాలక్రమమమున సింగుపురమైనది. సకునక గ్రామము వరాహవర్తని విషయములోనిది. తైత్తిరీయశాఖాధ్యాయులును, సోదరులును, అగు నాగశర్మ దుగ్గశర్మల కి గ్రామము దానమీయబడినది. ఈ శాసనమును అనంతశక్తివర్మ తన 28వ రాజ్యసంవత్సరపు ఫాల్గుణ శుద్ధ దశమీ తిథినాడు ఇచ్చెను. శాసనమున కాజ్ఞప్తులు కుమారామాత్యులగు (Junior Ministers) శివభోజక, వసుదత్తులు. వీరు ఉన్నతాధికారులు. ఇందు శివభోజకునికి మహాబలాధికృతుడను బిరుదమున్నది. (Commander in chief) వసుదత్తుడు దండనేత్ర బిరుదాంచితుడు. (General) శాసనమును వ్రాసినవాడు అర్జునదత్తుడు. దేశాక్షపటలాధికృత, తలవర(Chief Judge) బిరుదాంకితుడు. మహాతలవర బిరుదము, నాగార్జున కొండ. అల్లూరు కొండముది శాసనములందు కనిపించుచున్నది. అనంతశక్తివర్మ కాలము క్రీ. శ. 375-394

అనంతశక్తివర్మ యనంతర మాతని పుత్రుడు చండవర్మ సింహపురాధీశుడయ్యెను. ఇతని రెండు శాసనములు విజయసింహపురము నుండి ఈయ బడినవి. మొదటిది తిరిథాన శాసనము, చండవర్మ నాలుగవ విజయరాజ్య సంవత్సరమున గ్రీష్మర్తు రెండవ పక్షమున పంచమీతిథినా డీయ

---

1. Annual report of the Archaeological survey of India. New Delhi 1934-35 Page 65.
2. A. R. of the Archaeological survey of India New-Delhi 1934-35 Page 64.
3. Epigraphia Indica Vol. IV P. 42-
4. J. A. H. R. S. Vol. VI P. 53-54.
5. Epigraphia Indica Vol. XII P. 4.
6. J. A. H. R. S. Vol. XP. 143-144.
7. Epigraphia Indica Vol. XXI. P. 23.

బడినది. తిరిథాన లేక తిరిథానవాటక గ్రామము పలువురు విప్రుల కీయబడినది. ఇంతకు పూర్వము కళింగదేశమున నున్న 36 అగ్రహారముల కి తిరిథానగ్రామము చేర్చబడినది. శాసనమును చెక్కిన వాడు దేశాక్షపటలాధికృతుడగు రుద్రదత్తుడు. ఇతడు మాతృవరుని కుమారుడు.

చండవర్మ కోమర్తి శాసనమున పేర్కొనబడిన కోహేతూర గ్రామ మేవిషయములో నిదో పేర్కొనబడలేదు. ఈ శాసనమును చండవర్మ తన ఆరవ విజయరాజ్య సంవత్సరమున చైత్ర శుద్ధ పంచమీ తిథినాడు బ్రాహ్మణ దేవవర్మకు, కోహేతూర గ్రామము నగ్రహారముగా నిచ్చు సందర్భమున వేయించెను. చండవర్మ "బప్ప భట్టారక పాద భక్తః" అని శాసనమున వర్ణింప బడినాడు

చండవర్మ యనంతర మాతని పుత్రుడు ఉమావర్మ రాజయ్యెను[1]. ఉమావర్మ వేయించిన మూడు శాసనములింత వరకు బ్రకటింపబడినవి. అందు తొమ్మిదవ రాజ్య సంవత్సరమున వేయించిన లెక్కలి శాసనము విజయ వర్ధమానపురము నుండి ప్రకటింపబడినది. ఉమావర్మ రాజ్యారంభ కాలమున సింహపురిని కోల్పోయి యుండును. లెక్కలి శాసనము కాశ్యపగోత్రుడగు బ్రాహ్మణ యాశశర్మకు అస్తిహవేరా గ్రామము నగ్రహారముగా నిచ్చు సందర్భమున వేయింపబడినది. రాజుయొక్క మౌఖిక ఆజ్ఞ ననుసరించి యాతని తొమ్మిదవ రాజ్య సంవత్సరము మాఘశుద్ధ సప్తమీ తిథినాడీ దానము గావింపబడినది. పిష్ఠపుర వాసియగు కేశవ దేవుడీ శాసన లేఖకుడు. వర్ధమానపురము నేటి పాలకొండ తాలూకాలోని 'వడమ' గ్రామము కావచ్చును. హస్తిహవేరా నేటి శృంగవరపు కోట తాలూకాలోని "అతవ" కావచ్చునని చారిత్రికుల యభిప్రాయము. ఈ గ్రామములు నేటి విశాఖపట్టణము జిల్లాలోనివి.

ఉమావర్మ బృహత్ప్రోష్ఠ శాసనము బ్రాహ్మణ హారిదత్తుని కివ్వబడి కళింగములోని 36 అగ్రహారములకు జేర్చబడినది. ఈ శాసనరచయిత వాసుదేవుడు, లేఖకుడు మాతృవరుడు. శాసనప్రతిగ్రహీతయు, దేశాక్షపటలాధికృతుడును నగు హారిదత్తుని కుమారుడు. ఈ శాసనము ఉమావర్మ 30 వ రాజ్య సంవత్సరము మార్గశిర మాస మందలి 20వ దివసమున అనగా మార్గశిర బహుళ పంచమీ తిథినా డీయబడినది.

ఉమావర్మ బృహత్ప్రోష్ఠ శాసనమున బేర్కొనబడిన హారిదత్త సూనుడగు మాతృవరుడును, హోణరేజ్ఞ గ్రామ తామ్రశాసనమున బేర్కొనబడిన మాతృవరుడును ఒక్కరే.

| చండవర్మ తిరిథాణ శాసనము | ఉమావర్మ బ్రహత్ప్రోష్ట శాసనము |
|---|---|
| \| | \| |
| మాతృ వర | హారిదత్త |
| \| | \| |
| రుద్రదత్త | మాతృ వర-II |

1. A, R. S. I. E. 1935 Part II Page. 51




ఉమావర్మ ధవళపేట శాసనమాతని 30 వ రాజ్య సంవత్సరమున వేయింపబడినది

ఉమావర్మ కాలమునాటికి, మాసములో ముప్పదిరోజులు గణించునపుడు తిథులవరుసలో శుద్ధ పౌర్ణిమ, బహుళ అమావాస్యలను గణింపక మాసములో బహుళపంచమిని ఇరువదియవ దినముగాను, బహుళదశమిని ఇరువదియైదవ దినముగాను, అట్లే ఇతర దినములను లెక్కించుచుండిరని భావింపవచ్చును.

ఉమావర్మ యనంతర మాతని తనయుడు రాజయ్యెను. హోణరేజ్ఞగ్రామ తామ్ర శాసనమున పేర్కొనబడిన 'వసుషేణరాజు' ఉమావర్మ జ్యేష్ఠపుత్రుడై యుండవచ్చును. వసుషేణుని అకాలమరణము వలననో, లేక మరే కారణమువలననో ఉమావర్మ యనంతర మాతని ద్వితీయపుత్రుడు విశాఖవర్మ సింహాసనాసీనుడై, కొలది కాలము మాత్రమే రాజ్యము చేసెను. ఇతడు తన ఏడవ రాజ్యసంవత్సరమున కోరోషండ శాసనము వేయించెను. విశాఖవర్మతో మాఠరవంశీయుల పరిపాలన మంతరించినది. కళింగ దేశమును, కళింగ గాంగరాజులు స్వాధీనపఱచుకొని పాలించినారు.

# ఉమావర్మ హొణరేజ్ఞ తామ్ర శాసనము

**శాసనము**

మూడు రేకులు గల ఈ తామ్రశాసనమును డా॥ గిడుగు వేంకటసీతాపతిగారు నాకు దయతో నొసంగినారు. ఈ శాసనము శ్రీకాకుళము జిల్లా పాతపట్టణము తాలూకాలోని తెంబూరు గ్రామమున లభించినది. శాసనము చిన్నదేయైనను శాసనమున కమర్చబడిన కడియము, రాజముద్రిక పెద్దవిగా నున్నవి. శాసన రేకులు పలుచగా నున్నవి. ఇది కళింగశాసనము. ఉమావర్మ వేయించినది. ఉమావర్మ వేయించిన మూడు శాసనములింత వఱకు బ్రకటింప బడినవి. అవి తెక్కలిశాసనము[1] బృహత్ప్రోష్ఠశాసనము[2] ధవళపేటశాసనము.[3] తెక్కలిశాసన ముమావర్మ తొమ్మిదవ రాజ్యసంవత్సరములోను, బృహత్ప్రోష్ఠ, ధవళపేటశాసనము లాతని ముప్పదియవ రాజ్యసంవత్సరములోను వేయింపబడినవి.

**ఆకారాదికములు**

మూడు రేకులుగల ఈ శాసన మాకారమున చిన్నదిగనున్నది. శాసన రేకుల అంచులు అక్షరములు చెదరిపోకుండ తీర్చబడి యుండలేదు. రేకులు పలుచగానుండుట వలనను, చిలుము పట్టుటవలనను శాసనాక్షరములు చాలవరకు చెదరిపోయినవి. మొదటి రేకు రెండవప్రక్క ఎడమ వైపు అక్షరములును, రెండవ రేకు రెండువైపులును, మూడవరేకు మొదటిప్రక్క వైభాగమును చిలుముపట్టి రేకులఱిగి పోవుటవలన అక్షరములను చదువుటకు వీలులేదు.

ఈ శాసనపు రేకులు నాలుగుమూలలు సమానముగ నుండి రేకులకు రెండువైపుల అంచులు వంపు తీర్చబడినవి. శాసనపు ఒక్కొక్క రేకు పొడవు 15.1 సెం.మీ. వెడల్పు 7 సెం.మీ. శాసనపు రేకుల మందము 0 .2 సెం.మీ. ఈ రేకులకు ఎడమవైపున 1 . 2 సెం.మీ. వ్యాసముకల రంధ్రము లున్నవి శాసనపు రేకులకమర్చబడిన కడియముయొక్క వ్యాసము 11 సెం.మీ. కడియము చుట్టుకొలత 39.1 సెం. మీ. రాజముద్రికపొడవు 9.5 సెం. మీ. శాసనము తూకమీక్రింది విధముగ నున్నది.

| | | |
|---|---|---|
| మొదటి రేకు తూకము | 125 | గ్రాములు. |
| రెండవ రేకు తూకము | 125 | గ్రాములు. |
| మూడవ రేకు తూకము | 150 | గ్రాములు. |
| కడియము సీలుతో | 850 | గ్రాములు. |
| మొత్తము శాసనము తూకము | 1250 | గ్రాములు. అనగా ఒకకిలో 250 గ్రాములు. |

1, J. A. H. R. S. Vol VB P. 53–54
2. Epigraphia Indica Vol XII P. 4–6
3. J. A. H. R. S. Vol X P. 143–144

శాసనము మొదటిరేకు రెండవప్రక్క నుండి ప్రారంభమగు చున్నది. మూడవరేకు మొదటి ప్రక్కతో శాసనము ముగిసినది. మొదటిరేకు రెండవప్రక్క ఐదుపంక్తులు, రెండవ రేకు రెండువైపుల ఐదేసి పంక్తులు, మూడవరేకు మొదటి ప్రక్క ఐదువంక్తులును చెక్కబడినవి. శాసనమంతయు 20 పంక్తులలో ముగిసినది.

ఈ శాసనపురేకులకు అంచులు తీర్చబడి యుండలేదు. శాసనపురేకుల ఆకారము మూడవ వజ్రహస్తుని చిక్కుళ్ళవలస (చికాకులవలస) శాసనపురేకుల ఆకారము వలె నున్నది. మొదటి పల్లవ, శాలంకాయన, విష్ణుకుండినాది వంశీయుల శాసనముల రేకుల కంచులు తీర్చబడియుండలేదు. ఈ శాసనపురేకులును అల్లేయున్నవి. శాసనపు కడియమునకు రాజముద్రికపై చెక్కబడిన అక్షరములు చిలుముపట్టి చెదిరిపోయి చదువుటకు వీలుకాకుండ నున్నవి.

**భాష :**

ఉమావర్మ వేయించిన ఈ శాసన భాష సంస్కృతము. రెండవ రేకు రెండవప్రక్క మూడువ పంక్తి నుండి వ్యాసగీతా శ్లోకములు ప్రారంభ మగుచున్నవి. మూడవరేకు మొదటి ప్రక్క మూడవపంక్తి తరువాత శాసనము వేయించిన రాజ్యసంవత్సరము పేర్కొన బడినది.

శాసనమున వ్యాసగీతా శ్లోకముల తరువాత నున్నభాగము వచనములోనున్నది. శాసనారంభము నందొక శ్లోకముగాని, రెండు శ్లోకములుగాని యుండుట ఆచారము. కాని ఈ శాసనారంభమున వచనమే యున్నది. కళింగరాజుల ఇతర శాసనములందలి భాషవలె ఈ శాసన భాష యున్నది శాసనాక్షరములు విడివిడిగా నుండి, పెద్దవిగా నున్నవి. ఇంద్రవర్మ జిర్జింగి తామ్రశాసనము, దేవేంద్రవర్మ చీడివలసశాసనములలోని సంస్కృత వచనమువలె ఉమావర్మ వేయించిన బృహత్ప్రోష్ఠ, దవళపేట శాసనములలోని భాషవలె, ఈ శాసన భాష యున్నది. శాసనమున "వాసిష్ఠగోత్రాయ తైత్తిరీయసబ్రహ్మచారిణే బ్రాహ్మణ భర్తృణశర్మ్మణః" అను నతనికి దానమిచ్చి నట్లున్నది. భర్తృణశర్మ్మ అనుపేరు వింతగా నున్నది. కాని ఇట్టి పేళ్ళు కళింగ రాజుల శాసనములందు కనిపించు చున్నవి. ఉమావర్మ పితామహుడు అనంతశక్తివర్మ వేయించిన సకునక శాసనము నాగశర్మ, దుగ్గిశర్మల పేళ్ళును, చండవర్మ శాసనమున దేవశర్మ పేరును, ఉమావర్మ టెక్కలి శాసనమున యాళశర్మ పేరును తెలుపబడినవి. గోలశర్మ, కొట్టశర్మ, అగ్గిజ్జ, భావజ్జ నందజ్జ, మాతృవర వంటి పేళ్ళు శాసనములందు కనిపించు చున్నవి.

**లిపి**

ఇంద్రవర్మ జిర్జింగి శాసనపు[1] లిపిని పోలియున్న ఈ శాసనమందలి లిపి ప్రాచీనాంధ్ర లిపి. క్రీస్తుశకము నాలుగైదు శతాబ్దుల కాలపు తెలుగుకన్నడలిపిని పోలి ఈ శాసన లిపి యున్నది. విష్ణుకుండినుల శాసనములలోని లిపికిని ఈ శాసనలిపికిని దగ్గరి సంబంధమున్నది. అక్షరము లొకేవిధముగ నున్నవి. కాని విష్ణుకుండినుల శాసనములలోని అక్షరములకన్న ఈ శాసనాక్ష

1. J. A. H. R. S. Vol. III; Kalinga Samchika, Appendix .37

రములు పెద్దవిగా చెక్కబడినవి. 'త' అక్షరము మాత్రము భేదముగానున్నది. శాసనము చెక్కిన శిల్పి జాగ్రత్త వహించినాడు. శాసనములోని అక్షరములు గుండ్రఖత్తు అక్షరములు. శాసన రేకులపై సంఖ్యా సంకేతములులేవు. శాసనపుకడియమునకు బిగించియున్న రాజముద్రికపై నక్షరములున్నవి. కాని అవి చదువుటకు వీలులేకుండ చెదిరిపోయినవి.

వర్ణక్రమము:-

ఈ శాసనమున వర్ణక్రమమునకు సంబంధించిన విశేషములున్నవి, సంయుక్తాక్షరములతో గూడిన పదములు, ద్విత్వాక్షరయుతపదములు, అనుస్వారమునకుబదులు వర్గపంచ మాక్షరములను వ్రాయుట 'ౙ' వలపలగిలక వాడుట, ప్రాచీన శాసనములందు మనకు గనిపించును. ఇది సంస్కృత భాషా సంప్రదాయము. ప్రాచీన శాసనములన్నింటియందిట్లు వ్రాయబడినది

కళింగాధిపతిః-కలిఙ్గాధిపతిః శ్రీమహారాజోమవర్మా- శ్రీమహారాజోమవర్మ్మౙ, హోణరేంగగ్రామే- హోణరేఙ్గగ్రామే

| | | |
|---|---|---|
| సర్వ | — | సవ్వౙ |
| భర్తృ శర్మ | — | భర్తృౙ శర్మ్మౙ |
| అగ్రహారంకృత్వా | — | అగ్రహారఙ్కృత్వా |
| మహిర్మహిమతాం | — | మహిమ్మౙ హిమతాం |
| స్వర్గే | — | స్వగ్గేౙ |

ఇట్లు కలింగ, వర్మ, రేంగ, సర్వ, ఇత్యాదులందు అనుస్వారమునకు బదులుగా అనునాసికాక్షరములును, 'ౙ' నకు పూర్వాక్షరము ద్విత్వముగను వ్రాయబడినవి.

శాసన విషయము :

దాతయగు ఉమావర్మ సింహపురమందలి బప్పపాదభక్తుడును కళింగాధిపతియునైనవాడు. హోణరేంగ గ్రామమున అందరిని సమావేశపరచి ఆజ్ఞాపించుచు, "ఈ గ్రామము మాచేత మా కుమారుడగు వసుషేణరాజు యొక్క పుణ్యమును, కీర్తిని, విస్తరింపజేయుటకొఱకు, వసిష్ఠస గోత్రికుడును, తైత్తిరీయ శాఖాధ్యాయియును నగు బ్రాహ్మణ భర్తృౙశర్మకు సూర్యునిశశి, తారకలను ప్రతిష్ఠాపించుట ద్వారా అగ్రహారముగాజేసి కళింగ రాజ్యములో నొక సామాన్యమగు అగ్రహారముగాజేసి సమస్త విధములైన సుంకములనుండి తప్పించి దానము చేయబడినదని" శాసనమున వర్ణింపబడినది.

ఈశాసనము చిన్నది. శాసనవిషయముకూడ స్వల్పముగ నున్నది. ఉమావర్మ బప్పపాద భక్తుడు. దాన మాతని కుమారుడు వసుషేణరాజు యొక్క పుణ్యము, యశము విస్తరింపజేయు నిమిత్తమీయబడినది. "అస్మాభిఃపుత్రవసుషేణ రాజస్యపుణ్యాయశోభివృద్ధయే" అని శాసనమున కలదు. ప్రతిగ్రహీత వాసిష్ఠస గోత్రుడు, తైత్తిరీయ సబ్రహ్మచారియగు, బ్రాహ్మణ భర్తృౙశర్మ.

"వాసిష్టగోత్రాయ తైత్తిరీయ సబ్రహ్మచారిణ బ్రాహ్మణ భర్తృశర్మణ"

ఈ హోణరేంగ గ్రామము కళింగరాజ్యములో నొక సామాన్యమగు నగ్రహారముగా జేయబడి సమస్తవిధములైన సుంకములనుండి తప్పింపబడి దానము చేయబడినది. (రెండవ రేకు మొదటి ప్రక్క 2,3, పంక్తులు.)

ఈ శాసనమున కాజ్ఞప్తి వాసుదేవుడు. శాసనము ఉమావర్మ నలుబదియవ రాజ్య సంవత్సరమున వైశాఖమాసములోని ఇరువదియవ దినమున అనగా వైశాఖ బహుళపంచమీతిథి రోజు ఈయబడినది. శాసనము దేశాక్షపటలాధికృతుడగు హారిదత్తసూనుడైన మాతృవరేణ్యునిచే వ్రాయబడినది.

ఈ శాసనము ఐదవ శతాబ్ద పూర్వార్థభాగమున వేయింపబడినది. ఉమావర్మ నలుబదియవ రాజ్య సంవత్సరమున వైశాఖమాసములో కృష్ణపక్షమున పంచమీతిథి నాడు శాసనమొసంగబడినది. మాఠరవంశీయులలో మొదటి రాజగు శక్తివర్మకాలము క్రీ. శ 350-365. శక్తివర్మ యనంతర మనంతవర్మ ఒక్కసంవత్సరము మాత్రమే పాలించెను. అతడు పాలించిన సంవత్సరము క్రీ. శ. 365 అనంతవర్మకుమారుడు రెండవ శక్తివర్మ క్రీ. శ. 365-394 వరకును, చండవర్మ క్రీ. శ. 394-400 వరకును కళింగదేశమును పాలించినారు.

చండవర్మకుమారు డుమావర్మ నలుబది సంవత్సరములు కళింగదేశమును పాలించెను, ఇతడు క్రీ. శ. 400లో రాజై తన 9వ రాజ్యసంవత్సరము కి. శ. 409 లో శెక్కలి శాసనమును వేయించెను. బృహత్ప్రోష్ఠ ధవళపేట శాసనముల నీ మహారాజు తనముప్పదియవ రాజ్యసంవత్సరము క్రీ. శ. 429 లో వేయించెను. హోణరేజ్జశాసనమును తన నలుబదియవ రాజ్యసంవత్సరము క్రి శ. 439 లో వేయించెను. కావున ఈ శాసన కాలము క్రీ. శ. 439 యనవచ్చును. శాసనమున ప్రభవాది సంవత్సరము పేర్కొనబడలేదు. కాని మాసము-మాసమున ఇరువదియవ రోజు తెలుపబడినది. ఉమావర్మ పాలించినకాలము క్రీ. శ. 400-440. యని తెలియుచున్నది.

# ఉమావర్మ్మ హోణరేజ్జ తామ్ర శాసనము

## శాసనము - మూలము

### మొదటి రేకు— రెండవ ప్రక్క

1 స్వస్తి విజయసింహపురాద్పప్ప పాదభక్తమ్కలిఙ్గాధిపతిః

2 శ్రీమహారాజోమవర్మ్మా - హోణరేజ్జగ్రామే సర్వ్వా
సమవేతాన్

3 కుటుమ్బిన స్సమాజ్ఞాపయత్యస్త్యేష గ్రామోస్మాభిఋప్త

4 వసుషేణ రాజస్య పుణ్యయశోభివృద్ధయే వాసిష్ఠసగో

5 త్రాయ తైత్తిరీయ సబ్రహ్మచారిణే బ్రాహ్మణ భర్తృశర్మ్మణే

### రెండవ రేకు - మొదటి ప్రక్క

1 ఆసహస్రాంశు శశితారక ప్రతిష్ఠ మగ్రహారఙ్కృత్వాదత్త

2 య వాగూమదమ్బాద్వినిష్కృష్య కలిఙ్గాగ్రహార సామాన్యం
కృత్వా

3 సర్వ్వకరపరిహారైశ్చ పరిహృత్య ప్రత్తః తదివంవిదిత్వా

4 ఋణ్యాగీతమర్య్యాద యోపస్థానఙ్కర్త్తవ్యం మేయ హిర

5 ణ్య...యమ్పవిష్యతుశ్చ రాజ్ఞో విజ్ఞాపయతి ధర్మ్మ

## రెండవ రేకు - రెండవ ప్రక్క

1 క్రమ విక్రమాణా మన్యతమ యోగాదవాష్యం మహిమను
శాసతాం

2 ప్రవృత్తకమిదన్దానం సద్ధమ్మ్ర మనుపశ్యద్భి రేషోగ్ర
హారాను

3 పాల్యః భవన్తి చాత్ర వ్యాసగీతాః శ్లోకాః ॥బహుభిర్బ్ర

4 హుధాదత్తా వసుధావసుధాధిపైః యస్యయస్యయదా భూమిః

5 తస్యతస్య తదాఫలమ్ - స్వదత్తాం పరదత్తాంవా యత్నా
ద్రక్షయుధి

## మూడవ రేకు - మొదటి ప్రక్క

1 ష్ఠిరా మహిమ్మహిమతాం శ్రేష్ఠ దానచ్ఛ్రేయోను పాలనమ్.

2 షష్టింవర్ష సహస్రాణి స్వర్గే వసతి భూమిదః ఆక్షేప్తాచా

3 నుమన్తాచ తాన్యేవ నరకేవసేత్ - ఆజ్ఞో వాసుదేవః

4 సంవత్ 80 + 10 వైశాఖాది 20 దేశాక్షపటలాధికృత

4 హరిదత్త సూను నా మాతృవరేణ లిఖితమితి ॥౹౹

**అనువాదము :**

స్వస్తి విజయపురమందలి బప్ప పాదభక్తుడును కళింగాధిపతియును మహారాజును అగు ఉమావర్మ హోణరేంగ గ్రామమునందు అందఱిని సమావేశపఱచి ఆజ్ఞాపించుచున్నాడు ఈ గ్రామము మాచేత మా కుమారుడగు వసుషేణరాజు యొక్క పుణ్యాయశోభివృద్ధికి వసిష్ఠ గోత్రికుడును తైత్తిరీయ శాఖాధ్యాయియును అగు బ్రాహ్మణ భర్తృ శర్మకు సూర్యుని శశి తారకలను ప్రతిష్ఠి చేయుట ద్వారా అగ్రహారముగా జేసి వాగూమదంబము నుండి వేరుచేసి కళింగ రాజ్యములో నొక సామాన్యమగు నగ్రహారముగా జేసి సమస్త విధములైన సుంకముల నుండి తప్పించి దానము చేయబడినది. అట్టి దానిని—కర్తవ్యమును—రాజులకు విజ్ఞాపించుచుండగా ధర్మ............ ఈ దానము సద్ధర్మమును పాలించు వారి చేత అగ్రహారము———అగు దురు. ఇందుకు వ్యాసప్రోక్తములగు శ్లోకములు ప్రమాణములు. చాలమంది చేత భూమి దానముచేయబడినది. భూమి భూపాలునికి చెందినది. భూమి ఎప్పుడెవరిదో వారి వారి కప్పుడప్పుడది ఫలమునిచ్చును. స్వదత్తముగాని పరదత్తముగాని ప్రయత్నపూర్వకముగా రక్షింపుము. ఓరాజశ్రేష్ఠుడా! దానము కంటె పరదత్తమగు దానిని సంరక్షించుటే శ్రేయోదాయకమైనది. అరవై వేలసంవత్సరములు భూదానకర్త స్వర్గము నందుండును. దీని నాశేపించువాడును, ఆ శేపము ననుమతించువాడును, ఇతరులును నరకమందు వసింతురు. శాసనమున కాజ్ఞప్తి వాసు దేవుడు. సంవత్సరము30 + 10 వైశాఖమాసములోని 20వ దివసమున అనగా వైశాఖ బహుళ పంచమినాడు శాసన మొసంగబడినది. దేశములోని అక్షపటలికులలో శ్రేష్ఠుడైన హారిదత్తుని యొక్క కుమారుడు మాతృవరేణ్యునిచే ఈ శాసనము వ్రాయబడినది.



# కళింగము - గాంగ వంశీయులు

ఇప్పటి ఆంధ్ర ప్రదేశ్‌లోని శ్రీకాకుళము, విశాఖపట్టణము, ఒరిస్సా, రాష్ట్రములోని బరంపురం ప్రాంతములు పూర్వము కళింగదేశముగా వ్యవహారిం పబడినవి. అతి ప్రాచీన కాలము నుండియు, కళింగదేశము ప్రసిద్ధిజెందినది, పురాణములం దీదేశ ప్రశంస కలదు. రామాయాణ మహాభారత భాగవతాదులందు సందర్భానుసారము కళింగదేశము పేర్కొనబడినది, మౌర్య చక్ర వర్తియగు అశోకుడు కళింగదేశముపై దండెత్తి జయించెను ఆ యుద్ధమున కలిగిన రక్తపాతమును చూచి, .మరణించిన వారి బంధువుల రోదనము విని, వికలాంగులైన సైనికుల గాంచి, మనో వేదనము ననుభవించి, యుద్ధము చేయనని ప్రతిజ్ఞబూని "అహింసా పరమోధర్మ" యని బోధించు బౌద్ధమత మవలంబించి, బౌద్ధమత ప్రచారమునకు అశోకచక్రవర్తి తన శేష జీవితమును, ధారపోసినాడు. అప్పటినుండి కళింగదేశము వాసికెక్కినది. భారతదేశ చరిత్రలో కళింగ దేశమున కొక సాన మేర్పడినది

కళింగదేశము చాల కాలము వరకు, గంగ లేక గాంగ వంశీయులచే పాలింప బడినది. వీరిని తూర్పు గాంగ వంశీయులందురు. ఈ వంశీయులను ప్రాచీన తూర్పుగాంగులనియు, మధ్య యుగపు గాంగునిలయు, తరువాతి గాంగులనియు చారిత్రకులు విభజించినారు. ఈ వంశీయులు ఐదవ శతాబ్దినుండి ఎడతెగకుండ 15వ శతాబ్దివరకు, కళింగమును పాలించినారని చారిత్రుకుల యభిప్రాయము. ప్రాచీన తూర్పు గాంగులు తమ శాసనములందు గాంగశకమును పేర్కొనినారు. మధ్యయుగపు గాంగులు తరువాతి గాంగులు, సుప్రసిద్ధమైన శకసంవత్సరమును తాము వేయించిన శాసనములందు పేర్కొనినారు.

భారతావనిలో కళింగమతి ప్రాచీనమైన దేశము. ఇయ్యది పురాణములందు, సూత్ర ములందు పేర్కొనబడినది. టాలెమీ, ప్లినీ, మున్నగు విదేశీయుల వ్రాతలందును, కళింగదేశము పేర్కొనబడినది. కురుక్షేత్రమున జరిగిన కౌరవ పాండవ యుదమున పాండవులకు వ్యతిరేకముగా కౌరవుల పక్షమున జేరి కళింగులు పోరాడినారు. తూర్పు సముద్ర తీరమున కంళిగు లనువారు న్నట్లు 'న్యాచురల్ హిస్టరి' అను గ్రంథము వలన తెలియుచున్నది. ఈ గ్రంథమును ప్లినీ అను చరిత్రకారుడు రచించినాడు. ఈ గ్రంథమున భారతదేశమున నున్న జాతుల చరిత్ర కలదు.

గంగానదీ తీరస్థ ప్రాంతములందు తూర్పుమాగధులు, లేక ప్రాచ్యమాగధులు, కళింగ గాంగులు అలెగ్జాండరు కాలమున నున్నట్లు Meerindle and Plutrach ల వ్రాతల వలన తెలియుచున్నది. జైన గ్రంథములగు పరిశిష్ట పర్వము, మహాబోధివంశమను గ్రంథముల వలన కూడ ఈ విషయము తెలియుచున్నది."

గంగ వంశాను చరితమను సంస్కృత కావ్యము వలన గాంగవంశజుల వంశక్రమము, రాజ్యపాలనా కాలము తెలియుచున్నధి. జగన్నాథాలయమున భద్రపరుపబడిన 'మండలపాంజి' వలన గాంగ వంశీయుల చరిత్ర తెలియుచున్నది, ఇది ఒరియా భాషలో పదునారవ శతాబ్ద్యంతమున వ్రాయబడిన గ్రంథము.

కుళోత్తుంగచోళుని దండనాయకుడగు కరుణాకరుని ఉత్తరకళింగ లేక సప్త కళింగ విజయము పంద్రెండవ శతాబ్దిలో నున్న 'జయన్గొండార్' రచించిన 'కళింగట్టుప్పరణి' గ్రంథము వలన తెలియుచున్నది. ఈ గ్రంథము కరుణాకరుని సమగ్ర దండయాత్ర విజయములను తెలుపుటయేగాక కళింగ దేశప్రజల ఆచారవ్యవహారములను, సంస్కృతిసభ్యతలను, తెలిసికొనుటలో తోడ్పడుచున్నది. పదమూడవ శతాబ్దిలోని గాంగరాజుల కాలపు సాంస్కృతిక మత రాజకీయ స్థితులను సంస్కృత గ్రంథములగు విద్యాధర ఏకావళి, నరహరియతి స్తోత్రముల వలన తెలిసికొనుటకు వీలగు చున్నది.

భారతావనిలోగల కళింగదేశమున తూర్పు గాంగరాజుల పరిపాలనము సుమారు వేయి సంవత్సరములు సాగినది. గాంగ శకారంభమునుండి, సుమారు క్రీ శ. 1450 వరకీ వంశీయులవిచ్ఛిన్నముగా కళింగదేశమును పాలించినారు. వీరి పరిపాలనా కాలమున ఒక్కొక్కమారు కళింగ రాజ్యము వృద్ధియైనది. మరియొకమారు క్షీణించినది. మొత్తముపై ఈ వంశీయుల పాలనము మాత్రము సుమారు వేయి సంవత్సరములు సాగినది.

గాంగరాజుల రాజధాని కళింగ నగరము. కళింగరాజులీ నగరమునుండి ఎన్నియో శాసనముల నిచ్చినారు. రాజులు తాము వేయించిన శాసనములందు త్రికళింగాధిపతుల మని చెప్పుకొనినారు. కళింగనగరస్థల నిర్దేశము గురించి, పండితులలో నేకాభిప్రాయము లేదు. మహాభారతమున భీష్మపర్వము, ఉద్యోగ పర్వములందు రెండు కళింగములు పేర్కొన బడినవి వీటిలో నొకదానికి రాజపురము, రెండవ దానికి దంతపురము, రాజధానులుగా నుండెడివి. రాజపురము నేటి ఒరిస్సారాష్ట్రములో నున్న జయపురము. దంతపురము నేటి శ్రీకాకుళము జిల్లాలోనున్న దంతపురము,

వాల్మీకిరామాయణమున అయోధ్యాకాండలో దశరథ మహారాజు అయోధ్యను పాలించుచుండగా, కళింగ నగరమున్నట్లును, అదికోసలదేశమునకు పడమర సోనానది (శోణనది) యొడ్డున నున్నట్లును, పేర్కొనబడినది. దంతపురమున బుద్ధుని దంతము ప్రతిష్ఠింపబడినది. దంతముపై మహాచైత్యము నిర్మింపబడి పూజింప బడుచుండెనని తెలియుచున్నది.

డా॥ ఫ్లీటు కళింగ నగరమును నేటి కళింగపట్టణము గుర్తించినారు ఇది వంశధారా నదీముఖ ద్వారమున నున్న రేవు పట్టణము. Alexander Cunningham గోదావరి ముఖద్వారముననున్న రాజమహేంద్రవరమును కళింగ నగరముగా గుర్తించినారు. పుణ్యక్షేత్రమగు ముఖలింగమును మొదట కళింగ నగరముగా గుర్తించినవారు రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారు[1]. కళింగపట్టణమున ప్రాచీన శిథిలముల జాడలు, లేవనియు, ముఖలింగమున కలవనియు, ముఖలింగమునకు రెండుమైళ్ళ దూరమున గల నగరికటకములో ప్రాచీన చారిత్ర కావవశేషములు, శిథిలములు కలవనియు, రామమూర్తి పంతులుగారు వెల్లడించినారు.

ముఖలింగమున పెక్కు శివలింగములు దేవాలయములు ఉన్నవి. వందలకొలది శాసనములున్నవి. శాసనములందు శివుడు మధుకేశ్వరుడుగా, సోమేశ్వరుడుగా వర్ణింపబడినాడు. శాసన

---

I. Madras Jouanal of tit. Society 1889-1894. P. 68

ములందు కళింగావని నగరే '(శ్రీమన్మధుకేశ్వరాయ' అనివర్ణింపబడినది. ఇందువలన ముఖలింగమే కళింగ నగరమని యూహించుట కవకాశమున్నది. కామార్ణవుడను తూర్పుగాంగరాజు, నగరమను పట్టణమును నిర్మించి శివునికి దేవాలయము నిర్మించి మధుకేశ్వరుడను పేరిడినాడు. మధూకలింగము, మోహాలింగముగా, ముఖలింగముగా మారి, ఆ ప్రాంతము ముఖలింగ క్షేత్ర మనబడినది మధూకలింగమును, ఒరియా భాషలో మోహాలింగమని వ్యవహారింతురు. మోహాలింగము ముఖలింగమైనది ముఖలింగ క్షేత్ర ప్రాంతము పూర్వము కళింగ నగరముగా ప్రసిద్ధి జెందియుండెనని డా॥ హుల్ష్[1] ఆర్. డి బెనర్జి[2] వి. ఎ. స్మిత్తు[3] వంటి చారిత్రకు లంగీకరించినారు.

## కళింగ గాంగశకము .

తూర్పు గాంగరాజులలో మొదటి వారు తమ శాసనములందు గాంగేయ ప్రవర్ధమాన రాజ్యసంవ్సతరములను వాడినారు ఈ శకము గాంగశక మనబడుచున్నది. శాసనములందు గాంగేయ వంశ సంవత్సరము, ప్రవర్ధమాన రాజ్యసంవత్సరము, విజయరాజ్య సంవత్సరము, రాజ్య సంవత్సరములుగా, సంవత్సరములు పేర్కొనబడినవి ఈ వంశీయులకు సంబంధించిన, తామ్రశాసనము లెన్నియో ప్రకటింపబడినవి. వందలకొలది శిలా శాసనములు కనిపించుచున్నవి. శిలా శాసనములలోగొన్ని ప్రకటింపబడినవి. ఐనను గాంగశకారంభ సంవత్సర విషయమున చారిత్రకులలో నభిప్రాయభేదము లున్నవి పలువురు పండితులు, చారిత్రకులు, విమర్శకులు, తమ తమ అభిప్రాయములను ప్రకటించినారు. గాంగ శకారంభ సంవత్సరమును చారిత్రకు లీ క్రింది విధముగా నంగీకరించినారు.

| | | |
|---|---|---|
| 1 | గొడవర్తి రామదాసు పంతులుగారు[4] | క్రీ, శ. 294. |
| 2. | డా. డి. సి. సర్కారుగారు[5] | క్రీ. శ. 496-497. |
| 3. | భావరాజు వేంకటకృష్ణారావుగారు[6] | క్రీ. శ. 498 |
| 4 | ప్రొపెసర్ వి. వి. మిరాశిగారు[7] | క్రీ. శ. 198 |
| 5 | జె. సి. ఘెష్‌గారు[8] | క్రీ. శ. 496 |

---

1. Epigraphia Indica. Vol IX. P. 94.
2. Early history of India P. 498.
3. History of Orissa P. 42.
4. I. A. Vol. XIII. P. 128.
5. Select Inscriptions.
6. Early Dynasties of Andhra Desa. P. 578-592.
7. E. I. Vol. XXVI P. 333.
8. I. A. Vol. LXI P. 237.

| | | |
|---|---|---|
| 6 | మల్లంపల్లి సోమశేఖరశర్మగారు[1] | క్రీ. శ. 504-505. |
| 7. | ఆర్. సి. మజుందార్‌గారు[2] | క్రీ. శ. 550-557. |
| 8. | జి ఎన్. ఓఝుగారు | క్రీ శ. 570. |
| 8. | డా॥ ప్లీటుగారు[3] | క్రీ శ. 590. |
| 10, | ఎన్. ఎన్. రాజగురు[4] | క్రీ శ. 627-627 |
| 11. | ఎన్. రమేశన్‌గారు[5] | క్రీ. శ 434. |

కాని సర్వసాధారణముగా నందరిచే క్రీ. శ. 436-497, 497-498. అంగీకరింపబడినది.

గాంగశకారంభ సంవత్సరము కనుగొనుటకు, కళింగరాజులు వేయించిన శాసనములందు పేర్కొనబడిన చంద్ర సూర్య గ్రహణములే యాధారము. కాని యవి అంతగా నుపయోగ పడుట లేదు.

కళింగ గాంగరాజుల శాసనములలో పేర్కొనబడిన దానములు సూర్యగ్రహణ నిమిత్తముననో, చంద్రగ్రహణ నిమిత్తముననో వేయబడినవి. ఈ సూర్యచంద్రగ్రహణములు వచ్చిన నక్షత్ర, తిథి, వార, మాస, సంవత్సరములు ఒకదానితో నొకటి సరిపడుటలేదు. సంవత్సరములు కలిసిన మాసము, వారము కలిసిన తిథి కలియుటలేదు. తూర్పు గాంగ వంశీయులకు సమకాలికులైన పశ్చిమ గాంగులు, కదంబులు, విష్ణుకుండినులు, చాళుక్యులు, తమ తమ శాసనములందు శక సంవత్సరములు పేర్కొనినారు. ప్రాచీన తూర్పుగాంగరాజులు, గాంగేయ సంవత్సరమును, లేక ప్రవర్థమాన గాంగ సంవత్సరమును పేర్కొనినారు. మధ్యయుగపు గాంగరాజుల శాసనములందు శక సంవత్సరము పేర్కొనబడినది.

గుప్తసామ్రాజ్య పతనాంతరము కళింగమును తూర్పు గాంగ వంశీయులు, మాళవ దేశమున వల్లభులు, బీహారు రాష్ట్రములో మౌఖరులు, దక్షిణాపథమున చాళుక్యులు. స్వాతంత్ర్యము ప్రకటించి రాజ్యములను స్థాపించిరి. గుప్తరాజులవలె తూర్పు గాంగ వంశీయులు, గాంగేయశకమును స్థాపించిరి. ఐనను ప్రాచీన గాంగ రాజులు తాము వేయించిన శాసనములందు గాంగ శకమును పేర్కొనలేదు. కాని ప్రవర్థమాన రాజ్య సంవత్సరమును తెలిపినారు. వీరి శాసనములలో తిథి, వార, నక్షత్ర, చంద్ర, సూర్యగ్రహణములు, సంక్రాంతి, ఉత్తరాయణ పుణ్యకాలము మున్నగునవి పేర్కొనబడినవే కాని శక సంవత్సరముతో పోల్చుకొనుటకు వీలైన సంవత్సరముల వైశ్యైనను తెలుపబడలేదు.

---

1. I. C. Vol. IX P. 148.
2. I. C. Vol. 1V P. 179.
3. I. A. Vol. XVI P. 1 31.
4. J. A. H. R. S. Vol. I. P. 29-50.
5. C. P. Inscriptions of A. P. Govt. Museum P. 129.

## గాంగ వంశీయులు :

కళింగదేశమును పాలించిన రాజవంశీయులలో గాంగవంశీయులు కడు ప్రసిద్ధులు. ఈ వంశీయులకు సంబంధించిన మొదటి శాసనములన్నియు, తామ్రశాసనములు. శాసనములలోని రాజులందరును, గాంగేయవంశ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములను, ప్రవర్ధమాన విజయ రాజ్య సంవత్సరములను, గాంగేయవంశ సంవత్సరములను పేర్కొనినారు. గాంగశకము గంగ వంశ రాజ్య ప్రారంభకాలమును తెలుపును. గాంగ శకమును పేర్కొనిన రాజులలో దేవేంద్రవర్మ సత్యవర్మ, హస్తివర్మ, ఇంద్రవర్మ, మొదలగు రాజులు ముఖ్యులు. పూర్వగాంగులు, తరువాతి గాంగులు, ఒక్క వంశీయులే. గాంగశకము పూర్వగాంగుల శాసనము అందు పేర్కొనబడినది. తూర్పుగాంగ వంశమునకు, చెందినవాడని చెప్పబడుచున్న మధుకామార్ణవుని శాసనమున[1] 526 గాంగేయశకసంవత్సరము పేర్కొనబడినది. కావున గాంగులు వేర్వేరు వంశములకు చెందిన వారు కారనియు, ఒకేవంశమునకు చెందిన వారనియు, తెలియుచున్నది. మొట్ట మొదటి గాంగ రాజుల చరిత్ర నిర్మాణమునకు, కాలనిర్ణయమునకు దగిన సాధనసామగ్రి సమకూరలేదు. అనంత వర్మ చోడగంగు కొర్ని శాసనము[2] అందు గాంగవంశక్రమము వర్ణింపబడినది. ఈ సంపుటిలో ప్రక టింపబడుచున్న అనంతవర్మ చోడగంగుని తెంబూరు శాసనమున గాంగరాజుల వంశక్రమమున్నది. మొదటి గాంగరాజుల శాసనములందు శక సంవత్సరములు పేర్కొనబడలేదు. తరువాతి గాంగ రాజుల శాసనములందు శక సంవత్సరములు పేర్కొనబడుటయేగాక, ఏయేరాజు ఎన్ని సంవత్స రములు రాజ్యభారము వహించెనో తెలుపబడినది.

గాంగవంశపు రాజులలో కొందరు కళింగనగరము నుండియు, మరికొందరు సింహ పురము నుండియు. దంతపురము నుండియు, శాసనములు వేయించినారు.

శాతవాహన సామ్రాజ్యభానుడస్తమించిన పిదప కళింగదేశమున చిన్న చిన్న రాజ్య ములు స్థాపింప బడినవి. అందు గాంగవంశీయులు సుస్థిరమైన రాజ్యమును స్థాపించినారు మొదటి గాంగరాజుల చరిత్ర నిర్మాణమునకు, ఆయారాజుల కాలమున వెలసిన శాసనములే ఆధా రము. ఈరాజుల శాసనములన్నియు, గాంగేయ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములలో వేయించిన శాసనములందు సంవత్సరములు మాత్రమే పేర్కొనబడినవి గంగ వంశీయుల రాజ్యము వృద్ధి చెందుచున్న రోజులవి కళింగ గాంగరాజులు సుమారు వేయి సంవత్సరములు పాలించినారు. ఈ వంశీయులకు సంబంధించిన విషయమిచ్చటసంక్షిప్తముగా నీయబడుచున్నది.

## 1. మితవర్మ .

ఇతడు పృధ్వీమూలుని గోదావరి తామ్రశాసనమున, పేర్కొనబడిన మితవర్మ, ఇంద్ర వర్మ తండ్రి, గంగవంశమునకు మూలపురుషుడు. తిర్లింగ శాసనము నిచ్చినవాడు. మితవర్మ తిర్లింగ శాసనమునకు[3] "ప్రవర్ధమాన రాజ్యసంవత్సరస్య అష్టావింశతిం" అని వ్రాయించుట వలన 28వ గాంగశక సంవత్సరమున ఫాల్గుణ బహుళ అష్టమినాడు శాసనము వేయింపబడినదని తెలియు చున్నది.

---

1. E. R. For 1918-1919. C. P. No, 5.
2. కళింగదేశ చరిత్ర Appindix P. 59-78.
3. J. A. H. R. S Vol. III. part I. P 55.

## 2. ఇంద్రవర్మ I :

ఇతడు మిత్రవర్మ కుమారుడు. తండ్రి యనంతరము రాజై ప్రవర్ధమాన 39వ సంవత్సరమున జిర్జింగి శాసనము[1]ను వేయించెను ఈ శాసనము నితడు దంతపురమునుండి వేయించెను. శాసనమునందితడు, "పరమేశ్వర పాదభక్తుడును, గంగామలకుల గగన తలమునకు సూర్యుడును అనేక చతుర్దంత యుద్ధములందు విజయముగాంచుటచేత పాదాక్రాంతులగు, సామంత రాజులుగల వాడును, సాదుబాంధవార్థిజనులను పోషించు వాడును మాతాపితృ పాదానుధ్యాతయు త్రికళింగాయధిపతియగు శ్రీమహారాజేంద్రవర్మ[2]" యని కీర్తింపబడినాడు ఓంకార భోగములోని జిజ్జిక గ్రామము నగ్రహారముగాజేసి అన్నివిధములైన పన్నులనుండి తప్పించి రుద్రస్వామి కుమారుడగు, అగ్నిస్వామికిని, మనుమడు రుద్రస్వామికిని రెండు సమ భాగములుగా విభజించి ఇంద్రవర్మ దానమిచ్చెను.

## 3. అనంతవర్మ I :

ఇతడు ఇంద్రవర్మ కుమారుడు ఈ సంపుటిలో ప్రకటింపబడుచున్న 'సేవిది' గ్రామ దానశాసనమును వేయించిన వాడు శాసనమున ఈ రాజు "సర్వర్తువులందు సుఖకరమైనదై యాహ్లాదదాయకమును దుర్జేయమునగు కళింగనగరమున నివసించువాడును, సకల భువనములకు నిర్మలమైన యాధిపత్యమును, భగవంతుడగు మహేశ్వరునికి భక్తుడగుటచేత కలికలంక్కములనుండి వెలువడిన వాడును, నయవినయసంపద కలవాడును, శత్రువులను కలిచి వేయుటవలన కళింగ రాజ్యాధిపత్యమునుపొంది చతురుదధి తురంగములను మేఖల కలిగిన భూమియందు స్వచ్ఛమగు విస్తారమైన కీర్తిచేత సమర సంక్షోభములందు జయశబ్దములబొంది మహేంద్రునికి విషాదమును కలిగించునట్లు వైతరణీనదిని యజ్ఞములందు వదలబడిన నీటితో సృష్టించిన వాడును, గజ్గమలకుల మందు ప్రతిష్ఠగాంచిన వాడును, ప్రతాపాతిశయమువలన లోబఱచు కొనిన సమస్త సామంతుల యొక్క చూడామణుల కాంతిపుంజముచే ప్రకాశమానములగు చరణములు గలిగినవాడును, మాతాపితృ పాదసేవ చేయువాడును, మహేశ్వరుడును, పరమ శివభక్తుడును, అగు మహారాజశ్రీ అనంతవర్మ.."అని వర్ణింపబడినాడు. అనంతవర్మ గొప్ప విజేత. యజ్ఞయాగాదు లాచరించినవాడు.

## 4. దేవేంద్రవర్మ I :

అనంతవర్మ కుమారుడు, తండ్రి యనంతరము రాజై కళింగనగరమును రాజధానిగా కళింగావనిని పాలించెను. ఇతని శ్రీకాకుళశాసనము[3] గాంగేయ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము 51లో వేయింపబడినది. శాసనమునందీ రాజు "నయవినయ దయదాన దాక్షిణ్య శౌర్యౌదార్యాదిగుణ సంపన్నుడుగను, పరమ మహేశ్వరుడుగను, మాతాపితృ పాదాను ధ్యాతుండును, గంగామలకుల తిలకుండును, మహారాజ శ్రీమదనంతవర్మదేవ సుతుండునగు శ్రీ దేవేంద్రవర్మ

---

1. J. A. H. R. S. Vol. III part I P. 49–53.
2. కళింగదేశచరిత్ర—page. 498.
3. Indian Antiquary Vol. XIII. P. 273.

యని వర్ణింపబడినాడు. మూడు వందలమంది బ్రాహ్మణులకు, గోకర్ణేశ్వరునికి తామరచెఱువు గ్రామము నగ్రహారముగా సూర్యగ్రహణ నిమిత్తమొసంగెను. తామర చెఱువు గ్రామము వరాహావర్తని విషయములోనిది.

## 5 సత్యవర్మ :

సత్యవర్మ దేవేంద్రవర్మ కుమారుడు. ఇతడు గొప్ప విజేత. దెవేంద్రవర్మ గాంగళకము. 51లో మరణింప సత్యవర్మ పట్టాభిషిక్తుడై శ్రీకాకుళము శాసనమును వేయించెను శాసనమున "నిజనిస్త్రింశధారో పార్జిత సకల కళింగాధి రాజ్య" అనియుండుటవలన నీతనికి సకల కళింగాధిరాజను బిరుదమున్నట్లు తెలియుచున్నది. ఈ శాసనము 'సూర్యగ్రహణ సమయమున తారు గ్రామమును దేవాగ్రహారముగా నొనర్చి ఖండ్యమ గురువు కుమారుడగు కమలాసనుని కొసంగబడినది. ఇతనికి హస్తివర్మ ఇంద్రవర్మలను కుమారు లుండిరి

## 6. హస్తివర్మ :

సత్యవర్మ జ్యేష్ఠపుత్రుడు హస్తివర్మ. శాసనమందితడు "గంగామలకుల ప్రతిష్ఠః" అని చెప్పబడినాడు. ఇతనికి 'రాజసింహ' 'రణభీత' యను బిరుదము లున్నవి. హస్తివర్మ ఉర్లాం శాసనమును[1] ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము 80లో వేయించుచు ఊరుమల్ల గ్రామవాసియగు జయశర్మకు క్రోష్టుకవర్తని విషయములోని హొండెవక గ్రామమున కొంత భూమిని విలిచి అగ్రహారముగ నొనర్చి అన్ని విధములైన పన్నుల నుండి తప్పించి తన తల్లిదండ్రుల పుణ్యాభివృద్ధి కొఱకు దానము చేసెను

## 7 ఇంద్రవర్మ II :

ఇతడు సత్యవర్మ మహారాజు రెండవ కుమారుడు. హస్తివర్మ అనుజుడు. ఇతడు గా. శ. 87లో అచ్యుతాపుర తామ్రశాసనమును[2] శాంతబొమ్మాళి శాసనమును[3] గా శ. 87లోను పర్లాకిమిడి శాసనమును[4] గా. శ 91లోను వేయించెను ఈ మూడు శాసనములకు లేఖకుడొక్కడే. శాసనములలో "ఇదం వినయచంద్రేణ భానుచంద్రస్యసూనునా శాసనం రాజసింహ స్వలిఖితంస్వముఖాజ్ఞయా" అనువిషయ మున్నది ఇంద్రవర్మ అచ్యుతాపుర శాసనమును గా. శ. 87లో వరాహావర్తనివిషయ మందలి సిద్ధార్థక గ్రామ కుటుంబములకు తెలియజేయుచు, గ్రామములోని రాజతటాక సమీపమున ఒక నాగలిభూమిని, ఉత్తరాయణ పుణ్యకాలమందు గౌతమస గోత్రుడైన దుగ్గశర్మకు, దానమిచ్చెను. "మాతృభట్టారిక పాదానాన్తటాక ప్రతిష్ఠాపనం" అనుట

---

1. Epigraphia Indica, Vol. XVII P. 330-334.
2. Epigraphia Indica Vol. III P. 127-130
3. J. A. H. R. S. Vol. IV. Parts 1,2
4. Indian Antiqury Vol.XVI* P, 131-134.

వలన ఒక క్రొత్త చెఱువు త్రవ్వించినట్లును దాని నీటిని, వ్యవసాయమున కుపయోగించుట కనుమతించినట్లును, తెలియుచున్నది. సిద్ధార్థకము-నేటి సద్ధాంతము. వంశధారా నదీతీరమున ముఖలింగ నగరికటకములకు సమీపమున నున్నది ఈ గ్రామ ప్రతిగ్రహీత, దుగ్గశర్మపుత్రులు. కుబ్జ విష్ణువర్ధనుని చీపురుపల్లి శాసన[1] ప్రతిగ్రహీతలు.

శాంతబొమ్మాళి శాసనమును ఇంద్రవర్మ గా. శ. 87లో వేయించెను ఇది క్రోష్ఠుక నివర్తనమందలి హారిభట గ్రామ కుటింబినుల నాజ్ఞాపించుచు "గ్రామములోని రెండు నాగళ్ళ భూమిని దత్తయవాయ భగవంతుడగు రామేశ్వరభట్టారకుని పూజాది సంస్కారములకు గాను సర్వవిధములైన పన్నులనుండి తప్పించి దేవాగ్రహారముగాచేసి, తలవర దేవభోగికునకు దానమిచ్చిన సందర్భమున వేయింపబడినది

శ్రీకాకుళం శాసనమును ఇంద్రవర్మ, దేవన్న పాంచాలి యందలి కెత్తట గ్రామకుటుంబినుల కిట్లు ఆజ్ఞాపించుచు "కొండవల్లికునిచే బోధింపబడి నా తల్లిదండ్రుల యొక్క, నా యొక్క పుణ్యాభివృద్ధికి కళింగనగర సామాన్యాయములోనివాడును గార్గేయస గోత్రికుడును, ఛందోగ సబ్రహ్మచారియును అగు ధృవశర్మకు, ఈ కెత్తట గ్రామమును సర్వవిధములైన పన్నుల నుండి తప్పించి అగ్రహారముగా చేసి యిచ్చెను. ఈతని కాలమున వైదికమతము వృద్ధియైనది. సంస్కృతము ఆదరింపబడినది

## 8. దానార్ణవుడు

ఇత డింద్ర వర్మకుమారుడు కావచ్చును. ఇతనికి సంబంధించిన శాసనములు లభింపలేదు. బహుశః ఇతడు కొలది కాలము మాత్రమే పాలించియుండవచ్చును. లేదా ఇంద్రవర్మ యనంతరము మూడవ ఇంద్రవర్మ రాజై కళింగము నేలియుండవచ్చును.

## 9. ఇంద్రవర్మ

ఇతనివి నాలుగు శాసనములు ప్రకటింపబడినవి. గా. శ. 126 నాటి శ్రీకాకుళ శాసనమును[2] ఇంద్రవర్మ వరాహావర్తని విషయములోని తామర చెఱువు గ్రామమును భాడక సహితముగ మార్గశిర పౌర్ణమి చంద్రగ్రహణ నిమిత్తము బ్రాహ్మణులకు దానమిచ్చెను. గా. శ. 138 నాటి శ్రీకాకుళశాసనమును[3] క్రోష్ఠుక పాంచాలి యందలి తాలమూల గ్రామకుటుంబినులకు తెలుపుచు తల్లిదండ్రుల యొక్కయు, తన యొక్కయు పుణ్యవృద్ధికై అవరెగ కళింగ వాసులగు స్కందశర్మ, లలితశర్మల కగ్రహారముగా నీయబడినది. గా. శ. 187 నాటి పుర్లి శాసనము[4] దంతపురమునుండి ఈయబడినది. దానార్ణవుని కుమారుడగు శ్రీ మన్మహారాజేంద్రవర్మ కూరక

1. Indian Antiqury Vol.XX. P.15.
2. I. A. Vol. XIII.
3 I. A. Vol. XIII.
4. Indian Inscriptions Vol. XIV. P. 362. శారద. Vol. 1.Pages 528–532.

రాష్ట్రములోని ఖుక్కుకుర గ్రామపు వ్యవసాయదారుల కిచ్చిన ఆజ్ఞ. "నాతల్లిదండ్రుల యొక్కయు నా యొక్కయు పుణ్యాభివృద్ధికి కార్తిక పున్నమినాడు తిర్లింగి వాస్తవ్యుడు వేదవేదాంగవేత్త భవదత్తశర్మ అను విప్రుని కీ గ్రామమున భూమిదానము చేయబడు సందర్భమున వేయింపబడినది. గా. శ. 154 నాటి టెక్కలి శాసనమును, రూప్యవతీ విషయములోని తుంగన్న గ్రామ వ్యవసాయ దారుల నాజ్ఞాపించుచు, బ్రహ్మదేయపు కొలమానముతో ఒక నాగలి భూమిని ఈ గ్రామమందు మా తల్లియగు అచ్చిపోతి పుణ్యాభివృద్ధికి, సూర్యగ్రహణ కాలమందు వేదవేదాంగ విదుడు, గర భోన్న గ్రామవాసి స్కందవర్మకు ధారపోయనైనది భూమికి తూర్పున, ఉత్తరమున విద్యుద్గంగయు దక్షిణమున పాషాణములును[1] పశ్చిమమున శర్కరవాటకయు కలవు తుంగనగ్రామ తటాకమందలి నీరు కారాఖన్డీ బ్రాహ్మణపాలని యను కాలువల ద్వారా ప్రవహించి భూమిని సాగుబడి చేయునుగాక-అజ్ఞప్తి-మహా మహత్తర హారిశర్మ, రూప్యావతి, రూపవర్తని విషయము. టెక్కలి తాలూకా లోనిది.

## 10. గుణార్ణవ

ఇతడు ఇంద్రవర్మ మూడవ కుమారుడు. తండ్రి యనంతరము రాజై కళింగరాజ్యమును పాలించెను. ఇతనికి సంబంధించిన శాసనములు లభింపలేదు.

## 11. దేవేంద్రవర్మ

ఇతనికి సంబంధించిన మూడు శాసనములు లభించినవి. గా. శ 183 నాటి శ్రీకాకుళము శాసనము[1] గుణార్ణవుని కుమారుడగు దేవేన్ద్రవర్మ క్రోష్టుకవర్తని విషయములోని పొప్పంగిక గ్రామ కుటుంబినుల నాజ్ఞాపించుచు, తన యొక్క, తన తల్లిదండ్రుల యొక్క పుణ్యాభివృద్ధికి ఉత్తరాయణ పుణ్యకాలమున అన్ని పన్నుల నుండి తప్పించి గ్రామమును మాఘ శుద్ధ 8 రథ సప్తమి నిమిత్తము కళింగనగర నివాసులు, ఛందోగ శాఖీయులు, కృష్ణ ఆత్రేయగోత్రికులును, వేదవేదాంగవిదులును అగు ఆరుగురు అన్నదమ్ములకు దానమిచ్చెను. దానగ్రామ సమీపమున కురుడుంబి గ్రామము, నేటి 'గురుండి' యున్నది. అపూర్వనట వంశీయుడగు మాత్రుచంద్రుని కుమారుడగు పల్లవచంద్రునిచే రాజు స్వముఖాజ్ఞపై నీ శాసనము వ్రాయబడినది. మహత్తర స్వరనందిశర్మ యెదుట వ్రాయబడిన శాసనమిది.

గా. శ. 183లో శ్రావణ బహుళ పంచమిన ఖండిచంద్ర భోగికుని కుమారుడగు స్వర చంద్రునిచే చెక్కబడిన శాసనమిది.

---

1. E. I. vol. III. P. 130-134

గా॰ శ. 184 లో వేయింపబడిన ధర్మలింగేశ్వర శాసనము[1] పుష్పగిరి పంచాలి విషయము లోని హడువగ్రామ కుటుంబినుల కాజ్ఞ — "తల్లిదండ్రులయొక్కయు తనయొక్కయు పుణ్యాభివృద్ధికి, వేదవేదాంగేతిహాస పురాణ న్యాయవిద్యా సిదాంతములు నేర్చిన భగవత్ పతంగశివాచార్య గురువునకు మంత్ర దీక్షా కాలమున గురుపూజార్థ మొసంగబడిన దానమిది.

గా. శ. 165నాటి సిద్ధాంతశాసనము[2] శ్రావణ బహుళపంచమి దక్షిణాయన పుణ్యకాలమున వరహావర్తని విషయమందలి సిద్ధార్థక గ్రామమున నొక నాగలిభూమిని ఎరండపల్లి (ఆముదాల వలస) వాస్తవ్యుడగు తంపరశర్మ దీక్షితునకు దానమీయ బడినది. ఎరండపల్లిలో నివసించు అపూర్వ నటవంశమునకు జెందిన మాత్రుచంద్రుని పుత్రుడగు దీక్షిత శ్రీమదనాంకుర పల్లవునిచే ధరంపనందిశర్మయను పురోహితుని సలహాతో ఈ దానశాసనము వ్రాయబడినది. దీనిని శంకరుని కుమారుడగు నాగబోయి అక్షశాలి చెక్కెను. ఎరండపల్లి దమనుని క్రీ శ. 340 ప్రాంతమున సముద్రగుప్తు డోడించెను.

## 12. జయవర్మ

ఇతడు రెండవ దేవేంద్రవర్మ జ్యేష్ఠపుత్రుడు. ఇతనికి సంబంధించిన శాసనములు లభింపలేదు. ఇతని పరిపాలనాకాలము సుమారు తొమ్మిది సంవత్సరములు.

## 13 అనంతవర్మ II

ఇతడు రెండవ దేవేంద్రవర్మ రెండవ కుమారుడు. జయవర్మ సోదరుడు. ఇతని పర్లాకిమిడి శాసనము[3] గా. శ. 204 లో వేయింపబడినది. ఈ శాసనమున జయవర్మ, అనంతవర్మ అన్నదమ్ములని తెలుపబడినది. గా సం 221 నాటి నందవర్మ, గా. శ. 254 నాటి దేవేంద్రవర్మ అనంతవర్మ కుమారులు. అతని మరియొక శాసనము[4] చంద్రగ్రహణ సమయమున నొక భూమిని దానమిచ్చినట్లు తెలుపుచున్నది. గా. శ. 204 నాటి శాసనము క్రోష్టుకవర్తని విషయమందలి తాలత్తేరి గ్రామీణులగూర్చి, "తల్లిదండ్రుల యొక్కయు. సోదరుడగు జయవర్మయొక్కయు, తనయొక్కయు పుణ్యాభివృద్ధికై వేదవేదాంగవేత్త కామరూప విషయములోని శృంగంటికాగ్రహార వాసియు, పరాశరస గోత్రికుడును అగు విష్ణుసోమాచార్య పాదములకు వివాహకాలమందీ గ్రామము దానమీయబడినది.

---

1. J. A. H. R. S. vol. II. P. 275-276.
2. E. I. vol. XIII.
3. J. A. H. R. S. vol II P. 271-274.
4. E. R. 1918-1919.

## 14 నందవర్మ

ఇత డనంతవర్మ కుమారుడు. .గా శ. 221 నాటి శాంతబొమ్మాళి శాసనము[1] చిఖల్లిక గ్రామవాసులగు భోగిక, వారిక, ప్రముఖుల సమావేశమున కుటుంబినుల నాజ్ఞాపించుచు "చిఖల్లిక గ్రామమును సూర్యగ్రహణ నిమిత్తము నా పుణ్యాభివృద్ధికై రాజపుత్రుడగు ఖాలి సమక్షమున నివేదన పూర్వకముగా కౌండిన్యస గోత్రులు, బ్రాహ్మణులు ఆదిత్య, మాతృ, దుర్గ శర్మలకు దానమిచ్చినానని" శాసనమందున్నది. చిఖల్లిక = చిక్కాలవలస; భోగిక = ఆదాయపు పన్ను చేయువాడు. ఇతడనంతవర్మ జ్యేష్ఠపుత్రుడు.

## 15 దేవేంద్రవర్మ

ఇత డనంతవర్మ రెండవ కుమారుడు. ఇతడు గాంగ సంవత్సరపు 254 నాటి విశాఖ పట్టణ శాసనమును[1]–దేవదమన దేవ విషయమందలి గ్రామకుటుంబినుల సమావేశ పఱచి నాజ్ఞాపించుచు 'నామేనమామ ధర్మఖేడి చేత ప్రేరేపింపబడి' 'ధర్మేశ్వరభట్టారకాయ ఆయనపూర్వ మాచంద్రార్క ప్రతిష్టాంకృత్వా' యని దేవదమన దేవద విషయమందలి గ్రామములను దానమిచ్చు సందర్భమున వేయించెను.

## 16 రాజేంద్రవర్మ

దేవేంద్రవర్మ యనంతరమాతని కుమారుడు రాజేంద్రవర్మ కళింగ రాజ్యాధిపతి యయ్యెను. ఇతనికి సంబంధించిన శాసనములు లభింపలేదు. ఇతని పరిపాలన విశేషములు తెలియుటలేదు.

## 17. అనంతవర్మ

ఇతడు రాజేంద్రవర్మ కుమారుడు గా. సం. 284, 304 లలో ఇతడు శాసనములను వేయించెను. గాంగ సంవత్సరము 304 నాటి ఆలమండ శాసనము[3] ఇతడు తిరికట విషయములోని మెదలక గ్రామ కుటుంబినుల నాజ్ఞాపించుచు, సూర్యగ్రహణకాలమున తటాక ప్రతిష్ట సమయమున వేద వేదాంగ విదుడును హోంవరవలస గ్రామవాసియు కౌశిక గోత్రికుడును, వాజసనేయ శాఖీయుడును విష్ణుదేవుని కుమారుడగు శ్రీ ధరభట్టునకు ఉదక పూర్వకముగా నీ గ్రామమును దానమిచ్చెను. రాజు రహస్యాధికారి దుర్గప్ప వ్రాయగా అక్షశాలి చెక్కిన శాసనమిది.

## 18, దేవేంద్రవర్మ

అనంతవర్మ యనంతరము దేవేంద్రవర్మ కళింగ రాజ్యాధికారము వహించెను. ఇతడనంతవర్మ సోదరుడు. ఇతడొక శాసనమున[4] వరాహవర్తని విషయమందలి సిద్ధాంత గ్రామ కుటుంబినుల నిట్లాజ్ఞాపించెను. ఈ గ్రామమును పరమేశ్వర పరమ భట్టారక దేవునిపూజ, ధూప, దీప,

---

1. J. A. H. R S. Vol. II P.185-189.
2. I. A. Vol. XVIII.
3. E. I. Vol. III. P. 17-24.
4. Epigraphia Carnatica-Vol. Banglore No. 140.

నై వేద్యాది సంస్కారములకై పాలుకోసు వాస్తవ్యుడును, కటయసూత్ర పంచవ్రతుండును అగు కౌతుకయను విప్రునికి ఆయన సంక్రాంతి నిమిత్తము తల్లిదండ్రుల యొక్కయు, తన యొక్కయు పుణ్యాభివృద్ధికి శ్రీ పర్వతవాసి నవనీతరాసియు అగు గురువు యొక్క ప్రోత్సాహముచే దాన మిచ్చితిని" శ్రీ ఖండిమల్ల ఈశాసనమును చెక్కెను.

ఇతని రెండవ శాసనము[1] చెక్కలిలో లభించినది. దేవనాగరలిపిలో వ్రాయబడినది. రూపవర్తని (చెక్కలి) విషయమందలి నియన గ్రామవాసుల కిచ్చినయాజ్ఞ 'మహా ప్రతిహార పుత్రః-సుకవియు బ్రాహ్మణు (శర్మణః)నకీ గ్రామమన్ని విషముల నైన పన్నుల నుండి తప్పించి, దానమీయ బడినది. పుణ్యాభివృద్ధికై నీయబడిన ఈ శాసనము గా. సం 310లో వేయింపబడినది ఈ శాసనము శ్రీ సామంత సర్వచంద్రునిచే లిఖింపబడి అతుశాలి శ్రీ సామంత ఖండిమల్లచే చెక్కబడినది.

## 19 రాజేంద్రవర్మ II.

ఇతడు దేవేంద్రవర్మ అన్నయగు అనంతవర్మ కుమారుడు. ఇతని గా. సం. 342 శాసనమున[2] ఈతడు కళింగ నగరమునుండి తాంవాడి గ్రామమును బ్రాహ్మణులకు దానము చేసినట్లున్నది. ఈ శాసనము సామి రాజుపుత్రుడు సంధి విగ్రహికుడగు రణామేయనిచే వ్రాయబడినది. ఇతని మరి యొక శాసనము E.R. 1918లో నమోదు చేయబడినది.

## 20 వజ్రి లేక వజ్రిహస్త :

ఇతడు రాజేంద్రవర్మ కుమారుడు. ఈతని కాలమున వెలసిన శాసనములు లభింపలేదు ఇతని పరిపాలనా విశేషములును తెలియవు.

## 21. మారసింహ

ఇతడు వజ్రహస్తుని కుమారుడు. ఇతని పరిపాలనా విశేషములను తెలుపు శాసనమే దియు లభింపలేదు.

## 22. భూపేంద్రవర్మ :

ఇతడు మారసింహుని కుమారుడు ఇతని శాసనములు, పరిపాలనా విశేషములు తెలియరాలేదు

## 23. దేవేంద్రవర్మ V

ఇతడు భూపేంద్రవర్మ కుమారుడు. ఇతని చీడివలస శాసనము[3] సివిడి గ్రామదాన సందర్భమున వేయింపబడినది. కోలువర్తని విషయమందలి కందలివాడ గ్రామవాసుల నాజ్ఞాపించుచు

1. Epigraphta Indica Vol. XVIII. No. 32.
2: J B O. R. S. Vol. XII P. 101.
3. ఆం. సా. ప. పత్రిక Vol. XV సంచిక. 5, 6, P. 18.31 J. A. H. R. S. Vol. II part. II. P. 146-164.

నా యొక్కయు, నా తల్లిదండ్రుల యొక్కయు పుణ్యాభివృద్ధికి దానముచేయబడినదనియు, యజ్ఞములుచేయుట వేదపఠనము, మున్నగు సత్కార్యములు నాచేత చేయించుటయం దాసక్తి గలవారును 'సివిడి' గ్రామవాసులును ధర్మానురక్తులును, సివిడి గ్రామార్జిత గోజాదీక్షిత వంశమునం బుట్టినవారును, భారద్వాజ గోత్రీకులును అగు ఆదిత్యభట్టు, యజభట్టు, శడిదేవరభట్టు మొదలగువారికి సూర్యగ్రహణ కాలమున కందలివాడ గ్రామమందలి 'సివిడి' ప్రదేశము పన్నులు లేకుండ దాన మీయబడినది. ప్రవర్థమాన విజయరాజ్య సంవత్సరము. 397 వ ముధపచే లిఖింపబడి, భట్ట శ్రీదర, భట్టయూజువులచే పరీక్షింపబడి సప్పదపచే చెక్కబడినది.

## 24. గుణమహార్ణవ :

(894-)ఇతడు ఐదవ దేవేంద్రవర్మ కుమారుడు. తండ్రి యనంతరము రాజై ఒక్క సంవత్సరము మాత్రమే పాలించినట్లు తెలియుచున్నది.

## 25. వజ్రహస్త :

(894-938) ఇతడు గుణమహార్ణవుని కుమారుడు. పూర్వపు రాజులచేత భూమి, ఐదు భాగములు విభజింపబడి పాలింపబడుచుండ, వజ్రహస్తుడు, ఆ భాగములన్నియు నేకముగాచేసి, శత్రువులను జయించి నలుబదినాలుగు సంవత్సరములు కళింగదేశమనేలెను. ఇతడు కళింగదేశము నేలిన రాజులలో సుప్రసిద్ధుడైన వాడు, త్రికళింగాధిపతి

## 26. గుండమ రాజు :

ఈ మహారాజు వజ్రహస్తుని జ్యేష్ఠపుత్రుడు. ఇతడు కళింగరాజ్యమును మూడు సంవత్సరములు మాత్రమే పాలించెను. ఇతని పరిపాలనాకాలము క్రి. శ. 938-941.

## 27. కామార్ణవుడు :

(941-976) ఇతడు గుండమరాజు సోదరుడు, 35 సంవత్సరములు కళింగదేశమును పాలించెను. ఇతని పరిపాలనా విశేషములు తెలియుటలేదు.

## 28 వినయాదిత్య :

(976-979) కామార్ణవుని తరువాత వినయాదిత్యుడు రాజై మూడు సంవత్సరములు కళింగరాజ్యాధికారము వహించెను. ఇతని పరిపాలనా విశేషములు తెలియుటలేదు.

## 29. అనంతవర్మ అనియంకభీమ వజ్రహస్త :

(979-1014) ఇతడు కామార్ణవుని కుమారుడు ఇతనికి రెండవ వజ్రహస్తుడను పేరు కలదు. ఇతడు 35 సంవత్సరములు కళింగమునేలెను. ఇతని శాసన మొకటి గంజాం జిల్లాలో

నున్న పాలూరు గ్రామములోని వశేశ్వరాలయము ముందున్నది. వశేశ్వర, వీరేశ్వర దేవరలకు కొంత భూమిని, దీపమునకు 24 గేదెలను దానమిచ్చు సందర్భమున ఈ శాసన మివ్వబడినది[1].

## 30. దేవేంద్రవర్మ కామార్ణవ

(1014) ఇతనినే చరిత్రకారులు రెండవ కామార్ణవు డందురు. తండ్రియగు అనియంక మవజ్రహస్తుని యనంతరము కళింగాధిపతియై ఆరు నెలలు మాత్రమే రాజ్యము చేసెను. తరువాత ఇతని తమ్ముడు గుండమరాజు రాజ్యమునకు వచ్చెను.

## 31. గుండమ రాజు:

(1015-1018) గుండమరాజు, అనియంకభీమవజ్రహస్తుని రెండవ కుమారుడు. ఇతని పరిపాలనా కాలము మూడు సంవత్సరములు.

## 32. మధుకామూర్ణవుడు :

(1019-1037). మధుకామార్ణవుడు గుండమరాజు సవతి తల్లి కుమారుడు. ఇత డనంతవర్మ కుమారుడు. ఇతడు ఎరప నాయకునకు, పటు, హోండవడో, మోరఖిని గ్రామము లను వైశ్యాగ్రహారములుగా చేసి దానమిచ్చెను. ఇతడు వేయించిన తామ్రశాసనము గా. సం. 526 నాటిది[2].

## 33 అనంతవర్మ వజ్రహస్త:

(1037-1070) ఇతని కాలమున దంతపురము, కళింగనగరము గూడ రాజధానులుగ నుండెను. ముఖలింగాలయ కుడ్యములపై ఈ రాజు వేయించిన శాసనము లున్నవి. ఇతని భార్య బెజియమ లేక విజయ మహాదేవి హైహాయ వంశమున జన్మించిన నారీమణి. అనంతవర్మ వజ్రహస్త మహారాజుశాసనము లైదు ప్రకటింపబడినవి[3].

## 34. దేవేంద్రవర్మ రాజ రాజ

(1070-1077) ఇత డష్టాదమునకు రాజు. ఇతడు ముందు లక్ష్మిని జయించెను. యుద్ధోత్సాహము కలవాడై చోడరాజు కుమార్తెను వివాహమాడెను. వేంగిని వదలి చోడ రాజ్యమందు విజయాదిత్యుని ప్రతిష్ఠించెను. ఈతని కాలమున, నారాయణపురమందలి నీలేశ్వరా లయమున నాదిత్యవిగ్రహము స్థాపించబడింది.

---

1. E. R. 1918. Insc. No. 828.
2. Ep. R. 1918–1919. C. P. No. 5.
3. S. I. I. Vol. V. No. 1120. 1121. 1122. 1123 & 1133.

## 35. అనంతవర్మ చోడగంగదేవ

(1077-1150) ఇతడు రాజరాజు జ్యేష్ఠపుత్రుడు. ఇతనిని పేర్కొను వందలకొలది శిలాశాసనము లున్నవి. ముఖలింగమున వెలసిన శాసనములలో నధికము నీతని కాలమున వేయింపబడినవి ఇతని తెంబూరు తామ్రశాసన మీ సంపుటిలో ప్రకటింప బడుచున్నది. ఇతడు 1077 లో పట్టాభిషిక్తుడైన పిదప తూర్పు దిక్కున ముందుగా ఉత్కళపతిని రాజ పీఠమున నుంచి, వేంగీశుని పశ్చిమముననను ప్రతిష్ఠుని చేసెను. సుమారు 70 సంవత్సరముల దీర్ఘకాలము పాలించిన రాజితడే యని భావింపవచ్చును. వేములవాడ భీమకవిచే శప్తుడైన రాజితడేయని చారిత్రికులు నిర్ణయించినారు. ఇతడు కడు సమర్థుడైన రాజు. ఇతని రాణులలో కస్తూరికామోదిని, ఇందిరాదేవి, చంద్రలేఖ ముఖ్యులు. ఇతని యనంతరము వరుసగా ఈ రాణుల కుమారులు రాజ్యాధికారము వహించిరి, అనంతవర్మ చోడగంగు మహారాజు దీర్ఘకాలము పృథ్వీభారము వహించి క్రి. శ, 1150 లో మరణించెను. తరువాత కస్తూరికామోదిని పుత్రుడు కామార్ణవ VII, 1147-1156; ఇందిరాదేవి కుమారుడగు రాఘవుడు 1156-1170; చంద్రలేఖ కుమారుడగు రాజరాజు II 1170-1194 చంద్రలేఖ రెండవ కుమారుడు అనియంక భీముడు 1194-1198; తరువాత వరుసగా రాజరాజు III 1198-1211; అనంగభీమ, 1211-1145; నరసింహదేవ I 1245-1264; భానుదేవ I, 1264-1279; నరసింహదేవ II, 1279-1306; భానుదేవ II, 1306-1327; నరసింహ III 1327-1153; భానుదేవ III, 1353-1378; నరసింహదేవ IV, 1378-1424; భానుదేవ IV, 1424-1434, వరకు పాలించిరి. నాల్గవ భానుదేవునితో గాంగ వంశీయుల పరిపాలన మంతరించినది.



# అనంతవర్మ సేవిది తామ్ర శాసనము

**శాసనము :-**

మూడు రేకులు గల ఈ శాసనమును డా॥ గిడుగు వేంకటసీతాపతిగారు నాకు దయతో నొసంగిరి. ఈ శాసనము శ్రీకాకుళము జిల్లా-పాతపట్నం తాలూకాలోని తెంబూరు గ్రామమున లభించినది. శాసనమెప్పుడెవరికి లభించినదో తెలియదు. ఈ శాసనము చదివి ప్రకటింపదలచిన నాకు అడిగిన వెంటనే ఇచ్చిన డా॥ గిడుగు సీతాపతిగారికి నా కృతజ్ఞతలు.

**ఆకారాదికములు**

ఈ శాసనమున మూడు రాగిరేకు లున్నవి ఒక్కొక్క రేకు పొడువు 16.5 సెం.మీ. వెడల్పు 7.5 సెం.మీ ఈ మూడు రేకులు ఒక రాగి కడియమునకు దగిల్చియున్నవి. కడియము యొక్క చుట్టుకొలత 31.5 సెం. మీ. కడియము యొక్క వ్యాసము 3 5 సెం. మీ శాసనపు కడియమున కమర్చబడిన రాజముద్రికపైన గల చిహ్నము గుర్తింపరాని విధముగ చిలుముపట్టి అఱిగిపోయినది. బహుశః వృషభ లాంఛనమై యుండవచ్చును. శాసనపు రేకుల అంచులు తీర్చ బడి యున్నవి. రేకులమందము 0.4 సెం. మీ. శాసనపురేకులకు ఎడమ ప్రక్క 1.5 సెం. మీ. వ్యాసముగల రంధ్రములున్నవి. శాసనపురేకుల బరువు ఈ క్రింది విధముగ నున్నది.

| | | |
|---|---|---|
| మొదటి రేకు తూకము | 310 | గ్రాములు |
| రెండవ రేకు తూకము | 375 | గ్రాములు |
| మూడవ రేకు తూకము | 330 | గ్రాములు. |
| కడియము సీలుతోసహా | 860 | గ్రాములు |

మొత్తము శాసనము తూకము, 1875 గ్రాములు. అనగా ఒక కిలో 875 గ్రాములు.

ఈ శాసనమందలి మూడు రేకులలో మొదటిరేకు రెండవప్రక్కనుండి శాసన మారంభ మగుచున్నది. మూడవరేకు మొదటి ప్రక్కతో శాసనము పూర్తియగుచున్నది. శాసనమునగల పంక్తుల మొత్తము సంఖ్య 28.

| | | |
|---|---|---|
| మొదటి రేకు రెండవ ప్రక్క | 7 | పంక్తులు |
| రెండవ రేకు మొదటి ప్రక్క | 7 | పంక్తులు |
| రెండవ రేకు రెండవ ప్రక్క | 7 | పంక్తులు |
| మూడవ రేకు మొదటి ప్రక్క | 7 | పంక్తులు |

మొత్తము- 28 పంక్తులు

ఈ శాసనపు రేకుల అంచులు తీర్చబడియున్నవి. శాసనాక్షరములు చెదిరిపోకుండుట కీ అంచులు తీర్చబడినవి రేకులు చిలుము పట్టుటవలన కొన్ని అక్షరములు చెదిరిపోయినవి. శాసన భాష సంస్కృతము, దేవనాగరిలిపి. శాసనపు రేకులు కడియమునకు తగిలించబడినవి. రాజముద్రిక కడియమునకు బిగింపబడినది. మొదటి రేకు రెండవప్రక్క నాలుగు, ఐదు, ఆరు పంక్తులలోని కొన్ని అక్షరములు చెదిరిపోయినవి. రెండవ రేకు రెండవప్రక్క మూడు, ఐదు పంక్తులలోని కొన్ని అక్షరములును, చదువుటకు వీలుగాలేవు. ఈ శాసనము కళింగనగరము నుండి కళింగాధి పతియగు శ్రీ అనంతవర్మచే వేయింపబడినది.

**భాష :**

ఈ శాసన భాష అంతయు సంస్కృతము. మొదటి రేకు రెండవ ప్రక్కనుండి ప్రారంభ మగుచున్న ఈ శాసనము మూడవ రేకు మొదటి ప్రక్క మొదటి పంక్తిలో నున్న "పరదానేతి పార్థివ" అను శ్లోకమువరకు సంస్కృత వచనములో నున్నది చివరనున్న శ్లోకములు దాన ఫలమును తెలుపునవి. శాసనాంతరమున "మాణికహస్త శ్రీ సామన్తేణ లిఖితం" అను వాక్యము వచనములో నున్నది. మొదటి రేకు రెండవ ప్రక్క మూడవ పంక్తిలో "కలికలఙ్క వినయనయ సమ్పదామరిస్పన్దాధిగతస్స" అను వాక్య భాగములో (ఆ రాజవంశములో) అను భావము వచ్చు పదములేనిదే అన్వయము కుదురుటలేదు అట్లే రెండవ రేకు మొదటి ప్రక్క ఐదవ పంక్తిలో "సేవిది గ్రామదాన సర్వ్వకర పరిహార చాదభద అప్రవేశ" అనుచోట క్రియలేదు. "దానము చేసెను" అను అర్థము వచ్చు క్రియాపద ముండవలయును. రెండవరేకు రెండవప్రక్క దానమి చ్చిన గ్రామముయొక్క సరిహద్దులు చెప్పునప్పుడు, సరిహద్దుల వర్ణనము మూడవరేకు మొదటి ప్రక్క మొదటి పంక్తివరకును ఉన్నది. అందును ఈ సరిహద్దులు (కలది) అను అర్థమువచ్చు క్రియాపదములేదు. (పూర్వోత్త రామాభూద పరిశఙ్కవః పరదానేతి పార్థివ—)"

**లిపి:-**

ఈ శాసనము సంస్కృత భాషలో వ్రాయబడినది. శాసన లిపి ప్రాచీన దేవనాగరి లిపి. శాసనపు రేకులకు సంఖ్యలు వేయబడిలేవు. ఈ శాసనము అనంతవర్మ వేయించినది రెండవ అనంత వర్మ కుమారుడు నందవర్మ వేయించిన శాంతబొమ్మాళి తామ్ర శాసనమందలి అక్షరములను బోలి ఈ శాసనాక్షరము లున్నవి. కాని, ఈ రెండు శాసనములలోని అక్షరముల కించుక భేదము కని పించును.

**వర్ణక్రమము:-**

శాసనము మొదట "ఓం" గుర్తు తెలుగులోని '౨' తావత్తు లేక 'రెండు' అంకె గుర్తువలె నున్నది. శాసనమున 'ర' వలపలగిలకకు పూర్వాక్షరము ద్విత్వముగా వ్రాయబడినది. అనుస్వారమునకు బదులుగా అనునాసికాక్షరములు వ్రాయబడినవి.

సర్వర్తు - సర్వ్వర్తుర
కళింగ - కలిఙ్గ
కలంక - కలఙ్క
నిర్మలాధిపత్యం - నిమ్మ్మలాధిపత్యం
సామంత - సామన్త
అనంతవర్మ - అనన్తవమ్మ్మ.

శాసనములో వర్ణక్రమ మీ విధముగా సంస్కృత బాషా సంప్రదాయము ననుసరించి వ్రాయబడినది. ప్రాచీన శాసనము లన్నింటిలోను ఇట్టిపద్ధతి మనకు కనిపించును

**శాసన విషయము :**

ఈ శాసనమున దాతయైన అనంతవర్మ కళింగ రాజ్యాధి పత్యమును పొంది చతురుదధి తరంగములను మేఖల కలిగిన భూమియందు స్వచ్ఛమగు విస్తారమైన కీర్తిచేత సమర సంక్షోభము లను జయశబ్దములబొంది మహేంద్రునికి విషాదమును కలిగించునట్లు వైతరణీనదిని యజ్ఞములందు వదలబడిన నీటితో సృష్టించినవాడును, ప్రతాపాతిశయమువలన లోబరచుకున్న సమస్త సామంతుల యొక్క చూడామణుల కాంతి పుంజముచే ప్రకాశమానములగు చరణములు కలిగినవాడును, మాతా పితృపాదసేవచేయు పరమ మహేశ్వరుడును అని ప్రశంసింపబడినాడు. ఈ శాసనము నీతడు కళింగనగరమునందు మార్గశీర్ష మాసమందలి యమావాస్యయందు సూర్యగ్రహణ కాలమున భారద్వాజ గోత్రుడగు గోత్పాతీక్షితునికి 'సేవిది' యను గ్రామమును, అన్ని పన్నుల నుండి తప్పించి అజ్ఞానుల కప్రవేశ్యముగా నొనర్చిదానము చేసెను.

ఈ శాసనమున కళింగనగర ప్రశంసకలదు. ఆ నగరము సర్వర్తువులందు సుఖకరమైన దనియు, అహ్లాదదాయకమును, దుర్జేయమును అగు నగరమనియు వర్ణింపబడినది. అనంతవర్మ మహారాజు భగవంతుడగు మహేశ్వరుని భక్తుడు. ఇతనికి పరమ మాహేశ్వరుడును బిరుదము న్నది.

దానము చేయబడినది 'సేవిది' యను గ్రామము. ఈ గ్రామము విష్ణు, శివసుతముల కాచార్యులు భాణుదేవుడు మహేశ్వరభక్తులు-వన్దభులు-దేవరులు భసీఋలు మొదలగు వారి కావాస మైనదై యున్నది. మూడవరేకు మొదటిప్రక్క మొదటి పంక్తినుండి దానఫలము, పరదానాను పాలనము, వలన కలుగు ఫలము చెప్పబడినవి 'స్వయముగా దానము చేసిన దానికన్న, ఇతరులు చేసిన దానమును రక్షించుటవలన ఎక్కువ ఫలము కలుగును. అప్పుడది పరదానానుపాలన మగును. స్వదత్తముగాని పరదత్తముగాని ఓ యధిష్ఠిరుడా! ప్రయత్న పూర్వకముగా రక్షింపుము. భూమిని ఇష్టులును, ఉత్తములును అగువారికి దానము చేయుట కంటె శ్రేయస్కరమైనది పరదానములను రక్షించుట యగును'. అని దానఫలము, పరదానానుపాలనమువలన కలుగు ఫలమును చెప్పిన తరువాత దానచ్ఛేదఫలము తెలుపబడినది. ఈ శాసనము మాణికహస్తశ్రీ సామన్తునిచే వ్రాయబడినది.



౪౦

# అనంతవర్మ సేవిది తామ్ర శాసనము

## శాసనము – మూలము

### మొదటి రేకు– రెండవ ప్రక్క

1 ఓం. స్వస్తి సర్వర్తు సుఖరమణీయాద్విజయ కలిఙ్గరాధివా

2 సో సకల భువన నిర్మ్మాలాధిపత్యం భగవతో మహేశ్వర
ప్రణామా

3 దపగత కలికలఙ్కో వినయ నయసమ్పదా మరిస్పన్ధాధిగతస్స

4 కలకలిఙ్గాధిరాజ్యంశ్చతురుదధి తరఙ్గ మేఖలా

5 వనితల ప్రథిత తామల యశానేక సమర సంక్షోభ

6 జనిజయశబ్దో మహేంద్ర పరితాపయోపయోగ వైతటనో

7 గఙ్గమలకుల ప్రతిష్ఠః ప్రతాపాతిశయా నామిత సమస్త

## రెండవ రేకు - మొదటి ప్రక్క

1. సామన్త చూడామణి ప్రభామఞ్జరీ ప్రరఞ్జితచరణో
2. మాతాపితృ పాదానుధ్యాత పరమమహేశ్వరో మహారాజ
3. శ్రీ అనన్తవమ్మా కలిఙ్గనగరే మార్గ శీష్యామావాస్యా
4. యాం సూర్య్యగ్రహణే భారద్వాజగోత్ర గోత్ఛాదీక్షితాయ
5. సేవిది గ్రామదాన సర్వ్వకర పరిహారచాదభద అప్రవేశ
6. విష్ణుశివ ఆచార్య్య భాణుదేవ మహేశ్వర జేమభట్టమౌ
7. చన్ద్రిభాను కోమ్మిచ గాముదతేచ దేవరహసీఙ త్రైపురిక్రా

## రెండవ రేకు - రెండవ ప్రక్క

1. న్తం పూర్వేణ తిన్తలీవృక్ష ఉరూధుబై వాసేత్ త్రికూటే పావ
2. ణా చంద్రరశ్రపాషాణాం గెరివట అజనన్దివ్యాఘతటాక త్రి
3. కూట దక్షిణేన నన్దివాపీ తిన్తలీ రాధనవృక్ష త్రికూట......రి
4. ణె కపాలాని పశ్చిమేన కరణ్ణహలద్ర శిఖరాకృ
5. తి శిలాతిన్తలీ త్రికూట। ఉత్తరేణ మౌదర వృక్షతిన్త
6. లీ రజకవాపీ దేవతాయతన ధరణీ పర్వ్వతి కాయోత్త
7. రేణ మహాపర్వ్వతికాయ మస్తకేన త్రికూటాత్పూర్వోత్తరా

## మూడవ రేకు - మొదటి ప్రక్క

1. మాభూదపరిశఙ్కావః । పరదానేతి పార్థివ । స్వదానాత్ప
2. ల మానంత్యం పరదానానుపాలనం । స్వదత్తాద్పరదత్తాద్వా
3. యత్నాద్రక్షయుధిష్ఠిర । మహీమహీమత శ్రేష్ఠ దానాచ్ఛ్రేయో
4. ను పాలనం అష్టమేవ సహస్రాణివాజపేయ శతానిచ గవా
5. ఙ్కోటి ప్రదానేన భూమిహర్తా న శుద్ధ్యతి । అన్యాయేన హృతాభూమిరన్యా
6. యేనతుహారితా । హరతాహర యస్తస్యాహరత్యాసప్త
7. మంకులం । మాణికహస్త శ్రీ సామన్తేన లిఖితం ॥౦॥

**అనువాదము**

స్వస్తి-సర్వర్తువులందు సుఖకరమైనదై ఆహ్లాదదాయకమును, దుర్జేయమునగు కళిఙ్గ నగరమున నివసించువాడును, సకలభువనములకు నిర్మలమైన యాధిపత్యమును భగవంతుడగు మహేశ్వరునికి భక్తుడగుట చేత (నమస్కరించుటచేత) కలికలఙ్కముల నుండి వెలువడినవాడును, నయవినయ సంపదలు కల (యారాజ వంశములో) శతృవులను కలచివేయుటవలన కళింగ రాజ్యాధిపత్యమును పొంది చతురుదధి తురంగములను మేఖల కలిగిన భూమియందు స్వచ్ఛమగు విస్తారమైన కీర్తిచేత సమర సంక్షోభములందు జయశబ్దముల బొంది మహేంద్రునికి విషాదమును కలిగించునట్లు వైతరణీనదిని యజ్ఞములందు వదలబడిన నీటితో సృష్టించిన వాడును గఙ్గమల కుల మందు ప్రతిష్ఠగాంచిన వాడును, ప్రతాపాతిశయమువలన లోబరచుకొనిన సమస్త సామంతుల యొక్క చూడామణుల కాంతి పుంజముచే ప్రకాశమానములగు చరణములు గలిగినవాడును, మహేశ్వరుడును పరమ శివభక్తుడును అగు మహారాజశ్రీ అనంతవర్మ కళిఙ్గనగరమునందు మార్గ శీర్ష మాసమందలి యమావాస్యయందు, సూర్యగ్రహణకాలమున భారద్వాజ గోత్రోద్భవుడైన గోత్కా దీక్షితునికి సేవిదియను గ్రామమును అన్ని పనుల నుండి తప్పించి అజ్ఞానుల కప్రవేశ్య ముగా నొనర్చి (దానముచేసెను) విష్ణు శివమతముల కాచార్యులు భానుదేవుడు, మహేశ్వరభక్తులు వన్దభులు, భసీఖులు, మొదలగు వారిచేత నా గ్రామము ఆక్రమింప బడినదై (నివసింపబడు చున్నదై) తూర్పు దిక్కున ఒక తిన్త్రలీ వృక్షమును (చింత చెట్టు)——పార్వణగిరి——ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన——దక్షిణమున నన్దివాపి దగ్గరనున్న చింతచెట్టును——పశ్చిమమున——శిఖరముగల—కొండ దగ్గరనున్న చింతచెట్టును, చాకలివాండ్ర బావియు, దిగువభాగమున దేవాలయములు గల గుట్టకు ఉత్తరముననున్న పర్వతశిఖరమును కలిగి, తూర్పునుండి పడమరవరకు పైన చెప్పిన సరి హద్దులు (కలది) స్వయముగా దానము చేసిన దానిని రక్షించుటవలన కలుగు ఫలముకంటె ఇతరుల చేత నీయబడిన భూమిని రక్షించుటవలన ఎక్కువ ఫలము కలుగును. అది పరదానాను పాలన మగును. స్వదత్తమునుగాని పరదత్తమునుగాని యుధిష్ఠిరుడా ప్రయత్న పూర్వకముగా (తప్పక) రక్షింపుము. భూమిని నిష్ఠులును, నుత్తములును నగువారికి దానముచేయుటకంటె శ్రేయస్కరమై నది పరదానములను రక్షించుటయగును. ఎనిమిదివేల వాజపేయ యజ్ఞములు...ఓ రాజా! దానము జేయుటవలన జూడదు. అన్యాయముతో నిండినది అన్యాయముగా నపహరింపబడినది అగు భూమి అపహరించినవాని యొక్క ఏడు జన్మలను (తరములను) హరించును. మాణికహస్త శ్రీ సామంతునిచేత ఈ శాసనము వ్రాయబడినది.

# శ్రీ మదనంతవర్మ చోడ గంగదేవుని తెంబూరు తామ్ర శాసనము

**శాసనము**

ఏడు రేకులుగల ఈ తామ్రశాసనమును శ్రీమదనంతవర్మ చోడగంగదేవుడు తన ఆప్త భృత్యులకు ప్రీతితో కళింగదేశమండలి 'ఎఅద' విషయమందుగల షోడశ గ్రామములను, తన తండ్రియగు రాజరాజు యశోభివృద్ధికై దానమిచ్చు సందర్భమున వేయించెను. ఈ శాసనమును డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు నాకు దయతో నొసంగిరి. శాసనము శ్రీకాకుళం జిల్లా పాతపట్నం తాలూకాలోని తెంబూరు గ్రామసమీపమున లభించినది.

ఈ శాసనపు రేకులు కడియమున కమర్చబడినవి. కడియమునకు నంది విగ్రహామున్న రాజముద్రిక అమర్చబడినది. శాసనపురేకులలో మొదటి రేకులో ఒక్క ప్రక్క వదిలివేయబడినది. అట్లే ఏడవరేకు రెండవ ప్రక్క వదిలివేయబడినది. శాసనము ఏడవరేకు మొదటిప్రక్క 2/3వంతు మాత్రమే చెక్కబడినది. అక్కడికి శాసనము ముగిసినది.

ఈ శాసనము ఆకారమున పెద్దదిగా నున్నది. శాసనలేఖకు డంచులవరకు అక్షరములను చెక్కినాడు, అచ్చటచ్చట అక్షరము లొకవరుసలోనివి రెండవ వరుసలోని అక్షరములతో కలిసి పోయినవి. శాసనమున కళింగరాజుల వంశక్రమము వర్ణింపబడినది. అనంతవర్మ చోడగంగుని కొర్ని శాసనమున నున్న గాంగ వంశక్రమము ఈ శాసనమున వర్ణింపబడిన వంశక్రమము ఒకే విధముగా నున్నవి

**ఆకారాదికములు**

ఈ శాసనములోని ఒక్కొక్క రేకు పొడవు 25 సెం. మీ. వెడల్పు 12.5 సె. మీ. ఈ ఏడు రేకులును నంది విగ్రహాముతో గూడియున్న రాజముద్రిక గల కడియమునకు గుది గుచ్చబడినవి. కడియము చుట్టుకొలత 40. సెం. మీ. కడియము యొక్క వ్యాసము. 10. సెం. మీ. శాసనపు కడియమునకుగల రాజ ముద్రికపైనున్న నంది విగ్రహాము చుట్టు అక్షరములు చెక్కబడినవి. అవి నగిషీ చెక్కినట్లు కనిపించుచున్నవి. చిలుముపట్టి చెదరిపోవుటవలన అక్షరములు చదువుటకు వీలులేకుండ నున్నవి నందివిగ్రహాముని కభిముఖముగ నున్న రాజముద్రికభాగము విఱిగి పోయినది రాజముద్రిక గుండ్రముగను పలుచగను ఉన్నది. మధ్యలో నంది విగ్రహాము కలిగి యుండుటవలన చూచుట కందముగ నున్నది. శాసనపు రేకుల అంచులు అక్షరములు చెదరి పోకుండ తీర్చబడినవి. అచ్చటచ్చట తీర్చిన అంచులపైనను, శాసనాక్షరములు చెక్కబడినవి. శాసనపు రేకుల మందము 0.6 సెం. మీ. కొన్ని రేకులు 0.6 సె. మీ. కన్న తక్కువ మందముగా నున్నవి ముఖ్యముగ ఏడవరేకు పలుచగనుండి, ఎడమవైపున నున్నరంధ్రము వద్దను, రేకు మధ్యలోను రంధ్రము లేర్పడి పగిలిపోయినది. అక్కడ శాసనాక్షరములు చెక్కబడిలేవు. శాసనపు రేకులకు ఎడమప్రక్క 1.5 సెం. మీ. వ్యాసముగల రంధ్రములున్నవి.

శాసనపు రేకుల తూకమీ క్రింది విధముగ నున్నది.

| | | |
|---|---|---|
| మొదటి రేకు తూకము. | 680 | గ్రాములు. |
| రెండవ రేకు తూకము. | 685 | గ్రాములు. |
| మూడవ రేకు తూకము. | 685 | ,, |
| నాలుగవ రేకు తూకము. | 700 | ,, |
| ఐదవ రేకు తూకము. | 625 | ,, |
| ఆరవ రేకు తూకము. | 615 | ,, |
| ఏడవ రేకు తూకము. | 410 | ,, |
| కడియము సీలుతో సహా | 680 | ,, |

మొత్తముశాసనము తూకము 5080 గ్రాములు. అనగా 5 కిలోల 80 గ్రాములు.

శాసనపు రేకులు పెద్దవిగా నున్నను. శాసనాక్షరములు చెదిరిపోకుండ అంచులు తీర్చి యున్నను. శాసనము చెక్కిన శిల్పి అక్షరములను దగ్గరదగ్గరగా చెక్కినాడు. శాసన విషయ మెక్కువగా నుండుటవలన శిల్పి ఒకదానికొకటి తాకునట్లుగా అక్షరములను చెక్కుట తటస్థించినది.

శాసనాక్షరము లొక్కొకచోట పెద్దవిగాను, ఒక్కొక్కచోట చిన్నవిగను ఉన్నవి. మొదటి రేకు రెండవప్రక్క క్రిందిభాగముననున్న అక్షరములు చిలుముపట్టి చెదిరిపోయినవి. రెండవ ప్రక్క క్రింది భాగమున ఎడమవైపునను, కుడివైపునను, మూడవరేకు రెండుప్రక్కల క్రింది భాగములందును, నాలుగవరేకు మొదటిప్రక్క చివరి పంక్తిలోని కొన్ని అక్షరములును, నాలుగవరేకు రెండవప్రక్క క్రింది వైపు మధ్యభాగములును, ఐదవరేకు మొదటిప్రక్క అచ్చటచ్చటను, అయిదవ రేకు రెండవప్రక్క అచ్చటచ్చట కొన్ని అక్షరములు ఆరవరేకు మొదటిప్రక్క చివరిపంక్తిలోని అక్షరములును, ఆరవరేకు రెండవప్రక్క క్రిందిభాగమునకు కుడివైపున గల అక్షరములును, ఏడవ రేకులో ఎనిమిదవపంక్తిలో రంధ్రములున్న చోటును, అక్షరములు చదువుటకు వీలులేకుండ నున్నవి.

ఈ శాసనమందలి పంక్తుల సంఖ్య 157.

| | | | |
|---|---|---|---|
| మొదటి రేకు - రెండవ ప్రక్క | 13 | పంక్తులు |
| రెండవ రేకు - మొదటి ప్రక్క | 12 | ,, |
| రెండవ రేకు - రెండవ ప్రక్క | 14 | ,, |
| మూడవ రేకు - మొదటి ప్రక్క | 13 | ,, |
| మూడవ రేకు - రెండవ ప్రక్క | 13 | ,, |
| నాలుగవ రేకు - మొదటి ప్రక్క | 14 | ,, |
| నాలుగవ రేకు - రెండవ ప్రక్క | 14 | ,, |
| ఐదవ రేకు - మొదటి ప్రక్క | 14 | ,, |
| ఐదవరేకు - రెండవ ప్రక్క | 13 | ,, |
| ఆరవ రేకు - మొదటి ప్రక్క | 13 | ,, |
| ఆరవ రేకు - రెండవ ప్రక్క | 15 | ,, |
| ఏడవ రేకు - మొదటి ప్రక్క | 9 | ,, |
| మొత్తము | 157 | పంక్తులు. |

శాసనలిపి

ఈ శాసనమందలి లిపి ప్రాచీన కన్నడ-తెలుగు లిపి. శాసనాక్షరములు దగ్గర దగ్గరగా నుండి ఒక వరుసలోని అక్షరములు రెండవ వరుసలోని అక్షరములతో కలిసిపోయినవి. శాసన లిపి అనంతవర్మ చోడగంగు వేయించిన శక సంవత్సరము 1040 నాటి శాసనలిపిని[1] శక సంవత్సరము 1034 లో వేయించిన కొర్ని శాసన లిపిని,[2] బోలియున్నది శాసన కవి, శాసనాధికారి భాస్కర భట్టు శాసనలేఖకుడు, చాళుక్యగంగాచార్యుని జామాతయగు మాంకనాచార్యుడు. ఈ శాసనమున కొన్ని అక్షరములు చిన్నవిగను, కొన్ని పెద్దవిగను ఉన్నవి. శాసన విషయము పెద్దదిగా నుండుటవలన శాసనాక్షరములు కొన్నిచోట్ల ఒక వరుసలోనివి రెండవ వరుసలోని యక్షరములను తాకుచున్నట్లు చెక్కబడినవి. లేఖకుని అజాగ్రత్తవలన అచ్చటచ్చట అక్షరములు వదలివేయబడినవి. మూడవ రేకు రెండవప్రక్క తొమ్మిదవ పంక్తిలో "...తత్తనయో+ణార్ణవః" 'తత్తనయో' తరవాత 'ర' అక్షరము మరచి, తరువాత+గుర్తు 'యో' ప్రక్కనచెక్కి 'యో' 'ణా'ల మధ్య క్రిందుగా 'ర' చెక్కినాడు. అచ్చటచ్చట కొని అక్షరములను మరచిపోయినాడు. శాసన మూలమున కుండలీకరణమున వాటిని చేర్చడమైనది.

1. Indian Antiquiry Vol. XVIII
2. భారతి-క్రోధన సంవత్సరము-కళింగదేశ చరిత్రానుబంధము. పేజి 65—78.

భాష

శాసనము 7 రేకులుగలిగి 157 పంక్తులతో గూడియుండి గాంగవంశ చరిత్ర వర్ణింపబడి యున్నది. అనంతవర్మ చోడగంగు వేయించిన కొన్ని శాసనములలోనున్న గంగవంశపు రాజుల చరిత్ర వంశోత్పత్తి, వంశానుక్రమము, ప్రశస్తి మొదలగు విషయము లీ శాసనమున నున్న విషయ ములతో సరిపోవు చున్నవి. ఈ శాసనభాష యంతయు సంస్కృతము శాసనము 157 పంక్తుల గ్రంథము. శాసనకవి భాస్కరభట్టు, సంస్కృత పండితుడు. కవి. చక్కని కవిత్వము వ్రాయగల వాడు, ప్రబంధశైలిలో గ్రంథరచనచేయ సమర్థుడు. ఈ శాసనమున రెండువంతులు శ్లోకములు ఒకవంతు వచనము ఉన్నది. కళింగదేశమున ప్రజలు నిత్యవ్యవహారమున తెలుగు భాష మాట్లాడి నను, శాసనములు వందలకొలదిగ తెలుగుభాషలో వేయింపబడినను, ఈ శాసనమున గ్రామ సరి హద్దులు చెప్పునప్పుడైనను. తెలుగు మాటలు వాడక, సంస్కృతశబ్దములనే శాసనకవి ఉపయో గించినాడు. శాసనమునగల వర్ణనములు, కవి రచనాశక్తిని, పాండితీ ప్రభావమును తెలుపును. దాని వలన అనంతవర్మ చోడగంగు మహారాజు సంస్కృత భాషాభిమాని యని తెలియుచున్నది.

శాసనమున ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు, పూర్ణానుస్వారములు, సంస్కృత సంప్రదాయానుసారము వ్రాయబడినవి. 'ఙ' పంక్తి ఆరంభమున పూర్ణానుస్వారము వ్రాయుట కూడ ఈ శాసనమున కనిపించును. సంస్కృత భాషా సంప్రదాయానుసారము, వర్ణనము లీ శాసన గ్రంథమున నున్నవి. శాసనము చాలపెద్దది. అనంతవర్మ చోడగంగు వేయించిన కొన్ని శాసనములలోని, గాంగవంశ వర్ణనము, ఈ శాసనమందు కనిపించును,

శాసనవిషయము

ఈ శాసనమున గంగావంశానుక్రమము వర్ణింపబడినది. వంశమునకు ప్రాముఖ్యము కలుగుటకు చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిప్రభువులు, విజయనగరాధీశులు, తమ తమ వంశము లకు మూలపురుషులుగా, విష్ణువును, తారాపతిని, సూర్యుని చెప్పుకొనినారు. అట్లే గాంగవంశజులు తమ వంశమునకు మూలపురుషునిగా, శ్రీ మహావిష్ణువును, చేర్కొనినారు. ఈ శాసనమున వరు సగా విష్ణువు, బ్రహ్మ, అత్రి, చంద్రుడు, బుధుడు, పురూరవుడు, ఆయువు, నహుషుడు. యయాతి వసువు, గాంగేయుడు, విరోచనుడు, సంవేద్యుడు, భాస్వంతుడు, దత్తసేనుడు, సౌమ్యుడు, అంశు మంతుడు. సౌరాగుడు; చిత్రాంబరుడు, సారధ్వజుడు, ధర్ముడు, పరీక్షితుడు, జయసేనుడు, విజయసేనుడు, జితవీర్యుడు, వృషధ్వజుడు, ప్రగల్భుడు, కోలాహలుడు, విరోచనుడు. విరోచనుని యనంతరము 81 మంది రాజులు పాలించిన పిదప వీరసింహుడను రాజు కళింగాధిపతి యయ్యెను. వీరసింహుని యనంతరము కామార్ణవుడు 36, దానార్ణవుడు 44, రెండవ కామార్ణవుడు 55, రణా ర్ణవుడు 5, రెండవ వజ్రహస్తుడు 15, మూడవ కామార్ణవుడు 21, గుణార్ణవుడు 27, పోతాంకు శుడు 15, కలింగలాంకుశుడు 12, గుండమహారాజు 7, నాల్గవ కామార్ణవుడు 25, వినయాది త్యుడు 3, నాల్గవ వజ్రహస్తుడు 35, అయిదవ కామార్ణవుడు అర్థసంవత్సరము, రెండవ గుండమ రాజు 3, ఆరవ మధుకామార్ణవుడు 21, వజ్రహస్తుడు 30, రాజరాజు 8 సంవత్సరములు పాలించి నట్లు వర్ణింపబడిన పిదప అనంతవర్మ చోడగంగు, శంకనవరంధ్ర గ్రహగణగణితమగు దానియందు (999) కుంభస్థమగు దినమందు రేవతీనక్షత్రయుక్త మీనలగ్నమందు విశ్వవిశ్వంభరా చక్రమును,

రక్షించుటకు పట్టాభిషిక్తుడయ్యెను. అతని గుణగణములు పరాక్రమాతిశయములు వర్ణించిన పిదప చోడగంగు తన ఆప్తభృత్యులకు, ప్రీతితో కళింగదేశమందలి 'ఎఱద' విషయమందు గల షోడశ గ్రామములను, తన తండ్రి యశోభివృద్ధికి దానమొసంగినట్లు వర్ణింపబడినది. ఆ దానమును మిధున కృష్ణ ద్వాదశి ఆదిత్యవారమున పూర్వాహ్ణమున చోడగంగుని విజయరాజ్య సంవత్సరమున ధారా పూర్వకముగా, ఆ చంద్రతారార్కము సర్వభోగార్థ మీయబడినది. గోర్దఖి ఆది చతుర్దశ గ్రామ ములకుతోడు, కనుమద్ది, ముగ్రోమ, వెల్సివాడ అను మూడు గ్రామములు దేవభోగములుగా నీయబడినవి. ఈ గ్రామములకు సరిహద్దులు చెప్పబడినవి. అటుపిమ్మట సంప్రదాయానుసారముగా వ్రాయు శ్లోకములు, శాసనాంతమున కవి, శాసనాధికారియగు భాస్కరభట్టు పేరును లేఖకుడు శాసనాధికారి చాళుక్య గంగాచార్య జామాత మాంకనాచార్యుని పేరును ఉల్లేఖింప బడినవి.

**అనువాదము :**

ఓం లక్ష్మినిషేవ్యమైనదియు, తారాపతి కలంక కాంతివంటి కాంతి కలిగి శక్తివంతము లగు, చతుర్భుజములతో గూడినట్టియునగు శరీరమును ధరించుచున్నవాడై ముల్లోకములను సష్టించు కోరికతో విశ్వప్రసూతి జఠరుడై భగవంతుడగు ననంతుడుద్భవించెను. ఆతని నాభికమలమునుండి, భువన ప్రారంభ దీక్షారతుడగు బ్రహ్మ వేద పరంపరను ధరించు చతుర్ముఖములతో బుట్టెను. ఆతని నుండి ప్రజాపతి పదవి నలంకరించిన మునీశ్వరుడగు అత్రి జనించెను. ఆతడు త్రిలోకవాసుల దివ్యతపశ్శక్తి పుంజమే రూపుగొనినట్లుండెను. త్రిపురహర జటాజూట నేపథ్యరత్నమును, ధర్మనీయుడును, స్మరచరిత మహానాటికా సూత్రధారుడును దాక్షిణాత్యుల ముఖముకురములకు (అద్దములకు) దృష్టాంతమైనవాడును శర్వరీజీవితేశుడును, త్రైలోక్యానందకందుడును, గగనతల మహాంభోధిశంఖుడునునగు చంద్రుడు పుట్టెను. ఆ చంద్రునకు సూర్యాధిక తేజుడును శుభగ్రహమును విబుధాగ్రణియునగు బుధుడు జనించెను. ఆతని నుండి పురూరవుడుద్భంచెను. ఆతని పరాక్రమోపేతములగు భుజములచేత వసుంధర యనుభవింపబడెను. ఆతనికి ఆయువు అనునతడు త్రిజగద్విఖ్యాత కీర్తి జనించెను. ఆతనికి పరాక్రమవంతుడగు నహుషనరపతి రాజాగ్రగణ్యుడైనవాడు పుత్రుడయ్యెను. ప్రజాబాహుళ్యముగల భూమిని యతడనుభవించి యామెకు విముఖుడై దేవవేశ్యను ఇంద్రునిపై ఖండింతనాయికనుగా జేసి ప్రణయ పరవశుడై స్వపౌరుషముతో ననుభవించెను ఆతనికి శత్రుంజయుడగు యయాతి పుట్టెను. ఆతనికి ఊర్వశియందు వసువు జనించెను. ఆతడు పూర్వగీర్వాణ గురువగు శుక్రునియొక్క మహిమచేత మాతామహుని వక్షస్థలమందు బెరిగెను. చిరకాలమాత డనపత్యుడై దుఃఖితుడై యారాజశ్రేష్ఠుడు నిష్ఠాగరిష్ఠుడై పూజించినచో వరమునిచ్చు గంగాదేవి నారాధించి యజేయుడగు గాంగేయుడను కుమారుని పొందెను. అది మొదలు క్రమముగా తద్వంశ్యులకు భూమియందు గంగాన్వయులు (గంగాన్వయము) అను పేరు వచ్చెను. ఆతని కుమారుడు విరోచనప్రభువు, ఆతడు వైరిగ్రహముల కస్త్రాదియగువాడు. అతని పాదరేణు సమూహము (పాదధూళి) ఇతర రాజ చక్రకిరీట పత్రిమకరములయందు లగ్నమైనది. లక్ష్మీవాగ్వనితా మహాకుల నదులకు దెలియు కార్యారంభముగల సవేంద్యుని గంగాన్వయోత్తంసుని యారాజు (విరోచనుడు) కనెను. సంవేద్యునినుండి కాంతివంతమగు మణివలె రాజకిరీటస్థగిత రత్నములచేతను రాజులచేతను లాలింపదగినవాడును, ప్రాసాది దోషరహితుడును, సంపన్నిధియునగు దత్తసేనుడు జనియించెను. ఆ పృథ్వీశ్వరమౌళి మండనమణికి నసాధారణమగు నృపశ్రీని వహించునొక ప్రియసుతుడు అతిరమ్యాకృతియగు సౌమ్యుడను నాతడు పుట్టెను. అతనికి సౌరాగుడు అన్యరాడ్గజఘటానాశకుడు పుట్టెను. అతనికి చిత్రాంబరుడను కుమారుడు పుట్టెను అతడు భూమండలమునకు ఏకైకమగు న్యస్త కలవాడు. అతని కుమారుడు సారధ్వజుడు అతడు సమస్త భువనాధిపత్యమునకు బ్రసూతివంటివాడు. (జనకుడు) అతని కుమారుడు ధర్ముడు. అతడు రాజనీతిజ్ఞుడు. జయశీలియు నేకధన్వుడు. (పరాక్రమశాలియు) నగు పరీక్షితుడతని కుమారుడయ్యెను ఆ రాజు అన్యనృపదర్ప శాతనుడును అభిమానవంతుడునునగు, జయసేనుని పుత్రునిగా బడసెను. అతనికి విజయసేనుడను కుమారుడు తన కీర్తిచే దిశల నతి ధవళముగా జేయుచుబుట్టెను. అతడు జితవీర్యుని కనెను. అతడు రాజవృషభుడగు వృషధ్వజుని కనెను. అతడు శక్తివంతుడును, అనుల్లంఘనీయ శాసనుడును, విజయేచ్ఛువును, విరోధి

భీషణుడునునై యుండెను. అతనికి ప్రగల్భుడు తనయుడయ్యెను. అతడు ఉత్తీశమార్గాచరణము నందు ప్రగల్భుడు. అతడు తన ఖడ్గధారాజములచేత వైరినారీకపోల స్థల రచిత పత్రభంగములను గడిగివైచెను. అతనికి ఏకసితాత పత్రతిలకుడును వీరుడును, శ్రీ వనితా స్వయంవృతపతియును నగు కోలాహాలుడను కుమారుడు కలిగెను. అతడు గొప్పదగు గంగవాడి దేశమున కోలాహాల మను పురమును (వైష్ణవాలయమును) విష్ణువునకుగల స్వర్గలోక దర్శన కుతూహలమున కవరోధ ముగా నుండునట్లు నిర్మించెను. అతని కుమారుడు విరోచనుడనువాడు. శరాసనయష్టిని పట్టుకొని చోరబాధావివర్జితముగా భూమిని రక్షించెను. స్వశాసన ధిక్కృతి నెఱుగనివా డతడొక్కడే. కోలాహాల పురీభుజులగు నా వంశపు రాజులు (81) ఎనుబదియొక్కమంది పాలించిన పిదప వీర సింహుడనువాడు రాజయ్యెను. అతనికి కామార్ణవుడు దానార్ణవుడు, గుణార్ణవుడు, మారసిం హుడు. వజ్రహస్తుడు అను ఐదుగురు కుమారులుదయించిరి. అంత కామార్ణవుడు తన రాజ్య మును పితృవ్యున కప్పగించి (తండ్రి సోదరుడు) దిగ్విజయమునకై నలుగురు సోదరులతో మహేం ద్రగిరికి బయనమయ్యెను. అచ్చట సురాసుర సిద్ధసాధ్యకిరీటకోటి నిఘృష్టమసృణచరణ పీఠుడగు గోకర్ణస్వామి నారాధించి నమస్కరించి, తత్ప్రసాదమున వృషభలాంఛనమందికొని, సకల సామ్రాజ్య చిహ్నములనుబొంది ప్రకాశించువాడై యారాజు (కామార్ణవుడు) మహేంద్రాచల శిఖరమునదిగి యుధిష్టిరునివలె నలుగురు సోదరులతో ననుసరింపబడువాడై యుద్ధభూమిలో శబలా దిత్యునిజంపి కాళింగదేశమును గ్రహించెను. ఆ దేశమునకు ఇంద్రుని పరిహసింపజాలు పురదంతామ రమను పట్టణము రాజధానిగా నుండెను. కామార్ణవుడు, దానార్ణవునకు, పురదంతామరమును, గుణార్ణవునకు అంబవాడి విషయము, మారసింహునకు సోదామండలమును, వజ్రహస్తునకు కంటకావర్తమును ఇచ్చెను. ఈ విధముగా (36) ముప్పదియారు సంవత్సరములు కామార్ణవుడు కళింగదేశమును పాలించెను. శ్రీమంతులును, అశేషభువన భూపాలమౌళి మాలాలంకార యశ స్కులును అనవరత రాజ్యవినోదాపహసిత మహేంద్రులును, మహేంద్రాచలామల శిఖర ప్రతిష్టితు డును, సకల భువన నిర్మాణైక సూత్రధారుడునగు, గోకర్ణస్వామియొక్క సమారాధనవలన బొందిన నిఖిల మనోరథులును, అగు గాంగ రాజులయొక్క కులము నలంకరించువాడై విష్ణువువలె విక్రమముతో నాక్రాంత సకల మహీమండలుండగు కామార్ణవునియొక్క అనుజుడు దానార్ణవుడు నలుబదినాలుగు (44) సంవత్సరములు రాజ్యముచేసెను. అతని కుమారుడు రెండవ కామార్ణ వుడు ఏబదియైదు (55) సంవత్సరములు రాజ్యముగావించెను. అతనికి త్రివిష్టప తిరస్కారియగు నగరమను పేరిపురము రాజధానిగా నుండెను. మధూకవృక్షమునుండి పుట్టుటచేత లింగాకృతి నున్న ఈశ్వరునకు మధుకేశుడను పేరిడి ఆనగరమందు అభ్రంకషమగు నొక ప్రాసాదమును నిర్మిం చెను. ఆ ప్రాసాదపు ద్వారోర్ధ్వ ప్రదేశమందలి విచిత్ర పత్రలతికా చిత్రములను చూచు దివౌకసు లకు తమతమ భవనములమీద (స్వర్గభవనములమీద) తిరస్కారభావము కలుగును. అతని కుమా రుడు రణార్ణవుడు (5) ఐదు సంవత్సరములు భూమిని పాలించెను. అతని కుమారుడు రెండవ వజ్ర హస్తుడు (15) పదునైదు సంవత్సరములు భూమిని పాలించెను. అతని సోదరుడు మూడవ కామా ర్ణవుడు భూమిని (21) ఇరువదియొక్క సంవత్సరములు పాలించెను. అతని కుమారుడు గుణార్ణ వుడు (27) ఇరువదియేడు సంవత్సరములు భూమి నభివృద్ధికరముగా పాలించెను. అతని కుమా రుడు పోతాంకుశుడు (15) పదిహేను సంవత్సరములు భూమిని నిస్సపత్నముగా జేసెను. పిదప

నాతని సోదరుని కుమారుడు కళింగలాంకుశుడు (12) పండ్రెండు సంవత్సరములు కళింగదేశము నలంకరించెను. పిదప నాతని పితృభ్రాతయగు గుండమహారాజు (7) ఏడు సంవత్సరములు భూమండల మండనుండయ్యెను. అతని సోదరుడు నాల్గవ కామార్ణవుడు (25) ఇరువదియైదు సంవత్సరములు భూమి ననుభవించెను. వారిద్దరికన్న చిన్నవాడగు వినయాదిత్యుడు మూడు (3) సంవత్సరములు భూమిని పాలించెను. పిదప వారిలో జ్యేష్ఠుడగు కామార్ణవుని కుమారుడు నాల్గవ వజ్రహస్తుడు ముప్పదియైదు (35) సంవత్సరములు పాలించెను. అతనిచే దానము చేయబడిన వేల కొలది ఏనుగుల దానవారిచేత భూమి పంకిలమయ్యెను. తరువాత నాతని సుతుడు పంచమ కామార్ణవుడు అర్థ సంవత్సరమును, పిదప నాతని సోదరుడు రెండవ గుండమ రాజు (3) మూడు సంవత్సరములు అతని ద్వైమాతురిని సోదరుడగు (మారుతల్లి లేక రెండవ తల్లి) ఆరవ మధుకామార్ణవుడు (21) ఇరువదియొక్క సంవత్సరములు పాలించెను. పిదప నాతని నందనుడగు వజ్రహస్తుడు (30) ముప్పది సంవత్సరములు పాలించెను. అతని వర్ణనయందు:- గాంగ కులమునందుత్తముడును భువనానందకరుడునునగు నా వజ్రహస్తుని చంద్రకాంతివంటికీర్తి దిక్చక్రవాళమున వ్యాపింపగా తమ ఏనుగులను గుర్తుపట్టలేక దిగ్గజముల మావటీంద్రువాని (దిగ్గజముల) కుంభస్థలములయందును, పట్టకములను, దట్టమైన సింధూరముతో పూయుచున్నారు. గుణవంతుడగు నాతని యందలి అనురాగముచేత హృదయ ముఖాబ్జములయందు శ్రీ సర్వతులు ఉపవిష్టలై యతని కనుకూలలుగానుండిరి. త్రిలింగనాధునికి వజ్రహస్తనామము కేవలము నామముగాక సార్థకమైనది. వజ్రహస్తుడు తప్ప మరొకడెవడు భూమియందుపడుచున్న వజ్రము నాపనోపును? అతని పుత్రుడు రాజరాజు. అష్టాదమునకు రాజు. అతని వర్ణమునందు :- ఆ రాజు ముందు లక్ష్మిని జయించెను యుద్ధోత్సాహముకలవాడై చోడరాజ కుమార్తెను వివాహ మాడెను. వేంగిని వెంటనే వదలెను. అది ఉదయకాలపు టాకాశమువలె నుండెను. చోడరాజ్యమునందు విజయాదిత్యునికి పట్టము గట్టెను. ఆపన్నులకు పరమ శరణ్యుడును, లక్ష్మీ సంసేవ్యుడునునగు విజయాదిత్యుని పశ్చిమ దిక్కునందు రాజును చేసెను. అతనికి పెద్ద కుమారుడు చోడగంగుడు అతడు నిజభుజా విక్రమార్జిత సారసత్త్వుడు. సత్యత్యాగైకసీమ. విమలతర యశశ్చంద్రికాధౌతలోకుడు. వాగుల్లంఘ్య ప్రతాపుడు. శుభ చరితనిధి. భాగ్యసౌభాగ్య రాశి. క్షోణీప్రాణాధినాధుడు. సకల రిపు మనో భంగకారియు నగువాడు, శకాబ్దములు (999) నందరంధ్రగహ గణితమగు దానియందు కుంభ సంస్థనుగు దినమందు రేవతి నక్షత్ర యుక్తమీనలగ్నమందు గంగాన్వయమను తామరసవనమునకు దినకరుడును, విశ్వవిశ్వంభరా చక్రమును రక్షించుటకుగాను, సద్గుణనిధియు, నధిపుడును నగు చోడగాంగుడు పట్టాభిషిక్తుడయ్యెను. శత్రుగర్వమును నాశనముచేయు అతని భుజదండ యుగ్మకలితమై వరలక్ష్మి భుజస్తంభద్వయ నియంత్రితమగు కరణీ సాదృశ్యము నందుచున్నది. అతని పాద ద్వంద్వము క్షోణీభృతుల మౌళుల సంపర్కము కలదై మధుపశ్రేణీ సమాశ్రితమగు పద్మశోభమ వహించుచున్నది తూర్పు దిక్కున ముందుగా ఉత్కలపతిని రాజపీఠమున నుంచి యద్భుతముగా, తరువాత పశ్చిమదిక్కున వేంగీశుని సుప్రతిష్ఠితుని జేసి వీరిద్దరి రాజ్యలక్ష్ములకు వందన మాలికను జయశ్రీ తోరణ స్తంభములకు వలెకట్టి దానివలన మహాకీర్తిని శ్రీ గంగ చూడామణియందు కొనెను.

మహారాజ, రాజాధి రాజ, రాజ పరమేశ్వర పరమ భట్టారక, పరమవైష్ణవ, పరమ బ్రాహ్మణ్య, మాతాపితృ పాదానుధ్యాతుడైన శ్రీ చోడగంగదేవుడు రాష్ట్రకూట ప్రముఖ పరివారముల నాహ్వానించి ఆజ్ఞాపించుచున్నాడు. విదిత మగుగాక. మంత్రి పురోహిత సేనాపతి యువరాజు దౌవారిక సమక్షమునం దిరీతిగా తెలుపబడినది.

చోడగంగు మహారాజాధిరాజు, క్షత్రియోత్తముల పాలిటి మహేంద్రుడు ఆయన భార్య గుణభూషణ, సుచరిత శ్రీ చోడగంగు ప్రభువుకు ఛాయనుగ అయినట్టిది. వారిరువురికి కలిగిన సుపుత్రుడు, శస్త్రాస్త్ర విద్యా ప్రవీణుడు సరస్వతీ పుత్రుడైన శ్రీ మత్కామార్ణవుడు. ఆ చోడగంగుడు తన ఆప్తభృత్యులకు ప్రీతితో కళింగ దేశమందలి ఎఱద విషయమందు తన తండ్రి యశోభివృద్ధికి, షోడశ గ్రామములను దానమిచ్చెను.

శకవర్షములు పంచాశదుత్తర సహస్రమున సరియగు చోడగంగదేవుని విజయరాజ్య సంవత్సరమున పంచ పంచాశదుత్కళదేశమున నివ్వెర అను రాజధానియందు మిధున కృష్ణ ద్వాదశీ ఆదిత్యవారమున పూర్వాహ్ణమున ధారా పూర్వకముగా ఆచంద్ర తారార్కము సర్వ భోగార్థమీయబడినది. ఇచ్చట మరి వేరు భావము లేదు. అందుచేత ఇచట గ్రామ నామములు వ్రాయబడుచున్నవి గోర్దఙ్ఖి, వేఱుము, గోసేలు, పరింకాము, తాడివడ, తొత్తడణ, డిప్యాము, గ్రుంపియము, గంధివడ, నడుపల్లి, క్రొవ్వడ, వృద్ధి, మ్రాను, కంచరణ అను చతుర్దశ గ్రామములు, కనుమద్ది, ముక్రాము, ఎల్సివాడ, అను మూడు గ్రామములు దేవభోగములుగా నివ్వగా మొత్తము పదునేడు గ్రామములగుచున్నవి. ఈ గ్రామములకు సరిహద్దులు వ్రాయబడుచున్నవి.

గోర్దఙ్ఖి:- పూర్వదిశన గత్త ఆగ్నేయముగా చింతచెట్టు, పశ్చిమముగా కోణముగా గ్రుండియము, ముఱజబోదు, చెఱువు, త్రికోణములోగల చింత చెట్టు, పడమరగల చింత చెట్టు, దక్షిణముగా తొత్తడ, గోర్ది వాడల మధ్యగల చింత, వెలగచెట్లున్న కలవు. తరువాత గ్రుంపియము, నడుపల్లి, వల్సివాడల త్రికూటమునగల చింత చెట్లు గారచెట్లుగల భూమియున్న ప్రదత్తము, తదుపరి గందివడ అంపడల మధ్యగల సేతువు వాని దెగ్గరనున్న గారచెట్టు తరువాత నైఋతిలోగల నడుపల్లి, క్రొప్పల్లి, త్రికూటములోగల వాప్యోసలి పుట్టయున్న చింతచెట్టున్న తరువాత క్రొవ్వాడ, గండివడ, క్రొప్పల్లి త్రికూటము నందుగల చింత చెట్టు పుట్టలున్న పడమర తాడివడ, తాలండి, క్రొప్పల్లి త్రికూటమునగల రాతిగర్త, పులిగోరు, చెట్టున్న, ప్రక్కన చింత చెట్టు దానికి పడమర క్రొవ్వాడ, మ్రాము గ్రామముల త్రికూటములలోగల ఇలింది వృక్షములు, రేంగోము, మ్రోము, గ్రామముల మధ్యగల చింతచెట్టు తరువాత వృద్ధి గ్రామముల త్రికూట ములో గల తింత్రిణీ వృక్షములు తరువాత ధవళమాడిద వృక్షములు, అటు పిమ్మట మఱుంగోలి గ్రామముల త్రికూటములోగల తటాకము తరువాత పోల్నాటి, రోంగాలి గ్రామముల మధ్యగల తింత్రిణీవృక్షములు, తర్వాతగల పాలచెట్టు తరువాత చెఱువు మధ్యగల మహోటక. పితృన్నాత ములు తదుపరి ముక్రోము అంగోలి, పరింకాము గ్రామముల మధ్యగల తెల్ల ఎలుక చెట్టు, తరు వాత పాలచెట్టు, వాయువ్యముగ గాట్ట (గత్త) చిశాలాండ-దేమ్య త్రికూటమున గల పర్వ తము తరువాత కొండనేల-ఉత్తరమున కనుమద్ది, కలుమడుగు గ్రామముల మధ్యగల పర్వతము

వల్సివాడ, కలిమఱు, మదేలివాడ గ్రామముల త్రికూటములుగల పర్వతము. కొండగల పుట్టలు తరువాత వల్సివాడ లివాడల మధ్యగల చింతచెట్టు, తరువాత నారింజచెట్టు ఈశాన్యమున దొర పూండి మవ్వాడ, వెలివాడల త్రికూటమునగల పర్వతము, కొండగల పుట్టలు తరువాత వల్సివాడ లివాడల మధ్యగల చింతచెట్టు, తరువాత నారింజచెట్టు ఈశాన్యమున దొరపూండి మవ్వాడ, వెలి వాడల త్రికూటస్థలి వార్నమ దొరపూడి గ్రామముల మధ్య త్రికూటమున తింత్రిణీ వృక్షములు, వాటి ప్రక్కనగల చెఱువులోగల పెద్దపుట్ట, తరువాత చకస్థలి మఱుంపల్లి, మఱుము, దొరపూడి, గోర్దఖి గ్రామముల త్రికూట స్థలిలో తింత్రిణీద్వయము,- మెఱుము గ్రామముల మధ్యనగల పాలచెట్టు, తరువాత పుట్టగల చింతచెట్టు, తరువాత గోర్దఖిలో గ్రామముల ఎత్తు నేలపైగల గుల్మవృక్షములు తరువాత ఆ ప్రదేశము ప్రక్కగల ఉగ్రిణ గోర్ధఖి సంప్యము గ్రామ త్రికూట మునందుగల తింత్రిణీవృక్ష సమూహాములు.

తరువాత శాసనాంతమున సంప్రదాయానుసారముగ వ్రాయుశ్లోకములు, శాసనము చివర శాసనాధికారియగు భాస్కరభట్టు పేరు, శాసనలేఖకుడు శాసనాధికారి చాళుక్య గంగాచార్యజామాత మాంగనాచార్యుని పేరును పేర్కొనబడినవి.

# శ్రీమదనంతవర్మ చోడగంగదేవుని తెంబూరు తామ్రశాసనము

## శాసము - మూలము

### మొదటి రేకు - రెండవ ప్రక్క

1. ఓం. లక్ష్మీనిషేవ్య ముదురాజకలంకకాంతి బాహాచతుష్టయచణం వపురా

2. దధానః । ప్రాదుర్బభూవ భువనత్రితయం విధిత్సు ర్విశ్వప్రసూతిజఠరో

3. భగవా ననంతః । తన్నాభినలినాద్బభూవ భువన ప్రారంభదీక్షారతో

4. బ్రహ్మవేదపరంపరాం (ప) రిదధద్వక్త్రైశ్చతుర్భి స్తతః ప్రాజాపత్యధురాధిరూ

5. ఢమహాసామత్రిమ్మునీనాం ప్రభుర్జ్ఞాతస్సర్వజనీనదివ్యతపసాం ప్రా

6. తోవపుష్మానివ । అత్రేః పుత్రో బభూవ త్రిపురహరజటాజూటనేపథ్య

7. రత్నం నేత్రవ్యాపారదేశః స్మరచరితమహానాటికాసూత్రధారః దృ

8. ష్టాంతో దాక్షిణాత్యముఖముకురరుచాం శర్వరీదీ(రీ)జీవితేశ(ః) త్ర (త్రై)లోక్యానందకం

9. దొంగనతలమహాంబోధిశంఖశ్శశాంక । తతో జగత్తాపభిషజ్జితత్విషశ్శుభ

10. గ్రహోఽభూద్విబుధాగ్రణీర్బుధః పురూరవా స్తత్తనయో యదుల్లసద్భుజే

11. భుజిష్యాంబుభుజేవసుంధరాం । తస్మాదాయుశ్శుభం యుస్త్రిభువనవిదితో

12 జన్మలేభే తదీయఃపుత్రోఽభూజ్జైత్రబాహుర్నహుషనరపతి ర్భూభృతామగ్రగణ్యః.

13. యః పృథ్వ్యామేకపత్న్యా మన(ను)భవవిముఖో భూరిజాతప్రజాయాం స్వ

## రెండవ రేకు - మొదటి ప్రక్క

1. వ్వైశ్యాం ఖణ్డితేంద్రాం ప్రణయపరవశః పౌరుషేణాన్వభుఙ్క్త । తతోయయా

2. తి వ్విజితాఖియాతి జ్జజ్ఞే తతస్యువ్వ సురువ్వరస్వః సపూర్వ్వగీర్వ్వాణగురో

3. మ్మహిమ్నా మాతామహస్యో రసిసంప్రవృద్ధః । అపుత్రత్వంప్రాప్త స్సుచిరను

4. తిఖిన్నోన్నృపవృషస్సగంగామారాధ్యం నియతగతిరారాధ్యవరదాం । అజేయ

5. ం గాంగేయం సుతమలభతారభ్యచ తదాక్రమ స్తద్వంశ్యానాం భువిజయతి గ

6. ంగాన్వయఇతి ॥ అస్యాసీత్తనయో విరోచనవిభుర్వైరిగ్రహాస్తాచలః

7. క్షోణీనాథ కిరీటపత్రమకరీ లగ్నాంఘ్రిరేణూత్కరః లక్ష్మీవాగ్వనితా

8. మహాకులనదీ సంవేద్యముద్యోగినం సంవేద్యం సమజీజనత్స నృపతిగ్గంగా

9. న్వయోత్తంసకం ॥ సంవేద్యతో మణిరివాజనినామభాస్వాన్ భూపాలమౌళిమ

10. కుటై రుపలాలనీయః । త్రాసాదిదోషరహితస్సబభూవపుత్రీ యస్సంపదాని

11. ధిరజాయత దత్తసేనః ॥ తస్యోర్వ్వీశ్వరమౌళి మణ్డనమణే రాసీదసాధారణాం వి

12. ఖ్యాణోనృపతిశ్రియం ప్రియసుతస్సోమ్యోతిరమ్యా కృతిః । తస్మాదప్యుదపాది

## రెండవ రేకు - రెండవ ప్రక్క

1. మోదితజగచ్చక్రోంశుదత్తస్త తస్మాన్రాగో భవదన్యరాడ్గజఘటా పాతక్రియా
2. పాకలః ॥ తస్మాచ్చిత్రాంబరోభూ త్క్షితితలవలయే రాజశబ్దైకవాచ్య స్సూనుస్సారధ్వజోస్యా।
3 భవ దఖిలభువామాధిపత్య ప్రసూతి (ః) । ధర్మ్మాద్ధిత త్తనూజో నృపనయపదవీపాం
4 ధముఖ్యో విరేజే బభ్రాజాపత్యమస్య క్షితిజయపరవా నేకధన్వాపరీక్షిత్ । సమ
5. హీపతిస్సుతమవాపమానినం జయసేనమన్య నృపదర్ప్పశాతనం । అభవత్సుతో
6 స్య (జ) యసేనసంజ్ఞితః ప్రథయన్దిశాంసి దుకూలితయశః । జితవీర్య్యమసా
7 వజీజనత్సచభూపాలవృషంవృషధ్వజం సహాశక్తి మలంఘ్యశాసనం వి
8 జిగీషుం సవిరోధిభీషణం । తస్యప్రగల్భ స్తనయోబభూవ క్షితీశమార్గా
9 చరణప్రగల్భః యః ఖడ్గధారాజలధౌతవైరి నారీకపోలస్తల పత్రభంగః । ఆసీ
10 దేకసితాతపత్రతిలక క్షోణీభృదస్యాత్మజో వీరశ్రీవనితాస్వయం వృతపతిర్ద్దే
11. వస్సకోలాహలః నిర్మ్మాణయోజ్జిత గంగవాడివిషయే కోలాహలాఖ్యాం పురం య
12 శ్చక్రే సురసద్మవీక్షణరస ప్రత్యూహమక్షాం హారేః ॥ తత్సుతో ధృతశరాసనయష్టి
13 గ్గాఢమురతు దపవర్జ్జిత చౌర్య్యః । శాసనప్రథితపాశవిధేయా యేకవసవిరోచ
14 నాంజ్ఞః । గతేత్రతనరేంద్రాణాం కోలాహలపురీభుజాం । ప్రకాశిత్వంచ తద్వంశ్యో

## మూడవ రేకు - మొదటి ప్రక్క

1. వీరసింహోఽభవన్నృపః ॥ తస్యకామార్ణవస్సూను ర్దానార్ణవగుణార్ణవౌ । మారసి
2. ంహ ఇతిఖ్యాతో వజ్రహస్తాఖ్య పంచమాః ॥ అథ కామార్ణవోదత్వా పితృవ్యాయ
3. నిజోమ్మహీం । ప్రాయాత్పృథ్వీం భువంజేతు మ్మహేంద్రం భ్రాతృభిగ్గిరిః ॥ తత్రచ సకల
4. సురాసురసిద్ధసాధ్యకిరీటకోటినిఘృష్టమసృణచరణపీఠమారాధ్య గోకర్ణస్వామి
5. నమస్య ప్రసాదాత్సమాసాదిత వరనృషభలాంఛన స్సముపలబ్ధ సకలసాంమ్రాజ్యాచి
6. హ్నా ప్రశోభమానస్సనరేంద్రో మహేంద్రాచలశిఖరాదవతీర్య్య యుధిష్ఠిరఇ
7. వ చతుర్భిరనుజై రనుగమ్యమాన స్సమరశిరసిశబలాదిత్యంనిహత్య
8. కామార్ణవః కలింగానగ్రహీత్ । తస్యచాపహసిత సురేంద్రాపురం దంతా మరల్నామ
9. నగరీరాజధాన్యాసీత్ । అసౌ దానార్ణవ మనుజకంఠికాబంధురకంధరం విధాయగుణా (ర్ణ
10. వాయాంబవాడివిషయం మారసింహాయ సోదామణ్డలం వజ్రహస్తాయ కంటకవ ర్త
11. నీ మదాత్ । ఏవంచ క్రమేణష ట్త్రింశద్వర్షాన్ కలింగానపాలయత్ । తస్యచ శ్రీమతా
12. మశేష భువనభూపాలమౌళి మాలాలంకారయశసాన్ని జరాజ్యసంపదపహాసి
13. త మహేంద్రాణా మ్మహేంద్రాచలా మల శిఖరప్రతిష్ఠితస్య సకలభువన

## మూడవ రేకు - రెండవ ప్రక్క

1 నిర్మాఁణైక సూత్రధారస్య చరాచరగురో బ్భఁగవతో గోకర్ణ్ణఁస్వామినస్సమా

2. ౼రాధనలబ్ద నిఖిలమనోరథానా మాత్రేయగోత్రాణాం గంగానాంకులమలంక

3. రిష్ణో ర్వ్విఁష్ణోరివ విక్రమాక్రాంత సకలమహీమణ్డలస్య కా(మా)ర్ణ్ణఁ వస్యానుజో దానార్ణఁ

4. వశ్చత్వారింశతమబ్దకాఁ రాజ్యమకాషీఁత్॥ తత్సూనుర్ద్విఁతీయఃకామార్ణఁవః ప

5. ంచాశద్వర్షాఁ న్మహీమణ్డలమమణ్డయత్। తస్యతిరస్కృతత్రివిష్టపంనగర

6. న్నామ పురమాసీత్॥ తస్మిఁన్సో పిమధూకవృక్షజననాధీశస్యలింగాకృతే

7. ః కృత్వాఖ్యాం మధుకేశఇత్యరచయ త్ప్రాసాదమభ్రంకషం యద్వారోర్ద్ధ్వఁ విచిత్రప

8. త్రలతికా చిత్రాణివాపశ్యతాం సౌధాన్యంబరవ_ర్తి(ఁ)నాం హృదిభవేన్మ్నానం వి

9. మానారుచిః తత్తనయో రణార్ణఁవః పంచవర్షాఁన్ మహీ (మ) పా (ల) యత్। తత్సూనుర్ద్విఁతీయో వజ్ర

10. హ_స్తః పంచదశసమాః క్షమామరక్షత్। తస్యానుజస్త్రితీయః కామార్ణ్ణఁవోర్ణ్ణఁవమేఖ

11. లామేకోనవింశతివత్సరా న్సమవర్ధఁయత్। తత్సుతోగుణార్ణఁవ స్స_ప్తవింశ

12. తిమబ్దామబ్ధిరశనాం వశమనై_షీత్। తదాత్మజఃపోతాంకుశః పంచదశవత్సరాఁ మ

13. హిన్నిస్సపత్న్యా మకామషీఁత్। తద_స్తద్భ్రాతుస్సుతః కలి(ం)గలాంకుశో ద్వాదశవత్సరా

## నాలుగవ రేకు   మొదటి ప్రక్క

1. ఞ కలింగా నలంచకార। తతస్తస్య పితృభ్రాతా సప్తవర్షాణ్ గుండమరాజో మహీమణ్డల
2. మణ్డనో బభూవ। తస్యానుజ శ్చతుర్ణః కామార్ణవః పంచవింశతివర్షాన్ వసు
3. ంధరామనుబభూవ। తయోః కనీయాన్వినయాదిత్యో వర్షత్రయం ధరిత్రీమ
4. త్రాయత। తతస్తజ్జ్యేష్ఠస్య కామార్ణవస్యసుతశ్చతుర్థో వజ్రహస్తః పంచ
5. త్రింశదమబ్దకాన్। యద్దత్తదంతి సహస్రదానవారిణాజ్జనవారిణాచ కువలయం
6. పంకేలనూసీత్। తతస్తత్సుతః పంచమకామార్ణవో ర్ద్ధమాసమాం। తతస్తదను
7. జో ద్వితీయోగుణ్డమరాజ స్త్రీణి। తస్యద్వైమాతురో భ్రాతాషష్ఠో మధు
8. కామార్ణవ ఏకోనవింశతివర్షాణి। తతస్తదీయనందనో వజ్రహస్త స్త్రిం
9. శతమబ్దకాన్। తద్వర్ణనే॥ వ్యాప్తే గంగకులోత్తమస్యయశసా దిక్చక్రవాలే శశి
10. ప్రద్యోతామలినేన యస్యభువన ప్రహ్లాదసంపాదిన సింధూరై రతి సాంద్రపం
11. కపటలైః కుంభస్థలీపట్టకే ష్వాలింపంతి పునః పునశ్చహారితా మాధోరణావాస్తా
12 అనురాగేణ గుణినో యస్యవక్షోముఖాబ్జయోః ఆసీచ్చే శ్రీసరస్వత్యా ఏ
13. నుకూలే విరాజితః॥ ననామతః కేవల మర్థతోపి సవజ్రహస్త స్త్రికలింగనా
14 థః। కోవజ్రహస్తా దపరః పృథివ్యాం వజ్రం పతద్వారయితుం సమర్థః। తత్సుతో

## నాలుగవ రేకు - రెండవ ప్రక్క

1. రాజరాజో ష్టవస్స(త్స)రాణ్ణా। తద్వర్ణనే । సరాజః ప్రథమం జయశ్రియః పతిర్బ్భూ
2. భూవ ద్రమిలావహోత్సవిరాజమానా మధరాజసుందరీ ముదూఢవాంశ్చోడ
3. మహీభుజాత్మజాం । త్యక్త్వా వేంగిం సపదిపరిణామోదయే ద్వామివాన్యాం చోడవ్యా
4. జే మహావిజయాదిత్యమభ్యౌమిమ(ం) తు । ఆపన్నానాం పరమశరణం రాజ
5. రాజ్ఞోవిచిత్రం లక్ష్మీభాజం సుచిరమకరో త్పశ్చిమాయాం దిశాయాం॥ తస్యాసీ
6. దగ్రసూనుః పృథులనిజభుజా విక్రమార్జ్జితస్సార సృత్యత్యాగైకసీమా విమ
7 లతరయశశ్చంద్రికా ధౌతలోకః వాగుల్లంఘిప్రతాపః శుభచరితనిధి
8. ర్బ్భాగ్యసౌభాగ్యరాశిః క్షోణీప్రాణాధినాథ స్సకలరిపు మనోభంగ
9 దశ్చోడగంగః । శాకాబ్దే నందరంధ్రగ్రహగణగణితే । కుంభసంస్థేదినేశే శుక్లేపక్షే తృ
10. తీయా యుజిరవిజదినే రేవతీభే నృయుగ్మే । లగ్నే గంగాన్వవాయాంబుజవనదిన
11 కృద్విశ్వవిశ్వంభరాయా శ్చక్రం సంరక్షితుం సద్గుణనిధిరధిప శ్చోడగంగోభిషిక్తః ॥
12. పీరశ్రీభుజదణ్డయుగ్మకలితా యస్యారిదర్పచ్ఛిద స్తంభద్వంద్వనియంత్రితైక కర
13. ణీసాదృశ్యమాశ్లిష్యతి । యత్పాద ద్వితయాంతరాలమిలితాః క్షోణీభృతామౌళ
14. లయ స్థాయత్పద్మయుగానుసారి మధుపశ్రేణీశ్రియం బిభ్రతి॥పూర్వస్యాం ది

## ఐదవ రేకు మొదటి ప్రక్క

1. శ్రీ పూర్వ్వ ముత్కలపతిం రాజ్యేనిధాయాద్ధృతం పశ్చాత్పశ్చిమది_క్తటే విఘటితం వేంగి
2 శమప్యేతయోః । లక్ష్మీం వందనమాలికా మివజయశ్రీతోరణ_స్తంభయో బ్బద్ధ్వాతిస్మ
3. సమిద్ధకీ_ర్త్తి విభవ శ్రీగంగచూడామణిః॥ యస్సంఖ్యేజయగొణ్డచోడ మవధీద్య
4. _స్త్రీర్ణ బాహాసినా పాత్కృ_త్త ప్రబల త్రిలోచన గలద్రక్తప్రవాహైర్ధ్రువం । సంగ్రామార్ణ్ణ
5. మ పూరయత్ స్ఫుటతరం యః కర్ణ రాయం రణే సర్వ్వస్వంచ విజిత్య చోత్కలభు
6. వస్సాంబ్రాజ్యలక్ష్మీ మదాత్॥స శ్రీమదనంతవర్మ్మ మహారాజో రాజాధిరాజో రాజపరమే
7. శ్వరః పరమభట్టారకః పరమవై_ష్ణవః పరమబ్రాహ్మణ్యః మాతాపితృ పా
8. దానుధ్యాత శ్రీచోడగంగదేవః కుశాలి కాలింగదేశే ఎఱూదవిషయే రాష్ట్రకూటప్రము
9. ఖాన్కుటుంబిన స్సర్వ్వానాహూ యే త్సమాజ్ఞాపయతి విదితమ స్తు వో మంత్రిపురోహిత సే
10 నాపతి యువరాజ దౌవారిక సమక్షం యథా । అసీత్సంబర్ నాయకో గుణనిధి ర్వి
11. ప్రాగ్రణీ స్సత్యభూ _స్తత్పుత్ర స్సుజనై_కబంధు రతులశ్రీబొర్న్న యాఖ్యః కృతీ । తద్భార్య్యా గుణభూ
12. షణం సుచరితా శ్రీచోడగంగప్రభో... నామదేయ మహితా సత్యాన్వితా త్యాగ
13. భూః । తాభ్యాం జాతస్సుపుత్ర స్సకలగుణనిధి శ్శస్త్రశాస్త్రప్రవీణ స్సత్రిశ్రీచోడగం
14. గ్గః విమలభుజబల స్సత్యవాణీప్రసూతిః । శ్రీమత్కామార్ణ్ణవస్య స్థిరతరయశసః స్సో

## ఐదవ రేకు - రెండవ పత్రిక

1. దరః శాయ్యర్ భూమిస్నేహాస్థానం ప్రభూతం సకలనృపపతేశ్చోడగంగ్గాధిపస్య॥తస్మై త్రై
2. చోడగంగ్గయాస్మాక మా త్తభృత్యాయ ప్రీతైరస్మాభిః కలింగ్గదేశే ఎఅదవిషయే గోర్ద్దభినా
3. మ సంభోగః షోడశ గ్రామైస్సమేత స్సజల స్థల స్సర్వపీడావివర్జితః పిత్రోరాత్మనశ్చ పుణ్య
4. యశోభివృద్ధయే శకాబ్దే ష్వేకపంచాశదుత్తరసహస్రేషు శ్రీచోడగంగ్గదేవ విజయ
5. రాజ్యసంవత్సరేషు పంచపంచాశదుత్కలదేశే నివాలినామరాజధాన్యాం స్థితైమ్మిర్మర్ధు
6. నకృష్ణ దశమ్యా మాదిత్యవారే పుర్వాహ్ణే ధారాపూర్వ్వక మాచంద్రాక్కర్
   సర్వ్వకరపరి(హా)
7. య్యర్ (౦) ముపభోగార్త్థం ప్రదత్తః ఇతి॥ అత్రతనకేనచిద్భావః కర్త్తవ్య తత్రగ్రా
8. మనామాని లిఖ్యంతే॥ గోర్ద్దభి వేఱుము గొసేఱుపరింకావు। తాడివడ
9. తొత్తడాణ చర్ంప్యము గుంప్రియాము గందివడ నడుపల్లిక్రొవ్వడ• వృద్ధి
10. ప్రమాము కంచరణ ఇతిచతృర్శ (చతుర్దశ) గ్రామాఃకనుమద్ది ముక్రోమ వేల్సవాడ
11. ఇతి త్రయోగ్రామా దేవభోగాః ఇతి మిలిత్వా సప్తదశగ్రామాః గోర్ద్దభిస
12. ంభోగస్య సివా(మా)లింగాని లిఖ్యంతే। పూర్వ్వతఃగత్తార్ । ఆగ్నేయతః దేవాడసి
13. మ్మి తింత్రిణీవృక్షః పర్వ్వతకోణంచ చోంపియాక్షైము ముఅజబోడు వాపి

## ఆరవ రేకు - మొదటి ప్రక్క

1 నాం త్రికూటే తటాకపాలిస్థిత తింత్రిణీ (వృ) క్షసమూహాః పరతి తింత్రిణీ వ్రి
2 క్షః । దక్షిణతః తొత్తడా గొద్దివాడ యోమ్మర్ధ్యే తింత్రిణీవృక్షః కపిత్థశ్చ । ...
3 ః గ్రుంపాము ఋాంగోలి మార్గసివామినాం త్రికూటే తింత్రిణీవృక్షాః ... రేంగు వృ
4. క్షాస్థలీచ । తతోగండ్డివాడ(ల)అంపాడయో మర్ధ్యేదిగ్వ్సేతుః చికురేంగు
5 వృక్షాః । తతోనడుపల్లీ క్రొప్పల్యోమ్మర్ధ్యే ఇలిందివృక్షః నిచులవృక్ష తింత్రి
6. ణీ వృక్షాశ్చ । నైరృత్యాం నడుపల్లి క్రొప్పల్యా ణ్మధ్యగర్తాః తింత్రిణీవృక్షా
7. శ్చ తతోగడ్డివాడ నడుపల్లి క్రొప్పల్లినాం త్రికూటే వాపీస్థలివల్మీకాస్తత
8. ః తింత్రిణీ వృక్షాశ్చ । తతః క్రొవ్వాడ గడ్డినాడ క్రొప్పలినాం త్రికూటే తింత్రిణీ వృక్షా
9. ః వల్మీకాశ్చ పరత స్త్రాలడ్డి క్రొప్పల్లి మోమునాం త్రికూటే పాషాణగర్తాః ... ...
10. వృక్షాః పరతో తింత్రిణీ వృక్షాశ్చః పశ్చిమతః క్రొవ్వాడ మోపు వృద్దినాం త్రికూటే తిం
11. త్రిణీ వృక్షాః కపిత్థశ్చ వల్మీకాశ్చ । పరతః రేంగాము తాలడ్డ మోము గ్రామాణాం త్రి
12 కూటే ఇలిందివృక్షాః రేంగాము మోము గ్రామయోమ్మర్ధ్యే తింత్రిణీవృక్షాః ।
13. తతః ద్వ (కి) మోము...గ్రామాణాం త్రికూటే తింత్రిణీ వృక్షాః తతః.........

## ఆరవరేకు - రెండవ ప్రక్క

1. గ్రామయోర్మధ్యే తింత్రిణీవృక్షాః తతో ధవలమాడికి వృక్షాః । తతో వ్యటపాలా
2. ముఱుంగొలి గ్రామాణాం త్రికూటే తటాకః తతః పొల్నాడఱాగొలి గ్రామయోర్మ
3. ధ్యే తింత్రిణీవృక్షాః । తతః క్షీరవృక్షాః । తతస్తటాక మధ్యేమహాటక పితృవృక్షాః ।
4. తతో ముక్రోమ ఱోంగొలి పరికాము గ్రామాణాం త్రికూటేతింత్రిణీవృత్తు సమూహో
5. ః । తతో ముక్రోమ పరికాము గ్రామయోర్మధ్యే ధవలమూషికవృక్షాః । స్తతఃక్షీ
6. ర వృక్షః । తతః పాషాణ సహిత దిగ్బ్పాలి । తతో దాకమహాతింత్రిణీ వృక్షః । వాయ
7 వ్యతః గోర్ద్ధఖి తాలణ్డా దిమ్మ్యగ్రామాణాం త్రికూటేపర్వత స్తతః పర్వతఞోణీ
8. భృద ఉత్తరతః కనుమద్ది కలుమడుము గ్రామయోర్మధ్యే పర్వతః
9. మల్నవాడ కలిమడుమ వేలివాడ గ్రామాణా (ం) త్రికూటేపర్వతవాక
10. కొణ్డధిగ్వ వల్మీకాః తతోమల్నవాడ వాల్నవాడయోర్మధ్యే తింత్రిణీవృక్షాః తతో నార
11. ంజి వృక్షాః । ఈశానతః । దొరపుణ్డి మల్వాడ వెలివాడానాంత్రికూటే గర్తా । వెలణ
12. ము దారపూణ్డి గ్రామయోర్మధ్యే గర్తా పరకూటే తింత్రిణీవృక్షా తతః తంత్రిణీవృ
13. తుసమూహా సమీప (భగ్నె ౨) తడాక మధ్యమహద్వల్మీకాః తతోచక లి । మణపల్య
14 ముఱును దొరపుణ్డి గోర్ద్ధఖి గ్రామాణాత్రికూటేస్థలసహిత పాలిసమప తి
15. ంత్రిణీద్వయం । వేఱమగ్రామయోర్మధ్యే క్షీరవృక్షాః । తతో వల్మీక

## ఏడవ రేకు మొదటి ప్రక్క

1. తింత్రిణీవృక్షాః । తతో గొర్దఖిద గ్రామ వేఱముగ్రామాణాం త్రికూటే భగ్నతడాపా
2. లిస్థిత తింత్రిణీ వృక్షాః । తతో గొర్దఖి యాగ్రామగ్రామయోర్మధ్యే మంటుగుల్మస
3. హితస్వపగర్తః తతో నంద్రికవృక్షః । తతో గర్తాః పరతః ఉగ్రాణగోర్దఖి సేం
4. వ్యము త్రికూటే తింత్రిణీవృక్షసమూహః ఇతి॥ బహుభిర్వసుధాదత్తా బహుభి
5. శ్చానుపాలితా యస్యయస్యయదాభూమి స్తస్యతస్యతదాఫలం స్వదత్తాం పరద
6. త్తాంవా యోహరేత వసున్ధరాం । షష్టింవర్ష సహస్రాణివిష్టాయాం జాయతే కృ
7. మిః॥ షష్టివర్షసహస్రాణి స్వర్గేతిష్ఠతిభూమిదః ఆక్షేప్తాచానుమం
8. తాచ తాన్యేవ నరకే వసేత్ । కవిశ్శాసనాధికారీ భాస్కరభట్టః లే
9. ఖకః సాశనాధికారి (శాసనాధికారి) చాలుక్యగంగాచార్యజామాతా మాంకనాచార్యః॥

# కందూరి చోడులు

నేటి ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణ ప్రాంతమున మహబూబునగరము, నల్లగొండ మండలము లందు, తెలుగు చోడ వంశీయులలో నొకశాఖవారు కందూరి చోడులుగా ప్రసిద్ధిజెంది, కల్యాణీచాళుక్యులకును, కాకతీయులకును, సామంతులుగా వ్యవహరించి పాలించినారు. ఈ వంశీయుల రాజధానులుగా వర్ధిల్లిన నగరము లలో కొలనుపాక, కందూరు, వర్ధమానపురము, పానగల్లు ముఖ్యమైనవి.

కందూరి చోడ వంశీయులకు సంబంధించిన శాసనముల నాధారముగా గొని, రాజుల కాలమును, చరిత్రను కొంతవఱకు తెలిసికొనవచ్చును.

## కందూరి చోడుల శాసనములు

1. కొలనుపాక — తొండరసచోళ మహారాజు. చా వి. సం. 13 —
— A. P Govt Arch. Series No. 3 Ng. 48.

2. కాప్పోలు — తొండయచోళ మహారాజు.

3 కొలనుపాక— కుమార కొండయచోళ మహారాజు. చా వి. సం 24.
— A. P. Govt Arch. Series No. 3. Ng 46.

4. గట్టుతుమ్మెన—నల్లభీమదేవచోడ మహారాజు. చా. వి. సం 30.
— Hyd. Arch Series No 19 Mn. 10.

5. ఉప్పునూతల— సోమనాథదేవచోడ మహారాజు చా వి. సం. 32.
— Hyd. Arch. Series No. 19. Mn. 45.

6 ఏలేశ్వరం — గోకర్ణదేవచోడ మహారాజు. చా. వి. సం. 33.
— A. P. Govt. Arch Series No. 22. No. 333.

7. ఏలేశ్వరం — గోకర్ణదేవచోడ మహారాజు. చా. వి సం 33.
— A. P. Govt. Arch. Series No 22, No. 339.

8 ఏలేశ్వరం— గోకర్ణదేవచోడ మహారాజు. చా. వి. సం 33.
— A. P. Govt. Arch. Series No. 22 No 344.

9. మామిళ్ళపల్లి— గోకర్ణదేవచోడ మహారాజు. చా. వి సం 41. సౌమ్యసంవత్సరము.
— Hyd. Arch. Series No. 19. Mn. 27.

10 గట్టుతుమ్మెన- గోకర్ణదేవచోడ మహారాజు. చా. వి. సం 40.
— Hyd. Arch. Series No. 19. Mn: 11.

11. పానగల్లు — గోకర్ణదేవచోడ మహారాజు శ. సం. 1043.
— Hyd. Arch. Series No. 13-2 P. 96.

12. పానగల్లు — మైలాంబ—శ. సం. 1046
— Hyd. Arch. Series No. 13–2 P. 105-109.

13. సిరికొండ — ఉదయనచోడ మహారాజు శ. సం. 1070-భారతి-ఫిబ్రవరి 1970.

14. రాచూరు — ఉదయనచోడ మహారాజు. శ సం. 1079. ఆంధ్రపత్రిక—సౌమ్య-ఉగాది సంచిక 1969.

15 జడ్చర్ల — ఉదయనచోడ మహారాజు శ. సం. 1084.
— Hyd Arc. Series No. 19. Mn 12&13.

16 నేలకొండపల్లి- ఉదయనచోడ మహారాజు శ. సం. 1097.
— Hyd. Arc. Series No. 19. Km 15.

17. ఏలేశ్వరం— ఉదయనచోడ మహారాజు.
— A. P. Govt. Arc. Series No. 22 – No. 357.

18. ఏలేశ్వరం — ఉదయనచోడ మహారాజు
— A. P Govt Arc. Series No 22 – No. 358.

19. మామిళ్ళపల్లి- భీమ. గోకర్ణదేవచోడ మహారాజులు-శ సం 1100
— Hyd. Arc Series No. 19 - Mn. 26.

20 లింగాల — తొండ. శ సం 1106.
— Hyd. Arc Series No. 19. Mn 17.

21 పాలెము — గోకర్ణదేవచోడ మహారాజు
— Hyd. Arc. Series No 19. Mn. 31.

22. మల్లేపల్లి — భీమదేవచోడ మహారాజు శ సం. 1157
— Hyd Arc. Series No. 22 - No. 307.

23. పద్మటిపల్లి — భీమదేవచోడ మహారాజు శ. సం. 1157.

24. ఇదంపల్లి — ఉదయాదిత్యదేవచోడ మహారాజు శ. సం. 1157.

25. ఆగామోతుకూరు-రామనాథదేవచోడ మహారాజు. శ. సం. 1204

26. పెరూరు-భీమదేవచోడ మహారాజు.

పైన పేర్కొనబడిన శాసనములలో రాచూరు, సిరికొండ, పద్మటిపల్లి, ఇదంపల్లి, మల్లేపల్లి ఆగామోతుకూరు శాసనములు 'భారతి' పత్రికలో ప్రకటింపబడినవి. 6, 7, 8, 17, 18 క్రమ సంఖ్యగల శాసనములు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురాతత్వశాఖ సీరీసు నెం. 22లో నమోదు చేయబడినవి. కొప్పోలు పెరూరు శాసనము లప్రకటితములు

పశ్చిమ చాళుక్యరాజగు త్రైలోక్యమల్లుని కాలమున ఇరుగణచోళ మహారాజును పేర్కొను మూడు శాసనములు[1], శ, సం 978 లో అలంపురమున వేయింపబడినవి. ఇతనికి 'చరణ సరోరూహ విహత విలోచన

1. తెలంగాణ శాసనములు Vol. II కల్యాణి చాళుక్య శాసనములు—Nos, 4, 5, and 6.

ప్రముఖాఖిలోదీ' చోడవంశ ప్రశస్తి చేర్చబడినది. చిద్దణచోళ మహారాజు 'ఐజె' మున్నూటిని పాలించు మహా మండలేశ్వరుడుగా త్రైలోక్యమల్లుని సామంతుడుగానున్నట్లు శ. సం. 986 నాటి అలంపుర శాసనము[1] వలన తెలియుచున్నది.

ఈ చిద్దణచోళ మహారాజే భువనైకమల్లుని కాలమున కన్నె-300; పెడకల్లెంటు-100; నరవాడి-500; అయిజె-300; పాలించుచుండెనని శ. సం. 995 నాటి శాసనము[2] తెలుపుచున్నది.

త్రిభువన మల్ల విక్రమాదిత్యుని రెండవ విజయ రాజ్యసంవత్సరము నాటికి, అయిజె మండలమును వైదుంబ వంశీయుడగు మల్ల మహారాజు పాలించుచున్నట్లు తెలియుచున్నది.[3]

త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు కడుసమర్థుడైనరాజు. సింహాసన మధిష్ఠించిన పిదప మాండలికులను సామంత రాజులను తొలగించి, క్రొత్తవారిని నియమించినట్లు తెలియుచున్నది. బహుశః చిద్దణ చోళ మహారాజు వారసుడో లేక దగ్గరి బంధువో ఐన తొండరసచోళ మహారాజు కొలనుపాక ఏడువేలు పాలించుటకు త్రిభువనమల్ల విక్రమాదిత్యునిచే నియమింపబడియుండును. కృష్ణానది ఉత్తరప్రాంతమును, కొలనుపాక రాజధానిగా, తొండరస చోళ మహారాజు పాలించుచుండెనని కొలనుపాక శాసనము[4] వలన తెలియుచున్నది. నల్లగొండ, ఖమ్మం మండలములోని నేలకొండపల్లి ప్రాంతము, మహబూబునగర మండలము కొలనుపాక ఏడు వేల పరిధిలోనికి వచ్చును. కృష్ణా, తుంగభద్రానదుల మధ్య ప్రాంతమును, అనగా నేటి గద్వాల, అలంపూరు తాలూకాలు "అయిజె" మండలమని ఆనాడు పిలువబడినది. ఈ ప్రాంతము వైదుంబరాజుల అధీనముననుండెను. తుంగభద్రానది దక్షిణమున కర్నూలు, కడప, అనంతపూరు ప్రాంతములను, తెలుగుచోడ వంశీయులు పాలించుచుండిరి ఈ మాండలిక రాజులందరును, త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యుని సామంతులుగా వ్యవహరించు చుండిరి. ఈ మాండలిక రాజులందరును, త్రిభువనమల్లుడు తన కుమారుల నాయా ప్రాంతములందు రాజ ప్రతినిధులుగా నియమించెను. కందూరు మండలమును పాలించుటకు, చందలదేవి కుమారుడగు, కుమారతైలపుడును, కొలనుపాక మండల పాలకునిగా పట్టమహిషి పుత్రుడైన సోమేశ్వరుడును, నియమింపబడిరి. రాజపుత్రులు రాజప్రతినిధులుగా నున్నను, ఆయా మండలములను, మాండలికరాజులు పాలించుచుండిరి. రాజప్రతినిధిగా కుమార సోమేశ్వరుడు కొలనపాకలో నియమింపబడుటకు పూర్వము, తొండరస చోళ మహారాజు, అతని సంతతివారు కొలనుపాక ఏడువేలు పాలించిరి అటు పిమ్మట కందూరుపానగల్లు పట్టణములను రాజధానులుగా జేసికొనిరి. ఉదయనచోడ మహారాజు కాలము నాటికి వర్ధమానపురము రాజధానిగా నున్నట్లు రుద్రదేవుని వేయి స్తంభాల గుడి శాసనము[5] వలన తెలియుచున్నది. వేయిస్తంభాలగుడి శాసనమే హనుమకొండ శాసనముగా ప్రకటింపబడినది.

---

1. తెలంగాణ శాసనములు Vol. II కళ్యాణి చాళుక్య శాసనములు No. 11.
2. ,, ,, ,, Vol. II ,, ,, ,, No. 12.
3. ,, ,, ,, Vol. II ,, ,, ,, No. 14 & 15.
4. A. P. Govt. Arc. Series No. 3 Ng. 48.
2. తెలంగాణ శాసనములు, Vol. 1 కాకతీయ శాసనములు No 5

## 1. తొండరసచోళ మహారాజు :

కందూరిచోడ వంశీయుడగు ఈ రాజు ప్రశంస కొలనుపాక శాసనమందున్నది.[1] ఇతడు నల్లగొండ మండలములోని కొప్పోలులో ఒక శాసనమును వేయించెను ఇతడు త్రిభువనమల్ల అరవ విక్రమాదిత్యుని సామంతుడు శాసనమందితడు. "సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర, వీరమాహేశ్వర, కోడూర్పుర సరేశ్వర సూర్యవంశోద్భవకుల తిలక, కాశ్యపగోత్ర, కరికాలాన్వయ, నామాది సమస్త ప్రశస్తి సహిత శ్రీ మన్మహా మండలేశ్వర కన్దూర తొణ్డరస చోళ మహారాజని" వర్ణింపబడినాడు. ఈ శాసనము చా వి వ. 13 విభవ సంవత్సరమున ఉత్తరాయణ సంక్రాంతి పర్వదినము నందియబడినది ఇతడు కొలనుపాక పడు వేల పాలకుడు. చా వి వ సం. 13 విభవ సంక్రాంతి క్రీ. శ. 1088 డిశంబరు 24కు సమానమగును కొలనుపాక శాసనము కందూరి చోడ వంశీయులకు సంబంధించిన మొదటి శాసనము. కొప్పోలు శాసనమును తొండయ చోళ మహారాజు చా. వి సం. 17 అంగీరస సంవత్సర ఉత్తరాయణ సంక్రాన్తినాడు వేయించెను. చా. వి. సం. 17 క్రీ శ 1093కు సమానము. కందూరి చోడరాజ్య స్థాపకుడీ తొండవరస చోళమహారాజని భావింపవచ్చును. ఇతని పరిపాలనాకాలము క్రీ. శ. 1078-1093 కావచ్చును.

## 2. కొండయ చోళమహారాజు :

ఇతడు కొలనుపాక శాసనమునుష[2] వేయించెను. ఇతడు తొండరసచోళ మహారాజు పుత్రుడు కావచ్చును. ఇతనికి చోడవంశ ప్రశస్తికలదు. ఈ శాసనమున చా వి. సంవత్సరపు సంఖ్య భాగము సంవత్సరము పేరు చెదరిపోయినవి. స్పష్టా స్పష్టము గనున్న అక్షరములనుబట్టి ఇది ప్రమాది సంవత్సరములో వేయించినట్లు తెలియుచున్నది ప్రమాది సంవత్సరము చా. వి. సంవత్సరము 24కు సమానము. కావున కొండయ చోళమహారాజు తండ్రియనంతరము కొలనుపాక పదు వేలు పాలించియుండును. ఇతని పరిపాలనాకాలము క్రీ. శ 1098-1105.

## 3. నల్లభీమదేవచోడ మహారాజు :

ఈ రాజు ప్రశంస గట్టుతుమ్మెన శాసనమున[3] కనిపించుచున్నది. ఇతనికి మహామండలేశ్వర బిరుదమున్నది, ఇతని పట్టమహిషి ధెన్నమదేవి. తుంమేటి రామేశ్వర దేవరకు, కోరికలతో నిచ్చిన దత్తిని తెలుపు శాసనమిది. నల్లభీమదేవచోడ మహారాజు తల్లిదండ్రులు పేళ్ళు తెలియుట లేదు. ఈ శాసనము చాళుక్య విక్రమ సంవత్సరము 30లో వేయింపబడినది. కావున శాసన కాలము క్రీ. శ. 1106 అగును.

---

1. A. P. Govt. Arch. Series No. 3. Ng. 48.
2. A. P. Govt. Arch. Series No. 3. Ng. 46.
3. Hyderabad Archaeological Series No. 19 Mn. 10

## 4. సోమనాథదేవ చోడమహారాజు :

ఇతడు చా వి సం. 32 శార్వరి సంవత్సర చైత్ర బహుళదశమి శనివారమునాడు ఉప్పునూతల శాసనమును[1] కేదారేశ్వరదేవరకు వెలివోలము ఖ 12 ప్రోలెనాయకుని చెఱువువెనుక నీరు పొలము 8 మత్తులు అందే శ్రీ కేశవదేవరకు, అడ్డత్తిపొలము, బాసాని చెఱ్వు వెనుక మత్తులు 2. నందాదీపమునకు ప్రత్తిమలగ కోలపొద్దువను కట్టి కూలిని పెంట సుంకము అడ్డగట్టును-ఇచ్చు సందర్భమున వేయించెను. చా. వి సం. 32 క్రీ. శ. 1108 కి సమానము.

## 5. గోకర్ణ దేవచోడమహారాజు :

గోకర్ణదేవచోడ మహారాజు కందూరి చోడులలో ప్రసిద్ధుడు. చా.వి.సం. 33లో వేయించిన ఏలేశ్వర శాసనమును[2] సౌమ్య సంవత్సరములో అనగా చాళుక్యవిక్రమ సంవత్సరము 41 లో వేయింపబడిన మామిళ్ళపల్లి శాసనమును[3] శ. సం. 1043లో వేయింపబడిన పానగల్లు శాసనమును[4] ఏలేశ్వరములో లభించిన రెండు అప్రకటిత శాసనములును[5] గోకర్ణదేవచోడ మహారాజును పేర్కొనుచున్నవి. ఇతడు చా వి సం 33లో ఏలేశ్వరదేవరకు కోడూరు గ్రామమును దానమిచ్చెను. చా. వి సం. 33 క్రీ. శ 1110 కి సమానము. గట్టుతుమ్మెన శాసనమును[6] పిలబచెనాయకుడు మహామండలేశ్వర గోకర్ణదేవ మహారాజు రాజ్యాభివృద్ధిని గోరుచు చా. వి సం. 40లో వేయించెను. చా. వి. సం. 40=AD 1116. మామిళ్ళపల్లి శాసనమును గోకర్ణదేవచోడ మహారాజు దండనాయకుడగు హరిహరదాసుండు. ఖమిదేవుడు సౌమ్య సంవత్సరము పుష్య బహుళ సప్తమి సోమవారమునాడు సంక్రాన్తి పర్వదినమున నృసింహదేవర నైవేద్యమునకు భూమి దానమిచ్చు సందర్భమున వేయించెను. ఇందు గోకర్ణ దేవచోడ మహారాజుకు చోడ వంశ ప్రశస్తి చేర్చబడినది. సౌమ్య సంవత్సరము చా. వి సం. 41కి సమానము. కావున శాసనకాలము క్రీ శ. 1117 శా శ. 1043లో వేయించిన పానగల్లు శాసనమును గోకర్ణుడు కుక్కుళము 30 లోని మాడువుల గ్రామమును, కావలియ భీమన ప్రెగ్గడకును. అమనికల్లు 70 లోని అడ్డలూరు గ్రామమును అష్టభోగ సహితముగా దొడ్డభట్లకును కాళ్ళు కడిగి దానమిచ్చెను. ఈ శాసనమున పేర్కొనబడిన మాడువుల మాడుగులపల్లి; కుక్కులము-కుక్కడము. నల్లగొండ మండలమున పానగల్లు సమీపమున నున్నవి. శా. శ. 1043=క్రీ శ. 1121; ఏలేశ్వరమున లభించిన నెం. 339 శాసనము వలన గోకర్ణుడు చిటకోడూరు గ్రామమును, ఏలేశ్వరదేవరకును నెం 344 శాసనము వలన కందూరి చోడరాజు ఏలేశ్వరదేవరకు కీచకపల్లి గ్రామమును దానమిచ్చినట్లు తెలియుచున్నది.

మైలాంబ శా. శ. 1046లో వేయించిన శాసనము వలన ఆమెకు ఉదయన, చోడభీమ నారాయణ గోకర్ణులను పుత్రులున్నట్లు తెలియుచున్నది.

---

1. Hyderabad Archaeological Series No. 19. Mn. 45
2. A. P. Govt Arch. Series No 22 No. 339.
3. Hyd. Arch. Series No. 19 Mn. 27.
4. Hyd. Arch. Series No. 13-2P. 96.
5. A. P. Govt. Arch. Series No. 22 Nos. 357 & 358
6. Hyd. Arch. Series No. 19. Mn. 11.

## 6. ఉదయనచోడ మహారాజు

కందూరిచోడ రాజులలో ఉదయనచోడ మహారాజు కడుప్రసిద్ధుడు. ఇతడు గోకర్ణుని పుత్రుడు. ఇతనికి సంబంధించిన శాసనములలో సిరికొండ శాసనము మొదటిది శక సంవత్సరము 1070లో వేయింపబడినది. చాళుక్య ప్రతాపచక్రవర్తి జగదేకమల్లుని కాలపు శాసనమిది ఉదయన చోడ మహారాజుకు సంబంధించిన శాసనములలో సిరికొండ శక సంవత్సరము 1070; రాచూరు శ. సం. 1079; జడ్చర్ల శ. సం. 1084; నేలకొండపల్లి శ. సం. 1097; ఏలేశ్వరము నెం. 357 358లు ముఖ్యమైనవి. కందూరి ఉదయనచోడుని ప్రశంస కాకతీయుల శాసనములందు కనిపించు చున్నది. గోకర్ణదేవుని యనంతరము ఉదయనుడు రాజై సుమారు క్రీ. శ. 1140-1176 వరకు పాలించెను.

కాకతి రుద్రదేవుని హనుమకొండ శాసనము[1] వలన రెండవ ప్రోలరాజు గోవిందరాజు నోడించి అతని రాజ్యమును ఉదయున కొసంగినట్లు తెలియుచున్నది చారిత్రపులి ఉదయుని కందూరి ఉదయచోడ మహారాజని నిర్ణయించినారు.

ఉదయనచోడ మహారాజుకు మహామండలేశ్వర బిరుదమున్నది. చోడవంశపు రాజుల ప్రశస్తి ఇతనికి జేర్చబడినది కందూరి ఉదయనదేవచోడ, ఉదయనచోడ, ఉదయాదిత్య, ఉదయ చోడ, చోడోదయ అని ఇతడు శాసనములందు పేర్కొనబడినాడు. ఇతడు కోడూర్పుర వరేశ్వర సూర్యవంశోద్భవకులతిలక, కాస్యపగోత్ర, కరికాలాన్వయనామాది సమస్త ప్రశస్తి సహితుడు, కాకతి ప్రోలరాజు వలన, తానింతకు పూర్వము కోల్పోయిన రాజ్యమును పొంది ప్రోలరాజు శత్రువులతో వైరము కలిగియుండెనని భావింపవచ్చును. చాళుక్య మూడవ తైలపునితో కాలచు ర్యుల పక్షమున ప్రోలరాజు చేసిన యుద్ధమున ఉదయనచోడ మహారాజు సహకరించియుండును. ప్రోలరాజు తైలపు నోడించిన సంవత్సరము క్రీ శ. 1157 కావచ్చునని చారిత్రకుల అభిప్రాయము[2].

ప్రోలరాజు మరణానంతరము రుద్రదేవుని కాలమున ఉదయనచోడ మహారాజు స్వతం త్రుడయ్యెను. కాని కాకతి రుద్రదేవుడు చోడోదయుని స్వాతంత్ర్యము సరికట్టెను. ఉదయనచోడ మహారాజు వృద్ధాప్యమున తన కుమారులగు భీమ గోకర్ణుల ప్రోత్సాహమున స్వతంత్రుడయ్యెను ఉదయనచోడుని కాలమందే భీముడు రాజ్యమేలుచు తండ్రికి సహాయపడెను. చాళుక్య తైలపుడు మరణింప బలపరాక్రమ సంపన్నుడైన భీముడు తైలపుని రాజ్యభాగముల నాక్రమించెను.

---

1. యఃకుంరోరి పతేరకుంర పరశుర్లక్ష్మా గ్రధారోల్లస
ద్ధారా పాతనిపాతనైక చతురం గోవిందరాజాహ్వయం
బద్ధ్వోన్ముచ్యత దోదయక్షితి భృతేరాజ్యందదౌలీలయా
లుంతా కోవిషయస్యతస్య సమరేసద్వీరదీక్షాగురుః

—తెలంగాణ శాసనములు Vol. 1 శా. శా. No. 5

2. ఆంధ్రుల చరిత్ర-చి. వీరభద్రరావుగారు, P. 206

భీమచోడుడు బల గర్వితుడై యుండ. కాకతిరుద్రుడు వర్ధమానపురముపై దండెత్తెను. భీముడు తల్లి, భార్య, సోదర, ఆప్తబంధువర్గముతో, వర్ధమానపురము వీడి అడవులలో దాగెను. రుద్ర దేవుడు భీముని వెదకి బంధించి క్షమించి, తిరిగి భీమునకు రాజ్యము నిచ్చెను. భీముడు రుద్రదేవుని సామంతుడుగా నుండుట కంగీకరించెను. అంతయేకాక తన సోదరి పద్మావతీదేవిని రుద్రదేవ మహా రాజు కిచ్చి వివాహ మొనర్చెను[1].

కాకతిరుద్రుడు వర్ధమాన పురము నాక్రమించిన పిదప భీముడు సకుటుంబముగా బయలు దేరి నేటి మున్ననూరు కొండలలోను, అడవులలోను దాగియుండ, కాకతిరుద్రుడాతని వెంబడించి, అడవి కాల్పించి చివరకు భీముని బంధించి అతని సోదరి పద్మావతీదేవిని వివాహమాడు భీముని క్షమించెను. ఆ ప్రాంతమున నగరము నిర్మించి తటాకము త్రవ్వించెను. రుద్రదేవునికోట బ్రహ్మ గుండము, ఆలయములు, శిథిలనగర చిహ్నములు, మున్ననూరుఘాటురోడ్డు ప్రక్క కనిపించును, సుమారు మైలు దూరమువరకు, ఈ కోట, శిథిలనగరము వ్యాపించియున్నవి కోటలో నొక కొండ కొన శిలా శాసనమున్నది. శాసనము శా శ. సం. 1347లో వేయించినట్టిది. ఈ ప్రాంతము మహేశ్వర నీలకంఠ పుణ్యక్షేత్రమైనట్లును, ఇచట గుప్త మల్లికార్జున దేవర ఆలయమున్న ట్లును, ఈ శాసనమునుపాలకుర్తి మల్లినాయని కొడుకు సోమన వేయించినట్లును తెలియుచున్నది.[2] ఈ కొండలలోనే దిగువ శ్రీశైలక్షేత్రమునకు ఉత్తరద్వారమని ప్రసిద్ధిచెందిన పవిత్రమైన ఉమా మహేశ్వరమున్నది.

ఉదయనచోడుడు అతని మంత్రి పింగళి గోవిందయ్య శివతత్వ సారము[3] పండితారాధ్య చరిత్రలను[4] గ్రంథములందు ప్రశంసింపబడినారు. ఉదయన చోడమహారాజు నల్లగొండ సమీపమున నున్న పానగల్లులోని ఉదయ సముద్రమను గొప్ప తటాకము త్రవ్వించెను. దానిని ఉదయాదిత్య సముద్రమందురు. ఉదయ సముద్ర ప్రశంస కాకతీయుల శాసనములందు కనిపించుచున్నది.[5] ఈ శాసనములలో నొకటి శ సం. 1187లోను రెండవది శ. సం. 1218లోను వేయింపబడినవి. శా శ. 1482లో ఉదయాదిత్య సముద్రమునకు నీరు వచ్చుటకు త్రవ్వింపబడిన కాలువ కతువఖిలమైయుండ గోలకొండ నవాబగు ఇబ్రహీంవకుతుబ్షా పంపున రహమతుల్లా కతువ, కాలువ, తూములు, బాగు చేయించినట్లు తెలియుచున్నది.

---

1. "కందూరోదయ చోడవంశవిలసత్ క్షీరాబ్ధి గర్భోద్భవ
త్పద్మైకాశ్రయరుద్ర దేవనృపతేః కిం వర్ణ్యతే విక్రయః-"
—అనుమకొండ శాసన. తెలంగాణ శాసనములు Vol. 1
కా. శా. No. 5

2. Hyderabad Archaeological Series No. 19 Mn. 30
3. శివతత్వసారము—పీఠిక పుట 8
4. పండితారాధ్య చరిత్ర – మహిమాప్రకరణము
5. తెలంగాణ శాసనములు Vol 1 కా. శా. Nos. 33, 34 & 35

"...పానుగంటి ఉదయసముద్రం కాలువ ఇందుపుకెలసీమలో నమిలెపెద్ద మూసిపటి కతువఖిలమై వుండంగాను పునరోద్ధారకముగాను-కత్తువగట్టి కాలువ చేయించి, ఆనీళ్ళు ఉదయ సముద్రంనించి, ఆగి నీళ్లు క్రిష్ణగామిని చేయించి. నమిలెకతువ మొదలుకొని క్రిష్ణ ఈ మధ్య చెరువులు కుంటలు కాలువలు నించి—"[1]

ఉదయన చోడమహారాజు పరిపాలన కాలము క్రి. శ. 1140-1176; సుమారు మూడు వందల సంవత్సరముల తరువాత శ సం. 1432 లేక క్రి. శ. 1510 ప్రాంతమున ఉదయనచోడుడు నిర్మించిన కతువఖిలమై బోయినదని భావింపవచ్చును. ఏడవ నిజాము కాలమున నమిలె కతువ పునరుద్ధరింపబడినది

## 7 & 8 భీముడు - గోకర్ణుడు

భీమగోకర్ణులిరువురు ఉదయనచోడ మహారాజు కుమారులు. వీరు కలిసియే రాజ్యమేలినట్లు తెలియుచున్నది. క్రి. శ. 1178 విళంబి సంవత్సరములో వీరు చూతిఘోష అగ్రహారమును, మామిళ్ళపల్లి, మంచి కుంట గ్రామములను, నృసింహదేవర కగ్రహారముగ నిచ్చినట్లు మామిళ్ళపల్లి శాసనమువలన తెలియుచున్నది.[2] భీమదేవచోడ మహారాజు కడు ప్రసిద్ధుడు. బలపరాక్రమ సంపన్నుడు. ఉదయచోడుని జ్యేష్ఠపుత్రుడు. కాకతి రుద్రుని కలవరపరచినవాడు. పశ్చిమ చాళుక్య రాజగు మూడవ తైలపుడు మరణింప అతని రాజ్య వైభవమును కొన్నినాళ్ళనుభవించినవాడు.[3]

శక సంవత్సరము 1106 లేక క్రి. శ. 1184లో మల్లమసాని, కన్నరదేవుల కుమారుడగు తాండ, విష్ణ్వాలయమును, భీమరాజు పేరను శివాలయమును తన తండ్రియగు కన్నరదేవుని పేరను, సూర్యదేవుని ఆలయమును గోకర్ణదేవుని పేరను నిర్మించినట్లు లింగాల శాసనము[4] వలన తెలియుచున్నది. తాండ కరికాల చోళ వంశీయుడు, ఇతడు లింగాల గ్రామమునగ్రహారముగా జేసి సోమశిల శివాలయమున కిచ్చెను. కారుపాముల గ్రామమున పైన పేర్కొనబడిన మూడు ఆలయములు నిర్మించెను. ఇతడు మాండలిక ప్రభువు.

## 9. సోమనాథదేవచోడ మహారాజు

ఇతడు, ఇతని కుమారుడు ఉదయాదిత్యదేవచోడమహారాజు వేయించిన ఇదంపల్లి శాసనమున పేర్కొనబడినాడు. ఇతడు గోకర్ణదేవచోడుని కుమారుడు. ఉదయనచోడమహారాజు మనుమడు. ఇతడు తండ్రి యనంతరము రాజై క్రి. శ. 1200-1230 వరకు పాలించియుండును.

---

1. Epigraphia Indo. moslemica 1925-26. P. 23-25.
2. Hyderabad Archaeological Series No. 19. Mn 29.
3. తెలంగాణ శాసనములు Vol 1 కా. శా సం. 5.
4. Hyderabad Archaeological Series No. 19. Mn 17.

## 10 & 11 భీమ-ఉదయాదిత్యదేవచోడ మహారాజులు

సోమనాథదేవచోడమహారాజు జ్యేష్ఠపుత్రుడు భీమదేవచోడమహారాజు. ఇతడు మల్లేపల్లి శాసనమును శ. సం. 1157 జయ సంవత్సర కార్తీక బహుళ దశమి గురువారమునాడును పడమటిపల్లి శాసనమును శ. సం. 1157 మన్మథ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి గురువారమునాడును వేయించెను. ఇతని సోదరుడు కందూరి ఉదయాదిత్యదేవచోడమహారాజు ఇదంపల్లి శాసనమును శ సం. 1157 మన్మథ సంవత్సర భాద్రపద బహుళ ఏకాదశి ఆదివారమునాడు వేయించెను. భీమ గోకర్ణులవలె, భీమ, ఉదయాదిత్యదేవులు కలిసియే రాజ్యమేలినట్లు భావింపవచ్చును.

## 12. వీరమల్లనాథదేవచోడ మహారాజు

ఇతడు ఆగామోతుకూరు శాసనమును వేయించిన రామనాథదేవచోడమహారాజు తండ్రి. ఇతని పరిపాలనా విశేషములు తెలియుటలేదు

## 13. రామనాథదేవచోడ మహారాజు

ఇతడు శా. శ. 1204లో ఆగామోతుకూరు శాసనమును వేయించెను. ఇప్పటివరకు లభించిన కందూరి చోడుల శాసనములో ఆగామోతుకూరు శాసనమే చివరిది. రామనాథదేవ చోడమహారాజు చివరివాడు. ఇతడీ శాసనమును క్రి. శ. 1282లో వేయించెను.

కందూరి చోడరాజులు మొత్తము పదమూడు మంది సుమారు. రెండువందల యేబది సంవత్సరములు తెలంగాణములోని మహబూబునగరం, నల్లగొండ, ఖమ్మం మండలములను పాలించిరి. కొంతకాల మీ రాజన్యులు పశ్చిమ చాళుక్య రాజులకు సామంతులుగాను. కొంతకాలము స్వతంత్ర్యముగాను, మరికొంత కాలము కాకతీయుల సామంతులుగాను పాలించిరి తెలంగాణమున కృష్ణానది ఉత్తర ప్రాంతమును వీరు తమ అధికారము క్రిందికి దెచ్చుకొని, పాలించుటయేగాక, బలవంతులై, అనేక సామంతులను కలిగి, దేవాలయముల నిర్మించి, దేవాలయముల కగ్రహారములను, భూములను దానమిచ్చిరి. ఈ వంశీయులు కందూరి చోడరాజుల మనియే శాసనములందు చెప్పుకొనినారు.

## కందూరిచోడ వంశవృక్షము



# సిరికొండ శాసనము

## శాసనము

నల్లగొండ మండలములోని సూర్యాపేట తాలూకాలోని "సిరికొండ" గ్రామము వెలుపల నాగులబండవద్ద కళ్యాణీచాళుక్యులనాటి శాసనమున్నది. సూర్యాపేట - ఖమ్మం రోడ్డుపైన సూర్యాపేటనుండి పదిమైళ్ళ దూరములోనున్న "మోతె" స్టేజినుండి సుమారు మూడుమైళ్ళ దూరములో సిరికొండ గ్రామమున్నది. మోతె స్టేజినుండి సిరికొండ గ్రామమువరకు సమితిరోడ్డు ఉన్నది.

"సిరికొండ''కొండపై కోట కట్టబడినది. అతిప్రాచీనమై శిథిలావస్థలోనున్న ఈ కోట కళ్యాణీ చాళుక్యుల కాలమున నిర్మించబడినది. కొండ అంచులో "సిరికొండ'' గ్రామమున్నది. నేడది పెద్దగ్రామము. గ్రామపంచాయతీ కలది. పూర్వము వైభవముతో నొప్పారినది.

"సిరికొండ" గ్రామమునకు మూడువైపుల చెఱువులున్నవి. కొండ అంచులనుండికట్టలు పోయబడి, కొండనీరు, చుట్టుప్రక్కల వరదనీరు వచ్చి నిలుచునట్లు తటాకములు నిర్మింపబడినవి

"సిరికొండ"గ్రామము వెలుపల కొండకు తూర్పున నాగులబండవద్ద, పశ్చిమచాళుక్య వంశీయుడగుప్రతాప చక్రవర్తి రెండవ జగదేకమల్లుకాలపుశిలాశాసనమున్నది ఈశాసనమును రెండవ జగదేకమల్లుని సామంతుడును,మహామండలేశ్వరుడునునగు కందూరి ఉదయనచోడ మహారాజునుండి కొండపల్లి నాడును శాసనబద్ధముగా బడసిన కేతయ, శివాలయముల నెత్తించి ఆలయములోని దేవరలకు అంగరంగభోగములకు, హవిబలి అర్చనాదులకు, భూమి దానమిచ్చు సందర్భమున వేయించెను. ఈ శాసనము తెలుగు భాషలో వేయింపబడినది. శాసనాంతమున వ్యాసగీతా శ్లోకములున్నవి.

## సిరికొండ

సిరికొండ ప్రాచీనమైన గ్రామము. పూర్వ మీగ్రామము కేతయ మహామాండలికుని రాజధాని నగరము. నేడు గ్రామమున శిథిలరూపముననున్న ఆలయములు, గుళ్ళు, కోనేరులు, ఇండ్ల పునాదులు కనిపించుచున్నవి. పూర్వ మీ గ్రామముజైనులకు, బౌద్ధులకు ఆవాసముగ నుండెను. జైనమతమాంధ్ర దేశమున సన్నగిల్లుకాలమున బౌద్ధమతము విజృంభించినది. బౌద్ధము రాజాదరము కోల్పోవు కాలమున వైదికము విజృంభించినది. వైదికమతమున మొదట శైవము, తరువాత వైష్ణవము వ్యాపించినవి. సిరికొండ ప్రాంతము తొలుత జైనులకు, తరువాత బౌద్ధులకు నివాసస్థానముగా నుండెను. బౌద్ధజైన మతములకు సంబంధించిన శిల్పములు, విగ్రహములు ఈ ప్రాంతమున విశేషముగ కనిపించుచున్నవి. శైవమువ్యాప్తిలో నున్నకాలమున జైన బౌద్ధ విగ్రహములుశైవుల ఆగ్రహమునకు గురియై, దేవాలయములను, మఠములను, చైత్యాలయములను, వీడి, దిగుడు బావులలో స్థానమేర్పరచుకొనినవి. బావుల పూడికతీయుచుండ బయలుపడిన బౌద్ధజైన మతములకు సంబంధించిన విగ్రహములను, గ్రామీణులు, ముత్యాలమ్మగుడిలోను, దిగుడుబావివద్ద గల తుమ్మచెట్ల దగ్గరను నిలిపినారు.

నేలకొండపల్లి, ఫణిగిరి, గాజులబండ, సిరికొండ, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి, ఇంద్రపాలనగరము బౌద్ధుల కావాసనగరములు. బౌద్ధసన్యాసులకు, ఛాత్రులకు నిలయములైన ఈ నగరములు, బౌద్ధ విద్యాలయములుగా ప్రసిద్దిచెందినవి. కళ్యాణీచాళుక్యుల కాలమున ఈ సిరికొండ ప్రాంతమున జైనమతము పోషింపబడినది. కాలక్రమమున జైన, బౌద్ధమతములు వైదిక మత ప్రాబల్యమువలనను, ప్రజల నిరాదరణమువలనను క్షీణించినవి.

సిరికొండ గ్రామముననున్న ఆలయములలో శివాలయము, వేణుగోపాలస్వామి ఆలయములు ముఖ్యమైనవి. శివాలయము కూలిపోయి శిథిలరూపమున కనిపించుచున్నది. శివలింగము, తల నఱికివేయబడిన నంది విగ్రహము చూచుటకందముగనున్నవి. గ్రామమునగల మరికొన్ని ఆలయములు, నామరూపములు లేకుండ శిథిలమైనవి. నాగులబండ వద్దగల శివాలయము శిథిలమైనది. ఆలయ శిథిలములకు చిహ్నములుగా నాగుల చెక్కబడినరాళ్ళు లింగము, పానపట్టము, శిలా శాసనము కనిపించుచున్నవి. సిరికొండ గ్రామమున రెండు తెల్లరాతి శాసనములున్నవి. ఈశాసన శిలలు విఱిగిపోయినవి. ఇవి అర్వాచీనమైనవి, ఈ రెండు శాసనశిలలు, ఇండ్ల మూలమలలకు పాతబడినవి, అక్షరములు చెదిరిపోయి, చదువుట కనుకూలముగలేవు.

"సిరికొండ" గుట్ట ఒకేరాతితో ఏర్పడినట్లున్నది మొదట విశాలమైన పరుపుబండ, మధ్య ఎత్తైనకొండ, తూర్పువైపు కొంతవరకు పరుపుబండ కలిగి సుమారు నాలుగుమైళ్ళ చుట్టు కొలత కలిగియున్నది. కొండ నెక్కుటకు మెట్లున్నవి. ఇవి చెక్కుచెదరకుండ నున్నవి. కొండ చుట్టు కోటగోడ నిర్మింపబడినది సున్నము-రాయితో నిర్మించిన ప్రాకారకుడ్య మచ్చటచ్చట కూలి పోయినది. కొండపైన శివాలయములు. మంటపములు, ఇండ్లపునాదులు, బంకులు ధాన్యాగారముల అడుగులు, రాణివాస గృహములు కనిపించుచున్నవి భువనగిరి దుర్గమువలె సిరికొండ దుర్గము ఏకశిలాదుర్గము. కాని భువనగిరి దుర్గము చాలా ఎత్తైనది. సిరికొండ చాల చిన్నకొండ కొండవాలులో మూడు చెఱువులు నిర్మింపబడినవి.

"సిరికొండ" నేలకొండపల్లికి ముప్పైమైళ్ళ దూరమున నున్నది. నేలకొండపల్లి, కందూరి చోడుల రాజ్యమున నున్నట్టిది. కొండపల్లినాడులోనిదే సిరికొండ రాజ్యము. కొండపల్లి నాడును శాసనబద్ధముగా బడిసి కేతయ నాయకుడు సిరికొండ రాజ్యమును పాలించుచుండెనని శాసనమువలన తెలియుచున్నది. ఈ ప్రాంతమున కందూరి చోడులకు సంబంధించిన అనేక శాసనములున్నవి. అందు ముఖ్యముగా నేలకొండపల్లి[1]. ఆగామోతుకూరు[2], పానగల్లు[3], మల్లేపల్లి[4], ఇదంపల్లి[5], పడమటిపల్లి[6], కొపోల్లు[7] ఏలేశ్వరము[8] ప్రాంతములోను మహబూబునగర మండలము అచ్చంపేట తాలూకాలోని శాసనములును కందూరి చోడుల చరిత్ర తెలిసికొనుటలో తోడ్పడుచున్నవి.

1. Hyd. Arch· Series No. 19 Km. 15
2. భారతి-ఆగస్టు 1970
3. Hyd. Arch. Series No. 13-2 page 96; 105-109.
4. A. P. Govt. Arch. Series No. 22 No. 307.
5. భారతి-ఆగస్టు 1970
6. భారతి-ఆగస్టు 1970.
7 అప్రకటితము.
8. A. P. Govt. Arch Series. No. 22 Nos. 333; 339; 344; 357; 358.

సిరికొండ గ్రామమునగల ఆలయములలో శివాలయము, వేణుగోపాలస్వామి ఆలయము పేర్కొనదగినవి.

**శివాలయము**

ఈ ఆలయము గ్రామము మధ్యలో నున్నది. చుట్టు ప్రాకారము కలిగి, మంటప ద్వారము, విశాలమైన 16 స్తంభముల మంటపము, గర్భగుడి కలిగి చూడ ముచ్చటగా నున్నది. కాని ఈ దేవాలయము శిథిలమైనది. స్తంభములొరిగి, కప్పుకూలి. మండపములాకారమును కోల్పోయినవి ఆలయమునగల శివలింగము ఎత్తైనది. గర్భగుడి ముందుగల మంటపమున నంది విగ్రహమున్నది. నల్లరాతితో చక్కగా మలచబడిన ఈ నంది విగ్రహము తల విఱిగిపోయినది. ఈ ఆలయ ద్వారమిప్పుడు మూసివేయబడినది. ఆలయ ప్రాకారకుడ్య మక్కడక్కడ పడిపోయినది. పడిపోయిన గోడరాళ్ళతో, దొడ్లు ఆలయము చుట్టుగల కుడ్యములపై ఇండ్లు, గుడిసెలు, గ్రామీణులు నిర్మించినారు. చాళుక్య శిల్ప సంపదతో నొప్పారు ఈ ఆలయము శిథిలమైయుండుట విచారింపదగినది.

**వేణుగోపాలస్వామి ఆలయము**

ఈ ఆలయము చుట్టు ప్రాకారకుడ్యముకలిగి చెక్కు చెదరక నిలిచియున్నది. ఇది శివాలయమునకు కొలది దూరములో నున్నది. ఆలయ మతి విశాలమైనది. బహుశః శాసనమున పేర్కొనబడిన నారాయణదేవర ఆలయమిదియే యైయుండవచ్చును. ఈ ఆలయము గర్భగుడిలో గల మూర్తి నారాయణదేవర-లేక వేణుగోపాలస్వామి విగ్రహము లేకుండ శూన్యముగా నున్నది.

ఆలయము ముందుద్వారము నాలుగు స్తంభములపై నిర్మింపబడి చక్కని చెక్కడములతో నొప్పారుచున్నది. ఆలయము ముందు మంటపమున్నది. ఈ మంటపము, ముందు నాలుగు స్తంభములతో చిన్న మంటపమును కలిగియున్నది. గర్భగుడి నానుకొనియున్న మంటపము చేరుటకు, మెట్లు అక్కడే ఉన్నవి. గర్భగుడి నానుకొనియున్న మంటపము విశాలమై నాలుగు వరుసలలో వరుసకు నాలుగు స్తంభముల చొప్పున 16 స్తంభములు కలిగియున్నది. దాని తరువాత గర్భగుడినానుకొని ముఖ మండపము నిర్మింపబడినది. గుడిగోపురము ఎత్తైనది. ఆలయఆవరణములో ఆంజనేయస్వామి విగ్రహము ద్వారపాలకుల విగ్రహములున్నవి. ఆలయ స్తంభములపై ఏనుగుల ప్రతిమలు చెక్కబడినవి. ఆలయము పై భాగమున, ద్వారతోరణముల పై భాగమున కప్పుకు క్రిందుగా కొన్ని గోపుర ప్రతిమలు చెక్కబడినవి. ఇవి ఆలయ శిఖరాకారమును సూచించునట్లు చెక్కబడినవి. ఈ ఆలయము గ్రామీణులలో గొందరికి విశ్రాంతి స్థలముగాను, మరికొందరికి, పేకాట స్థలముగాను వినియోగపడుచున్నది.

**శాసనము-అకారాదికములు**

ఈ శాసనము నాగులబండ శివాలయమున కనతి దూరములో పొలము ప్రక్కపడియుండ సిరికొండ గ్రామవాస్తవ్యులగు శ్రీ ఎస్. సత్యనారాయణరెడ్డిగారు శాసనశిలను నాగులబండమీదికి చేర్పించి, చెక్కడము కలిగిన రాతి దిమ్మెపై నిలిపినారు. శాసనము నల్లరాతిపై చెక్కబడినది. ఈ శాసనశిల మూడువైపుల కేతయ నాయకుడు వేయించిన శాసనమును, నాలుగవ ప్రక్క వేరొక శాసనమును చెక్కబడినవి. నాలుగవ ప్రక్క చెక్కబడిన శాసన మర్వాచీనమైనది. ఇందలి అక్షరములు అరిగిపోయినవి. లోతుగా చెక్కబడియుండక పోవుటవలన అక్షరములు చెదిరిపోయి చదువుట కనువుగా లేవు. ఫోటో ప్రతులలోగాని, పేపరుపైగాని ఈ శాసన ప్రతిబింబము చక్కగా రాలేదు

మొదటి శాసనము మూడువైపుల తెలుగు భాషలో వేయించబడినది కందూరి ఉదయన చోడ మహారాజు నుండి కొండపల్లినాడును శాసనబద్ధముగా బడిసి సిరికొండ రాజ్యమును మహామాండలిక కేతయ పాలించుచు, దేవాలయముల నిర్మించి, పూజాదికములకు భూమిని దానమిచ్చు సందర్భమున ఈ శాసనమును వేయించెను.

ఈ శాసనశిల పొడవు 1.30 మీటర్లు వెడల్పు 1.3 ప్రక్కలు 0.37 మీటర్లు; 2,4 ప్రక్కలు 0 32 మీటర్లు; శాసన శిఖరము 0,20 మీటర్లు, శాసనము చెక్కబడిన భాగము 1.10 మీటర్లు. మొదటిప్రక్క శాసనారంభమున సూర్యచంద్రుల చిహ్నములు, నంది, పానవట్టముతో కూడిన శివలింగము, వృషభము చెక్కబడినవి ఇవి యన్నియు శైవమత చిహ్నములు. ఈ శాసనమున మొదటిప్రక్క 27 పంక్తులు, రెండవప్రక్క 35 పంక్తులు, మూడవప్రక్క 19 పంక్తులు, మొత్తము 81 పంక్తులున్నవి.

**లిపి**

ఈ శాసనమున పంద్రెండవ శతాబ్ది పూర్వార్ధమున ఆంధ్రదేశమున ముఖ్యముగా తెలంగాణ ప్రాంతమున వాడుకలో నున్న లిపి వాడబడినది. ఇది తెలుగు కన్నడ లిపి. శిల్పి కడు జాగరూకతతో అక్షరములను చెక్కినాడు. ఐనను అచ్చటచ్చట కొన్ని అక్షరములను చెక్కుట మరచిపోయి అక్షరములపైనగాని, క్రిందగాని మరచిపోయిన అక్షరములు చెక్కినాడు. శాసనము మొదటి ప్రక్క 24-27 వరుసలలో చివరిభాగము విరిగిపోయినది. అచ్చటకొన్ని అక్షరములు లేవు. శాసనాక్షరములు మొదటి ప్రక్క పెద్దవిగను రెండవ ప్రక్క చిన్నవిగను చెక్కబడినవి. మూడవ ప్రక్క చెక్కబడిన అక్షరములు అచ్చటచ్చట చెదిరినట్లు కనిపించినను మొత్తముపై శాసన మందముగ చెక్కబడినది. మొదటి ప్రక్క 16వ పంక్తిలో "మణ్ణాలేశ్వర కందూరి" లో "ర" అక్షరము మొదట చెక్కుట మరచిపోయి తరువాత × గుర్తుచే క్రింద అనగా "శ్వ" "కం" మధ్యన "ర" వ్రాయబడినది. అట్లే 18వ పంక్తిలో "కులసంకకాలు" అనుచోట "ల" మొదట చెక్కుట మరచిపోయి తరువాత వ్రాయబడినది. శాసనాక్షరములు కొన్ని చోట్ల చెదరిపోయినవి. శాసనము నల్లరాతిపై చెక్కినదైనను శిల్పి అజాగ్రత్తవలన అక్కడక్కడ అక్షరములు చెదిరినట్లు చెక్కబడినవి.

ఈ శాసనాక్షరములు మేడయభట్టుబొల్లేపల్లి శాసనము[1] కందూరి ఉదయన చోడమహారాజును పేర్కొను జడ్చర్ల శాసనము[2] రాచూరు శాసనము[3] మల్లియణ భట్టు చందుపట్ల కోనేరు శిలా శాసనాక్షరము[4] లను పోలియున్నవి.

**భాష :**

ఈ శాసనమంతయు తెలుగుభాషలో వ్రాయబడినది. శాసనాంతమున మూడవ ప్రక్క పంద్రెండవ పంక్తి చివరినుండి "బహుభిర్వ్వసుధాదత్తా" అను శ్లోకమారంభమగుచున్నది. శాసనము చివర మూడు శ్లోకములున్నవి. శాసనమున ద్విత్వాక్షరములు "ౘ" వాడబడినవి. ఆ కాలమున వెలసిన శాసనము లన్నిటి యందును, ఇట్లే కనిపించును. రెండు మూడుచోట్ల అనుస్వారమునకు బదులు అనునాసికాక్షరములు వ్రాయబడినవి.

| | | |
|---|---|---|
| ప్రవర్ధమాన బదులు | — | ప్రవర్ద్ధమాన |
| చంద్రార్క | — | చంద్రాక్కర్క |
| ప్రవర్త్తిల్ల | — | ప్రవర్తిల్ల |
| సూర్యవంశోద్భవ | — | సూయ్యర్యవంశోద్భవ |
| గోడూర్పుర | — | గోడూప్పుర |
| పర్వతము | — | పవ్వర్తము |
| తూర్పు | — | తూప్పు |
| పంచమహాశబ్ద | — | పఞ్చమహాశబ్ద |
| మండలేశ్వర | — | మణ్డలేశ్వర |

కుడులు, గుళ్ళు; ఆళ్ళపట్టు; మత్తూరు, మత్తుళ్ళు, మత్తుర; మత్త్ర; చెఱువు, చెఱువుల సెట్టిల; అనురూపవైవిధ్య పదములు శాసనమున కనిపించుచున్నవి.

---

1. భారతి — మార్చి 1969.
2. Hyderabad Archaeological Series No. 19 Mn 12 & 13.
3. ఆంధ్రపత్రిక సౌమ్య ఉగాది సంచిక మార్చి 1969.
4. అప్రకటితము

శాసనము వేయించిన కేతయ నాయకునికి చాళుక్య నంకకాఱ. పడువాయె పరఘోషణ ఖట్వాంగ ధ్వజ, మహావృషభలాంఛన, ఆది బిరుదములున్నవి కేతయ మహామాండలికుడు అసహాయశూరుడు. స్వామిభక్తి కలవాడు. శాసనమున చాళుక్య రెండవ జగదేకమల్లుడు, కందూరి ఉదయనచోడుడు పేర్కొనబడినారు.

**శాసన విషయము :**

ఈ శాసనమును మహామాండలిక కేతయ నాయకుడు వేయించెను. శాసనము మొదట చాళుక్య వంశీయుడగు ప్రతాపచక్రవర్తి రెండవ జగదేకమల్లుడు పేర్కొనబడినాడు జగదేకమల్లుడి శాసనమున "సమస్త భువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజపరమేశ్వర పరమ భట్టారక సత్యాశ్రయ కులతిలక చాళుక్యాభరణ శ్రీ మత్ప్రతాప చక్రవర్తి జగదేకమల్ల దేవర" అనియు, ఆతని సామంతుడును మహామండలేశ్వరుడును ఐన కందూరి ఉదయన చోడమహారాజు "సమధిగత పంచమహాశబ్ద మహామణ్డలేశ్వర పరమ మహేశ్వర కోడూర్పురవరేశ్వర సూర్య్యవంశోద్భవకుల తిలక కాశ్యపగోత్ర కరికాలాన్వయ నామాది సమస్త ప్రశస్తి సహితం శ్రీ మన్మహామణ్డలేశ్వర కందూరి ఉదయనచోడమహారాజు" అని వర్ణింపబడినాడు.

మహామాండలిక కేతయ నాయకునికి, అనేక బిరుదములున్నట్లు శాసనము వలన తెలియుచున్నది. "వేంగిదేశ చాళుక్యనంకకాఱ, పరమండల చూఱకాఱ, కాంచీపుర రక్షక, కడువాయె పరఘోషణ, ఖట్వాంగ ధ్వజమహావృషభలాంఛన, భారద్వాజగోత్ర పల్లవకులతిలక పాదంబుజ సేవిత, గోడూప్పురవరాధీశ్వర, యన్వకామకుల కుముదినీ ముఖచంద్ర, మన్యదేవేంద్ర, బంధు జనాశ్రయ, శరణాగత వజ్రపంజర, మన్నియ బ్రహ్మరాక్షస, దుష్టాశ్వపల్ల-కుసూల్ల శాసనపతి, దేవగురుద్విజభక్తులు నూఱువరజముండు నయిన శ్రీమన్మహా మాండలిక కేతయ గొండపల్లి నాడు శాసనబద్ధంబుగా బడసి సిరికొండ రాజ్యంబు సేయుచుండగా" అని శాసనమందున్నది.

మహామాండలికుడైన కేతయ నాయకుడు సుఖసంకథా వినోదంబుల సిరికొండ రాజ్యము చేయుచు జవ్వనాయకుని సమక్షమున దేవాలయముల నెత్తించి, ఆ దేవాలయములందు దేవరలకు హావిబలి వివిధార్చనలకుగాను, ధారాపూర్వకముగా భూమి దానమిచ్చెను.

సిరికొండపైనిగల జవ్వేశ్వర దేవరతో కలిపి, పంచలింగములకు, సిరికొండ తూర్పు దిశలో 15 మఢ్ఢు ఆడ్లపట్టునేల, ఆదేవరలకే మరికొన్ని చోట్ల పుట్టి పుట్ట పండు నేలలును, నారాయణ దేవరకు, భీమేశ్వర దేవరకు, కేదార దేవరకు, వివిధములైన అర్చనలకు, పలుతావులందు భూమిని దానమిచ్చెను.

పర్వతము వాయవ్యమున కేత సముద్రము వెనుక పర్వతము మీంది పంచిలింగాలకు, మూడు మఱుతుర్ల భూమిని, భీమేశ్వర దేవరకు మూడుమర్తుర్లు, నారాయణ దేవరకు రెండు మఱుతుర్లు జినదేవరకు మర్తుర్లు రెండు. బ్రాహ్మణులకు మర్తుర్లు పది. సోమ సముద్రము, సూర సముద్రము, భీమ సముద్రము ఈ మూడు సముద్రముల క్రింద, నీరు నేల దానముగా నిచ్చెను. ధూపదీప నైవేద్యములకు, హావిబలి అర్చనలకు, బ్రాహ్మణులకు వివిధములైన భూములను దానమిచ్చి. శాసనము వేయించెను. కేత సముద్రమను చెఱువు కేతయ పేర వెలిసినట్టిది.

సిరికొండ కొండమీద నరసింహస్వామి ఆలయమున్నది. బహుశః ఈ ఆలయము కేతయ నాయకుని కాలమున వెలసి యుండలేదేమో! శాసనాంతమున దాన ఫలమును తెలుపు శ్లోకము లున్నవి.

## కాల నిర్ణయము

ఈ శాసనము శా.శ. 1070 విభవ సంవత్సరము ఫాల్గుణశుద్ధ పాడ్యమి గురువారమునాడు వేయింపబడినది. శా శ. 1070సం. క్రీ.శ. 1148; చాళుక్య రెండవ జగదేకమల్లుని పరిపాలనాకాలము క్రీ. శ. 1136-1155; ఈ శాసనము రెండవ జగదేకమల్లుని పం|డ్రెండవ విజయ రాజ్యసంవత్సరమున వేయింపబడినది. బొల్లేపల్లి శాసనము[1] జగదేకమల్లుని పదియవ రాజ్య సంవత్సరమున అనగా శా శ. 1068 లేక క్రీ. శ. 1146లో వేయించినట్టిది.

కందూరి ఉదయనచోడ మహారాజు కాలము క్రీ.శ. 1140-1176; కాకతిప్రోలరాజు కుంతోరిదేశపు రాజును జయించిన గోవిందరాజును యుద్ధమునందోడించి, అతని రాజ్యమునుఉదయ రాజున కిచ్చినట్లు హనుమకొండ వేయిస్తంభాల గుడి శాసనము[2] వలన తెలియుచున్నది. కుంతోరి దేశము నేలకొండపల్లి ప్రాంతముకాదని భావించవచ్చును. ఈకొండపల్లి నాడును శ.సం. 1070నాటికే ఉదయనచోడ మహారాజు కేతయ మహా మాండలికునకు శాసనబద్ధము గావించి యొసంగెను.

ఉదయనచోడ మహారాజు రాజ్యము కృష్ణానది దక్షిణ సరిహద్దుగా గలది, మహబూబు నగరమండలమున గద్వాల, అలంపూరు తాలూకాలు మినహా తక్కిన ప్రాంతమంతయును, నల్లగొండ మండలము పూర్తిగాను ఖమ్మంజిల్లాలోని నేలకొండపల్లి ప్రాంతము, ఉదయనచోడుని రాజ్యమున చేరియుండెను. కందూరిచోడుల రాజధానులుగా వర్ధిల్లిన నగరములు నల్లగొండ మహబూబునగర మండలములలో నున్నవి. నల్లగొండ మండలమున ఉదయన చోడుని సామంతు లనేకులుండి యుందురు. అందు నేలకొండపల్లి ప్రాంతపాలకుడు సిరికొండ రాజ్యము నేలువాడు కేతయమాండలి కుడు. అట్లేపానుగల్లు, భువనగిరి, రాచకొండ, రాచూరు, వంగూరు, ప్రాంతములందు సామంతు లుండి యుందురు. కందూరు, వర్ధమానపురము, పానుగల్లు మున్నగునవి కందూరి చోడుల రాజ ధానీ నగరములు.

కాకతి ప్రోలరాజు రెండవ జగదేకమల్లుని సామంతుడు. మహామండలేశ్వరుడు. అట్లే ఉదయన చోడుడు రెండవ జగదేకమల్లుని సామంతుడు. మహామండలేశ్వరుడు. కాకతిప్రోలరాజు రెండవ జగదేకమల్లుని మరణానంతరము, జైత్రయాత్రచేసి, అనేక సామంతులను, మాండలిక రాజులను, జయించియుండును. ఉదయన చోడుడు కాకతిప్రోలరాజుతో సమానమైనవాడు. కాకతి

---

1 భారతి — మార్చి 1969

2 వేయి స్తంభాలగుడి శాసనము తె. శా. కా. శా. నం. 5

పంక్తులు — 30 — 33;

ప్రోలరాజు చాళుక్య చక్రవర్తి యగు తైలపు నోడించిన పిదప, ఉదయనుడు, కాకతి ప్రభువుతో చెలిమిగోరి యుండును. కాకతి ప్రోలరాజు ఉదయనునకు కొంత రాజ్యమిచ్చి తన అధిక్యము చూపియుండును.

కాకతి రుద్రదేవుని కాలమున కల్యాణి ప్రభువులు, రాజ్యము కోల్పోవ, ఉదయనుడు అతని కుమారులు, భీమ, గోకర్ణులు, రాజ్యకాంతచే రుద్రదేవు నెదిరించి, ఓడిపోయి, అతని సామంతులుగ నుండ నంగీకరించి, పద్మావతీ దేవిని రుద్రదేవునికిచ్చి వివాహమొనర్చియుండురు.

సిరికొండ రాజ్యము కాలక్రమముగ కేతయ వంశీయుల చేయిజారి, కందూరి చోడుల వశమై యుండెనని భావింపవచ్చును. గుణపతిదేవ చక్రవర్తి, రుద్రాంబ పాలించుకాలమున మహబూబునగర మండలము గోన వంశీయుల అధికారము నందుండెను. ఆ కాలమున కందూరి చోడుల రాజ్యము నల్లగొండ మండలమునకే పరిమితమై యుండెను, కందూరి చోడుల శాసనములలో మల్లేపల్లి శాసనము శ. సం. 1157 నాటిది. అనగా క్రి, శ. 1235లో వేయింపబడినది. అగా మోతుకూరు శాసనము శ. సం. 1204లో అనగా క్రి. శ. 1282లో వేయింపబడినది. కాకతి రుద్రమ పాలించునాటికి కందూరి చోడులు నల్లగొండ మండలమును పాలించుచుండిరని తెలియుచున్నది. అప్పటికి మహబూబునగర మండలమున కందూరిచోడుల పాలన మంతరించెను. గణపతి దేవ చక్రవర్తి పాలించు నాటికే కందూరిచోడులు కందూరినాడుపై అధిపత్యమును కోల్పోయి యుందురు.

ఉదయన చోడుని యనంతరము, భీమగోకర్ణుల కాలమున కందూరి చోడులు నల్లగొండ మండలములోని పానుగల్లు పట్టణమును తమ రాజధానిగా నేర్పరచుకొనిరి. క్రి. శ. 1235లో వేయింపబడిన మల్లేపల్లి శాసనమున భీమదేవచోడమహారాజు పేర్కొనబడినాడు. ఇతని మనుమడు రామనాథదేవచోడ మహారాజు, అగా మోతుకూరు శాసనమును వేయించెను. ఈ శాసన కాలము క్రి. శ. 1282. రామనాథదేవచోడ మహారాజు, నల్లగొండ మండలమును కాకతిరుద్రాంబ సామంతునిగా పాలించెను.

సిరికొండ పాలకులు తొలుత కందూరిచోడుల సామంతులు. అటుపిమ్మట వీరు కాకతీయుల సామంతులుగనో, దండనాథులుగనో నుండియుందురని భావింపవచ్చును—

# సిరికొండ శాసనము

శాసనము - మూలము

మొదటి ప్రక్క

1, స్వస్తి సమస్తభువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ
2. మహారాజాధిరాజ పరమేశ్వర పరమ
3. భట్టారక సత్యాశ్రయకుళతిలక చాళు
4. క్యాభరణ శ్రీమత్ప్రతాపచక్రవర్త్తి జగదే
5. కమల్లదేవర విజయరాజ్య ముత్తరోత్తరాభి
6. వృద్ధిప్రవర్ద్ధమాన మాచంద్రార్క్కతార మా
7. సముద్ర పర్య్యంత మఖిలలోక సుఖప్ర
8. దంబై ప్రవర్త్తిల్ల స్వస్తి శకవర్షములు
9. 1070 యగు విభవ సంవత్సర ఫాల్గు
10. ణ శుద్ధ 1.॥యు గురువారమున
11. స్వస్తి సమధిగత పఞ్చమహాశబ్ద మ
12. హామణ్డలేశ్వర పరమ మాహేశ్వర కోడూ
13. ర్పుర వరేశ్వర సూర్య్యవంశోద్భవ కు
14. ళతిలక కాశ్యపగోత్ర కరికాలాన్వయ
15. నామాది సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మ
16. హామణ్డలేశ్వర కందూరి ఉదయనచో
17. డ మహారాజుల చేత స్వస్తి శ్రీవేంగి దే
18 శ చాళుక్య సంకకాఱ పరమండల సూఱకా
19. ఱ కాంచీపుర రక్షక కడువాయె పటుఘో
20. షణ ఖట్వాంగధ్వజ మహావృషభలాంఛన
21. భారద్వాజగోత్ర పల్లవకులతిలక పాదాం
22. బుజసేవిత గోడూర్పురవరాధీశ్వర య
23. న్వకామకులకుముదినీ ముఖచం(ద్ర)
24. మన్యదేవేంద్ర బంధుజనాశ్రయ శర(ణా)
25. గతవజ్రపంజర చెన్నమన్నెయగణ్డ
26. ర్వ్వస్వచూరకాఱ బిరుదమన్నియ (బ్రహ్మ)
27. రాక్షస దుష్టాశ్వమల్ల తురగరేవ(ంతుండ)

రెండవ ప్రక్క

1. యనియానమల్లడ కూనూడ్ల శాసన
2 పతి దేవగురుద్విజభక్తులు నూఱు
3. మరజముండు నయిన
4. శ్రీమన్మహామండలిక కేత
5. య గొండపల్లినాడు శా
6. సనబద్ధంబుగా బడసి సిరికొణ్డ
7. రాజ్యంబు సేయుచుండగా నందు వి
8. నోదంబులను న్డక......(దిజువ్వనా)
9. యకునకు సెజ్ఞయెత్తించిన గు
10. డ్ల దేవరలకు హవి బలి పవిధార్చ్చనలకు ధా
11. రాపూర్వ్వముసేసి పెట్టినపత్తి
12. పవ్వతముమీది జువ్వేశ్వరదేవర
13. సహితమైన లింగములకు సిరికొం
14. డ తూర్ప్పదిశాభాగము నలుబయెను
15. మిట్లొంబండు యాడ్లపట్టు భూమి మఱి
16. య్యు నాదేవరలకు నడిమిభూమి మీద
17. వాడె నిరుపుట్టి యాండ్లపట్టు — డును
18. కముముంది —కలకడ మంచాలు
19. ముప్పందుము॥ దేవరలకు రావిపాటిం
20. బుట్టెండు॥ ఆదేవరల కలకాపాలుం బుట్టెం
21. డు । ఆదేవరల కయెల మాఎం పన్నెండు । ఆ
22. దేవరకు ప్రమోండు — భీమేశ్వరదే
23. వరకు ఏకుమట్లుం బండు యాడ్లపట్టు నారాయ
24. ణదేవరకు నీరువుట్టి యాడ్లపట్టు భీమేశ్వర దే
25. వరకు సుంకముబండిం దూమెండు ధాన్యము పో
26. కలబండి నెంభయిపోకలు తలమాడునుం చెడి
27. పోంకలు ఆకు మోపున సెంచయ యాకులు డ
28. ట్టుపటక మానెండు మోపుసు పట్టెండు నకరము
29. నందు నివేద్యమున నఖండదీపము॥ కేదారదేవ
30. రకు మూండుమట్లాడపట్టు॥ పవ్వతము॥ ప
31. శ్చిమము జలకేదారదేవరకు పుట్టెండాడ్లపట్టు
32. పవ్వతము ఉత్తరము అచుతేశ్వరదే
33. వరకు — నిరుడు — బయా _ డు — దేఉత్త
34. రము సూరసముద్రము — పల — పార
35. నుచురు — —

## మూడవ ప్రక్క

1. జిన దేవరకు నీరుమట్టి యాడ్లపట్టు ॥ బ్రాహ్మలకు నిరు

2. వయెను మద్దిడ్లపట్టు ॥ సంకునికంబుట్టి ॥ పవ్వోణాతముపా

3. యవ్యమున కేతసముద్రము వెనుకం పప్పాణాతము మీం

4 ది వఞ్చలింగములకు మత్తుఌ మూఁడు॥ భీమేశ్వర

5. దేవరకు మత్తుఌ మూఁడు ॥ నారాయణదేవ

6. రకు మత్తుఌ రెండు ॥ కేదారదేవరకు మత్తుఌ

7. రెండు ॥ జినదేవరకు మత్తుఌ రెండు ॥ బ్రాహ్మ

8. లకు మత్తుఌపది ॥ సకనికెద్ద ॥ సూర సముద్ర

9. ము సోమసముద్రము భీమసముద్రము మూం

10, డు సెఌల యంఁదునుం గొరియకు మాస్యము

11. మత్తుర నొకమత్తురనుం బండుమునం అమ్పుగా

12. ని యాగాదయిస చెఱ్వు పొలమించునబ ॥ బహు

13. భివ్వఀసుధాదత్త బహుభిశ్చానుపాలితా య

14. స్యయస్యయదాభూమి స్తస్యతస్యతదాఫ

15. లం ॥ స్వదత్తాం పరదత్తాంవా యోహరేతి వసుం

16. ధరా షష్టివ్వఀషసహస్రాణి విష్టాయాం జాయ

17. తేక్రిమి ॥ ద్వేషన్తియే మత్సరలోభభాజన తా

18. ఇమం ధమ్మఀమధమ్మఀవిలాధ గోప్నమాతృఘ్న పితృ

19. ఘ్న లోకా సేవేవ్రజన్తి విప్రఘ్నగతిం బభూవ.

# రాచూరు శాసనములు

మహబూబునగర మండలము, కల్వకుర్తి తాలూకాలోని రాచూరు గ్రామము వెలుపలనున్న దేవాలయమున గల నల్ల రాతిపై మూడువైపుల శాసనములును, నాలుగవవైపు మహానాగమును చెక్కబడినవి. ఈ శాసనములు రావితొత్తిప్రెగ్గడ మల్లిసెట్టి వేయించి నట్టివి.

రాష్ట్రకూట వంశమంతరించిన పిమ్మట, నల్లగొండ, మహబూబునగర మండలములను కల్యాణీ చాళుక్య రాజులు తమ సామ్రాజ్యమున జేర్చుకొని పాలించిరి. ఈ మండలములలో కల్యాణీ చాళుక్యులకును వారి సామంతులకును, దండనాథులకును సంబంధించిన వందలకొలది శాసనములు కనిపించుచున్నవి.

రాచూరు గ్రామ మతి పురాతనమైనది. ఇచ్చట నున్న ప్రాచీన దేవాలయములలో గొన్ని శిథిలమై నామ మాత్రముగ నిలిచియున్నవి. కేశవ దేవర ఆలయము, శిథిలము కాకుండ పశ్చిమ చాళుక్య శిల్ప సంపదతో నొప్పారు చున్నది. ఈ ఆలయ గర్భగుడి విశాలమైన మంటపము కలిగియున్నది. కేశవదేవర ఆలయము, మల్లికార్జున దేవర ఆలయము, కలిసియే యున్నవి. ఆలయము ముందు ఆవరణలో చిన్న చిన్న గుళ్లు ఉన్నవి. అందు వినాయక, పార్వతి, ఆంజనేయస్వామి విగ్రహములున్నవి.

వినాయక విగ్రహము ముందుగల నంది చక్కని శిల్పముతో నొప్పారుచున్నది. దేవాలయ ప్రాకార కుడ్యములు పడిపోయి పునాదులు మాత్రము కనిపించుచున్నవి. ఈ గ్రామమున ప్రాచీన దేవాలయ శిథిల చిహ్నములు విశేషముగ నున్నవి. చరిత్ర ప్రసిద్ధిగన్న గంగాపుర మిచ్చటికి ఇరువదియైదు మైళ్ళ దూరమున నున్నది.

కేశవదేవర ఆలయమునకు పదిగజముల దూరమున ఒక శిలాశాసనమున్నది. ఈ శాసనము కల్యాణీ చాళుక్య రాజగు మూడవతైలపుని కాలమున నల్లపయ్య దండనాయకరు వేయించినది. ఇది కన్నడ శాసనము.

రావితొత్తిప్రెగ్గడ మల్లి సెట్టి వేయించిన మూడు శాసనములలో నొకదానియందు కందూరి ఉదయన చోడ మహారాజు ప్రశంసకలదు. ఉదయనచోడునికి సంబంధించిన మొదటి శాసనము శక సంవత్సరము 1084 లో వేయింపబడిన జడ్చర్ల శాసనముని[1] ఇంతవరకు భావింపబడినది. కాని శక సంవత్సరము 1070లో వేయింపబడిన 'సిరికొండ' శాసనము[2] ఉదయనచోడ మహారాజును పేర్కొను మొట్టమొదటి శాసనమని తెలియుచున్నది. మల్లిసెట్టి వేయించిన రాచూరు శాసనము ఉదయనచోడుని పేర్కొను రెండవ శాసనము.

---

1. Hyderabad Archaeological Series No. 19 Mn. 12 & 13.
2. భారతి-ఫిబ్రవరి, 1970

కందూరిచోడులకు సంబంధించిన శాసనములందు పేర్కొనబడిన రాజుల పేళ్లు, కొణిదెన, పొత్తపి, రేనాడు, నెల్లూరు, కర్నాడు, ప్రాంతములను పాలించిన తెలుగుచోడ రాజుల పేళ్ళతో సమన్వయ పరచుటకు వీలు లేకుండ నున్నవి నల్లగొండ, మహబూబునగరం మండలములందు కందూరిచోడులకు సంబంధించిన శాసనములెన్నియో నున్నవి. అందుకొన్ని ప్రకటింపబడినవి. కొన్ని ప్రకటింపబడవలసి యున్నవి.

కందూరిచోడుల చరిత్ర అసమగ్రముగనున్నది. ఈ రాజన్యులు, తెలంగాణ ప్రాంతమున, నల్లగొండ, మహబూబునగర మండలములందేకాక, ఓరుగల్లు, ఖమ్మం మండలములలోని కొన్ని భాగములను కూడ పాలించిరి. కందూరి చోడ రాజులలో ఉదయనచోడ మహారాజు ప్రముఖుడు. ఈ రాజును పేర్కొను శాసనములే ఎక్కువగా కనిపించుచున్నవి

## శాసనముల స్వరూపము

రావితొత్తి ప్రెగ్గడమల్లి సెట్టి వేయించిన మూడు శాసనములును, ఒక మహానాగమును, రాచూరు కేశవదేవర ఆలయముననున్న నల్లరాతిపై చెక్కబడినవి. శాసనశిల ఎత్తు 5.1/2' అలు వెడల్పు 1.1/2' అలు నాలుగువైపుల సమానమైన వెడల్పుగలిగి, చూచుట కందముగనున్న శిలపై మల్లిసెట్టి శ. సం; 1081; 1082లలో మూడు శాసనములను చెక్కించెను శక సంవత్సరము 1079లో వేయించిన శాసనమున శ్రీ శ్రీల వరుసతో కలిపి, 31పంక్తులును, శ.సం. 1081నాటి శాసనమున 25 పంక్తులును, శ. సం 1082వ సంవత్సరపు శాసనమున 12 పంక్తులును ఉన్నవి. నాలుగవైపు చెక్కబడిన నాగము చూచుట కందముగ నుండి, సజీవముగ నున్నట్లు కనిపించును.

## లిపి

మల్లిసెట్టి వేయించిన మూడు శాసనములలో, ఆంధ్రదేశమున పండ్రెండవ శతాబ్ది ఉత్తరార్ధమున వాడుకలోనున్న తెలుగు లిపి వాడబడినది. అక్షరములు గుండ్రముగానుండి చక్కని వరుసలలో ఎంతో అందముగ కనిపించుచున్నవి. శాసనాక్షరములను చెక్కిన శిల్పి కడు జాగరూకతతో వ్యవహరించినాడు. ఐనను శాసనములందు కొన్ని స్కాలిత్యములున్నవి పడగ ఎత్తినట్లున్న నాగము, గంభీరముగను, సుందరముగను, ఆకర్షణీయముగను ఉన్నది. మొదటి శాసనారంభమున నాలుగు శ్రీ లు వ్రాయబడినవి. "సంవత్సర" బదులు "సంవత్స" వ్రాయబడినది. రెండవ శాసనమున ప్రమాది సంవత్సరము వ్రాయునపుడు రెండు "ప్ర"లు వ్రాయబడినవి. 24వ పంక్తిలో విష్ఠాయాం బదులు "విష్ఠా" వ్రాయబడినది. మూడవ శాసనమున పదియవ పంక్తిలో "స్థాయి" బదులు "సాయి" వ్రాయబడినది. మూడవ శాసనము మొదట హిరణ్యకశిపుని సంహరించుచున్న నరసింహమూర్తి, ప్రక్కన ప్రార్థించుచు నిలబడిన ప్రహ్లాదుడు చెక్కబడినారు. ప్రహ్లాదుని విగ్రహము చెదిరిపోయి గణపతి విగ్రహమువలె కనిపించుచున్నది.

## భాష

మల్లి సెట్టి వేయించిన మూడు శాసనములలోను తెలుగు వచనము వాడబడినది. ఉదయన చోడ మహారాజుకుగల చోడరాజుల ప్రశస్తి తెలుపబడినది. గోదూరి మున్నూటి సవదర

విన్నపమాలకించి దానము గావించుట కాజ్ఞయొసంగబడినది. సవదర పదము కన్నడ శాసనము లందును, బొల్లేపల్లి[1] శనిగరం[2]శాసనములందు పేర్కొనబడినది. గోడూరి మున్నూటిని పాలించు అధికారి పోతే నాయకుడు. ఉదయనచోడ మహారాజుచే నియమింపబడినవాడు. శాసనమున 26వ పంక్తినుండి బహుభిర్వ్వసుధాదత్తా-స్వదత్తం పరదత్తంవా శ్లోకము లున్నవి. అనుస్వారమునకు బదులు అనునాసికాక్షరములు కూడ అచ్చటచ్చట కనిపించుచున్నవి. 'శ' బదులు "స" వ్రాయ బడినది. రెండవ శాసనారంభమున శ్రీమత్త్రైలోక్యమల్ల గంగాపురము-త్రిభువమల్ల బ్రహ్మదేవర సెట్టి అనియున్నది. గంగాపురమునకు త్రైలోక్యమల్ల కేశవపురమను నామాంతరము కలదు[3]

| | | |
|---|---|---|
| ప్రశస్తి | — | ప్రసస్తి |
| నాయకుని | — | నాయకిని |
| శకవర్షములు | — | సకవషములు |
| సంవత్సర | — | సంవత్స |
| సంక్రాంతి | — | సకాన్తి |
| నందాదివెకు | — | నన్దాదివెకు |
| కార్తీక | — | కాత్తిక |
| సోమనాధ | — | సోమనాత |
| ఆచంద్రార్క | — | ఆచంద్రాక్క |

"శ" బదులు "స","ఁ" అనుస్వారమునకు బదులు అనునాసికాక్షరములను వాడుట ప్రాచీనాంధ్ర శాసనములందువలె ఈ శాసనములందును కలదు. కేశవదేవరకు, పెండ్లిండ్లు జరుగు నపుడు పెండ్లి కొడుకువారు. పెండ్లికూతురు వైపువారు చెల్లించవలసిన రూక, కట్టడి విషయ మును మొదటి శాసనము తెలుపుచున్నది. మల్లిసెట్టి రావితొట్టి ప్రెగ్గడ. మూడు శాసనము లను మల్లిసెట్టి కేశవదేవరకు నన్దాదివియలను పెట్టించు సందర్భమున వేయించెను. మొదటి శాసనమువలన కేశవదేవర గుడి స్థానాపతి దామోదరభట్టు పేరు తెలియుచున్నది. రెండవ శాసన మును ముట్టిబోయిని నాయకయ్యకొడుకు కొండె లోనుగాగల వారును మూడవ శాసనమున ముట్టెబోయిని కొడుకు యెలగె పేర్కొనబడినారు.

---

1. భారతి-మార్చి 1969.
2. భారతి-జూన్ 1970.
.3 తెలంగాణ శాసనములు Vol I చా. శా. సం. 24

# రాచూరు శాసనము

## మొదటి శాసనము

### శాసనము - మూలము

శ్రీ శ్రీ శ్రీ శ్రీ

1. శ్రీ స్వస్తి సమధిగత పంచమహాశబ్ద
2. మహామండలేశ్వర వీరమహేశ్వర
3. కోడూరుపుర వరేశ్వర సూర్యవం
4. శోద్భవ కులతిలక కాస్యపగోత్ర క
5. లి(రి)కాలాన్వయ నామాది సమస్త ప్ర
6. స(శ)స్తి సహితులైన శ్రీమన్మహా మం
7. డలేశ్వర కందూరి ఉదయనదేవ మ
8. హారాజులు గోడారి మున్నాటి సపవ
9. ర రావితొత్తి పోతెనాయకి(డు)ని విన్న
10. పము విన్నవిత్రమున సమధరించి
11. స(శ)కవర్షంబులు 1079 యగు ఈశ్వర సం
12. వత్స(ర) పుష్య బ. 6. బుధవారమునాటి
13. మకరస(ం)క్రాన్తి సమయమున మ
14. లిసెట్టి చేయించిన రావితొత్తి శ్రీ
15. కేశవదేవరకు అఖండవాయువు
16. స(శ)నివారసిద్ధి మడ్డుసు ముఖవృత్తి
17. పెట్టు పల్లిసెట్టిచెఱువునక అత్తము
18. వు మడ్డుసు యూరికడపటి నీల
19. ము ముందట పూవుతోట నస్తాదివకు
20. నకరము నిచ్చినది కోమటి యిండ్ల
21. ను త్తమము మూక మధ్యమము అర్ధు
22. కోమటియిండ్ల పెండ్లికొడుకువారు మూ
23. క కూంతువారు రూ. యీ కేశ(శ)వదేవ
24. ర గుడిస్తా(స్థా)నాపతి దామోదర భట్టుకు
25. శ్రీ బహుభిర్వసుధా దత్తా రాజభిః స్స
26. గరాదిభిః యస్య యస్య యదాభూమి
27. తస్య తస్య తదాఫలం స్వదత్తాం పర
28. దత్తాం వా యోహరేత వసుంధరా ష
29. ష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం
30. జాయతే క్రిమి — — — ।

## రెండవ శాసనము

### శాసనము – మూలము

1. స్వస్తి శ్రీ మత్త్రైలోక్య మ
2. ల్ల గంగాపురము త్రిభువ
3. నమల్ల బ్రహ్మదేవసెట్టి స (క)
4. కవర్షములు 1081 ప్ర
5. ప్రమాది సంవత్సర కార్తి (క) క
6. సు (శు) 11 వడ్డవ (వా) రము నాండు శ్రీ
7. మద్రాజధాని పానుగంటి పూ
8. బగుడి శ్రీ సోమనాత (థ) దే
9. వర శ్రీ కేశవదేవర సన్ని
10. ధానమ (ము) న రావితొాత్తి పెగ్గ
11. డ మల్లిసెట్టి చేయించిన శ్రీ కె
12. శవదేవరకు రెండు నందాది
13. వియలకు ధనసాదము
14. సవండముమనుం బడికి నడు
15. చుచున్న ముట్టైటోయిని నా
16 యకయ్య కొడుకు కొండె
17. టోనుగా నా చంద్రార్క తా
18. రకము ధారవోసి యిచ్చె
19 శ్రీ బహుభిర్వ్వసుధా ద త్త రా
20. జభిః స్సగరాదిభిః యెస్యయె
21. స్య యదాభూమి తస్య తస్య త
22. దాఫలం॥ స్వదత్తం పరదత్తం వా
23. యోహరేతి వసుంధరా షష్టి
24. వ్వర్షరుష సహస్రాణి విష్టా (యాం) జాయ
25. తే క్రిమి ॥

# రాచూరు శాసనము

## మొదటి శాసనము

### శాసనము - మూలము

శ్రీ శ్రీ శ్రీ శ్రీ

1. శ్రీ స్వస్తి సమధిగత పంచమహాశబ్ద
2. మహామండలేశ్వర వీరమహేశ్వర
3. కోడూప్పుణర వరేశ్వర సూర్యవం
4. శోద్భవ కులతిలక కాస్యపగో లక
5. లి(రి)కాలాన్వయ నామాది సమస్త ప్ర
6. స(శ)స్తి సహితులైన శ్రీమన్మహా మం
7. డలేశ్వర కందూరి ఉదయచోడ మ
8. హారాజులు గోడారి మన్యాది సమస
9. ర రావితొత్తి పోతెనాయకి(డు)కి విన్న
10. పము విన్నవిత్రమున సమర్పించి
11. స(శ)కవర్షంబులు 1079 యగు ఈశ్వర సం
12 వత్స(ర) పుష్య బ. 8. బుధవారమునాటి
13. మకరస(ం)క్రాన్తి నిమిత్తంబున మ
14. లిసెట్టి చేయించిన రావితొత్తి శ్రీ
15. కేశవదేవరకు ముప్పలవాయను
16. స(శ)నివారసిద్ధి మద్దులు ముప్పుట్టి
17. పెట్టు పల్లిసెట్టిచెఱువునకు అగ్నేయా
18. వు మద్దులు యూరకడపటి పొల
19. ము ముందట పూవుతోట నన్దాదీపము
20. నకరము నిచ్చినది కోమటి యిండ్ల
21. నుత్తమము కాక మధ్యమము అడ్డు
22. కోమటియిండ్ల పెండ్లికొడుక్కువారు మం
23. క కూంతువారు దూ యీ కేశ(శ)వదేవ
24 ర గుడిస్తా(స్థా)నాపతి దామోదర భట్టులు
25. శ్రీ బహుభిర్వ్వసుధా దత్తా రాజభిః స్స
26. గరాదిభిః యెస్య యెస్య యదాభూమి
27. తస్య తస్య తధాఫలం స్వదత్తాం పర
28. దత్తాం వా యోహరేత వసుంధరా ష
29. ష్టిర్వ్వరుష సహాస్రాణి విష్టాయాం
30, జాయతే క్రిమి ——— ।

# మల్లేపల్లి శాసనము

కందూరి చోడవంశీయులు పశ్చిమ చాళుక్య ప్రభువగు ఆరవ విక్రమాదిత్యుని కాలమున కొలనుపాక ఏడువేలు పాలించు అధికారమును పొంది ఉదయనచోడుని కాలమున కందూరి మండలమున స్థిరపడి, కందూరు చోడులుగా ప్రసిద్ది జెందుటయేగాక, సువిశాలమైన కందూరి చోడ రాజ్యమును, మహామండలేశ్వరులుగా పాలించినారు. కాకతి రుద్రదేవుని కాలమునుండి కందూరిచోడ రాజ్యము క్షీణింపమొదలిడి, రెండవ ప్రతాపరుద్రుని కాలము నాటికి పూర్తిగా పతనమైనది.

**శా స న ము**

ఈ శాసనము నల్లగొండ మండలములోని దేవరకొండ తాలూకా మల్లేపల్లి చౌరస్తా ప్రక్కనగల కుంట క్రింది చేనిలో పాతబడి యున్నది. శాసన శిలకు చేరువలో శిథిల దేవాలయ చిహ్నములు కనిపించుచున్నవి. పార్వతీదేవి విగ్రహము, నాగములు చెక్కబడిన శిలా ఫలకములు, భిన్నమైన పానవట్టము, నంది శిథిల ప్రాంతమున కనిపించుచున్నవి. దేవాలయము శిథిలముకాగా, శాసనశిల చెక్కుచెదరక నిలిచియున్నది.

**ఆకారాదికములు :**

శాసనము నల్లసరపు రాతిపైని చెక్కబడినది. అక్షరములు నాలుగు వైపుల చక్కని వరుసలలో చూచుట కందముగ నున్నవి. శాసన శిల పొడవు 5'-4"లు. వెడల్పు 1'7"లు. శాసనము నాలుగవ ప్రక్క చెక్కిన అక్షరములు దగ్గర దగ్గరగాను, చిన్నవిగను ఉన్నవి.శాసనాక్షరములు లోతుగా చెక్కబడినవి. పంక్తులలోని అక్షరములు గుండ్రముగా నుండి, అందముగ కనిపించుచున్నవి. శాసనమును చెక్కిన శిల్పి జాగరూకత వహించినట్లు కనిపింపదు శాసనమున తప్పులు కనిపించుచున్నవి.

శాసనము మొదటి ప్రక్క సూర్యచంద్రుల చిహ్నములు, పానవట్టముతో గూడిన శివలింగము, స్వస్తిక చిహ్నములు, గోవు, లేగ, శంఖము చిత్రింపబడినవి.ఇవి. యన్నియు శైవ మత సంప్రదాయ, చిహ్నములు ఈ శాసనము మొదటి ప్రక్క 16 పంక్తులు రెండవ ప్రక్క 15 పంక్తులు నాలుగవ ప్రక్క 21 పంక్తులు మొత్తము 67 పంక్తులు కలది. ఈ శాసనము ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురావస్తుశాఖవారి సీరీస్ నెంబరు 22లో 307వ శాసనముగా నమోదు చేయబడినది.

**లి పి**

ఈ శాసనమును కందూరి భీమదేవచోడ మహారాజు శక సంవత్సరము 1157 లో వేయించెను. శాసనము తెలుగు భాషలో వేయింపబడివది. శాసనాక్షరములు క్రీ. శ. పదమూడవ

శతాబ్ది పూర్వార్ధమున తెలుగు దేశమున వెలసిన శాసనాక్షరములను పోలియున్నవి శాసన లిపి కాకతీయ శాసన లిపికిని కందూరి చోడుల ఇతర శాసనముల లిపికిని సన్నిహితముగా నున్నది. శాసనాక్షరములు ముఖ్యముగా ఉదయనచోడుని పేర్కొను జడ్చర్ల[1] రాచూరు[2] ఏరికొండ[3] శాసనాక్షరములవలెను, పానుగల్లు,[4] మామిళ్ళపల్లి[5] గట్టుతుమ్మెన[6] శాసనములలోని అక్షరములను పోలియున్నవి. శిల్పి అజ్ఞతవలన శాసనము చెక్కునపుడు కొన్ని తప్పులు దొరలినవి.

**భాష**

ఈ శాసనము తెలుగు భాషలో వేయింపబడినది. శాసనారంభమున ఒక్క శ్లోకమును శాసనము రెండవ ప్రక్క పందొంద్రవ పంక్తి నుండి, మూడవ ప్రక్క పదమూడవ పంక్తివరకు మూడు సంస్కృత శ్లోకము లున్నవి తరువాత స్థానాపతి బిరుదములు, వర్ణన వచనములో నున్నవి. శాసనమున తప్పులు కనిపించుచున్నవి సాధారణముగ శాసనములందు "నమస్తుంగ శిరశ్చుంబి చంద్రచామర చారవే" అని యుండును. కాని ఈ శాసనమున నమస్తుంగ శిరశ్చంద్ర చంద్రచామర తారవే' అని చెక్కబడినది అట్లే నగరారంభ బదులుగ నకరారంభి, మూల బదులు ములు

| | | |
|---|---|---|
| జయాభ్యుదయాశ్చశ్శక | — | జయాభ్యుదస్చశ్శక |
| సమధిగత | — | శమధిగత |
| ప్రశస్తి | — | ప్రసస్తి |
| సహిత | — | శహిత |
| శ్రీమన్మహా | — | శ్రీమన్మాహా |
| పుణ్యార్థంబుగా | — | పుణ్యత్థంబుగా |
| శ్రేష్ఠ | — | శ్రేష్ఠ |
| ఆచంద్రార్క | — | ఆచంద్రాక |
| పరదత్తాను | — | వరదత్తాంను |
| సదత్త | — | శ్వదత్త |
| నిష్ఫలం | — | నిఫ్ఫలం |

---

1. Hyd. Arc Series No. 19. Mn. 12&13
2. "సౌమ్య" ఆంధ్రపత్రిక ఉగాది సంచిక మార్చి 196?,
3. భారతి-ఫిబ్రవరి 1970
4. Hyd. Arc. Series No. 13-2; P. 96&105-109
5. Hyd. Arc. Series No. 19 – Mn. 27.
6. Hyd. Arc. Series No. 19 Mn. 11.

ఇందు నాలుగవ స్థానాపతి గుణశీలాదులు వర్ణించునపుడు "స్వస్తియమనియమ............
శీలగుణ సంపన్న రుం - విబుధజన చింతామణీ గళు.........
బుధజన సేవ్య రుం - అంనదాన వినోది గళు............"
అను కన్నడ భాషా సంప్రదాయ వర్ణన మున్నది.

## శాసన విషయము

శాసనారంభమున శివుని స్తుతించు శ్లోకమున్నది. ఈ శాసనమును కందూరి భీమదేవ చోడ మహారాజు శక సంవత్సరము 1157 జయ సంవత్సర కార్తిక బహుళ దశమి గురువారము నాడు వేయించెను కందూరిచోడ రాజుల ప్రశస్తి ఈ భీమదేవచోడ మహారాజునకు చేర్చబడినది. భీమదేవచోడ మహారాజు తనకు పుణ్యాము సంప్రాప్తించుటకు శ్రీ పర్వతోత్తర ద్వార శ్రేష్ఠ శ్రీ మహేశ్వర దేవరకు "ఆకం మల్లేపల్లి" గ్రామమును, అంగరంగ భోగధూప దీపనైవేద్యాదుల కాచంద్రార్క స్థాయిగా దానమిచ్చెను. తరువాత వ్యాసగీతా శ్లోకములున్నవి. శ్లోకముల పిదప, యమ నియమ స్వాధ్యానుష్ఠాన జపతప శీలగుణ సంపన్నుండును, విబుధజనసేవ్యుండును అన్నదాన వినోదుండును, కుసుమాస్త్రవివర్జితుండును, పంచాదీక్ష ప్రతిష్ఠకరుండును, శరణాగత వజ్రపంజరుండును మణిరత్న ఖచిత యుత్తుంగ శ్రీశైల శిఖర సింహాసనారూఢ శ్రీ మహేశ్వర దేవరస్థానాపతి ఓంకారాసి దేవుని" వర్ణనము కలదు.

## కాల నిర్ణయము

ఈ శాసనము కందూరి భీమదేవచోడ మహారాజుచేత శ్రీశైలోత్తర ద్వార శ్రేష్ఠ మహేశ్వర దేవరకు ఆకంమల్లెపల్లి గ్రామము దానమిచ్చు సందర్భమున వేయింపబడినది. శాసనము శక సంవత్సరము 1157 కు సమానము క్రీ. శ. 1235 నాటికి గణపతి దేవమహారాజు తెలుగుదేశ మంతటిని ఏకచ్ఛత్రాధిపత్యముగ పాలించుచుండెను. అతని సామంతులలో గోనవంశీయులగు రెడ్లు కందూరు, వర్ధమానపుర ప్రాంతముల నేలుచుండిరి కందూరి చోడులు నల్లగొండ మండలములోని పానుగల్లు పట్టణమును రాజధానిగా నల్లగొండ, దేవరకొండ, సూర్యాపేట ప్రాంతములను, కాకతీయుల సామంతులుగా పాలించుచుండిరని శాసనముల వలన తెలియుచున్నది. కందూరినాడు ఈ రాజుల ఏలుబడిలో లేకున్నను - ప్రశస్తి మాత్రము కందూరి చోడులనియే యున్నది.

# మల్లేపల్లి శాసనము

( శాసనమూలము - ప్రతిబింబములు )

# ఆకం మల్లేపల్లి శాసనము

శాసనము - మూలము

## మొదటి ప్రక్క

1. ఓం నమస్తుంగ శిరచుం
2. ద్ర చంద్రచామర తార
3. వే త్రైలోక్య నకరారంభా[1]
4. ముల[2] స్తంభాయ శంభ
5. వే॥ స్వస్తి శ్రీ జయాభ్యుద
6. శ్చ శ్యకవర్షంబులు॥[3] 1157
7. జయ సంవత్సర కార్తిక బ
8. హుళ దశమియు గురువా
9. రము నాండు॥స్వస్తి శమధి[4]
10. గత పంచమహాశబ్ద మ
11. హామండలేశ్వర వీరమ
12. హేశ్వర కోడూర్ప్పుర వరా
13. ధీశ్వర సూర్య్యవంశోద్భవ
14. కులతిలక కాస్యప గో
15. త్ర కరికాలాంన్వయ నామా
16 ది సమస్త ప్రసస్తి శహిత[5]

---

1. నగరారంభ
2. మూల
3. జయాభ్యుదయాశ్చ శ్శకవర్షంబులు
4. సమధిగత
5. ప్రశసి సహిత

రెండవ ప్రక్క

1. శ్రీమన్మాహా [1]మండ
2. లేశ్వర కందూరి భీమ
3. దేవచోడ మహారా
4. జులు తమకు పుణ్యా
5. ర్త్రంబుగా[2] స్వస్తి శ్రీ ప
6. ర్వ్వతోత్తరద్వారశ్రేష్ట శ్రీ
7. మాహేశ్వర దేవరకు
8. ఆకంమల్లేపల్లి అంగరా
9. గభోగ ధూపదీపనివే
10. ద్యాలకు ఇచ్చినదత్తి
11. ఆచంద్రాక స్త్రాయి
12. గా[3] ॥ స్వదత్తం పర
13. దత్తంవా యోహరే
14. తి వసుంధరా శష్టి
15. వర్ష శ్రహాణి[4]

---

1. శ్రీమన్మహా
2. పుణ్యార్థంబుగా
3. ఆచంద్రార్క స్థాయిగా
4. షష్టింవర్ష సహస్రాణి.

మూడవ ప్రక్క

1. విష్ఠాయం జాయతే క్రి
2. మి॥ స్వదత్తం ద్విగుణం
3. పుణ్యం పరదత్తా
4. ం ను[1] పాలనం పర
5. దత్తం హరతే పా
6. పంశ్వ దత్త[2] నిష్ఫల
7. ంభవేత్॥[3] ఆదిత్య
8. చంద్రావనిలో నలశ్చ
9. ద్యుమిరాపోహి్రిద
10. యం యయాశ్చ హాశ్చ
11. రాత్రశ్చ యుభయే
12. తి సంధ్య ధర్మాశ్చ
13. జానాతి నరశ్చ వి త్తం
14. స్వస్తి యమనియ్య
15. మ మనస్వాధ్య ప

---

1. దత్తాను
2. స్వదత్త
3. నిష్ఫలం భవేత్

నాలుగవ ప్రక్క

1. దానధారణ యానా
2. యనుష్ఠాన జపశ
3 మాది శీలగుణస
4. ంపంన్నరుం విబుధజ
5 నచింతామణి గ
6. ఖం బుధజనసేవ్య
7. రుం అంనదానవి
8. నోదిగఖం కుసుమా
9. త్ర వివర్జితరుం ఆకు
10. శి సిద్ధాంత కుటుంబిని నా
11. దరుం నయనాయాక
12. నటి నాట్య రంగ విభూ
13. షణరుం పంచాదీక్ష
14. ప్రతిష్టకరుం అనాత
15. నాత[1] రుం షరణాగత
16. వజ్రరుం[2] మణిరత్నక
17. చిత[3] యుత్తుంగ శ్రీశైలసిక
18. ర[4] సింహాశనారుధ[5] శ్రీ మా
19. హేశ్వరదేవరు స్త్రానాపతి[6]
20. ఓంకార రాసి దేవరు యోక
21. ————శ్రీ

---

1. అనాథనాథ
2. శరణాగత వజ్రపంకజరుం
3 మణిరత్నఖచిత
4. శ్రీశైల శిఖర
5. సింహాస నారూఢ
6. స్థానాపతి

# పడమటిపల్లి శాసనము

-: o :-

ఈ శాసనము దేవరకొండ తాలూకాలోని పడమటిపల్లి గ్రామము వెలుపలనున్న శిథిల శివాలయ ప్రాంతమునకు దగ్గరనున్న బావిచెంత పడియున్నది. శాసనశిల పెద్దది. రెండు ప్రక్కల చెక్కబడినది. పడమటిపల్లి, దేవరకొండ - కల్వకుర్తి మార్గములో దేవరకొండకు ఎనిమిదిమైళ్ళ దూరములోనున్న గ్రామము. పడమటిపల్లి, తూర్పుపల్లి, పూర్వము పెద్దపట్టణముగా నుండెను. ఈ రెండు గ్రామములలో శిథిలములైన దేవాలయములు, మంటపములు, ఇండ్లపునాదులు బావులు కనిపించుచున్నవి.

ఈ శాసనము తెల్లరాతిపై చెక్కబడినది. శాసనారంభమున సూర్యచంద్రుల ప్రతిబింబములు పానవట్టముతో గూడిన శివలింగము, చెక్కబడినవి. శాసనమున మొదటి ప్రక్క 18 పంక్తులు, రెండవప్రక్క 7, పంక్తులు మొత్తము 25 పంక్తులున్నవి.

శాసనాక్షరములు పదమూడవ శతాబ్ది పూర్వార్థమున వెలసిన తెలుగు శాసనములలోని అక్షరములను పోలియున్నవి. శాసనాక్షరములు కొన్ని పెద్దవినగు, కొన్ని చిన్నవిగను, చెక్కబడినవి. శాసనారంభమున శ్లోకములేదు. ఇది తెలుగు శాసనము. శాసనాంతమున వ్యాసగీతా శ్లోకమున్నది. ఇందు ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు, 'ఱ' పొల్లునకు పూర్వాక్షరము ద్విత్వముగను వ్రాయబడినవి.

కందూరి భీమదేవచోడ మహారాజు శ్రీ పర్వత శ్రీ మల్లినాథదేవరకు పడమటిపల్లిలోని ఆకుతోటను దానమిచ్చు సందర్భమున ఈ శాసనమును వేయించెను. కందూరి చోడవంశ ప్రశస్తికల శాసనమిది. శాసనము శకసంవత్సరము 1157 లో అనగా క్రి. శ. 1235 లో వేయించి నట్టిది.

———

# పడమంటిపల్లి శాసనము

శాసనము – మూలము

మొదటి ప్రక్క

1. స్వస్తి శ్రీజయశ్చా
2. భ్యుదయాశ్చ శక
3. వర్షంబులు 1157 అ
4. గు మన్మధసంవత్సర చై
5. త్రశుద్ధ 1 గు॥ స్వస్తి సమ
6. ధిగత పంచమహా
7. శబ్ద మహామండలేశ్వ
8. ర వీరమహేశ్వర కోడూ
9. ప్పుంరవరాధీశ్వర సూ
10. ర్యవంశోద్భవ కులతిలక
11. కాశ్యపగోత్ర కరికాలాన్వ
12. య నామాది సమస్త ప్రశస్తి
13. సహితం శ్రీ మన్మహా మండ
14. లేశ్వర కందూరి భీమదేవ
15. చోడ మహారాజులు శ్రీ
16. పర్వంతం శ్రీ మల్లినాధ
17. దేవరకు శ్రీ పడమటి
18. పల్లిరమోస అకుతోంటను

రెండవ ప్రక్క

1. ఆచంద్రార్కంం స్థాయిగా
2. ఇచ్చిన దత్తి నడుపున
3. ది। స్వదత్తం పరదత్తం
4. వా యోహరేతి వసుం
5. ధరా షష్టివ్వంషం న
6. హస్రాణి విష్టాయాం
7. జాయతే క్రిమి ॥

# ఇదంపల్లి శాసనములు

**శాసనము :-**

నల్లగొండ మండలములోని దేవరకొండ తాలూకా కేంద్రమునకు పదిమైళ్ళ దూరమున ఇదంపల్లి గ్రామమున్నది. గ్రామమునకు నాలుగు ఫర్లాంగుల దూరమున వాగు దగ్గరి చేనిలో రెండు శాసనములు చెక్కబడిన శిలయున్నది. ఇందు కందూరి ఉదయాదిత్య చోడమహారాజు వేయించిన శాసనము, ఒకటి, రెండు వైపులను, మూడు నాలుగు వైపుల చెఱకు బొల్లయరెడ్డి వేయించిన శాసనమును చెక్కబడినవి.

**ఆకారాదికములు :-**

ఇదంపల్లి గ్రామమునకు నాలుగు ఫర్లాంగుల దూరమున నున్నవాగు యొడ్డునగల చేనిలో ఈ శాసనశిల పడియున్నది. ఇది నల్లసరపురాతిపై జెక్కబడినది. ఈ శాసనశిల మొదటి ప్రక్క పానవట్టముతో గూడిన శివలింగము, రెండవప్రక్క నంది చెక్కబడినవి. శాసనశిల నాలుగవప్రక్క సూర్యచంద్రుల ప్రతిబింబములు కలవు. శాసనశిల పొడవు 4'- 4"లు వెడల్పు 1'-2.5"లు. శాసన శిఖరము పొడవు 6"లు.

శాసనశిల మొదటి ప్రక్క 19 పంక్తులు
,, రెండవ ప్రక్క 21 ,,
,, మూడవ ప్రక్క 20 ,,
,, నాలుగవ ప్రక్క 20 ,

మొత్తము 80 పంక్తులుగల రెండు శాసనము లీశాసన శిలపై చెక్కబడినవి. ఇందొ క్కొక్క శాసనము నలుబది పంక్తులతో గూడియున్నది.

**లిపి**

ఈశాసనములందాంధ్రదేశమున పదమూడు పదునాలుగు శతాబ్దములందు వాడుకలో నున్న తెలుగు లిపి వాడబడినది. లిపి చక్కగాను, అందముగాను కనిపించుచున్నది. ఈ శాసనములలో మొదట శివునిస్తుతించు శ్లోకములున్నవి. కందూరి ఉదయాదిత్య దేవచోడమహారాజు వేయించిన శాసనము శ, సం. 1157 నాటిది. రెండవ శాసనము చెఱకుబొల్లిరెడ్డి వేయించినది. ఈ శాసన మున సంవత్సరము, తిథివార నక్షత్రాదులు పేర్కొనబడలేదు. కాని చెఱకు వంశీయులకు సంబం ధించిన శాసనములు ఈ ప్రాంతమున కనిపించుచున్నవి. ఈ శాసనమున పేర్కొనబడిన బొల్లిరెడ్డి వంశీయుల శాసనములు, అమరాబాదు, కల్వకుర్తి ప్రాంతములందున్నవి. ఈ శాసనశిలపై చెక్క బడిన రెండు శాసనముల లిపులలో వ్యత్యాసము కనిపించుచున్నది. బొల్లిరెడ్డిశాసనము, ఉదయా దిత్యదేవ చోడమహారాజు వేయించిన శాసనము తరువాతిది.

భాష:

ఈ రెండు శాసనములందు తెలుగు భాష వాడబడినది. ఇందు ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు, పొలు 'ౘ', పూర్ణానుస్వారము వాడబడినవి. మొదటి శాసనము చివర రెండు శ్లోకములున్నవి.

ఈ శాసనములందు

| | | |
|---|---|---|
| గోడూప్పౢర | — | గోడూర్పుర |
| సూయ్యౢ | — | సూర్య |
| సవ్వౢనమస్యంబుగా | — | సర్వనమస్యంబుగా |
| గంగకఱుతం | — | గంగాకఱుత - ఆదులలో |

'ౘ' పూర్వాక్షరము ద్విత్వముగను, పూర్ణానుస్వారమును వ్రాయబడినవి.

**శాసనముల విషయము**

శ. సం. 1157లో కందూరి ఉదయాదిత్య దేవచోడ మహారాజు వేయించిన శాసనమున ఉదయాదిత్య దేవచోడ మహారాజుకు కందూరి చోడుల ప్రశస్తి చేర్చబడినది. శ. సం. 1157 మన్మథ సంవత్సర భాద్రపద బహుళ ఏకాదశి ఆదివారమునాడు ఉదయాదిత్య దేవచోడ మహారాజు, తమతండ్రి సోమనాధదేవరకు, పుణ్యముగా నల్లదామపల్లిని మహేశ్వర దేవరకు అంగరంగ భోగములకు ధూపదీప నైవేద్య తాంబూలాదులకు సర్వనమస్యంబుగా ధారవోసి ఇచ్చెను. ఈ ధర్మమునకు విఘ్నము కల్గించిన వారు గంగ దగ్గఱ పశువులను, బ్రాహ్మణులను చంపిన పాపమును పొందుదురనియు శాసనమున జెప్పబడినది. శాసనాంతమున "స్వదత్తం" ఆది రెండు శ్లోకములున్నవి.

చెఱకు బొల్లిరెడ్డి వేయించిన శాసనమున మొదట శివుని స్తుతించు శ్లోకమును, తరువాత శాసనము వేయించిన బొల్లిరెడ్డి బిరుదములున్నవి. బొల్లిరెడ్డి ఈ శాసనమున "సమస్త గుణ గణాభరణ, పతిహిత చరణ, రణరంగ భైరవ, వైరిభకంఠీరవ శరణాగత వజ్రపంజర వీరావతార, చాములూరి పురవరాధీశ్వర—సుజనైకమిత్ర, పరాంగానాపుత్ర" అని వర్ణింపబడినాడు. చెఱకు బొల్లిరెడ్డి మహేశ్వర దేవరకు, అంగరంగ భోగములకు, నైవేద్యమునకు ఇచ్చిన దత్తిని తెలుపు శాసనమిది.

**కాల నిరయము**

ఈ శాసనములలో చెఱకుబొల్లిరెడ్డి వేయించిన శాసనమున శక సంవత్సరముగాని, ప్రభవాది సంవత్సరముల పేళ్ళుగాని. మాస, తిథి వారములుగాని పేర్కొనబడలేదు. చెఱకువంశీయుల శాసనములబట్టి ఈ శాసనమున శ సం. 1175 ప్రాంతమున వేయింపబడినట్లు భావింపవచ్చును. ఇక కందూరి ఉదయాదిత్య చోడమహారాజు వేయించిన శాసనము శ. స. 1157 నాటిది. అనగా

క్రి. శ 1235లో వేయించినట్టిది. మల్లేపల్లి శిలాశాసనము గూడ క్రి. శ. 1235 నాటిదే. ఒకే కాలమున ఇద్దరు రాజులొకే సంవత్సరమున వేర్వేరు శాసనములను వేర్వేరు ప్రాంతములందు వేయించినట్లు తెలియుచున్నది. మల్లేపల్లి శాసనమును వేయించిన భీమదేవచోడమహారాజు, ఇదంపల్లి శాసనమును వేయించిన ఉదయాదిత్యదేవచోడ మహారాజు. భీమగోకర్ణులవలె అన్నదమ్ములై ఇద్దరును కలిసి పరిపాలనా వ్యవహారములు చూచుచుండిరని భావింపవచ్చును. భీమదేవచోడ మహారాజు శాసనమునందాతని తండ్రిపేరు పేర్కొనబడలేదు. కాని ఇదంపల్లి శాసనమును వేయించిన ఉదయాదిత్య దేవచోడ మహారాజు తండ్రిపేరు సోమనాథదేవచోడ మహారాజు. ఇదంపల్లి శాసనము ననుసరించి కందూరి చోడులలో ఇద్దరు ఉదయాదిత్యచోడనామధేయు లున్నట్లు తెలియుచున్నది.

ఇదంపల్లికి దగ్గరలోనున్న పడమటిపల్లి గ్రామము వెలుపల దేవాలయము దగ్గరలోనున్న బావివద్ద కందూరిభీమదేవచోడమహారాజు వేయించిన శ.సం. 1157 నాటి శాసనమీ సంపుటిలో చేర్చ బడినది. భీమ గోకర్ణ చోడ మహారాజులు మొదటి ఉదయనచోడ మహారాజు కుమారులు. వీరిద్దరు కలిసి రాజ్యమేలినట్లు మామిళ్ళపల్లి శాసనము[1] వలన తెలియచున్నది. అట్లే భీమ ఉదయాదిత్య దేవచోడులు కలిసి కందూరిచోడ రాజ్యమును పాలించియుందురు. ఇట్లు అన్నదమ్ములు కలిసి ఏక కాలమున రాజ్యము పాలించుట ఈ కందూరి చోడులలోనే కనిపించును—

1. Hyd. Arch. Series No. 19. Mn. 27;

# ఇడంపల్లి శాసనములు

(శాసనము - శాసన ప్రతిబింబములు)

# ఇదంపల్లి శాసనము

## ఉదయాదిత్య దేవచోడుని శాసనము

### శాసనము - మూలము

### శాసనము - మొదటి ప్రక్క

1. ఓం నమస్తుంగ శిర
2. శ్చుంబి చంద్రచామ
3. ర చారవే త్రైలోక్య నగ
4. రారంభ మూల స్తం
5. భాయ శంభవే స్వస్తి స
6. మధిగత పంచమహా
7. శబ్ద మహామండలే
8. శ్వర వీరమాహేశ్వర
9. గోడూప్పుణర వరా
10. ధీశ్వర సూర్యార్ణవం
11. శోద్భవ కులతిలక
12. కాశ్యపగోత్ర కరి
13. కాలాన్వయ నామాది
14. సమస్త ప్రశస్తి సహితం శ్రీమ
15. న్మహా మండలేశ్వర కం
16. దూరి ఉదయాది
17. త్య దేవచోడమహా
18. రాజులు 1157 గు మ
19. న్మధ సంవత్సర భాద్రప

## రెండవ ప్రక్క

1. ద బహుల 11 ఆదివారం
2. నం దమతం్రడి సోమనాధ
3. దేవరకుం బుణ్యంముగా
4. నల్లదామపల్లి పోర్రిలు శ్రీమ
5. హేశ్వర దేవరకు నంగ
6. భోగ రంగభోగ ధూపదీప
7. నై వేద్య తాంబూలాదుల
8. కు సర్వ్వ నమస్యంబుగా
9. ధారవోసి ఇచ్చిరి దీ
10. ని ఎవ్వరేనం దప్ప చింతి
11. ంచినవారు గంగ్గకటుతం బ
12. సులం బ్రాహ్మలా జంపిన పాపా
13. నం బోయినవారు॥ స్వ ద త్తం ప
14. రద త్తంవాయోహరేతి వసు
15. ంధరా షష్టివర్ష సహస్రాణి
16. విష్ఠాయాం జాయతే క్రిమి
17. స్వద త్తం పరద త్తంవా
18. హరధూమం నరా
19. ధిప ప్రపద్యంతు య
20. శాలం నరకేదుకమే
21. బనం॥ శ్రీశ్రీశ్రీశ్రీ.

# ఇదంపల్లి శాసనము

## చెఱకు బొల్లిరెడ్డి శాసనము

### మూడవ ప్రక్క

1. ఓం నమస్తుంగ శిర
2. శ్చుంబి చంద్రచామ
3. ర చారవే త్రైలోక్య
4. నగరారంభ మూల
5. స్తంభాయ శంభవే
6. స్వస్తి సమస్త గుణ
7. గణాభరణ పతి
8. హిత చరణ ర
9. ణరంగ భైరవ
10. వైరిభకంఠీరవ
11. శరణాగత వజ్రపంజర
12. వీరావతారపి చాము
13. లూరి పురవరాధీ
14. స్వర[1] పరమమహేశ్వ
15. ర సకలహరుద
16. ప్ర—డ్ల రేకరేవ ది
17. త విజయలక్ష్మి
18. కమనిమల్ల భ
19. యలోభ మల్లభ
20. సుజనైక మిత్ర

---

1. పురవరాధీశ్వర

## నాలుగవ ప్రక్క

1. పరాంగనాపు
2. త్ర పరమగాంగే
3. య నామాది సమ
4. స్త ప్రశస్తి సహితం
5. శ్రీమతు సామం
6. త చెఱుకు బొల్లిరె
7. డ్డి శ్రీ మహేశ్వరదేవ
8. రకు అంగరంగభోగము
9. కు నివేద్యతంబు
10. సర్వ్వసమస్యంబుగ ధారవో
11. సి యిచ్చిన దత్తి దీనె
12. వారేనిం జెఱ్చినవారు
13. గంగకఱ్ర కవిల ఙ
14. ంపినండు పసుల బ్రా
15. హ్మలం జంపినండు త
16. నయిరుసురుల వారు
17. సినవండు॥ స్వద త్తం
18. పరద త్తంవా యోహరేతి
19. వసుంధర షష్టివష్ట సహస్రాణి
20. విష్టాయాం జాయతే క్రిమి॥

# ఆగామోతుకూరు శాసనము

**శాసనము**

ఈ శాసనము నల్లగొండ మండలములోని మిర్యాలగూడ తాలూకా ఆగామోతు కూరు గ్రామమునగల శివాలయమున నున్నది. కందూరిచోడ వంశమునకు చెందిన రామనాథ దేవచోడ మహారాజు వేయించిన శాసన మిది. నునుపుగా చెక్కబడిన శిలాస్తంభము నాలుగు వైపుల ఈ శాసనము చెక్కబడినది. ఆగామోతుకూరు గ్రామము మిర్యాలగూడ నల్లగొండ రోడ్డులో మాడ్గులపల్లి గ్రామమునుండి, ఆరుమైళ్ళ దూరమున నున్నది.

**ఆకారాదికములు**

ఈ శాసనము తెల్లరాతిపై నాలుగు వైపుల చెక్కబడినది. శాసనశిల భూమిలో పాతబడినది. శాసనమున్న ఆలయమున శివలింగము, ఆంజనేయస్వామి విగ్రహములున్నవి. శాసనము మొదటిప్రక్క గణపతి విగ్రహము, రెండవప్రక్క పానపట్టముతో గూడిన శివలింగ మును, మూడవప్రక్క ఆవు-లేగ, నాలుగవప్రక్క సూర్యచంద్రుల ప్రతిబింబములు చెక్కబడి నవి. శాసనము మొదటిప్రక్క 25 పంక్తులు, రెండవప్రక్క 30 పంక్తులు, మూడవప్రక్క 33 పంక్తులు నాలుగవ ప్రక్క 16 పంక్తులు మొత్తము 104 పంక్తులలో శాసనమున్నది. శాసనారంభమున శ్లోకములులేవు. శాసనాంతమున దానఫలమును, దానమునకు వ్యతిరేకముగా నడచినవారికి గలుగు పాప ఫలమును తెలుపునట్టి శ్లోకములున్నవి.

**లిపి**

తెలుగుదేశమున పదమూడవ శతాబ్ది ఉత్తరార్థమున వాడుకలోనున్న తెలుగు లిపి ఈ శాసనముగ వాడబడినది. శాసనము కాకతీయుల శాసనముల పద్ధతిని వేయింపబడినది. ఈ శాసన లిపి, పిల్లలమఱ్ఱి[1] బూర్గుగడ్డ[2] ఇర్విన్[3] బొల్లేపల్లి[4] శాసనముల లిపిని పోలియున్నది. శాసనమున ద్విత్వాక్షరములు, పూర్ణానుస్వారము. "ౘ" వాడబడినవి. శాసనాక్షరములు కొన్ని వరుసలలో పెద్దవిగాను, మరికొన్ని వరుసలలో చిన్నవిగాను, చెక్కబడినవి. శాసనారంభమున పెద్దపెద్ద అక్షరములతోను, శాసనాంతమున చిన్నచిన్న అక్షరములతోను, వరుసలు కనిపించును. ఒకటి, రెండు, మూడు ప్రక్కలలోని చివరి పంక్తులలోగల అక్షరములు, చిన్నవిగా చెక్క బడినవి.

---

1. తెలంగాణ శాసనములు Vol. 1 కాకతీయ శాసనములు.
2. ,, ,,
3. భారతి-జూన్ 1969.
4. భారతి-మార్చి 1969.

## భాష

ఈ శాసనము తెలుగుభాషలో వేయింపబడినది. శాసనాంతమున శాసనమును పాటించిన వారికి కలుగు పుణ్యమును, పాటింపని వారికి కలుగు పాపమును, మూడుశ్లోకములలో చెప్పబడినవి. శాసనము మొదటిప్రక్క ఐదవ పంక్తిలో "సమధిగత" బదులు "సమధిగజ" అని చెక్కబడినది

| | బదులు | |
|---|---|---|
| పంచ మహా శబ్ద | — | పంచ్చమహాశబుద |
| కాకతీయ | — | కాకెతియ్యా |
| సేయుచుండగాను | — | సేయుచుండ్డంగాను |
| సిధ్యర్థము | — | సిద్ద్యా ర్థజాము |
| చిన్నాలు | — | చిన్నాలు |
| సర్వమాన్యము | — | సప్వజామాన్యము |

ఈ శాసనమందు కొన్ని నేడు వాడుకలోలేని పదములున్నవి. ముయ్యాడ పెరుగు, సిన్నాలు, ముయ్యాడనేయి ఇత్యాదులు ముఖ్యమైనవి. తెలుగు భాషకు సంబంధించిన విశేషము లెక్కువ లేకున్నను, శాసనమువలన ఆనాటి ఆంధ్రుల సాంఘిక విషయములను కొంతవరకు తెలిసికొనుట కవకాశమున్నది. దేవాలయములకు రాజులుకాని, భక్తులుగాని, దానమిచ్చునప్పుడు కట్టడిగా, అనేక వస్తువులను, దేవర అంగ రంగ ధూప దీప నైవేద్యములకు జెందునట్లు శాసనబద్ధము గావించి చక్కని యేర్పాట్లు చేయుచుండిరి. ఈ శాసనమునగల యేర్పాట్లట్టివే యని తెలిసికొనవచ్చును.

## శాసన విషయము

ఈ శాసనమును కందూరి రామనాథ దేవచోడమహారాజు శకవర్షము 1204 చిత్రభాను వైశాఖశుద్ధ సప్తమీ గురువారమునాడు తన తండ్రి పేర వీరమల్లానాథదేవరను ప్రతిష్ఠచేసి తనకు ధర్మార్థముగా దేవరకు అంగరంగ భోగాది సమస్త ప్రయోజనములు కలుగునట్లు అనేక వృత్తులను పెట్టు సందర్భమున వేయించెను. శాసనారంభమున కాకతి రుద్రమదేవి ప్రశంస కలదు. కందూరి రామనాథ దేవచోడ మహారాజునకు కందూరి చోడవంశీయుల ప్రశస్తి చేర్చబడినది. కందూరి చోడవంశీయులకు సంబంధించిన శాసనములలో మొదటి శాసనము తొండరస చోళమహారాజు వేయించిన కొలనుపాక శాసనము[1] ఈ వంశీయులకు సంబంధించిన శాసనములలో చివరి శాసన మిప్పటికి ఈ ఆగామోతుకూరు శాసనమేయని భావింపవచ్చును—

---

1. A. P. Govt. Arch. Series No. 3. Ng. 48.

**కాల నిర్ణయము**

ఈ శాసనము కందూరి రామనాథ దేవచోడ మహారాజు శ. సం. 1204 చిత్రభాను సంవత్సర వైశాఖశుద్ధ సప్తమీ గురువారమునాడు వేయించెను. శ.సం. 1204 క్రీ.శ. 1282వ సంవత్సరమునకు సమానము. మల్లేపల్లి, ఇదంపల్లి, పడమటిపల్లి శాసనములు, శ. సం. 1157లో వేయింపబడినవి. తరువాత ఈ ఆగామోతుకూరు శాసనము మాత్రమే లభించినది. భావి పరిశోధనలవలన మరికొన్ని శాసనములు లభించినయెడల కందూరి చోడరాజుల సమగ్ర చరిత్ర తెలిసికొనుటకు కవకాశమేర్పడును. ఈ శాసనకాలమునాటికి ఆంధ్రదేశము నేకచ్ఛత్రాధిపత్యముగా కాకతి రుద్రమ పాలించుచుండెనని భావింపవచ్చును. కాకతి రుద్రమ రుద్రమహాదేవులుగా ఈ శాసనమున పేర్కొనబడినది. ఈ శాసనకాలమునాటికి కందూరి చోడులు పానుగల్లు మండల ప్రాంతమును మాత్రమే కాకతీయుల సామంతులుగా పాలించుచుండిరని భావించవచ్చును. ఈ శాసనమున పేర్కొనబడిన కొన్ని పదములానాటి ప్రజాజీవితమును తెలుపును—

మఱుతురు = నివర్తనము = ఇరువది దండముల ప్రమాణముగల భూమి = లేక రెండు వందల హస్తముల పరిమితిగల భూమి.

నిత్యపడ్లు = ప్రతిరోజు దేవాలయమునకు సమర్పించు కట్టడి వస్తువులు, నైవేద్యాదులు.

ముయ్యాడ = మూడు అర్ధలు—లేక ఒకటిన్నర.

మేలోగిరాలు = మేలైన ఆహార పదార్థములు లేక భోజనము (నైవేద్యముగ నిర్ణయించినవి).

మాడ = అర్ధదీనారము లేక పదిరూపాయలు.

ప్రిత్తులు, వృత్తులు = దేవుని సేవకు ఇచ్చు భూములు.

అంగరంగ భోగములు = మూలస్థాన దేవరకు ఉత్సవవిగ్రహములకు, స్నానవసనాభరణ గంధపుష్ప ధూపదీప నైవేద్యాది వైభవములు—మరియు గీత వాద్య నృత్యాది వైభవములు.

185

# ఆగామోత్కూరు శాసనము

## శాసనము - మూలము

### మొదటి ప్రక్క

1 స్వస్తి శ్రీమన్మహామండ్డలే
2. శ్వర కాకెతియ్య రుద్రమహా
3. దేవులు సుఖసంకధావినో
4 దంబులం బ్రిథివిరాజ్యంబు సే
5. యుచుండంగాను స్వస్తి సమధిగజ[1]
6 పంచ్చమహాశబుద మహామం
7 డ్డలేశ్వర వీరమహేశ్వర కోడూరి
8. పుర వరాధీశ్వర సూర్య్యవంశోద్భవ
9. కులతిలక కాస్యపగోత్ర కరికాలా
10 న్వయ నామాది ప్రశస్తి సహితం
11, శ్రీమన్మహామండ్డలేశ్వర కందూరి రా
12 మనాథదేవ చోడమహారాజులు
13 శకవరుషములు 1204 లగు చిత్ర
14 భాను సంవత్సర వైశాఖశుద్ధ 7 గు 1
15. నాండు తమతండ్రి పేరటను వీరమల్నా
16. థ దేవరంబ్రతిష్ఠ సేసి తమకు ధమ్మార్థ
17. ర్థముగాను అంగరంగ భో
18 గాది సమస్త ప్రయోజన సి
19. ద్యర్త్థము[2] ఆచంద్రార్క్క తా
20. రకముగాను సర్వ్వమాన్యముగా
21 నుం బెట్టిన ప్రిత్తులు నీరునేల పొల
22 ము మోంతుకూరను ఋంకనాయి
23. నిచెఱ్వు వెనకను ఊటపొలము న
24. ను కుంట్టచేను రె । == ఆకత్తువను క్రిం
25. ఃకాల్వను రె॥ మీందికాల్వను రె 2

---

1. సమధిగత
2. సిద్ధ్యర్థము

## రెండవ ప్రక్క

1. కొఅనిలును లోకసముద్రానను
2. తిప్పకాల్వను రె॥ వెలి వొలము
3. చంద్రుతిప్పను రె॥ 2 బొంమకం
4. ట్టను కొమరినాయని చెఱ్వువె
5. నకను రక్కసఽసాయను రె॥ జదా
6. లకు సుంకమందు దేపరాయం
7. మాడను వీసామున్ను ఇంతవట్టు
8. న్ను డిగిరాలకున్ను దీపాల
9. కూను। రంగ్గభోగానకు నూంక
10. నాఇని చెఱ్వువెనకను ఏపూరి
11. బ్రాహ్మని చేత క్రయముగొం
12. నద రె॥ బొంమ్మకంట్టను సూ
13. రెడి లోకసముద్రానను క్రింద్ది
14. కాల్వను రె॥ ప్రమాదీచ సంవత్సరమా
15. ఘ బ 14 గు నాండు శ్రీపవ్వజాతంమీం
16. దను పాతాళగంగ్గలోను ధారవోసిం
17. ద్ది నూంకనేని చెఱ్వువెనక ఊటపొలము
18. ననుం। బొంమకంటను సూరెడ్డి లోకస
19. ముద్రం వెనకను రె॥ రుద్రమకాల్వను రె॥ బ్రొం
20. తుకూరను నీరునేం పొలమును దేవరాయ
21. ము మఱుతురు చింనాలును వెలివొలము
22. సేను పుట్టి చింన్నాలూను। తాడూరు
23. పాలకు మాడను రెండు వీసాలూను
24. రంగ భోగానకు బొంమకంటను
25. నీరునేల పడివ రాయము మఱు
26. తురు నీరు నేలాను వెలి వొలానను
27. పుట్టి చింన్నాలూను। దీపాలకు దో
28. సపాదన పెదకాలువను సవ్వజా
29. మాన్యముగాను రెండుమఱు
30. తురులున్ను నీరునేలాను। గుగ్గి

## 187

### మూడవ ప్రక్క

1. లాసకుం ద్రానకూ విడము మంచి పో
2. ంకలకుంను మంచాకులకూ కప్పూ౯
3. రానకూను కస్తూరికిని యింగువు మిరి
4. యాలకూను పువుతోంటవాని జీ
5. తమూను పిండివంటకూను
6. ముప్పవురాన సవ్వ౯మాన్యము
7. గాను రెండుమ
8. ఱుతురు సేమ సీరునేలాను
9. దీపాలకు మ్రోంతు
10. కూరను ఆకుందొంటరికి దేవ
11. రాయము మాడ రెండు పీసాలు
12. ంను । మ్రోంతుకూరి పడుమటి
13. పెంనుగంటితెరు వుత్తరానను
14. తాంబట్టింపిన మామిండి
15. తోంట అంగరంగ భోగాన
16. కుంను। అంగభోగానకు చలి
17. వందిరి కుంటతూప్పు౯నను వెలి
18. వాలము రెండుపుట్లు సేనున్ను
19. యింతవట్టు వ్రిత్తులుంను యి
20. చ్చిరి॥ ఆ స్థానపతులు దేవర
21. కు నడిపి నిత్యపట్లు । రాజనపు
22. బియ్యము ముత్తుము పె
23. సలు ముయ్యేడ । నేయి మూ
24. ండుతవ్వలు । రెండు పిండివంట
25. లున్ను । పానసముంను । పదిమేలో
26. గిరాలుంను । ముయ్యేడపెరుగు
27. ంను । మిరియాలు-రెండుం
28. ను । యింగువు మూడు సిన్నాల ఎ
29. త్తున్ను । మంచిపోంకలు పదేనుం
30. ంను । మంచాకులు నలుపదేను
31. గంధము ఎండాదికి యిరువయి
32. తులములుంను । కస్తూరికిని కప్పు
33. రమూను ఈ ధర్మ దప్పక నడిపేది ॥

## నాలుగవ పత్రిక

1. ఈధర్మ్మావు ప్రతిపాలించిన వారి
2, కి ననంత పుణ్యమవును। ఈ ధర్మ్మా
3. వునకు బాధసేయువార్కి పంచమ
4. హాపాతకము లవును॥ అది
5. అట్టిదకదా పెద్దలవచనములు
6. స్వదత్తాం పరదత్తాంవా యోహ
7. రేతి వసుంధరాం। షష్టివ్వర్షరుష స
8. హస్రాణి విష్టాయాం జాయతే క్రిమి
9. శత్రణోపి కృతోధర్మ్మా పాలనియ్యః ప్రయ
10. త్నతః శ్శత్రుంవభవేశ్చత్రు ధర్మ్మాశత్రుంన్న కస్య
11. చిత్॥ సామాన్యోయం ధర్మ్మాసేతుం
12, నృపాణం కాలేకాలే పాలనీయ్యో భవ
13. ద్భిః। సర్వ్వానేతాన్భావినః పార్థివేం
14. ద్రా న్భూయోభూయో యాచతే రా
15. మచంద్రః॥ మంగళమహా శ్రీ శ్రీ
16. శ్రీ — — ...

# పెరూరు శాసనములు

**శాసనములు :—**

నల్లగొండ మండలములోని మిర్యాలగూడ తాలూకాలోనున్న పెరూరు గ్రామమున శ్రీ స్వయంభూ సోమేశ్వరాలయమున మూడు శిలా శాసనములున్నవి. అందొక శాసన శిలపై నాలుగు ప్రక్కల తొమ్మిది శాసనములు చెక్కబడినవి శాసన శిల మొదటిప్రక్క చాళుక్య విక్రమవర్షములు 44 లో వేయింపబడిన కన్నడ శాసనమున్నది. రెండవ ప్రక్క చాళుక్య విక్రమవర్షములు 44 లో వేయింపబడిన రెండు కన్నడ శాసనములును, శకవర్షము 1212 లో వేయింపబడిన తెలుగు శాసనమును, మూడవప్రక్క చాళుక్య భూలోకమల్లుని కాలపు మూడు తెలుగు శాసనములును, రెండవ జగదేకమల్లుని కాలపు తెలుగు శాసనమును చెక్కబడినవి. నాలుగవవైపు మహామండలేశ్వర కందూరి భీమనచోడమహారాజును పేర్కొను తెలుగు శాసనమున్నది. ఇట్లొకే శాసనశిలపైని వివిధ కాలములకు, వివిధభాషలకు సంబంధించిన శాసనములు మన కచ్చటచ్చట కనిపించుచున్నవి. ఇట్టి శాసనములను, మహారాజులు, వారి సామంత మాండలికులు, దండనాథులు, బంట్లు వేయించినట్లు కనిపించుచున్నది.

ఈ తొమ్మిది శాసనములు చెక్కబడిన శిల అన్నివైపుల పగిలిపోవుటవలన, అక్షరములచ్చటచ్చట చెదరిపోవుటవలనను, రెండు శాసనము లసంపూర్ణముగ నున్నవి.

పెరూరు నాగార్జునసాగర్ కు పండ్రెండు మైళ్ళ దూరములోనున్న గ్రామము. ఈ గ్రామమునగల సోమేశ్వరాలయ మతి ప్రాచీనమైనది ప్రతి సంవత్సరము శివరాత్రి మహోత్సవము లిచట జరుగును. చుట్టుప్రక్కలనున్న గ్రామములనుండియు, దేవరకొండ, మాచర్ల, మిరియాలగూడెం పట్టణములనుండియు భక్తు లీయుత్సవములలో పాల్గొనుటకు వచ్చుచుందురు. పెరూరు సుప్రసిద్ధ క్షేత్రమైన ఏలేశ్వరమున కిరువది మైళ్ళ దూరములోనున్నది. ఏలేశ్వరము నాగార్జునసాగర జలమున మునిగిపోయినది.

కృష్ణానదికి ఉపనదియైన అహల్యానది యొడ్డున పెరూరు గ్రామమున్నది నల్లగొండ-నాగార్జునసాగర్ రోడ్డుపై అహల్యానది రోడ్-డాం, ప్రక్కనుండి పెరూరు చేరుటకు సమితి రోడ్డుకలదు పెరూరు అహల్యనది రోడ్ డాం నుండి మూడుమైళ్ళ దూరములో నున్నది. ఈ గ్రామము పెద్దవూర సమితిలోనిది. అహల్యానదిని స్థానికులు 'హాల్యా' నదియని వ్యవహరింతురు.

**ఆకారాదికములు :—**

ఈ శాసనములుగల శిల నల్లరాతితో మలచబడినది. శాసనము మొదటి ప్రక్క సూర్యచంద్రుల చిహ్నములు, నంది, పానవట్టముతో గూడిన శివలింగము, ఆవు, లేగ చిహ్నములున్నవి. శాసన శిలఎత్తు ఎనిమిది అడుగులు. వెడలు 2½ అడుగులు.

శాసనశిల క్రింది భాగము పగిలిపోయినది రెండవప్రక్క మధ్యభాగము, క్రిందిభాగము పగిలినది మూడు నాలుగువైపుల శిలామధ్యభాగము పగిలినది. శాసనశిల అంచులు సైతము పగిలి అక్షరము లగుపడకుండ నున్నవి. కొన్ని అక్షరములు సష్టాస్పష్టముగనుండి చదువుటకు వీలులేకుండ నున్నవి. శాసనశిల మూడవప్రక్క అక్షరములు చెదరిపోవుటవలన చదువుటకు వీలుకాలేదు.

శాసనాక్షరములు నల్లసరపు రాతిపై చక్కగా చెక్కబడినవి. ప్రభుత్వశాసన పరిశోధనశాఖవారి శాసనముల ప్రతిబింబములను రెండు సంవత్సరములకు పూర్వము తీసికొనిపోయి నట్లు తెలిసినది. ఈ శాసనశిలపై చెక్కబడిన శాసనముల లిపికిని భేదము కనిపించును.

శాసనములలో ఈ క్రింది సంఖ్యలమేర పంక్తులున్నవి.

| | | | |
|---|---|---|---|
| మొదటి శాసనము | — | 49 | పంక్తులు |
| రెండవ శాసనము | — | 34 | ,, |
| మూడవ శాసనము | — | 12 | ,, |
| నాలుగవ శాసనము | — | 14 | ,, |
| ఐదవ శాసనము | — | 23 | ,, |
| ఆరవ శాసనము | — | 10 | ,, |
| ఏడవ శాసనము | — | 11 | ,, |
| ఎనిమిదవ శాసనము | — | 10 | ,, |
| తొమ్మిదవ శాసనము | — | 46 | ;, |

మొత్త మీశాసనములలోని వరుసల సంఖ్య 209.

**లిపి ;—**

ఆంధ్రదేశమున 12, 13, శతాబ్దులలో వాడుకలోనున్న కన్నడాంధ్ర, తెలుగులిపు లీశాసనములందు వాడబడినవి. 1, 2, 3, 5, 6, 7, 8, 9 శాసనములలిపి, తెలుగు-కన్నడలిపి. అక్షరములు పొంకముగా వ్రాయబడినవి. ఇవి గుండ్ర ఖత్తు అక్షరములు. నాలుగవ శాసనలిపి. ఇందలి అక్షరములు కాకతీయుల కాలమున వెలసిన శాసనాక్షరములను పోలియున్నవి. ముఖ్యముగా ఆకాలమున వెలసిన దుద్దెద[1] తాడువాయి[2] గుణపవరము[3] నాగులపాడు[4] బొల్లేపల్లి[2] దుప్పపల్లి[6] శాసనాక్షరముల నీ శాసనాక్షరములు పోలియున్నవి.

---

1. A P Govt. Archaeological Series No. 22.
2. భారతి మే, 1971
3. తెలంగాణ శాసనములు. vol. 1. కా. శా. No. 43.
4. తెలంగాణ శాసనములు vol. I.
5. భారతి–మార్చి, 1969.
6. భారతి–మే, 1971.

కన్నడ శాసనములందును, తొమ్మిదవ శాసనమందును కనిపించు లిపి, పశ్చిమ చాళుక్యరాజుల కాలమున, ముఖ్యముగా చాళుక్య త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యుని కాలమున వేయింపబడిన శాసనముల లిపివి, అటుపిమ్మట భూలోకమల్లుని కాలమందును, చాళుక్య ప్రతాప చక్రవర్తి రెండవ జగదేకమల్లుని కాలమున వెలసిన శాసనములలిపిని, ఈ శాసనములలోని లిపులు పోలియున్నవి. శాసనాక్షరములు కొన్ని వరుసలలోనివి పెద్దవిగను, మరికొన్ని వరుసలలోనివి చిన్నవిగను, చెక్కబడినవి. ఈ శాసనములలోని లిపి చందుపట్ల[1] కొలనుపాక[2] గంగాపురము[3] జడ్చర్ల[4] శాసనముల లిపులను పోలియున్నది. కన్నడ ప్రభువులైన కల్యాణీచాళుక్య ప్రభువులకాలమున వెలసిన ఈ శాసనములలో కొన్ని తెలుగు భాషలో వేయింపబడుట విశేషము ఆయా వంశపు రాజులాయా ప్రాంతములను పాలించుచు, రాజభాష కన్నడమైనను, తెలుగైనను, ప్రాంతీయ భాషలలో అనగా స్థానిక ప్రజలు వ్యవహరించు భాషలలో శాసనములను వేయించుటనుబట్టి ఆనాటి రాజులకుగల ప్రజాభిమానము తెలియుచున్నది. భూలోకమల్లుని కాలమందును, వెలసిన శాసనము లాంధ్రభాషలో వేయింపబడినవి ఆరవ విక్రమాదిత్యుని కాలమున వెలసిన శాసనములలో నధికభాగము కన్నడములోను, సంస్కృతములోను వేయించినట్టివి.

**భాష**

ఈ శాసనములలో ద్విత్వాక్షరములు, వర్గ పంచమాక్షరములు, అనుస్వారమునకు బదులు అనునాసికాక్షరములు. 'ఱ' రకారపొల్లు 'ఱ' రకారపొల్లుకు పూర్వాక్షరము ద్విత్వము గాను, వ్రాయబడినవి. కొన్నిపదములు విడి విడి అక్షరములుగా వ్రాయబడినవి. కన్నడ శాసనములలోని ప్రశస్తి సంస్కృత పదభూయిష్టముగా నున్నది. శాసనములన్నియు, స్వయంభూ సోమేశ్వరాలయమునకు భూమి దానమిచ్చు సందర్భమున వేయించినట్టివి. ఒక శాసనమున పలువురు విప్రులకు భూమిదాన మిచ్చినట్లు తెలుపబడినది మొదటిశాసనములోని భాష కన్నడము. వచనములో నున్నది. శాసనాంతమున వ్యాసగీతా శ్లోకము లున్నవి. 1,2,3 శాసనములు కన్నడ భాషలో వేయింపబడినవి. చాళుక్య విక్రమశకము 44 వికారి సంవత్సర వైశాఖ అమావాస్య ఆదిత్యవారము సూర్యగ్రహణ నిమిత్తమున వేయింపబడినవి. చాళుక్యరాజులకు గల ప్రశస్తి ఈ శాసనములందు వర్ణింపబడినది. తెనుగుశాసనములందు సైతము శాసనాంతమున వ్యాస గీతా శ్లోకము లున్నవి. కన్నడ భాషలో వేయింపబడిన శాసనములా కాలపు కన్నడ వచన రచన సరళిని తెలుపును.

శాసనములలో

మహామండలేశ్వరం బదులు మహామణ్డలేశ్వరం,
కందూరు; కన్దూరు,
ఆచంద్రార్క-ఆ చంద్రార్కఱ.

---

1. అప్రకటితము.
2. A. P. Govt. Archaeological Series No. 3 Ng. 48.
3. తెలంగాణ శాసనములు vol I. చా. శా. No. 24;
4. Hyderabad Archaeological Series No. 19. Mn 12 & 13.

రెండు-రెణ్డు,
నడపంగలవారు-నడపంగ్గలవారు,
మూండు-మూణ్డు.
సూర్యగ్రహణ-సూర్య్యగ్రహణ

అదులు వ్రాయబడినవి

**శాసనముల విషయము :-**

మొదటి శాసనము చా. వి. శ. 44 వికారి సంవత్సర వైశాఖ అమావాస్య ఆదివారమున సూర్యగ్రహణ నిమిత్తము నందీయబడినది. శాసనారంభమున చాళుక్య త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు పేర్కొనబడినాడు. అతని కుమారుడు, సామంతుడును అయిన కుమార. తైలపుడు కందూరు నాడును పాలించుచున్నట్లును, శాసనము పెరూరి శ్రీ స్వయంభూసోమేశ్వరదేవునికిని, బ్రాహ్మణులకును, భూమిని దానమిచ్చు సందర్భమున వేయించినట్లును తెలియుచున్నది. శాసన ప్రతిగ్రహీతల పేళ్ళు తెలుపబడినవి. శాసనము చివర వ్యాసగీతా శ్లోకములున్నవి. పెరూరు ప్రతిబద్ధ తాడిమట్ట గ్రామము ధారాపూర్వకముగా దానమీయబడినట్లు శాసనమందున్నది.

రెండవ శాసనము చాళుక్య విక్రమ వర్షము 44 వికారి వైశాఖ అమావాస్య ఆదివారము సూర్యగ్రహణ నిమిత్తమున పెరూరి శ్రీ స్వయంభూసోమేశ్వర దేవరకు సమస్త ప్రజాను శ్రీమత్కిబ్బట్టియ వడ్డరామలద దణ్డనాయకరు ధారాపూర్వకముగా, భూమిని గద్యాణములను దానమిచ్చు సందర్భమును పురస్కరించుకొని వేయింపబడినది.

మూడవ శాసనము చాళుక్య విక్రమ వర్షములు 44 వికారి వైశాఖ అమావాస్య ఆదివారమునాండు సూర్యగ్రహణ నిమిత్తమున పెరూరి స్వయంభూసోమేశ్వర దేవర అఖండ దీపమునకు, శ్రీమతి పెరియకందునాడ వడ్డరావళభణికారి భూమాతురదాసి బొల్లమరాజును పేజ్జంకద భణికారి మదూవాసి, వైశ్రవణి నాయికుంగూడ దానమిచ్చిన విషయమును తెలుపును.

నాలుగవ శాసనము శ్రీ రుద్రకుమారుడు రాజ్యము చేయుచుండ శకవర్షములు 1212 వికృతి భాద్రపద బహుళ 15 మంగళవారము సూర్యగ్రహణమున పెరూరు సోమేశ్వర దేరర శంగరంగభోగములకు కొంపల్లి గ్రామమును, అచంద్రార్కముగా ధారవోసి యిచ్చిన సందర్భమున వేయింపబడినది.

ఐదవ శాసనము, పెరూరి శ్రీ స్వయంభూసోమేశ్వర దేవరకు ముమ్మడి నాయకుడు తమ తల్లిదండ్రులకు పుణ్యముగా సోమేశ్వరాలయము సన్నిధి ఐయ్యన భట్టరు నల్లిల్లు నిల్పియిచ్చిన, పెరూరి పొలము వ్రిత్తిని తెలుపు సందర్భమున వేయబడినది.

చాళుక్య భూలోకమల్ల వర్షాలు 11 ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున యాజ్ఞవల్క్య కేశవభట్టు ఎత్తించిన కేశవదేవరకు ధూపదీప నివేద్యములకు ధారాపూర్వకము సేసి తాడిమట్ట దేవభోగమునం దిచ్చిన వ్రిత్తి-విషయమీ ఆరవ శాసనమందున్నది.

భూలోకమల్ల వర్షాలు 15 సాధారణ ఆశ్వయుజ అమావాస్య ఆదివారము సూర్య గ్రహణ నిమిత్తమున శ్రీమతుకిబ్బట్టెయ వడ్డరాలువ మంత్రి సుంకాధికారి అంబె నాగదేవ దండ నాయకులు యాజ్ఞ వల్క్య కేశవభట్టరు నిల్పిన కేశవ దేవర అంగభోగ నివేద్యములకు గద్యాణ ములు, వెలివోలము, అఖండ దీపమునకు రూకయిచ్చిన విషయమును ఏడవ శాసనము తెలుపుచున్నది.

చాళుక్యప్రతాప చక్రవర్తి రెండవ జగదేకమల్లుని 9వ రాజ్య సంవత్సరమున క్రోధన అషాఢ అమావాస్య ఆదివారము సూర్యగ్రహణ సమయమున మల్లనాయకుడు తమ తల్లిదండ్రు లకు ధర్మముగా దాన మొసంగిన విషయము ఎనిమిదవ శాసనము తెలుపుచున్నది.

కందూరి భీమన చోడమహారాజుల బంటు పెరూరి మనుమ మల్లనాయకులు-సోమేశ్వర దేవరకు దేవగృహా మెత్తించి దేవభోగమునకు రూకలు దానమిచ్చిన విషయమును-తొమ్మిదవ శాసనము తెలుపుచున్నది.

కాలనిర్ణయము:-

ఈ తొమ్మిది శాసనములలో మొదటి మూడు శాసనములు కన్నడ భాషలో వేయింప బడినవి. ఆరు శాసనములు తెలుగు భాషలో నున్నవి. మూడు కన్నడ శాసనములు చాళుక్య విక్రమవర్షము 44 వికారి సంవత్సర వైశాఖ అమావాస్య ఆదివారం సూర్యగ్రహణ నిమిత్తమున వేయింపబడినవి. ఒకేరోజు, మొదటిశాసనమును, మహారాజు పుత్రుడగు కుమార తైలపుని సామం తుడు జాయెమయ్య, రెండవ శాసనమును, సమస్త ప్రజలు, ముప్పురు దండనాయకులు, మూడవ శాసనమును, బొల్లమరాజు వేయించెను. మొదటి శాసనమున ఆరవ విక్రమాదిత్యుడు, అతని కుమారుడును, కందూరు 1100 పాలకుడగు కుమార తైలపుడును పేర్కొనబడినారు. కుమార తైలపుని మాండలికుడు జాయెమయ్య పేరూరు స్వయంభూసోమేశ్వరదేవర అంగ్గరంగ్గభోగము లకు, ధూపదీపనైవేద్యములకు. బ్రాహ్మణులకు పెరూరు ప్రతిబద్ధమైన తాడిమట్టగ్రామము నగ్ర హారముగాజేసి, ఇచ్చెను. చాళుక్య విక్రమవర్షము, 44 క్రీ. శ. 1120 కి సమానము.

రెండవశాసనము సమస్తప్రజలు, శ్రీమత్కిబ్బట్టయ వడ్డరామలదణ్డనాయకుడు పట్టభట్ట దణ్డనాయకులు, సోమేశ్వరదేవర కంగరంగభోగములకు, ధూపదీపనైవేద్యములకు దానమిచ్చిన విషయమును తెలుపుచు వేయించినట్టిది.

మూడవ శాసనము వలన పేరూరి సోమేశ్వరదేవునికి అఖణ్డదీపమునకు పెరియకందు నాడు వడ్డరావళ‌భణికారి బొల్లమరాజాదులు దానమిచ్చిన విషయము తెలియుచున్నది.

నాల్గవ శాసనము శ. సం. 1212 వికృతి భాద్రపద బహుళ అవామాస్య ఆదివారము సూర్యగ్రహణ నిమిత్తమున శ్రీ రుద్రకుమారుడు రాజ్యము చేయుచున్నకాలమున మల్లనాయడు, సవ్వినాయడు, దేవరాయడు, పేరూరి సోమేశ్వరదేవర కంగరంగభోగములకు, కొంపల్లి గ్రామ మును ధారవోసియిచ్చు సంధర్భమున వేయింపబడినది. శ. సం 1212 క్రీ. శ. 1290కి సమానము.

ఐదవ శాసనము మొదటి మూడుపంక్తులు చెదరిపోవుటవలన, కాలము తెలిసికొనుట కవకాశములేదు.

ఆరవ శాసనమును పెరూరు కేశవదేవరకు ధూపదీపనివేద్యాలకు, తాడిమట్టభోగమందు, కేశవభట్టుకు, భూమిని దానమిచ్చు సందర్భమున మండలిక గుండయ చాళుక్య భూలోకమల్ల వర్షాలు 11వల సంవత్సర ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున వేయించెను. చాళుక్యభూలోక మల్ల వర్షాలు 11 క్రీ శ 1137కు సమానము. చాళుక్య ఆరవ విక్రమాదిత్యుడు తనపేర విక్రమ శకము నారంభించెను. అతని కుమారుడు చాళుక్య మూడవ సోమేశ్వరుడు. సోమేశ్వరునికి భూలోకమల్లుడను నామాంతరము కలదు. ఇతనికి సర్వజ్ఞ చక్రవర్తియను బిరుదమున్నది. ఇతడు తండ్రివలె భూలోకమల్లశకము నేర్పరచెను. ఇతని పరిపాలనాకాలము క్రి. శ. 1126-1138.

ఏడవ శాసనము భూలోకమల్ల వర్షాలు 15 సాధారణ ఆశ్వయుజ అమావాస్య ఆదివారము సూర్యగ్రహణ నిమిత్తము అంబేనాగదేవ దండనాయకులు, కేశవదేవర అంగభోగములకు, నివేద్యములకు, గద్యాణములు నిలిపెను. చాళుక్యభూలోకమల్ల వర్షాలు 15 క్రీ. శ. 1141 కు సమానము.

ఎనిమిదవ శాసనము చాళుక్య ప్రతాప చక్రవర్తి రెండవ జగదేకమల్ల వర్షాలు 9 క్రోధన ఆషాఢ అమావాస్య సోమవారము సూర్యగ్రహణ నిమిత్తమున, మల్లయ నాయకుడు తన తల్లిదండ్రులకు పుణ్యముగా భూమిని దాన మిచ్చిన విషయమును తెలుపును. జగదేకమల్లుడు భూలోకమల్ల మూడవ సోమేశ్వరుని కుమారుడు. ఇతని పరిపాలనాకాలము క్రీ. శ. 1138-1155. ఈ శాసనము జగదేకమల్ల వర్షాలు 9 క్రీ.శ. 1147లో వేయింపబడినది.

తొమ్మిదవ శాసనము కందూరి భీమన చోడమహారాజు బంటు వేయించినది. ఇందు శక సంవత్సరము గాని, ప్రభవాది సంవత్సరములుగాని, పేర్కొనబడలేదు.

ఈ తొమ్మిది శాసనములలో ఆరు శాసనములు, సూర్య గ్రహణ పుణ్యకాలములం దీయబడినవి. ఆరవశాసనము ఉత్తరాయణ సంక్రాంతి పుణ్యదినము నాడీయబడినది. మూడు, తొమ్మిది సంఖ్య గల శాసనములందు దానమిచ్చిన సంవత్సరముగాని, శకసంవత్సరముగాని పేర్కొనబడలేదు.



# 1 వ శాసనము

1 స్వస్తి సమస్తభువనాశ్రయ శ్రీ ప్రథ్వీవల్లభ మహా
2 రాజాధిరాజపరమేశ్వర పరమభట్టారకం సత్యాశ్ర
3 య కులతిళకం చాళుక్యాభరణం శ్రీమత్త్రిభు
4 వన మల్లదేవర విజయరాజ్య ముత్తరోత్తరా
5 భివృద్ధి ప్రవర్ధమాన మాచంద్రార్కతారంబరం స
6 లుత్తమిరె లింగ్గదహాలయలు సుఖసంకథా వి
7 నోదదిం రాజ్యంగెయ్యుత్తమిరె తత్పాద పద్మోపజీ
8 విగళప్ప స్వస్తి సమధిగతపంచమహాశబ్ద మ
9 హామణ్డలేశ్వరం కుమారం తైలపదేవరు కన్దూరుహ
10 సిరదనూఱు పాలముమం దుష్టనిగ్రహశిష్టప్రతి
11 పాలనయింద మాళుతమట్టుతన్నపసాయితమణ్డలీ
12 కం జాయిమయ్యనల్లిపడిన శ్రీ మచ్చాళుక్యవిక్రమవర్షద 44 కెనె
13 యవికారి సంవత్సరదవైశాఖ అమావాస్య ఆదిత్యవారదన్దుసూర్య్యగ్ర
14 గ్రహణనిమిత్తదినె పెరియ ఇప్పత్తిఱకూడియు పెరూర శ్రీస్వయం
15 భూ సోమేశ్వరదేవర అంగ్గభోగకె పాత్రపాములకె ధూపదీపనివేద్య
16 కే దినభాగ అనియ మహాజన......వాగి పెరూర
17 ప్రతిబద్ధ తాడిమట్టియుం అగ్రహారం ధారాపూర్వకమ్మాడి
18 కొట్టధమ్మ ఇల్లియభాగక......మహాజనవారారె
19 శ్వర కుప్పణభట్టోపాధ్యాయరు ఆగరమకంకేశవభట్టరు
20 ...రజన్నయభట్టరు మేడయభట్టరు కాడవడంగరు కుప్పణప
21 దియసాసియరు వాగెపడంగరు మాధవభట్టరు సాధ్యాణ
22 భట్టరు మాహేశ్వరపోలమనాయకరు తాతంభట్టరు చంద్ర
23 సెమడగెరు నారాయణభట్టరు బ్రహ్మదేవభట్టరు చంద్ర
24 శేఖరపండితరు జోతిదుప్రోలెభట్టరు కొమ్మపడంగరు కొ
25 ...ట్టరు ఆరాస్యభట్టరు అరలయభట్టరు బామనభట్టరు
26 ......రు గుప్తషదంగరు కేశవభట్టరు ప్రోలెపడగరు
27 ......ణభట్టరు రాజనౌభట్టరు ప్రోలెపడగరు
28 భట్టరు.........
29 త్తు మూవత్తునాల్కు భాగదవరుం......
30 నంత శరదగదిం పదరక్షసాదన యిప్పత్తు

31 య - ల్వొబ్బరిగె యెరడు పుట్టి కెయ్యుమా...

32 పనాగిహద కొణ్డు పుత్రానుపౌత్రికం సుఖమ...

33 భవిసువరు మంగళమహా శ్రీ శ్రీ శ్రీ దేవరభోగదల్లి మ

34 హేశ్వర సిద్ధభట్టరిగె ఎరడు పుట్టికెయ్యుదిసగట్టమత్తరు పరమదా

35 మూరె చట్టంగ్గెలరడు పుట్టి కెయ్యుడినుగద...ము...

36 వాగిమాడి......

37 .........

38 .........

39 .........

40 మద్వంశజాః పరమహీపతి వంశజావాపాపాద పేత మనసోభువిభావిభూ

41 పాః యే పాలయన్తి మమధర్మ మిదం సమస్తం తేషాంమయావిరచి
తాంజలి రేషమూ

42 ర్ధ్ని సామాన్యోయం ధర్మసేతు నృపాణాం కాలేకాలే పాలనీయో
భవద్భిః

43 సర్వాన్ నేతాన్భావినః పార్థివేన్ద్రాన్ భూయోభూయో యాచతే రా

44 మభద్రః॥స్వదత్తాం పరదత్తాం వా యోహరేత వసున్ధరాం షష్టివర్ష

45 సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః బహుభిర్వసుధా
దత్తా బహు

46 భిశ్చానుపాలితా యస్యయస్యయదాభూమి స్తస్యతస్యతదాఫలం

47 ఆనియమ...లోభ...నరా...పితగోద...

48 .........

49 .........



# 2వ శాసనము

1 ఓం స్వస్తి సమస్తభువనాశ్రయ (శ్రీపృధ్వీవల్ల)
2 భ మహారాజాధి రాజపరమేశ్వర ప(రమభ)
3 ట్టారకం సత్యాశ్రియకులతిలకం చాళుక్యాభ(రణం)
4 శ్రీమత్త్రిభువనమల్లదేవర విజయరాజ్య ముత్త
5 రోత్తరాభివృద్ధి ప్ర(వ)ర్ధమాన మాచంద్రార్క్కతారంబ
6 రం సలుత్తమిరె లింగదహూలయబీడినోళ్ సుఖ
7 సంకథావినోదదిం రాజ్యం గెయ్యుత్తమిరే తత్పా
8 దపద్మోపజీవిగళు గంగ్గరమూవత్తాఱుబి
9 డుగళవరుం హదరడురుపాడినెండు బిడుగ
10 ళవరుం తుదిలసందరుం అదవజ్జెయవరుం బలం
11 జిగరుం ఱుమడువరు నలఱుమడువరుం
12 శంకరపాడియవరుం సమస్తవాద ప్రజయె
13 ల్లమం కూడి శ్రీమచ్చాలుక్య విక్రమవర్షద 4
14 4 నేయ వికారిసంవత్సరద వైశాఖ అమావా
15 స్య ఆదిత్యవారదందు సూర్య్యగ్రహణ నిమి
16 త్తదిం పేరూర శ్రీ స్వయంభూ సోమేశ్వర దేవరిగె
17 సనుస్తవాదం త్తప్పభిణ్ణకెల్ల నూఱుహోలింగ్గె ఎ
18 రడు హోగదల్కడిందేవం మానవం కొట్టధర్మ్మం
19 దేవర అంగభోగకె ప్రాత్రపామలకె ధూపదీ
20 పనివేద్యకె ఈ ధర్మ్మవ నాచంద్రార్క్కస్థాయి యా
21 గి మకెరమకలతరదిన్ద న్నిడనుంవరు॥ కుప్ప
22 న భట్టోపాధ్యాయర వంశకే పేరుసుకేడ వడ్డరావు
23 ల దణ్డనాయకరు సమస్తవాదన్తచ్చి పేఱువప్ర
24 జయెల్లమం కూడి సోమేశ్వర సన్నిధియలుబిడిన
25 లోన్దున్దుపాణవం మకలతరదిన్దం కొట్టుధర్మ్మ వన్న
26 డవివరు॥ శ్రీ మత్కిబ్బట్టయ వడ్డరామలద దణ్డ
27 నాయకరు పేరూర శ్రీ స్వయంభూ సోమేశ్వరదే
28 వరిగె సూర్య్యగ్రహణ నిమిత్తదిం ధారాపూర్వ్వక మ్మార్
29 డి శ్రీ మత్సహావాసి పట్టభట్టదణ్డనాయకం కొ
30 ట్టగద్యాణం హన్నెరడు ఇదాచదాయన మ్మార్డివ
31 డ్డరామలద దణ్డనాయకం ముద్రానేదఎట్టపయ్యం
32 ...దగద్యాణ వామఇన్తుతెకదంగన హస్తిగ...
32 ...పహతింగ్గె సుంకవం పరి...
34 ...ర...

# 3 వ శా స న ము

1. శ్రీమచ్చాళుక్య వి|క్రమవర్షద 44 నెయ వికారి సంవత్సరద చైశా
2. ఖ అమావాస్య ఆదిత్యవారదందు సూర్య|గ్రహణ నిమి
3 త్తదిం పెరూర శ్రీ స్వయంభు సోమేశ్వరదేవరగె అఖణ్డదీపకె
4 శ్రీమతు పెరియకందునాడ వడ్డరావళ భణికారి దూమ
5. ఘరదాసి బొల్లమరాజను పెజ్జంకదభణికాఱి మదూవా
6. సి చైత్రవణి నాయకనుం కూడి తింగ్గళిగె ఇవరొన్డు హణవ
7. చరొందు హణనినా ఎరడు హణవం కొట్టుధమ్మణవ నాచం|ద్రాకణ
8. స్థాయి యాగి నడసువరు॥మహేశ్వర జన్నయభట్టరు ఆవ
9. గావువం కొణ్డబస్తడె డిన్దు చట్టింగ్గె ఆచం|ద్రాకణ వెరడుసుం
10. మా పరిపాలి॥అదాబ్బబేణ్డగాడి ధమ్మణవం |ప్రతిపాలిసిదమ
11. ని వారణాసి కురుక్షే|త్ర గంగాయమున సంగమదలుకొడి
12. గ భక్తకాగిట్ట-పాణరిగె కొడి కన్యాదానవంకొడికపి అడు.

# 4వ శాసనము

1. శ్రీ రుద్రకుమారుడు ప్రిధివిరాజ్యం సేయుచూ నుండగాను
2. స్వస్తి శ్రీశకవరుషంబులు 1212 అగునేంటి వికృతి
3. సం భాద్రపద బహుళ 15 మ। సూర్యా గ్రహణ
4. —ఈ గుడికటించిన సబ్బమల్కాయని యమరగంగ వల్లిమల్లా
5. —ండు సర్విానాయండు దేవరాయండును పెర్రూరిశ్రీస్వయం
6. భూ సోమనాథదేవర కంగరంగభోగానకై కొంపల్లి ధారవో
7. సి యిచ్చిన దాచంద్రాక్కాస్థాయిగాను మంగళమహా శ్రీశ్రీశ్రీ
8. ఈ ధమ్మాము ప్రతిపాలించిన వారికి...। సామాన్యోయంధమ్మాసేతు
9. నృపాణాం కాలేకాలే పాలనీయో భవద్భిః। సర్వా నేతాన్భావినః పార్ధివేం
10. ద్రాన్ భూయోభూయో యాచతే రామచంద్రః। మద్వంశజాః పరమహీపతి వంశజావా
11. పాపాదపేత మనసో భువిభావి భూపాః। ఏ పాలయంతి మమధమ్మా
12. మిమం సమస్తం తేభ్యో మయా విరచితాంజలి రేషమూర్ధ్నా శ్రీసోమేశ్వ
13. ర దేవరకు కొంవల్లిని నిత్యము...రాజనారా...
14. ........................

# 5వ శాసనము A

1. ............
2. ............
3. ............
4. ముమ్మడి నాయకు
5. దంౘ్రులు గుండనాయక ప......
6. కులకు ధమ్మౣముగాం పెరూరి శ్రీ స్వయంభూ
7. సోమేశ్వరదేవర సన్నిధి బయ్యనభట్టరు నల్లిల్లు[1]
8. నిల్పి యిచ్చిన వ్రిత్తి పెరూరి పొలమున పు
9. డపుకు రెడుండిన నాచాంౘ్రాక్కౣ స్థాయిగా
10. నెవ్వరేలిన నడుపం గలవారు —

---

1. బ్రాహ్మణ అగ్రహారము

## 5వ శాసనము—B

అక్షరములు చదువుటకు వీలుగాలేవు

—o—

# 6వ శాసనము

1. స్వస్తి సమస్తప్రశస్తి సహితులై
2. న శ్రీమణ్డలిక గుణ్డయ స్వస్తిశ్రీ మచ్చాళుక్య భూలో
3. కమల్ల వషౣములు 11నెం సంవత్సర ఉత్తరాయ
4. ణ సంక్రాంతి నిమిత్తమున యాజ్ఞవల్కి కేశవభ
5. ట్టు యెత్తించిన కేశవ దేవరకు దూపదీప
6. నివేద్యములకు ధారాపూవ్వౣకము సేసి తాడి
7. మట్ట దేవభోగమునం దిచ్చిన వ్రిత్తి పాడు
8. ...రెండుపుడమత్తురు (అ)
9. చంౘ్రాకౣ స్థాయిగా నడపంగలవారు దానినడప
10. రేని గంగకఱ వేయి కవిలల జంపినవారు,

# 7 వ శాసనము

1. స్వస్తి శ్రీమచ్చాళుక్య భూలోకమల్ల వర్షఁము
2. లు (15) సాధారణ సంవత్సర ఆశ్వయుజ
3. అమావాస్య ఆదిత్యవారము సూయఁగ్రహణ ని
4. మిత్తమున శ్రీమత్కిబ్బట్టి వడ్డరాలువ మంత్రి
5. సుంకాధికారి అంబేనాగదేవ దండనాయకు
6. లు యాఙ్ఞవల్కి కేశవభట్టరు నిల్పిన కేశవదేవర అంగభోగ
7. నివేద్యములకు ఆ గద్యాణముల జ్వాబేలు
8. కలోడి ముప్పదింటికి సుంకములుం బడిపడి
9. కద అలవెలివొలము సవ్వఁకాలము రెండుమా
10. దలుం విరిడూరిరాంటరియ కయ నాయకుని సము
11. కమున నఖండదీపమునకు నేల రూక యిచ్చిరి॰

# 8 వ శాసనము

1. స్వస్తి శ్రీమత్ప్రతాప చక్రవత్తిఁ చాళుక్య జగదేకమల్ల
2. వర్షఁ ౯ యగు క్రోధన సంవత్సర ఆషాఢ అమా
3. వాస్యయు సోమవారము సూయ్యఁగ్రహణ నిమిత్తము
4. న శ్రీమత్యదువరము మల్లయనాయకుండు తమ
5. తంద్రులు గుండనాయక పల్లెనాయకులకు పుణ్య
6. ముగాం బెరూరి శ్రీ స్వయంభూసోమేశ్వర దేవర పూజా
7. రింగా మనపెగ్గడ కొడుకు మల్లయభట్టో (పాధ్యాయుల)
8. (సముఖమున) పెట్టిన మూండు (మట్టపట్టును)
9. మత్తురు నాచంద్రాక్కఁస్థాయిగా ధారాపూవ్వఁకముగా
10. సేసి యిచ్చిరి దీని నదైరీతినం నడపం గలవారు.

# 9వ శాసనము

1. స్వస్తి సమధిగత పంచమహాశ
2. బ్ద మహామణ్డలేశ్వరం వీరమాహేశ్వరం
3. కోడూర్ప్పుర వరేశ్వరం సూర్య్యవంశో
4 ద్భవ కులతిలకం కాశ్యపగోత్ర కరికా
5 లాన్వయ నామాది సమస్త ప్రశస్తిసహి
6. తం శ్రీ మన్మహామణ్డలేశ్వరం కన్దూ
7. రి భీమనచోడ మహారాజుల బంటు
8. స్వస్తి సమస్త నిజనామాంక మాలికా
9. ప్రశస్తి సహితం శ్రీమతు పేరూరి మా
10. మనుమ మల్లియ నాయకులు శ్రీ
11. స్వయంభు సోమేశ్వరదేవర కెత్తించిన
12. దేవగ్రిహాము వారి పుత్రానుపౌత్రి
13. కముగా నిల్పిన మటూరి కులధర్మ్మమది
14. ని నాచంద్రార్క్క స్థాయిగా దేవరకు నడచు
15. చున్న వ్రిత్తి యా పెరూరి నకరము దేవర
16. భోగమున కుత్తమమిన్ద రెణ్డురూకలు
17. మధ్యమమింద ముయ్యర్ద్దను కనిష్ఠ
18 మిఁద ముప్పాదికయుంగ్గాం దెలుంగు నకరము
19. నకచి నకరము నీ ధర్మ్మము ప్రతిపాలిం
20. చి నడంపగ్గలవారు అంద్దుల సమయము
21. పెద్దపీసాము -స్సని నడపంగ్గలవారు అ
22. ందుల తెలివారుగానుమనే బుద్యండు సే
23; సి......కు నడపంగ్గలవా
24. రు అగ్గడిదన......వండు
25. సేసి బియమింగ్గలవారు ఆ నక
26. రేశ్వరదేవరకు విష్ణుదేవరకు దెలుగు
27. నకరేశ్వరదేవరకు నివేద్యములకు మూ
28. ణ్డుదేవరలకు మూండు సద్దిగెములు వరిబి

29. యము నడపువారు అన్నుల కాసడమమిౖ

30. నవీరలకు రూక నరవీసాము గొనువా

31. రు పోంకల పెఱ్కు నిరువదేను ఆకు చెఱ్కుంగట్టుత

32. లమాపున సవలయ జొన్న మోపున మానెండు

33. కొల్చుబణ్డి నిరుమసఎత్త పెఱ్కు నద్దెండు వాసుదేవ

34. ... ణ్డిము దూనిచిన పెఱ్కునేనుపలములు బొడ్డునం

35. ... దు పఽముమీదిం యాలనావల పెఱ్కు మానం

36. ... అందుల గొల్లకాంపులు ఎంటంగ్గడుపు నెనుకకొ

37. ... దివియనేతికిం గలవారు అన్నులకు నాయ

38. ... నవారు ఎంబడిరెణ్డు గూడం బెట్టి యెందెను

39. ...గా వషాఽ్ప్రతి నడపంగ్గలవారు ఆనాయకు

40. ...వారికి రెణ్డుగద్యాణము లీంగలవాండు మ

41. ...ము వారెల నూరగద్యాన మీంగలవారు ఆదే

42. ... వారికి మేడితూము నడపంగ్గలవారు దే

43. వర ... ముఽను వెట్టెడి కొమటి కిలుదేఉవరి

44. ... వారము అందుల ... ముగుడుచుచున్న రట్టడి

45 ...పెగ్గడలైన వారు రెణ్డుసేసి రూక

46. ... వారి కొఱరూకల...

# మేడెయభట్టు

# బొల్లేపల్లి శాసనము

నల్లగొండ మండలములోని భువనగిరి తాలూకా కేంద్రమునకు సుమారు ఎనిమిది మైళ్ళ దూరమున బొల్లేపల్లి గ్రామ మున్నది. భువనగిరి - నల్లగొండ మార్గములోగల నాగిరెడ్డిపల్లి నుండి బొల్లేపల్లికి పోవచ్చును. బొల్లేపల్లి గ్రామము నానుకొని మూసీనది కుపనదియైన చిన్న ఏరు ప్రవహించుచున్నది గ్రామమునకు తూర్పున నదికి ఇవతలి యొడ్డునగల శివాలయము ఆవరణములో రెండు శాసనములున్నవి.

ఈ ఆలయము పూర్తిగా మట్టితో నిండి దిబ్బగా కనిపించుచుండుటవలన గ్రామ సర్పంచు శ్రీ రావి లక్ష్మీకాంతరెడ్డిగారి ప్రోత్సాహమున గ్రామీణులు 1968 మే మాసములో మట్టిని త్రవ్వించినారు. చెక్కుచెదరని శివాలయము వెలువడినది. గర్భగుడి, శివలింగము, మంటపము విగ్రహములు భిన్నముకాకుండ నున్నవి. ఆలయ ముఖమంటపము, భూమిలోనికి కొద్దిగా క్రుంగిపోయినది. మంటపస్తంభములతో నాలుగు ఒరిగిపోయినవి. మంటపమున పఱచిన బండలు పగిలిపోయినవి ఆలయము ఉత్తరాభిముఖముగా నున్నది ఆలయమునకు దూర్పున పైన పేర్కొనిన శిలాశాసనములున్నవి.

శ్రీ రావి నారాయణరెడ్డిగారు దేవాదాయశాఖవారికి—'ఆలయ మతిపురాతనమైన దనియు, దానికి దగిన రక్షణ కల్పించి, పూజ, నైవేద్యాదులు జరుగునట్లు చూడవలసినద'ని వ్రాసినారట. దేవాదాయశాఖాధికారి యొకరు బొల్లేపల్లికి వచ్చి, ఆలయమును చూచి, వెళ్ళినట్లు గ్రామము మాలీపటేలుగారివలన తెలిసినది.

మైలారు దేవర కాలయనిర్మాణము గావించి, ప్రతిష్ఠచేసిన సందర్భమును పురస్కరించుకొని, పశ్చిమచాళుక్యుల సామంతుడును, కొల్లిపుర ప్రభువును, అగు మేడెయభట్టు వేయించిన శాసనమొకటియు కాకతి రుద్రమదేవి పాలించుకాలమున వెలసిన శాసనమొకటియు ఇచట నున్నవి. ఇవి రెండును తెలుగు శాసనములు.

**శాసనము**

ఈ శాసనము కల్యాణీ చాళుక్య ప్రభువగు రెండవ జగదేకమల్లుని పదియవరాజ్య సంవత్సరమున కొల్లిపుర ప్రభువగు మేడెయభట్టు, మైలారదేవర ప్రతిష్ఠగావించు సందర్భమున వేయించెను. రెండవ జగదేకమల్లుని, పెర్మాడి జగదేకమల్లుడని యందురు. ఇతనికి శ్రీ మచ్చాళుక్య ప్రతాపచక్రవర్తియను బిరుదము కలదు. ఇతని పరిపాలనాకాలము ప్రశాంతముగ గడిచినది.

ఈ మహారాజు సుమారు 19 సంవత్సరములు చాళుక్య రాజ్యమును పాలించెను. ఇతడు క్రీ. శ 1138-1149 వరకు పాలించినట్లు చారిత్రకులు నిర్ణయించినారు.[1] కాని ఇతని పరిపాలనము క్రీ. శ. 1136-1155 వరకు సాగినట్లు శాసనములవలన తెలియుచున్నది.

బాదామీ చాళుక్యుల పరిపాలనము క్రీ. శ. 750 ప్రాంతమున అంతరించెను. రాష్ట్రకూటులు మాన్యఖేటము రాజధానిగా రెండువందల సంవత్సరములు బాదామీచాళుక్యుల పాలనములోనున్న భూభాగములను పాలించిరి. బాదామీచాళుక్యవంశీయుడగు రెండవతైలపరాజు క్రీ. శ. 973 లో రాష్ట్రకూట వంశమును నిర్మూలించి క్రీ. శ. 996 వ సంవత్సరమునాటికి కొలనుపాక రాజధానిగా, రాష్ట్రకూటుల పాలనములోనున్న ప్రాంతములన్నింటిని పాలించెను. ఈతని వంశీయులు సుమారు రెండువందల సంవత్సరములు కల్యాణీ చాళుక్యరాజ్యమును పాలించిరి. బాదామీచాళుక్యులలో చివరిరాజు రెండవ కీర్తివర్మ. కౌథెం శాసనమువలన రెండవకీర్తివర్మ మొదలు కల్యాణీ చాళుక్యరాజ్యస్థాపకుడగు రెండవ తైలపునివరకుగల రాజుల పేళ్ళు తెలియుచున్నవి. ఈ రాజుల మధ్యకాలము రెండువందల సంవత్సరములు.




కల్యాణీ రాజ్యస్థాపకుఁడగు రెండవ తైలపుడు క్రీ. శ. 973-996 వరకు పాలించెను. అతని యనంతరము క్రమముగా సత్యాశ్రయుడు 997-1008, త్రిభువన మల్లవిక్రమాదిత్యుడు

1. A. P. Govt. Archaeological Series No. 6 Page 72.

1008-1015, జగదేకమల్ల జయసింహుడు 1015-1042, మొదటిసోమేశ్వరుడు 1042-1068, భువనైకమల్ల సోమేశ్వరుడు 1068-1076, త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యుడు 1076-1126, మూడవ సోమేశ్వరుడు 1126-1136, రెండవ జగదేకమల్లుడు 1136-1155, మూడవతైలపుడు 1155-1161, నాలుగవ సోమేశ్వరుడు 1182-1200 కళ్యాణీ చాళుక్యరాజ్యమును పాలించిరి. మొదటి సోమేశ్వరుని కాలమున రాజధాని కల్యాణినగరమునకు మార్చబడినది. అంతకు పూర్వ మీ వంశీయులకు కొలనుపాక, మాన్యఖేటము, రాజధానులుగా వర్ధిల్లినవి. ఈ వంశమున చివరిరాజైన నాల్గవ సోమేశ్వరుడు అంతఃకలహములవలన వెంటనే సింహాసన మధిష్ఠింప లేకపోయెను [1]

ఈ బొల్లేపల్లి శాసనము రెండవ జగదేకమల్లుని పదియవరాజ్య సంవత్సరమున వేయించినది. కావున అప్పటికి తెలంగాణాములోని భువనగిరి, నల్లగొండ మండలములు కాకతీయుల అధికారము క్రిందికి రాలేదని స్పష్టమగుచున్నది.

**సమకాలిక రాజవంశములు:**

కళ్యాణీనగరము రాజధానిగా పశ్చిమ చాళుక్యరాజ్యమును రెండవ జగదేకమల్లుడు పాలించు కాలమున ఆంధ్రదేశమును వివిధ మండలాధిపతులు పాలించుచుండిరి. అందు చాళుక్య చోళులు, వెలనాటి చోడులు, కాకతీయులు ముఖ్యులు.

## 1. చాళుక్య చోళులు :

కుళోత్తుంగచోళుని పరిపాలనాకాలము క్రి.శ. 1070-1120; అతని కాలమునందాంధ్ర దేశ ప్రతినిధులుగను, అతని తరువాత చాళుక్య చోళ రాజ్యాధినేతలుగను ఈ క్రింది రాజులు పాలించిరి. రాజరాజముమ్మడి చోళుడు. 1076-1079; వీరచోడుడు. 1079-1084; రాజరాజ చోడగంగు 1084-1089. రెండవపర్యాయము వీరచోడు. 1089-1094; వీరపెర్మాడి దేవుడు. 1094-1107; పరాంతకదేవుడు 1107-1118; రెండవ విక్రమచోడుడు. 1118-1135; రెండవ కుళోత్తుంగుడు. 1135-1150; రెండవ రాజరాజ చోడుడు. 1150-1178; రాజాధిరాజు 1178-1179; ఇందు రెండవ కుళోత్తుంగుడు. కళ్యాణీచాళుక్య రెండవ జగదేకమల్లుని సమకాలికుడు.

## 2. వెలనాటి చోడులు :

వెలనాటిచోడు లాంధ్రదేశ ప్రతినిధులుగా పాలించుచు చోళరాజుల సామంతులుగ వ్యవహరించిరి. అందు గొంకరాజు 1076-1108; చోడరాజు 1108-1132; రెండవగొంకరాజు 1132-1168; వీరరాజేంద్రుడు 1168-1180; మూడవగొంకరాజు 1180-1186; పృథ్వీశ్వరుడు 1186-1208, వీరిలో రెండవ గొంకరాజు, రెండవ జగదేకమల్లుని కాలమువాడు.

---

1. Indian Antiquary vol. xvi. P. 15-24.

**3. కాకతీయులు :**

కాకతీయులు చాలకాలమువరకు పశ్చిమ చాళుక్యుల సామంతులుగ వ్యవహరించుచు, వారి బిరుదములనే ధరించుచుండిరి. కాకతీయ రాజన్యులలో మొదటి బేతరాజు క్రీ.శ. 1000-1050; మొదటి ప్రోలరాజు. 1050-1080; రెండవ బేతరాజు 1080-1115; రెండవ ప్రోల రాజు, 1115-1158; రుద్రదేవుడు 1158-1195; మహాదేవరాజు. 1195-1199; గణపతిదేవుడు 1199-1261; రుద్రమదేవి 1258-1296; రెండవ ప్రతాపరుద్రుడు 1290-1326; ఆంధ్రదేశ మును పాలించిరి.

రెండవ జగదేకమల్లుని కాలమున, చాళుక్య చోళరాజ్యమును రెండవ కుళోత్తుంగ చోళుడును, వెలనాటి చోడరాజ్యమును, రెండవ గొంకరాజును, కాకతీయరాజ్యమును, రెండవ ప్రోలరాజును పాలించుచుండిరి.

చాళుక్య చోళ సామ్రాజ్యాధినేతయగు రెండవ విక్రమచోళుని పాలనాకాలము క్రీ.శ. 1118-1135. ఇతని అవసాన కాలమున, మాండలికరాజులగు వెలనాటిచోడులు, పశ్చిమ చాళుక్యులను వేంగిమండలమునుండి తటిమివేసిరి. రెండవ కుళోత్తుంగచోళుడు క్రీ.శ. 1133లో యౌవరాజ్యాభిషిక్తుడై సైన్యముల నడిపి కృష్ణానదికి దక్షిణముననున్న కుంతల సైన్యముల దటిమి, కృష్ణదాటి పశ్చిమ చాళుక్య సైన్యమును, గోదావది నదివరకు వెంటాడి వేంగిరాజ్య మును కల్యాణీ చాళుక్యుల కబంధ హస్తములనుండి విడిపించెను. కాని పశ్చిమ చాళుక్యుల అధికారము తెలంగాణమున నెలకొనియుండెను. వెలనాటి గొంకరాజు ఈ యుద్ధమున కుళో త్తుంగచోళునికి సహాయపడెను.

కాకతీయులలో రెండవ బేతరాజు కల్యాణీ చాళుక్య చక్రవర్తియగు ఆరవవిక్రమాది త్యుని సామంతుడు. ఇతని పాలనాకాలము 1080-1115; ఆరవ విక్రమాదిత్యుడు 1076-1216; వరకు పరిపాలించెను. రెండవ ప్రోలరాజు పరిపాలనాకాలము 1115-1158; ప్రోలరాజు కాకతీయ రాజ్యమును పాలించుకాలమందు పశ్చిమ చాళుక్య రాజ్యమును ఆరవ విక్రమాదిత్యుడు, మూడవ సోమేశ్వరుడు, రెండవ జగదేక మల్లుడును ఒకరితరువాతనొకరు పాలించిరి. కాకతి ప్రోలరాజు పై ముగ్గురు రాజులకు సామంతునిగ వ్యవహరించెను. కాని రెండవ జగదేకమల్లుని తరువాత మూడవ తైలపుని కాలమున కాకతి ప్రోలరాజు విజృంభించి తైలపుని ఆధీనమందున్న తెలుగు భూభాగములను జయించి, తైలపుని బంధించి కల్యాణీచాళుక్యరాజ్య వంశముపైగల అభిమానముతో, గౌరవముతో విడిచిపుచ్చెను[1]. అప్పటినుండి కొలనుపాక ప్రాంతము కాకతీయ సామ్రాజ్యాంతర్భాగమయ్యెను.

---

1. హస్త్యారోహణకర్మ కర్మరగతిం చాళుక్య చూడామణిం।శశ్వద్యుద్ధనిబద్ధగర్వ్వార మతిం యుద్ధేభబంధ క్షణాత్ శ్రీమత్తైలపదేవమంబుదనిభ స్తంభేరమస్తంక్షణాత్ । ప్రఖ్యాతోరిపు కంఠఖండన విధేఃక్ష్మాను రాగా ఙ్ఞహా;—వేయి స్తంభాలగుడి శాసనము పంక్తులు; 27-30 ;

శాసనము-ఆకారాదికములు

బొల్లేపల్లి మైలార దేవర అలయ ఆవరణలో ఈ శాసనపు స్తంభము భూమిలో పాతబడియుండ, త్రవ్వించి వెలికితీసి శాసన ప్రతిబింబముల తీసికొనుట తటస్థించినది. శాసనశిల నల్లగానున్నది. శాసనాక్షరములు చెక్కబడినంతవరకు నునుపుగానుండి తరువాతి భాగము గరుకుగా నున్నది. శాసనశిల పొడవు 1.87 మీటర్లు. వెడల్పు 0.34 మీటర్లు-శాసనారంభమున సూర్య చంద్రుల చిహ్నములున్నవి.

శాసనాక్షరములు శాసనశిలకు నాలుగువైపుల చెక్కబడినవి. శాసనము మొదటిప్రక్క 21 పంక్తులు; రెండవప్రక్క 28, మూడవప్రక్క 18; నాలుగవప్రక్క 20 పంక్తులును గలవు. మొత్తము శాసనము 82 పంక్తులలో కలదు. ఇది తెలుగు శాసనము. శాసనవిషయమంతయు తెలుగువచనములోనున్నది. చివరనున్న రెండు వ్యాసగీతాశ్లోకములు సంస్కృతములు. శాసనమున కల్యాణీనగరము, కొల్లిపురము, భువనగిరి; బ్రహ్మపురి, లేక బ్రహ్మదేవరపల్లి పట్టణములు పేర్కొనబడినవి.

లిపి

క్రీ. శ. పం|డెండవ శతాబ్దమునం దాంధ్రదేశమున వాడుకలోనున్న తెలుగులిపి ఈ శాసనమున వాడబడినది. శాసనము వేయించినవాడు కొల్లిపురప్రభువు మేడెయభటు. శాసన మందచ్చటచ్చట కొన్ని కన్నడ పదములున్నవి. ఈ ప్రాంతమున పశ్చిమచాళుక్యులకాలమున వెలసిన శాసనము లన్నియు కన్నడ సంస్కృత భాషలలోనున్నవి. తెలుగు శాసనము కనిపించుట విశేషము. ఇందు కన్నడ శాసనములలోవలె చాళుక్యవంశ ప్రశక్తి కలదు. శాసనాక్షరములు చక్కగా చెక్కబడినవి. ఈ శాసనాక్షరములు చందుపట్ల శాసనముల అక్షరములను పోలి యున్నవి. శాసనము చెక్కిన శిల్పిపేరుగాని, శాసన రచయితపేరుగాని ఇందు పేర్కొనబడ లేదు

భాష

శాసనారంభమునుండి, చివరి వ్యాసగీతాశ్లోకమువరకుగల శాసనభాగమంతయు వచనములోనున్నది. శాసనశిల నాలుగవవైపు పదునొకండవపంక్తి చివరినుండి వ్యాసగీతాశ్లోకములారంభమగుచున్నవి. శాసనారంభమున సూర్యచంద్రుల చిహ్నములును, మూడవప్రక్క పై భాగమున డమరు త్రిశూల చిహ్నములును ఉన్నవి. శాసనము మొదట చాళుక్య ప్రశస్తి కన్నడభాషలో నున్నది. ఇందు పృథ్వీవల్లభం, చాళుక్యాభరణం, ఇత్యాది పదములున్నవి. శాసనమందొకటి రెండు కన్నడ పదములున్నను, శాసనమంతయు తెలుగుభాషలో వ్రాయబడినది. 'ర' కారమునకు పూర్వాక్షరము ద్విత్వముగను, పుష్పబదులు పుః ప ఆదులు కనిపించుచున్నవి.

ప్రవర్ధమాన-ప్రవర్ద్ధమాన
అచంద్రార్క-అచంద్రార్క్క
ప్రతాపచక్రవర్తి-ప్రతాపచక్రవర్త్తి
స్వర్గ-స్వర్గ్గ
పుష్ప-పుః ప ఇత్యాదులు శాసనమందచ్చటచ్చట కనిపించును.

**శాసన విషయము :-**

జగదేకమల్లుడు కల్యాణిపురము రాజధానిగా చాళుక్యరాజ్యము నేలుచుండ నాతని రాజ్యవర్షములు 10 ప్రభవ సంవత్సర వైశాఖ శుక్ల అక్షతృతీయ శనివారమునాడు వేంగి నాంటిలోని కొల్లిపుర ప్రభువును అప్పనభట్టు బొల్లసమ్మ దంపతుల వరపుత్రుడును, పొద టూరి సౌదర మల్లెనాయక బిరుదనాయకుల తండ్రియునగు మేడెయభట్టు, భువనగిరి ప్రతిబద్ధ మైన బొల్లేపల్లి తూర్పున నన్దనవనమున సుధాధవళి తోత్తుంగరమ్యమైన ఆలయమున మైలార దేవరను ప్రతిష్ఠచేసి, ఆ దేవరకు అక్షత గంధ పుష్పధూప దీపనైవేద్య తాంబూల వస్త్రాభరణా ద్యంగభోగములకు ద్రవ్యనిధి నేర్పఱచి, బ్రాహ్మణులకు ప్రతి పదిరూకలమాడలును, దేవర పూజారి మల్లికేయతల్లి గంగసవకు చీరలకు రెండు మాడలును. పాడెడువారికి ఐదు గద్యలును రాకాట వారికి మూడు గద్యలును, రంగవల్లి పెట్టువారికి ఒక మాడను, ఏర్పాటుచేసెను. ప్రతిష్ఠాదులకు నూటొక్క మాడపెట్టెను ఇతని కుమారుడు పొదటూరి సౌదర మల్లెనాయ కులు ఒకచెఱువుక్రింద నీరు నేల ఒక మఱుతురును, బొల్లేపల్లి పడమటి శివద్వారము పడు మట పురయేను పుట్లుపట్టు వెలివొలమును ధారాపూర్వకముగా నిచ్చెను.

**కాల నిర్ణయము :**

రెండవజగదేకమల్లుని పదియవ రాజ్య సంవత్సరమున వేయించిన శాసనమిది. శాస నమున కల్యాణిపురము పేర్కొనబడినది. మొదటి సోమేశ్వరుని కాలమున కల్యాణినగరమును రాజధానిగా మార్చుటవలన కొలనుపాక ఇత్యాదినగరములు, సామంత మాండలిక రాజుల యధీన మందుండెను రెండవ జగదేకమల్లుని పరిపాలనాకాలమున కొల్లిపాక లేక కొల్లిపురము లేక కొలనుపాక, వేంగినాటిలో నుండెను. మేడెయభట్టు కొల్లిపుర ప్రభువుగా ఈ శాసనమున వర్ణింప బడినాడు. ఇతడు భారద్వాజ గోత్రుడు. ఈ శాసనమున పేర్కొనబడిన వేంగినాడు వేంగీ విషయము మాత్రముకాదు. వేంగో రాష్ట్రము, వేంగినాడు; వేంగీ విషయములు వేర్వేరు మండలములు, వేంగో రాష్ట్రము నెల్లూరు మండలములోను, వేంగినాడు తెలంగాణములోను. వేంగీ విషయము గోదావరి మండలములోను వుండెను ఈ తెలంగాణములోని వేంగినాడు పశ్చిమచాళుక్యులకు సంబంధించినది. ఈ శాసనమున పేర్కొనబడిన భువనగిరి, బొల్లేపల్లి, నందన వనము లేక నందనము, ప్రొద్దటూరు, బ్రహ్మపురి లేక బ్రహ్మదేవరపల్లి - భువనగిరి - రామన్న పేట తాలూకాలలో నున్న గ్రామములు.

శాసనము చాళుక్య ప్రతాపచక్రవర్తి జగదేకమల్లవర్షాలు 10- ప్రభవ సంవత్సరము వైశాఖ శుక్లతదియ శనివారమున వేయింపబడినది. ఇందు పేర్కొనబడిన ప్రభవ సంవత్సరము శా. శ. 1068కి సరిపోవును. అనగా రెండవ జగదేకమల్లుని పదియవ రాజ్యసంవత్సరము శక సంవత్సరము 1068 అగును. లేక క్రీ. శ. 1146 అగును. కావున ఇతడు రాజ్యమునకు వచ్చిన సంవత్సరము క్రీ. శ. 1086 అగుచున్నది. జగదేకమల్లుని పరిపాలనాకాలము క్రీ. శ, 1136-1155. ఇతని యనంతరము మీతని యనుజుడు మూడవ తైలపునికాలమున కాకతి రెండవ ప్రోలరాజు చాళుక్యరాజ్యభాగములపై దండెత్తి యుద్ధములోనర్చి తైలపునిబంధించి, చాళుక్య రాజ్యముననున్న తెలుగు భాగములగు నల్లగొండ, కొలనుపాక, మహబూబునగర ప్రాంత ములను తనరాజ్యమున జేర్చుకొని, తైలపుని గౌరవముగా విడిచిపుచ్చెను. కాకతి రుద్రదేవుని కాలమునాటికి కల్యాణీ చాళుక్యరాజ్యము పతనమయ్యెను.

# మేడెయభట్టు

# బొల్లేపల్లి శాసనము

శాసనము - మూలము

మొదటి ప్రక్క

1. ఓం. స్వస్తి సమస్త భువనాశ్ర
2. య శ్రీ పృధ్వీవల్లభమహా
3. రాజాధిరాజ పరమేశ్వ
4. ర పరమ భట్టారక సత్యాశ్ర
5. య కులతిలక చాళుక్య
6. భరణం శ్రీమజ్జగదేకమ
7. ల్లదేవర విజయరాజ్య
8. ముత్తరోత్తరాభివృద్ధిప్రవ
9. ర్ధఁ మానమాచంద్రార్కఁతారంబు
10. కల్యాణిపురము నెలవిట సు
11. కసంకథా వినోదంబున
12. రాజ్యంబు సేయుచునుండ
13. శ్రీమచ్చాళుక్య ప్రతాపచ
14. క్రవర్త్తిఁజగదేకమల్ల వర్షాఁలు
15. 10గు ప్రభవ సంవత్సరవైశా
16. ఖ శుక్లపక్ష మక్షత్రితీయ
17. యు వడ్డవారము నాండు వేంగి
18. నాటిలోని కొల్లిపురము ప్ర
19. భువు భారద్వాజగోత్ర పవిత్రుం
20. డు మేడెయభట్టు తత్సుతుండు
21. శ్రీమత్ పొదటూరి సౌదర

## రెండవ ప్రతి

1. మల్లెనాయక బిరుదనా
2. యకుల బ్రహ్మపురి ఆ
3 ప్పనభట్టు తత్సతి బొల్లి
4. నమ్మతద్దంపతుల వర
5 పుత్రుండు మేడెయ
6. భట్టుశ్రీమతు పెంజెఱ
7. మైలారదేవర పంప్పాన
8 భువనగిరి ప్రతిబద్ధము
9. బొల్లేపల్లి ముందటి ఈ
10. స్త గాము తూర్పున నన్దన
11. వనములోపల సుధా
12. ధవళి తోత్తుంగరమ్య
13. మైన నవకాదము సేయిం
14. చి యందు మేడెయభ
15. ట్టు శ్రీమైలారదేవరను
16. ప్రతిష్ఠసేసిరి॥ ఆదే
17. వర నగరికి వచ్చుచస్రి
18. రావులోన దేవరకు న
19. క్షత గంధ పుష్ప ధూ
20. ప దీపనై వేద్యతాంబూ
21. ల వస్త్రాభరణాద్యంగ
22. భోగములకుం దగిన
23. ద్రవ్యము ని విధిగాన

## మూడవ పక్షిక

1. ద్రవ్యవ్రయము అధ్యక్షకుం
2. డెడు బ్రాహ్మణ జీవితము
3. నకు వర్షాం ప్రతిపదిరూకల
4. మాడలు॥ దేవరపూజారి
5. మల్లికేయతల్లి గంగనవకు
6 చీరెలకు మాడలు 1 పాడె
7. డు వారికిగద్యలు 5 రాకా
8. ట వారికి గద్యలు 3 రంగవ
9. ల్లి వెట్టువారికి మాడ 1 ఇట్టి
10. ధఱకు సీమార్గ్గాముసమేడె
11. యభట్టు పరిత్వించిన దేవ
12. కార్య్యాము దప్పక నడిపిన వా
13. రు స్వర్గ్గా గాములు నడపకత
14. ప్పినవారు నరకగాములు॥
15. మేడెయభట్టు దేవర ప్ర
16. తిష్ఠాది క్రయము వెల
17. విపదినేసి రూక
18. మాడలు నూటయొకటి

# శనిగరం శిలాశాసనము

****

**శాసనము :-**

ఈ శాసనము కరీంనగరం మండలములోని శనిగరం గ్రామమున నున్న పార్థేశ్వర దేవాలయమున నున్నది. ఈ ఆలయము శిథిలమగుటవలన గ్రామీణులు చుట్టు గర్భగుడివంటిదానిని నిర్మించి, పైన రేకులు కప్పినారు. ఆలయమునకు ప్రాకారకుడ్యము నిర్మించినారు. ఆలయమున గల శివలింగము ఎత్తైనది. ఎత్తైన పానవట్టముకలిగి శివలింగము గంభీరముగ కనిపించుచున్నది. శనిగరం గ్రామమున శిథిల దేవాలయము లున్నవి. ఆలయముముందు చిన్న అరుగు, మంటపమువలె నిర్మింపబడినది. ఎత్తైన నందివిగ్రహము చూచుట కందముగనున్నది. ఆలయ ఆవరణలో పశ్చిమ చాళుక్య ప్రభువగు ప్రతాపచక్రవర్తి రెండవ జగదేకమల్లుని కాలపు శిలాశాసన మున్నది. శాసనము అందు శనిగరం గ్రామము శనిగరంగానే పేర్కొనబడినది. ఈ గ్రామము పూర్వము మహాసామంతాధిపతులకు రాజధానిగా నుండెననుటకు నిదర్శనములున్నవి. శనిగరం గ్రామమున కాకతి వంశమునకుచెందిన ముప్పురిరాజులకు సంబంధించిన శాసనములున్నవి: మొదటి ప్రోలరాజు, రెండవ బేతరాజు, రెండవ ప్రోలరాజుకాలపు శాసనములివి. ఈ శాసనము రెండవ ప్రోలరాజు కాలమున వేయించినట్టిది.

హైద్రాబాదు-కరీంనగర్ రోడ్డుపై హైద్రాబాదుకు 78 మైళ్ళదూరమున శనిగరం గ్రామమున్నది. రోడ్డునుండి నాలుగు ఫర్లాంగుల దూరంలో గ్రామమున్నది. గ్రామము హుస్నాబాదు పంచాయతీసమితిలో నున్నది.

**ఆకారాదికములు :-**

ఈ శాసనము తెల్లరాతిపై నాలుగువైపుల చెక్కబడినది. శాసనశిల నాలుగువైపుల నునుపుగా చెక్కబడినది. అక్షరములు అందముగ చెక్కబడినవి. శాసనశిలఎత్తు 4′-9″లు. (శాసనాక్షరములు ఒక్కొక్కప్రక్క 3′లు చెక్కబడినవి.) శాసనశిల వెడల్పు 1, 3 ప్రక్కలు, 11″లు, 2,4 ప్రక్కలు, 12.5″లు. శాసనశిలను త్రవ్వించవలసిన అవసరములేకుండ ప్రతిబింబములు తీయుటకు వీలైనది.

శాసనము మొదటిప్రక్క సూర్య చంద్రులును, రెండవవైపు గోవు-లేగ, మూడవవైపు పానవట్టముతోకూడిన శివలింగము, నాలుగవవైపు నందివిగ్రహము చెక్కబడినవి. శాసనము మొదటిప్రక్క 23 పంక్తులు, రెండవప్రక్క 25, మూడవప్రక్క 28, నాలుగవప్రక్క 29 పంక్తులు మొత్తము 105 పంక్తులున్నవి.

లిపి :-

ఈ శాసనమునందు ఆంధ్రదేశమున ముఖ్యముగా తెలంగాణ ప్రాంతమున పండ్రెండవ శతాబ్ది పూర్వార్థమున వాడుకలోనున్న తెలుగు కన్నడ లిపి వాడబడినది. శాసన లిపి మేడెయభట్టు బొల్లేపల్లి శాసనము[1] బొల్లయ నాయకుని పెద్దకడుమూరు శాసనముల[2] లిపిని పోలియున్నది. శాసనాక్షరము లచ్చటచ్చట స్పష్టాస్పష్టముగ నున్నవి కొన్నిచోట్ల ద్విత్వాక్షరములు క్రిందివరుసలోనికి వచ్చి ఆ రెండు వరుసలు కలిసియేయున్నట్లు కనిపించుచున్నవి అక్షరములు కొన్ని పెద్దవిగను, మరికొన్ని చిన్నవిగను చెక్కబడినవి ఈ శాసనశిల క్రిందివైపు వంకరగానున్నది.

భాష :-

ఈ శాసనము కన్నడభాషలో వేయింపబడినది. ఇందు మొదట చాళుక్యుల ప్రశస్తియున్నది. కల్యాణీ చాళుక్య ప్రభువగు రెండవ జగదేకమల్లుని కాలమున వేయించిన శాసనమిది శాసనమును కమ్మకులాభరణుడును ఆత్రేయ గోత్రీకుడును శ్రీ మద్దండనాయక మండపరసరు, శ్రీ పార్శ్వేశ్వర దేవర నిత్యనివేద్యమునకు భూమిని దానిమిచ్చు సందర్భమున వేయించెను. ఈ శాసనమున వరుసగా చాళుక్యచక్రవర్తి రెండవ జగదేకమల్లుడు, మహా మండలేశ్వర కాకతిప్రోలరాజు, సబ్బిసవదొర రేపోల్లకురువరసరు, శ్రీ మద్దండనాయక మండపరసరు పేర్కొనబడినారు. వీరు వరుసగా ఒకరికొకరు సామంతులు.

రెండవ జగదేకమల్లుని సామంతుడు కాకతి ప్రోలరాజు, మహామండలేశ్వరుడు, ప్రోలరాజు సామంతుడు మహాసామంతుడైన రేపోల్ల కుఱువరసరు, అతని దండనాయకుడు మండపరసరు, శనిగరం ప్రాంత పాలకుడు, శనిగరం సబ్బిసాయర మండలములోని భాగము, ఈ సబ్బినాట అనేక సామంతులు, సామంతాధిపులు మహాసామంతాధిపులు ఉండిరి. అందు శనిగరం ప్రాంతపాలకుడు మహాసామంతాధిపతి. శాసనారంభమున శ్లోకములు లేవు మూడవప్రక్క 25వ పంక్తినుండి వ్యాసగీతాశ్లోకము లారంభమై నాలుగవప్రక్క 22వ పంక్తి వరకున్నవి. శాసనాంతమున కన్నడ వచనమున్నది.

---

1. భారతి-మార్చి 1969.
2. తెలంగాణ శాసనములు. vol ii క. దా. శా. నం. 36

శాసనమున భాషావిశేషములు, ప్రాచీన శాసనములలోవలెనున్నవి, ఇందు 'ఱ' వాడబడి నది. ప్రవర్ధమానబదులు-ప్రవర్ద్ఱమాన; ఆచంద్రార్క-ఆచంద్రార్కఱ ఆదులు కనిపించుచున్నవి. ఆంధ్ర కర్ణాటభాషల కొకేలిపి ఈ కాలమున వాడబడినది. ప్రోలరాజు ఇతర శాసనములలోనిభాష వలె ఈ శాసనభాషయున్నది. సంస్కృతపదములు ఎక్కువగానున్న ఈ శాసనమున ఒక్కొక్క మండలాధీశుని బిరుదములు తెలుపబడినవి. ఈశాసనమువలన మహాసామంతాధిపతి ఆతని దండనాయ కుని పేళ్లు తెలియుచున్నవి

**శాసన విషయము :-**

ఈ శాసనమును మహాసామంతాధిపతి మండపరసరు వేయించెను. శాసనమున కల్యాణీ చాళుక్యప్రభువగు రెండవ జగదేకమల్లుడు, అతని సామంతుడు మహామండలేశ్వరుడును ఐన కాకతి ప్రోలరాజు మొదట పేర్కొనబడినారు. ప్రోలరాజు తరువాత సౌదర రేపోల్ల కుబువసర-అతని పాదపద్మోపజీవి మండపరసరు పేర్కొనబడినారు. మండపరసరు కమ్మకులాభరణుడు. శ్రీ పార్థేఱ శ్వరదేవరకు నిత్యనైవేద్యములకు శకసంవత్సరము 1071-శుక్లచైత్ర శుద్ధ 15 గురువారము విష్ణు సంక్రాంతి వ్యతీపాత సోమ గ్రహణ నిమిత్తమున భూమిగానుగ దానమిచ్చినట్లు శాసనమున వ్రాయ బడినది. ఈ శాసనమున రెండవ జగదేకమల్లుడు "స్వస్తిసమస్త భువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహా రాజాధిరాజపరమేశ్వర పరమభట్టారక సత్యాగ్రశ్రయకులతిలక చాళుక్యాభరణ"అని వర్ణింపబడినాడు.

కాకతి ప్రోలరాజు-"తత్పాదపద్మోపజీవిత సమధిగత పంచమహాశబ్ద మహా మండలేశ్వర నన్మ కుండాపుర వరేశ్వర పరమమాహేశ్వర పతి హితచరితం శ్రీమన్మహా మండలేశ్వర కాకతీయ ప్రోల రసర" అనియు, సబ్బి సౌదర రేపోల్ల కుబువరసర "తత్పాదపద్మోపజీవిత సమస్తోపేత సమధి గత పంచ మహాశబ్ద మహాసామంత విజయలక్ష్మీకాంత కామనికామ నామాది సమస్త ప్రశస్తిసహితుడు" గాను, మండపరసరు "తత్పాదపద్మోప జీవిత సమస్తోపేతసమధిగత పంచమహాశబ్ద మహాసామంతాధి పతి మహాప్రచండదండనాయక వస్తుగుణ వస్తునాయక కమ్మకులాభరణ, ఆశ్రితదీనపోషణ సుజన పవిత్రయాశ్రేయగోత్ర" అని వర్ణింపబడినారు. శ్రీ మండపరసరు శ్రీపార్థేఱశ్వరదేవరకు దాన మిచ్చు సందర్భమున ఈ శాసనమును వేయించెను.

తోడెలిమ్యాదగ మేనూరు నేలమత్తురు-కసుకడి పదిమర్తులు, మనికతడు 10మర్తురులు, పురాదెనదెశ మన్నెరడు కొల్లచిత్తగాణ-శ్రీ చంద్రాభరణపండిత దేవత కాలుగడిగి ధారాపూర్వక ముగా దానమిచ్చెను. శాసనాంతమున దానఫలమునుతెలుపు శ్లోకములున్నవి. మూఁడవప్రక్క 25వ పంక్తినుండి దానశ్లోకము లారంభమై నాలుగవప్రక్క 22వ పంక్తితో పూర్తియగుచున్నవి. తరువాత ఆరు పంక్తులు కన్నడ వచనమున్నది. ఇంతటితో శాసనము ముగిసినది. శాసనము మండ పరసరు వేయించినది. అతఁడు తనపై అధిపతుల నందరిని పేర్కొనినాడు.

**కాలనిర్ణయము :-**

ఈ శాసనమున చాళుక్య ప్రతాపచక్రవర్తి బిరుదాంచితుడగు రెండవ జగదేకమల్లుడు పేర్కొనబడినాడు. రెండవ జగదేకమల్లుడు క్రీ. శ. 1136-1155 వరకు కల్యాణీ చాళుక్య రాజ్యమును పాలించెను. కాకతి రెండవ ప్రోలరాజు పాలించిన కాలము క్రీ. శ. 1115-1158. ఈ శాసనము వేయించిన సంవత్సరము శ. సం. 1071, అనగా క్రీ. శ. 1149 అగుచున్నది. కాకతి ప్రోల రాజు, రెండవ జగదేకమల్లుని సామంతుడుగా పాలించు కాలమున సబ్బిమండలమున ప్రోలరాజు ఆధీనములోనున్న మహాసామంతులు కొన్ని ప్రాంతములను పాలించుచుండిరి. అందు రేపొల్లకుఋ వరసరు, అవని సామంతుడు శ్రీ మండపరుసరు ఆదిగాగలవారుండిరి. అందు శనిగరంప్రాంతపాలకుడు మహాసామంతాధిపతి కుప్పకులాభరణుడునైన మండపరుసరు, శ్రీ పార్థేశ్వరదేవర నిత్య నైవేద్యములకుగాను క్రీ. శ. 1149లో ఈ శాసనమును వేయించెను. శాసనమును మండపరసరు వేయించుచు చక్రవర్తిని, రాజును, తనపైనున్న మహాసామంతాధిపతిని పేర్కొనుటవలన ఇతని ప్రభుభక్తి ఎట్టిదో తెలియుచున్నది.



# శనిగరం శిలాశాసనము

## శాసనము - మొదటి ప్రక్క

1. స్వస్తి సమస్త భువ
2. నాశ్రియ శ్రీ
3. పృథ్వీవల్లభ మహా
4. రాజాధిరాజ పరమే
5. శ్వర పరమ భటారకం
6. సత్యాశ్రియ కుల
7. తిలకం చాళుక్యాభర
8. ణం శ్రీమజ్జగదేక మ
9. ల్ల దేవర విజయ
10. రాజ్యముత్తరోత్తరా
11. భివృద్ధి ప్రవర్ధణమా
12. న మాచంద్రార్కణ తా
13. రం సలుత్తమిరె త
14. త్పాదపత్మోపజీవి
15. త సమధిగత
16. పంచ మహాశబ్ద మ
17. హా మండలేశ్వర న
18. న్మ కుండాపురవరేశ్వ
19. ర పరమ మహేశ్వ
20. రం పతిహిత చరి
21. తం వినయ విభూషణం
22. శ్రీ మన్మహామండ
23. లేశ్వర కాతీకయ

రెండవ ప్రక్క

1. ప్రోళలరసర తత్పాద
2. పద్మోపజీవిత సమ
3. స్తోపేత సమధిగత
4. పంచమహాశబ్ద మ
5. హా సామంతం విజయ
6. లక్ష్మి కాంతం కామనీకామ
7. దేవ మ ణెవుగెకావనా
8. మాది సమస్త ప్రసస్తి సహి
9. తం శ్రీమతు సర్విస హ
10. శ్రీము సపదొరరేపొల్ల
11. కుఱువరసరం తత్పాద
12. పద్మోపజీవిత సమ
13. స్తోపేత సమధిగత పంచ
14. మహాశబ్ద మహాసామం
15. తాధిపతి మహా ప్రచం
16. డ దండనాయకంవస్తుగు
17. ణవస్తు నాయకంకమ్మ
18. కులాభరణం యాశ్రితదీ
19. న పోషణం సుజన పవి
20. త్రం యాత్రేయ గోత్రం శ్రీ
21. మద్దండనాయకం మండ
22. పరసరు శ్రీ పొత్తేజశ్వర
23. దేవరిగె నిత్యనివేద్య
24. క్కంనందాదివి గంత
25. షోధనరాహారక

మూడవ ప్రక్క

1. ప్పడదానక్కం శక వ
2. షఁ 1071 నెయ
3. శుక్ల సంవత్సరద చై
4. త్రశుద్ధ 15 యు గు
5. రువారంవిషు సంక్రాం
6. తివ్యతీపాతసోమ
7. గ్రహణది పుట్టవ్వఁ
8. కంనూ మెంబరాటదం
9. తొఱెయ మూడణద
10. నీరు నేలమత్తు రుంకి
11. సుకాడదమత్తఁరు ప
12. త్తుమనిక రదమత్త
13. రు పత్తుమంరాటన (దనే)
14. ల పన్నెరడు కొల్లబంత్త
15. ము(మ)ంగాణమునుం చం
16. ద్రాభరణ పండితదేవ
17. ర కాలు (లం) గడిగి ధారాపూ
18. వ్వఁకం మాడికొట్టరు॥
19. గోకర్ణ్ణఁవంశ నిర్ప
20. భూషణశీతగోమా
21. న్ ధామత్రిలోకభవసం
22. స్థితస ప్రభు (ణ్యా) భాగీరథీ
23. జలవిజూట శరణ్యదేవ
24. యాత్రేయ గోత్రనిధివ
25. ర్ధఁనుమండపాయ్యుఁన్॥
26. సామాన్యోయంధమ్మఁ
27. సేతున్నృపాణాంకా
28 లేకాలేపాలనీయోఽభ

నాలుగవ ప్రక్క-

1. పన్ని: స్వవ్వా నేతాన్ భావినః
2. పా ర్థివేం[ద్రాన్ భూయో
3. భూయోయాచతేరా
4. మభ:ద్ర:॥ బహుభిర్వ్వసు
5 ధాదత్తా రాజభిస్సగరాది
6. భిః యస్యయస్యయదాభూ
7. మి త్ర (స్త) స్య తస్యతదాఫలం॥
8. కపాలం నా (భిదా) నేనస్వమాం
9. సం సురయా సహ ఇంద్ర [వి (ప్ర)
10. చ్ఛుతిచాండాలః కిమమేధ్య
11. మతఃపరం (మ్) దేవి (వ) [బ్రాంహ్మణ
12. వి త్తంహియోహరేతి (త) మనీషి
13. ణ (*) పాదపాంసుగతః కల్ప
14. కోటి దుర్గతిసంస్థితే॥ కోటిప
15. యతాతెపన్నికోటితపో
16. దసపిపేదద్విజ (రం) కొదకోటి
17. యేనెకోటి తీర్థాది కోటి
18. మహాదీనదొళలిదనింతి
19. దనశిద॥ స్వదత్తాంపరదత్తంవా
20. యోహరేతివసుంధర షష్టి
21. వర్షసహస్రాణివిష్టాయాం
22. జాయతే[క్రిమి (*) చిత్తపె (వి) ళతి
23. ధర్మామనెత్తానుంకిదిషై
24. మిడుబగెదధునరసాప్తి
25. దమటుంబ సహితంయ (న్తి)
26. స్నదరొరవక్కెపుళ
27. పుళసుళొడురు
28. కొండొ-జనమగనెసు
29. — [illegible] —

# నల్లపయ్య నాయకరు రాచూరు శాసనము

**శాసనము**

మహబూబు నగర మండలము కల్వకుర్తి తాలూకాలోని రాచూరు గ్రామమున కేశవదేవర ఆలయ సమీపమున నున్న ఇంటి గోడప్రక్క ఈ శిలాశాసన మున్నది. పశ్చిమ చాళుక్యరాజగు మూడవ తైలపుని కాలమున ప్రెగ్గడ నల్లపయ్య నాయకరు రావితొలుతి శ్రీ మల్లికార్జున దేవరకు నందాదివియలు పెట్టించు సందర్భమును పురస్కరించుకొని వేయించిన శాసనమిది. రాచూరు కేశవదేవర ఆలయమున గల మల్లిసెట్టి వేయించిన శాసనములు, ఇదివరలో ప్రకటింపబడినవి[1].

**ఆకారాదికములు**

ఈ శాసన శిలా ఫలకము 3.5 అడుగులు. వెడల్పు 3 అడుగులు. శాసన శిలాఫలకము క్రింది భాగమున కొంత విఱిగిపోయినది శాసనము తెల్లరాతిపై చెక్కబడినది, రాయి గరుకుగా నుండుటవలనను, అక్షరములు లోతుగా చెక్కబడి యుండకుండుటవలనను, శాసన ప్రతిబింబము పేపరుపై తీసికొనుట కనుకూలముగ లేనందున. రెండు మూడు ఛాయా ప్రతిబింబములు తీయుట తటస్థించినది.

ఈ శాసన శిల గరుకుగానున్నది. శాసన భాగమున్నంతవరకైనను రాతిని నునుపుగా చెక్కి యుండలేదు. అంచులవరకు అక్షరములు చెక్కబడినవి, శాసనారంభమున శైవమత చిహ్నములైన చంద్రుడు, వృషభము, శివలింగము, నంది, సూర్యుని ప్రతిబింబములు చెక్కబడినవి.

ఈ శాసనము మొత్తము 17 పంక్తులలో వ్రాయబడినది కాని, 16, 17 పంక్తులు చదువుటకు వీలులేకుండనున్నవి. శాసన శిల క్రింది భాగము విఱిగిపోవుటవలన కొన్ని అక్షరములు సగము సగము మాత్రమే కనిపించు చున్నవి.

---

1. ఆంధ్ర పత్రిక — 'సౌమ్య' ఉగాది సంచిక మార్చి 1969.

ාన ఆంధ్ర దేశమున పండ్రెండవ శతాబ్దిలో వా
ది. తెలుగు కర్ణాట భాషల కొకే లిపి, కాకతీయ
రిపాలనా కాలమువరకు గల శాసనములో కనిపిం
ටికి తెలుగు లిపి మారిపోయినది. తెలుగుభాషా
పదములు విరివిగా నుపయోగింపబడినవి. రుద్రద
నేటి లిపికి సన్నిహితముగా మారినదనుటకు లొల్లె
ාపిని పరిశీలించిన మనకి విషయము స్పష్టమగును.
ముఁగ నుండి చదువుటకు వీలు లేకుండనున్నవి.

ා కన్నడ భాషలో వేయించబడినది. కల్యాణి చా
లికుల శాసనములు, కన్నడ భాషలో వేయింపః
ා శాసనములుకూడ కన్నడభాషలో వేయింప
సంస్కృత కర్ణాట భాషలలోను వేయింపబడినవి.
, చాళుక్య వంశ ప్రశస్తి, శాసనము వేయింపబడి
వేర్కొనబడినవి. 'ఱ' వాడబడినది. 'ర' కాలము
ාරమునకు బదులు, అనునాసికాక్షరములు ప్రవా
ప్రవర్ధమాన బదులు ప్రవర్ద్ఱమాన అనియు సం

కల్యాణి చాళుక్య ప్రభువగు మూడవ తైలపదే
వేయించినది. శాసనమున తైలపదేవునికి చాళుక్య
"సమస్త భువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ మహా ర
ාశ్రయ కుల తిలక చాళుక్యాభరణ శ్రీ మత్తైలప
ා రెండవ జగదేకమల్లుని సోదరుడు. మూడవ
ల్లి ఆరవ విక్రమాదిత్యుని మనుమడు. ఇతనికి త్రై
పరిపాలనా కాలము క్రీ. శ. 1155-1161;

ఈ శాసనమును తైలపదేవుని సమస్త ప్రధాని బణ్ణిగె యధికారియునగు, పెగ్గడ నల్ల పయ్య నాయకరు. రావితొలుతి శ్రీ మల్లికార్జున దేవరకు నన్దాదివియలు పెట్టించిన సందర్భమున వేయించెను. శాసనాంతమున "స్వదత్తాం పరదత్తాంవా" శ్లోకమున్నది.

**కాలనిర్ణయము**

ఈ శాసనము త్రైలోక్యమల్ల నూర్మాడి తైలపుని కాలమున చాళుక్య విక్రమవర్షము 80, ప్రమోదూత సంవత్సర ఫాల్గుణ బహుళ అమావాస్య బుధవారము విషు సంక్రాంతినాడు ఈయబడినది. కావున శాసనము వేయించిన సంవత్సరము క్రీ. శ. 1156.

కాకతి రెండవ ప్రోలరాజు పరిపాలనా కాలము క్రీ.శ. 1115-1158; శక సంవత్సరము 1070లో వేయింపబడిన సిరికొండ శాసనము[1] ప్రకారము కందూరి ఉదయన చోడమహారాజు, కల్యాణీ చాళుక్య ప్రభువగు, రెండవ జగదేకమల్లుని సామంతుడని తెలియుచున్నది. అనగా క్రీ. శ. 1148 వరకు ఉదయనచోడుడు జగదేకమల్లుని సామంతుడే. కాకతి రెండవ ప్రోలరాజు శ. సం. 1071 అనగా క్రీ. శ. 1149 వరకు రెండవ జగదేకమల్లుని సామంతుడుగా నున్నట్లు తెలియుచున్నది.[2]

కాకతి రెండవ ప్రోలరాజు, కందూరి ఉదయనచోడ మహారాజు ఇద్దరును, జగదేకమల్లుని సామంతులు. రెండవ జగదేకమల్లుని మరణానంతరము, కాకతి ప్రోలరాజు విజృంభించి, అనేక మాండలికుల జయించెను. కల్యాణీ చాళుక్య తైలపునోడించి, గౌరవముగా విడిచిపుచ్చెను. చాళుక్య సామ్రాజ్యాంతర్గతమై యున్న కొలనుపాక మండలమును తన సామ్రాజ్యమున చేర్చుకొనెను. అప్పటికి కందూరు మండలము తైలపుని స్వాధీనమందుండెను. ఉదయన చోడ మహారాజు కందూరు నాటిని తైలపుని సామంతునిగా పాలించుచుండెను. ఉదయనచోడుడు మహామండలేశ్వరుడు, కల్యాణీ చాళుక్యుల సామంతుడు. బలపరాక్రమసంపన్నుడు. చాళుక్య రాజ్యపు సరిహద్దులందుగల కందూరునాడును పాలించువాడు. కావున ప్రోలరాజు ఉదయన చోడుని చెలిమి గోరెను.

క్రీ. శ. 1157 నాటి రాచూరు శాసనమందును[3] క్రీ. శ. 1162 నాటి జడ్చర్ల శాసనమందును[4] ఉదయన చోడ మహారాజు స్వతంత్రుడుగా నున్నట్లు శాసనములలోని ప్రశస్తినిబట్టి తెలియుచున్నది. ఈ శాసనములలో శక సంవత్సరము వాడబడినది. ఉదయనచోడమహారాజు కల్యాణీ చాళుక్య ప్రభువునకుగాని, కాకతి ప్రోలరాజునకుగాని, రుద్రదేవునకుగాని సామంతుడై నట్లు పేర్కొనబడలేదు ఉదయనచోడునికి పూర్వులైన కందూరి చోడరాజుల శాసనములందు చాళుక్య విక్రమశకము వాడబడినది.

---

1. భారతి—ఫిబ్రవరి 1970
2. శనిగరం శిలాశాసనము
3. ఆంధ్ర పత్రిక-సౌమ్య ఉగాది సంచిక 1969
4. Hyderabad Archaeological Series No. 19 Mn 12 & 13

కాకతి ప్రోలరాజు, తైలపదేవుని, గోవిందరాజును జయించిన పిమ్మట, మంత్రకూట ప్రభువగు గుండరాజును. తన నగరమును ముట్టడింపవచ్చిన జగద్దేవునోడించిన పిదప వెలనాటిని జయింపదలచెను. వెలనాటి ప్రభువగు రెండవ కుళోత్తుంగ చోడునితో జరిగిన ఒకానొక యుద్ధమున కాకతి ప్రోలరాజు మరణించెను ఈ వెలనాటి రాజునకు 'కాకతి ప్రోల నిర్దహన' అను బిరుదమున్నట్లు దాక్షరామ శాసనము వలన తెలియుచున్నది.

ప్రోలరాజు మరణానంతరము కందూరి ఉదయనచోడ మహారాజు విజృంభించి, తన కుమారులగు భీమ, గోకర్ణుల ప్రోత్సాహమున స్వాతంత్ర్యము ప్రకటించి, విశాల సామ్రాజ్య నిర్మాణ ప్రయత్నమందుండెను. మూడవ తైలపుడు క్రీ. శ, 1161 ప్రాంతమున మరణింప ఉదయన చోడుని జ్యేష్ఠ కుమారుడు భీమదేవచోడుడు కల్యాణీ రాజ్యభాగము లాక్రమించి, కాకతి రుద్రదేవునిచే ఓడింపబడి, కాకతీయ సామంతుడుగా నుండ నంగీకరించెను.

మూడవ తైలపదేవుడు క్రీ. శ. 1155 ప్రాంతమున చాళుక్య సింహాసన మధిష్ఠించెను ఈ శాసనము చాళుక్య విక్రమవర్షము 80 ప్రమోదూతనామ సంవత్సరము ఫాల్గుణ బహుళ అమావాస్య బుధవారము విషు సంక్రాంతి దినమున నీయబడినది, కావున ఈ శాసన కాలము క్రీ. శ. 1156–1157; శక సంవత్సరము 1079 నాటికి కల్యాణీ చాళుక్యుల పరిపాలనము కందూరి మండలమున అంతరించినది.

రావితొలుతి గ్రామము పూర్వము ప్రసిద్ధమైన నగరము. మల్లిసెట్టి వేయించిన రాచూరు శాసనములందును 'రావి తొలుతి' పేర్కొనబడినది. రావి తొలుతి నేటి రాచూరు. ఇచట కల్యాణీ చాళుక్యుల పాలనములోను, కందూరి చోడులు పాలించునాడును 'సవదర' నివసించుచుండెనని తెలియుచున్నది. కోడూరి మున్నూటిని పాలించు 'సరవదర' రావి తొలితి పోతినాయకుని ప్రశంస శక సంవత్సరము 1079లో వేయింపబడిన రాచూరు శాసనమున నున్నది. కాకతి ప్రోలరాజు తైలపదేవుని క్రీ. శ. 1156 ఓడించియుండును. ఉదయన చోడమహారాజు తైలపదేవుని మాండలికునిగా నుండ నంగీకరింపక క్రీ. శ. 1157లో స్వతంత్రుడయ్యెను.

# నల్లపయ్యా నాయకరు రాచూరు శాసనము

( శాసనములు — శాసన ప్రతిబింబములు )

# నల్లపయ్య నాయంకరు రాచూరు శాసనము

## శాసనము - మూలము

1 స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీ పృథ్వీ వల్ల
2 భ మహారాజాధిరాజ పరమేశ్వర పరమభ
3 ట్టారక సత్యాశ్రయ కులతిలక చాలుక్యాభరణశ్రీ
4 మత్తైలపదేవర విజయరాజ్య ముత్తరోత్తరాభి వ్రి
5 ద్ధి ప్రవర్ద్ధమాన మాచంద్రార్కతారంబరం కల్యాణపురదనె
6 లె విడినోల్ సుఖసంకథా వినోదదిం రాజ్యం గెయుత్తమి
7 రె శ్రీమచ్చాళుక్య విక్రమవర్షద (80 ప్రమోదూత) సంవత్సరద ఫా
8 ల్గుణ బహుళ దమవాసె బుధవార విషుసంక్రాన్తి నిమి
9 త్తద శ్రీ మత్తైలప దేవన ధర్మవాగి సమస్త ప్రధాని ద
10 హెదెయ సాదబణ్ణిగెయధికారి పెగ్గడె నల్లపయ్య నా
11 యకరు రావితొఱతియ శ్రీ మల్లికార్జున దేవరిగె న
12 న్దా దివిగె గద్దె మఱయోకలుమ - క - తెనివెదవగా
13 దె-కు దొయనెన్దిగ సాళవవాగి-శ్రీ బల్లవరసర ధర్మ
14 వాగిబిట్టెయా। స్వదత్తం పరదత్తం వా యోహరేతివ
15 సుంధరా షష్టివర్ష సహస్రాణి విష్టాయాం జాయాతే
16 క్రిమి॥ ఈధర్మవ
17 రణాసియం

# తుంగపాడు శాసనము

ఆంధ్రప్రదేశ్‌లోని నల్లగొండ మండలము చారిత్రకముగా ప్రసిద్ధిజెందినది. ఈ మండలము ప్రాచీన కాలము నుండియు, వివిధ మతములకు, విభిన్న సంస్కృతికి, వివిధ రాజవంశీయుల పాలనకు నిలయమై అపూర్వమైన శోభతో విలసిల్లిన ప్రాచీనాంధ్ర మహా నగరములను కలిగి ఆంధ్రదేశ చరిత్రలో ననుపమానమైన స్థానమలంకరించినది జైన, బౌద్ధమతము లచటి రాజుల ఆశ్రయమును బొంది వర్ధిల్లినవి ఇచటి జైనవసదులు, బౌద్ధారామ విహారములు[2] పూర్వవైభవమును చాటుచున్నవి. శైవ, వైష్ణవ మతము లిచట వ్యాపించి, ప్రజల నుత్తేజపరచినవి. అసమాన శిల్పకళాశోభితము లైన బృహద్దాలయములు[3] లీ ప్రాంతమున నేటికిని నిలిచియున్నవి. ఆంధ్ర దేశచరిత్రకు సంబంధించినంత వర కీ ప్రాంతమును వరుసగా శాతవాహనులు, ఇక్ష్వాకులు, విష్ణు కుండినులు, పశ్చిమ చాళుక్యులు, కాకతీయులు, పద్మనాయకులు, గోలకొండ నవాబులు పాలించిరి. ఆ యా రాజవంశీయుల పరిపాలనా కాలమున వారి, వారి, సామంతులు, మాండలికులు, నల్లగొండ మండలములోని వివిధ ప్రాంతాలను పాలించిరి.

ఈ మండలమున వివిధ రాజవంశీయులకు, వారి వారి సామంత, మాండలికులకు సంబంధించిన శాసనము లసంఖ్యాకముగా నున్నవి. ఈ శాసనములలో గొన్ని చదువుటకు వీలుకానంత వరకు చెడిపోయినవి

**శాసనము**

ఈ శాసనము నల్లగొండ జిల్లా, మిర్యాలగూడ తాలూకా కేంద్రమునకు, ఆరుమైళ్ళ దూరమున మిర్యాలగూడ - నాగార్జునసాగర్ రోడ్డు పైనున్నట్టియు, నేడు శిథిలావస్థలో నున్నట్టియు నగు కోటప్రక్కన శిథిల దేవాలయము చెంతనున్నది. ఇది నల్లరాతిపై నాలుగు వైపుల చెక్కబడినది. తుంగపాడు, తుంగపాడు వాగుయొడ్డున నున్న గ్రామము. శిథిలమైన పట్టణము వాగునకు తూర్పుదిశలో నున్నది. తుంగపాడువాగు, పెద్ద దేవులపల్లి రిజర్వాయరు అలుగు (మత్తడి) మిగులు నీటివలన నేర్పడి, పవిత్రమైన కృష్ణానదిలో కలియుచున్నది.

**ఆకారాదికములు**

ఈ శాసనము నల్లరాతిపై నాలుగు వైపుల చెక్కబడినది. శాసనారంభమున సూర్య చంద్రుల చిహ్నములను, పానపట్టముతో గూడిన శివలింగమును, శాసనశిల రెండవప్రక్క నంది

---

1. కొలనుపాక, సిరికొండ.
2. ఇంద్రపాల నగరము, ఫణిగిరి, గాజులబండ, సిరికొండ,
3. పిల్లలమర్రి, పానగల్లు, ఇంద్రపాలనగరము, నాగులపాడు, గణపవరము, వాడపల్లి, చందుపట్ల.

విగ్రహమును చెక్కబడినవి. శాసనశిల నునుపుగా చెక్కబడినది. శాసనాక్షరములు పొంకముగా నుండి చక్కని వరుసలలోను చెక్కబడినవి. శాసనమున కాకతి రుద్రదేవుని ప్రశంసయున్నది. శాసనము మొదటి ప్రక్క 25 పంక్తులు, రెండవ ప్రక్క 21 పంక్తులు, మూడవ ప్రక్క 20 పంక్తులు మొత్తము 76 పంక్తులున్నవి. ఈ శాసనము శక సంవత్సరము 1102లో వేయింపబడినది. శక సంవత్సరము 1102. క్రీ. శ, 1180కి సమానము. శాసనము వేయించిన కాకతి రుద్రదేవ మహారాజు కాకతి రెండవ ప్రోలరాజు జ్యేష్ఠపుత్రుడు. మహావీరుడు ఆంధ్రదేశము నేకచ్ఛత్రాధిపత్యముగ పాలించినవాడు.

రుద్రదేవునికాలమున కాకతి సామ్రాజ్యము మహోన్నత స్థితియందుండెను. రుద్రదేవుడు వేయించిన ఈ శాసన విషయ మతి స్వల్పము. శాసన శిల రెండవప్రక్క 9వ పంక్తినుండి వ్యాస గీతా శ్లోకము లారంభమగుచున్నవి. ఇట్టి శ్లోకముల సంఖ్య ఆరు. శాసనశిల మూడవప్రక్క పూర్తిగా ఈ శ్లోకములున్నవి. నాలుగవ ప్రక్క శాసనము రక్షించినవారికి కలుగు ఫలమును, రక్షింపని వారికి కలుగు పాప ఫలమును, వచనములో చెప్పబడినది.

**భాష - లిపి :-**

ఈ శాసనము తెలుగు భాషలో వేయింపబడినది. శాసనమున 12వ శతాబ్ద్యంతమున ఆంధ్రదేశమున వాడుకలో నున్న తెలుగు కన్నడ లిపి వాడబడినది. ఇందలి అక్షరములు, గుండ్రటి అక్షరములు. ఆరు శ్లోకములు తప్ప తక్కిన శాసనమంతయు తెలుగు వచనములో నున్నది. శాసనము "స్వస్తిశ్రీ"తో నారంభమగుచున్నది. శాసనమున ద్విత్వాక్షరములు "ౘ" రకారపొల్లు వాడబడినవి. కొన్నిచోట్ల పూర్ణానుస్వారము వ్రాయబడినది. నేడు మనము వ్రాయు లిపికి, శాసనమున వ్రాయబడిన లిపికిని కొలది భేదము కనిపించుచున్నది. శాసనమున

| | | |
|---|---|---|
| శార్వరి | బదులు | శావ్వౘరి |
| వర్షములు | — | వవ్షౘములు |
| నాడు | — | నాండు |
| శ్రీ పర్వత | — | శ్రీ పవ్వౘత |
| తూర్పున | — | తూప్పౘన |
| ఆచంద్రార్క | — | ఆచంద్రాక్కౘ |
| షష్టిర్వర్ష | — | షష్టివ్వౘష్ఙ |
| బహుభిర్వసుధా | — | బహుభివ్వౘ సుధా |

ఆదులు వ్రాయబడినవి.

ఈ శాసనమందలి లిపి కాకతీయులనాటి శాసనముల లిపిని పోలియున్నది. ముఖ్యముగా పం|్రెండవ శతాబ్దిలో వెలసిన రు|ద్రదేవుని వేయి స్తంభాల గుడి శాసనము[1] పిల్లలమఱ్ఱి[2]. నాగులపాడు[3]. అన్నవరము[4] శాసనాక్షరములను పోలిన అక్షరము లీ శాసనమునందున్నవి.

శాసనము నాలుగవ |ప్రక్కనగల తెలుగుభాష నేడు మనము వాడుచున్న భాషకు సన్నిహితముగా నున్నది. శాసనమున కాకతి రు|ద్రదేవ మహారాజు, "స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర పరమ మహేశ్వర, పరహిత చరిత, వినయ విభూషణం, అనుమకొండ పురవరేశ్వర కాకతీయ రు|ద్రదేవ మహారాజులు" అని వర్ణింపబడినాడు.

ఈ శాసనమున కాకతి రాజన్యులలో అసమాన |ప్రతిభావంతుడును, కాకతిరాజ్య విస్తీర్ణమునకు గారకుడైన రు|ద్రదేవ మహారాజు వర్ణింపబడినాడు. ఇందు కాకతి రాజన్యులకుగల బిరుదావళి ఇతనికి చేర్చ బడినది. సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర, పరమమాహేశ్వర, పరహిత చరిత, వినయభూషణ, అది బిరుదములు ఇతనికి పూర్వము కాకతిరాజ్యమును పాలించిన రాజులు వేయించిన శాసనములందు |వ్రాయించినట్టివి. కాని శాసనకాలము నాటికి కాకతి రు|ద్రుడు సర్వస్వతం|త్రుడు. పశ్చిమ చాళుక్య రాజులకు సామంతుడు కాని, మహా మాండలికుడు కాని కాడు. కందూరినాడును పాలించు ఉదయనచోడమహారాజు, అతని పు|త్రులు, భీమగోకర్ణులును రు|ద్రదేవుని సామంతులైయుండిరి. వంశాచారము ననుసరించి |ప్రశస్తిచేర్చబడినదే కాని, న్యాయముగా, రు|ద్ర దేవునికి "మహామండలేశ్వరాది బిరుదముల అవసరములేదు సకల సామంత రాజ్యము లీతని స్వాధీనమై యుండుట, పశ్చిమ చాళుక్యరాజ్యము పతనమగుట, జూడ కాకతి రు|ద్రుడు సర్వాం|ధ్ర దేశమునకు చ|క్రవర్తిగా గుర్తింపబడినాడు. కాకతిరు|ద్రదేవ మహారాజు, |శ్రీ|పర్వతమునకు ఈశాన్య ద్వారమైన ఏలేశ్వర క్షే|త్రమునకు, అచటి ఆరాధ్య దైవమగు, ఏలేశ్వర మహాదేవర అంగభోగ ధూపదీప నైవేద్యములకు, స|త్రమునకు, (అంబలిపల్లి (అంబటిపల్లి) లోని పెద్ద కాలువ, (పడుబాటు నీళ్ళుపోవు కాలువ) తొరకల కాలువ, తూర్పు దనదపె|గ్గడ చెఱువు పడమట చెవ్వ చెఱువు, అడుగూడి, అస్థాన చతుస్సీమ సహితముగా అచం|ద్రార్కముగా దానము గావించెను. శాసన విషయము తరువాత దానఫలమును తెలుపు ఆరు శ్లోకములున్నవి. దానశాసనములను రక్షించిన వారికి కలుగు పుణ్యఫలము, దానశాసనమును పాటింపని వారికి కలుగు పాప ఫలము తెలుపబడినది.

**కాల నిర్ణయము**

ఈ శాసనమును కాకతి రు|ద్రదేవ మహారాజు శక సంవత్సరము 1102 శార్వరి సంవత్సర ఆషాఢ శుద్ధ పౌర్ణమి గురువారము నాడు వేయించెను శకసంవత్సరము 1162 |క్రీ. శ. 1180కి

---

1. తెలంగాణ శాసనములు Vol I కాకతీయ శాసనములు—No. 5
2. ,, ,, ,, ,, 7
3. ,, ,, ,, ,, 10
4. ,, ,, ,, ,, 12

సమానము. అప్పటికి రుద్రదేవమహారాజు కాకతి సింహాసనమధిష్ఠించి 22 సంవత్సరములు. రుద్రదేవ మహారాజు రెండవ ప్రోలరాజు ప్రథమపుత్రుడు ప్రోలరాజు క్రీ. శ. 1115-1158 వరకు పాలించెను. కాకతి రుద్రదేవుడు క్రీ. శ. 1158లో సింహాసన మధిష్ఠించి, అవిచ్ఛిన్నముగా నాంధ్ర దేశమును 37 సంవత్సరములు అనగా క్రీ. శ. 1195 వరకు పాలించెను. ఈ శాసనము రుద్రదేవుని 22వ విజయరాజ్య సంవత్సరమున వేయింపబడినది రుద్రదేవుడు అనుమకొండ శాసనమును, శక సంవత్సరము 1084 చిత్రభాను సంవత్సర మాఘశుద్ధ 13 వడ్డవారమునాడు తన పేర రుద్రేశ్వర మును, శ్రీ వాసుదేవర శ్రీ సూర్య దేవరాను, ప్రతిష్ఠ చేయించిన సందర్భమున వేయించెను. శక సంవత్సరము 1064 క్రీ. శ, 1162కు సమానము. అనగా హనుమకొండ శాసనము వేయించు కాలము నాటికే కాకతిరుద్రుడు కందూరి భీమదేవచోడమహారాజు నోడించి, అతని సోదరియగు పద్మావతీదేవిని వివాహమాడి యుండెను. రుద్రదేవుని నాలుగవ విజయరాజ్య సంవత్సరమున అనుమకొండ శాసనము వేయింపబడినది. అనుమకొండ శాసనమువలన రుద్రదేవుడు కందూరి ఉదయనచోడ, భీమదేవచోడుల నోడించి, పద్మావతిని వివాహమాడినట్లు తెలియుచున్నది. ఈ శాసనము వేయించుకాలము నాటికి రుద్రదేవు డాంధ్ర దేశమున కేకైక ప్రభువు. సమస్త సామంత మాండలిక ప్రభువులకు ప్రభువు.

# తంగపాడు శాసనము

శాసనము - మూలము

మొదటి ప్రక్క

1. స్వస్తిశ్రీ శక వర్ష
2. ములు 1102 యగు
3. శార్వ్వరి సంవత్సర ఆ
4. షాఢ శుద్ధ 15 గురు వా
5. రము నాండు స్వస్తి స
6. మధి గత పంచ మ
7. హా శబ్ద మహా మండ
8. లేశ్వర పరమ మా
9. హేశ్వర పరహిత చ
10. రిత వినయ విభూ
11. షణ అనుమకొండ
12. పురవరేశ్వర నామా
13. ది సమస్త ప్రశస్తి
14. సహితం శ్రీమన్మ
15. హా మండలేశ్వర కాక
16. తీయ రుద్రదేవ
17. మహారాజులు
18. శ్రీ పర్వ్వతము ఈ
19. శాన్య ద్వార శ్రీ యే
20. లేశ్వర మహాదేవర
21. కు అంగ భోగ రంగ
22. భోగ ధూప దీప ని
23. వేద్యముల కూ సత్రా
24. నకూ అంబలి పలి
25. ప్రవిష్టము తికేపాటి

## రెండవ ప్రక్క

1. పెద్దకాల్వ పిన్నకాల్వ ప
2. డుం గాలువ తౌరకల
3. కాల్వాం దూప్పునాన దస
4. వె ప్రెగ్గడ చెఱ్వు పద్మట చె
5. ప్వ చెఱ్వు అడుగూడి ఆ
6. స్థాన చతుస్సీమ సహి
7. తమై ఆ చంద్రార్కస్థా
8. స్థాయిగా న్నిచ్చిన దత్తి.
9. స్వదత్తం పరదత్తం వా,
10. యోహరేత వసుంధ
11. రా షష్టిర్వష సహస్రా
12. ణి విష్టా యాం జాయతే
13. క్రిమి॥ స్వదత్తా ద్విగుణ
14. ం పుణ్యం పరదత్తాను
15. పాలనం పరదత్తా పహా
16. రేణ స్వ దత్తా నిష్ఫలం
17. భవేత్॥ బహుభిర్వ
18. సుధా సమ్యగ్రాజభి
19. ర్భాను పాలితా యెస్య
20. యెస్య యదా భూమి స్త
21. స్యతస్య తదా ఫలం॥

## మూడవ పత్రిక

1. మద్వంశ జాః పర మ
2. హీ పతి వంశ జావా
3 పాపా దపేత మనసో
4. భువి భావి భూపా
5. ః యే పాల యంతి మ
6. మ ధర్మ్మణా మిమం స
7. మ స్తంతేభ్యో మయా
8. విరచితాంజలి రేష మూ
9. ర్ధ్ని ణాః ॥ ఆదిత్య చంద్రావని
10. లో నలశ్చ ద్యౌ భూమి
11. రాపో హృదయం య యా
12. శ్చ అహశ్చ రాత్రిశ్చ యుభయేతి
13. సంధ్యా ధర్మాణాశ్చ జానాతి న
14. రస్య వి త్తం॥ సామాన్యో
15. యం ధర్మ్మణా సేతుర్ నృపా
16. ణం కాలే కాలే పాలనీయో
17. భవద్భిః సర్వాణ నేతాన్భావి
18. నః పార్థివా వేంద్రాన్భూయో
19. భూయో యాచతే రామ
20. చంద్రః॥

# నాలుగవ ప్రక్క

1. ఈ శాసనమునం గలం
2. త వట్టు నకు ఎడికు న
3. సి నాను ఎవ్వరేని విఘ్న
4. ము సేసినా దీన్కి యోవా
5. ము సేసికొన్న వారూ ను
6. గంగకత్తు వే ఇ నెన్మూ ఋ
7. గవిలం బొడ్చిన వారి గ
8. తికిం బోదురు వారణా
9. సి లోన బ్రాహ్మనిం జంపిన
10. వారి గతికిం బోదురు-

# ఇర్విన్ శాసనము

మహబూబునగర మండలము కల్వకుర్తి తాలూకాలోని ఇర్విన్ లేక ఇరువెంటి గ్రామమున కాకతి రుద్రమదేవి ఓరుగల్లు రాజధానిగా తెలుగు దేశమును పాలించుకాలమున, మహాసామంత వావిలాల రుద్రయరెడ్డి తమ అప్పరుద్రసానిగారికి పుణ్యముగా శ్రీ ఇంద్రేశ్వర పాత్ర భోగానకు, భూమిని దానమిచ్చు సందర్భమున వేయించిన శాసనమున్నది.

హైద్రాబాదు-కల్వకుర్తిరోడ్డుపైనున్న ఆమనగల్లు గ్రామము నుండి పదిమైళ్ళ దూరమున నున్న ఇర్విన్ గ్రామమువరకు జిల్లాపరిషత్తు రోడ్డు కలదు.

## ఇంద్రేశ్వరాలయము

ఇర్విన్ గ్రామమునంటి చిన్న ఏరు ప్రవహించుచున్నది. ఏటి యొడ్డున బ్రాహ్మణ పల్లి రోడ్డు కుడిప్రక్క శిథిల రూపముననున్న ఇంద్రేశ్వరాలయమున్నది. ఈ ఆలయ సమీపమున శిథిల దేవాలయ చిహ్నములు కనిపించుచున్నవి. నంది విగ్రహములు, శక్తి విగ్రహములు, మహానాగములు, చెక్కిన శిలా ఫలకములు. వీరభద్రుని విగ్రహములు విశేషముగ నున్నవి.

ఇంద్రేశ్వరాలయ గోపురము పడిపోయినది. గ్రామీణులు గర్భగుడి బాగుచేయించి ఒక గది కట్టించినారు. గ్రామ ప్రజలు ఇంద్రేశ్వరాలయమునకు వచ్చి పూజలు చేయుచుందురు. ప్రతి సంవత్సరము శివరాత్రి ఉత్సవము ఇచట జరుగును.

ఇంద్రేశ్వరాలయ శిథిల ముఖద్వారము ముందు ఎత్తైన నంది విగ్రహమున్నది. అది నల్ల సరపురాతితో నిర్మించినట్టిది. చూచుట కందముగ నున్నది.

ఇర్విన్ గ్రామమున అచ్చటచ్చట శిథిల రూపముననున్న శివాలయములు, హనుమదాలయములు, భైరవుని విగ్రహములు కనిపించుచున్నవి. ఈ శిథిల ప్రాంతమున పూర్వము ఇరువెంటి పట్టణముండి యుండును;

ఇరువెంటి గ్రామమునకు రెండుమైళ్ళ దూరమున గిరికొత్తపల్లి గ్రామమున్నది. ఇచట ఎత్తైన గోపురముగల చెన్నకేశవాలయమున్నది.

## శాసనము-అకారాదికములు

ఈ శాసనమును కాకతి రుద్రమ పాలించు కాలమున మహాసామంత చెఱకు ఇన్మడి బొల్లయరెడ్డిగారి వియ్యము మహాసామంత వావిలాల రుద్రయరెడ్డి తమ అప్ప రుద్రసానిగారికి పుణ్యముగా ఇంద్రేశ్వర దేవరకు భూమిదానమిచ్చు సందర్భమున వేయించెను శాసనము తెల్ల

రాతిపై చెక్కబడినది. శాసనశిల ఎత్తు నాలుగు అడుగుల మూడు అంగుళములు; వెడల్పు ఒక అడుగు ఒక అంగుళము

శాసనారంభమున సూర్యచంద్రుల ప్రతిమలును పానవట్టముతో కూడిన శివలింగము చెక్కబడి యున్నవి. ఇవి శైవమత చిహ్నములు. రెండవప్రక్క వృషభము, డాలు కత్తి చెక్కబడినవి. మూడవవైపు నంది చెక్కబడినది కాని శాసనము రెండవప్రక్కతోనే అంతమైనది. అది తెలుగు శాసనము. శాసనమున మొదటిప్రక్క 19 పంక్తులు, రెండవప్రక్క 16 పంక్తులు మొత్తము 35 పంక్తులున్నవి.

### లిపి

ఆంధ్రదేశమున 13వ శతాబ్దిలో వాడుకలోనున్న తెలుగు లిపి ఈ శాసనమున వాడబడినది శాసనాక్షరములు ఈ కాలమున వెలసిన కాకతీయుల ఇతర తెలుగు శాసనములలోని అక్షరములను పోలియున్నవి. ఆధునిక తెలుగు లిపికి సన్నిహితముగా ఈ శాసన లిపి ఉన్నది. శాసనారంభమున శుభప్రతిపాదకమైన "స్వస్తిశ్రీ" వ్రాయబడినది శాసనాంతమున మంగళమహా శ్రీ శ్రీ శ్రీ వ్రాయబడినది.

### భాష

శాసనమంతయు తెలుగుభాషలో వ్రాయబడినది. శాసనము చివర వ్యాస గీతా శ్లోకములుగాని, దానఫలమును తెలుపు శ్లోకములుగాని లేవు. చేయుచునుండగాను-బదులు సేయుచూనుండగాను అనియు, శకవర్షాలు-బదులు శకవషాణాలు అనియు; చెఱకు ఇన్మడి బదులు చిఱకుయన్మ అనియు వ్రాయబడినవి.

### శాసన విషయము

శ్రీమన్మహామండలేశ్వర కాకతీయరుద్రదేవ మహారాజు పృథ్వీరాజ్యము చేయుచున్న కాలమున శక సంవత్సరము 1173, ప్రజాపతి సంవత్సరము పుష్యబహుళ అష్టమీ శనివారము మకర సంక్రమణ కాలమున మహాసామంత చెఱకుయన్మ బొల్లయరెడ్డివారి వియ్యాము మహాసామంత వావిలాల రుద్రయరెడ్డి తమ అప్ప రుద్రసానిగారికి పుణ్యముగాను ఇరువెంటి ఇంద్రేశ్వర దేవర పాత్రభోగానకు కంభలంను కాల్వ సుఱాడ్ల కాల్వ క్రింద అడ్డాను, మడ్ల కాల్వనుపాతి కాను, కార్తిక వైశాఖాలు సూర్యచంద్రులు కలంతకాలము వృత్తిగా నిచ్చెను కార్తికవైశాఖాలు-అనగా కార్తిక వైశాఖమాసములందు వచ్చు పంటలని అర్థము. కార్తిక మాసమున వచ్చు పంటను వానాకాలపు పంట లేకా అబిపంట అందురు వైశాఖ మాసములో వచ్చు పంటను యాసంగి లేక వేసంగి, తాబీ పంట అందురు.

### శాసన కాలము

ఈ శాసనము శాలివాహన శకవర్షము 1173 ప్రజాపతి సంవత్సరము పుష్యబహుళ అష్టమీ శనివారము మకర సంక్రమణ కాలమున వేయింపబడినది. శక సంవత్సరము 1173పుష్యబహుళ అష్టమీ శనివారము మకర సంక్రాంతి క్రీ. శ. 1252 జనవరి 5 వ తేదీకి సమానమగును.

కాకతి గణపతిదేవ మహారాజు జీవించియున్నప్పుడే రుద్రమదేవి రాజ్యభారము వహించి యుండును. క్రీ.శ. 1250 ప్రాంతము నుండి రుద్రమదేవి, రుద్రదేవ మహారాజను పేర రాజ్యమేలు చుండెనని భావించవచ్చును. రుద్రమదేవి సామంతులుగా, చెఱకు వావిలాల వంశీయులు, వ్యవహరించినారు. అమరాబాదు ప్రాంతము చెఱకు యిన్మడి వంశపు రెడ్ల ఆధీనమందుండెనని అచటి శాసనములవలన తెలియుచున్నది. రుద్రమదేవి పాలించునాటికి కందూరిచోడవంశ మంతరించినది. వర్ధమానపురము రాజధానిగా కందూరినాడును గోనవంశీయులు పాలించుచుండిరి. చెఱకువంశీయులు, వావిలాల వంశీయులు, గోనవంశీయుల బంధువర్గములోనివారు. వావిలాల వంశీయులగు రెడ్లకు చెఱకువంశపు రెడ్లతో సంబంధ బాంధవ్యములున్నట్లే శాసనమువలన తెలియుచున్నది. చెఱకు ఇన్మడి వంశీయులలో బొల్లయరెడ్డి ప్రసిద్ధుడు. ఇతని వంశీయుడగు చెఱకు ఇన్మడివిశ్వనాథదేవర ప్రశంస వేరొక శాసనమున[1] కనిపించుచున్నది.బొల్లయరెడ్డిని పేర్కొను రెండు శాసనములు[2] అమరాబాదులో లభించినవి. ఇందు శక సంవత్సరము 1186 రక్తాక్షి సంవత్సరమున చెఱకు యిన్మడి విశ్వనాథదేవర ఆయురారోగ్యాభివృద్ధికి "శ్రీసిద్ధ మహాలక్ష్మి ప్రతిష్ఠచేసి శుకదేవరలు కిత్తికుంట వెనుక కాలువ ఇంమ్మడిదేవర ఇచ్చినది. ఒక మర్తురు, నకరలపల్లి పడమటి వెనుక పాతికడు, ఆయూరి తూర్పున గణేశ్వర దేవరకు ఉత్తరాన వెలిపొలమునం పెద్ద గద్దంటి తూర్పు దెసగ కేతనేనికుంట వెనక ఒక మర్తురు—తాడికోలన పడమటి కాలవ మంచిరాజు పాదిక-మాదేవి-నేలగాన్గు పాట కాలువ పొలమునకు పాదిక-పెలయ మట్టి పడమటి వల్ల శంకరుడు (5) పందుము-దేవన పెద్దిచేని తూర్పున రేకులచేను ఖ 1. సుఖదేవరలు లక్ష్మిదేవికి త్రికాలముం పూజ ధూపదీప నివేద్యాలు నడుపుమని నారజియ కొడుకు అంనజియకు ఇచ్చిరి-"

శక సంవత్సరము 1208 లో ఇమ్మడి బొల్లయరెడ్డి ఆయురారోగ్యాభివృద్ధిని గోరి వేయించిన శాసనమున "అమరావతి యిమ్మడి దేవరకు గుడి వెనుక పాతిక భూమి నిచ్చెను పెద్ద బొల్లి శెట్టి కొడుకు మాదిశెట్టి ఈ పురమున వాకిలి చవికేను చేయించెను. ఇమ్మడిజెట్టి బొల్లయరెడ్డి వారికి రాజ్యాభివృద్ధిగాను యిమ్మడిదేవరకు పుణ్యముగాను ఇచ్చిన పతి చూరు గుండాల కాలువ నీరు నేలపాతిక. ఆ దిక్కుననే వెలివొలము అయిదుంబావు బొల్లయరెడ్డి ఇమ్మడిదేవరకు పుణ్యముగాను కీర్తికుంట వెనుక మల్లినాథదేవుని చేద పడుమట అర్ధనేల ఇచ్చెను." అని కలదు.

శక సంవత్సరము 1212లో వేయించిన శాసనమున "బొల్లయరెడ్డికి పుణ్యముగాను. ఆగటునాయుడు బొప్పెరిపోచె మైలారదేవరకు, సోగసిరికాలువ వృత్తిగా నిచ్చెను. కోమటి నరసింహశెట్టి పోచెంగారిచే ఈ కాలువ దేవరకిప్పించి పరచి చెల్లించెను. బొల్లయరెడ్డిగారు వీరి ఈవి తన ఈవిగా చెల్లించెను" అని యున్నది.

బొల్లయరెడ్డి సుమారు నలుబది సంవత్సరములు మహాసామంత పదవి నిర్వహించినట్లు శ.సం. 1173 నాటి ఇర్విన్, శ. సం. 1212 నాటి అమరాబాదు శాసనములనుబట్టి భావింపవచ్చును.

---

1. Hyderabad Archaeological Series No 19 Mn. 5
2. Hyderabad Archeological Series No. I9 Mn 4 & Mn. 6.

# ఇర్విన్ శాసనము

## మొదటి ప్రక్క

1. స్వస్తిశ్రీ జయ
2. శ్చా భ్యుదయాశ్చ
3. శక వర్షంబులు
4. 1173 అగు ప్రజా
5. పతి సంవత్సర పు
6. ష్య బహుళ 8 శని
7. వారము నాడు
8. మకర సంక్రమణ
9. కాలమందు స్వస్తి
10. శ్రీ మన్మహా మండ
11. లేశ్వర కాకతియ్య
12. రుద్రదేవ మహా
13. రాజులు పృథ్వీ
14. రాజ్యము సేయు
15. చూ నుండా (డం) గాను
16. శ్రీమన్మహాసామ
17. ంత చిఱకు యన్మ బో
18. ల్లయరెడ్డి వారి వి
19. య్యము.

## 251

## రెండవ ప్రక్క

1. శ్రీమన్మహా సామ
2. ంత వావిలాల రుద్ర
3. య రెడ్డివారు తమ
4. అప్ప రుద్రసాని గారిక్కి
5. ఋణ్యముగాను
6. ఇరువెంటి ఇంద్రే
7. శ్వర దేవర పాత్ర భో
8. గానకు కంబలంమ
9. కాల్వను సుబాద్ల కాల్వ
10. ను ఆడ్డాను—మద్లకా
11. ల్వను పాడికాను కా
12. ర్తీక వైశాఖాలు సూ
13. ర్యగ్రహణ చంద్రుల కల
14. ంత గాలమూ వి[illegible]
15. త్తిగా నిచ్చిరి మంగ
16. ళ మహా శ్రీశ్రీశ్రీ

# బొల్లేపల్లి శాసనము

ఈ శాసనము బొల్లేపల్లి ఆలయ ఆవరణములో రెండవ జగదేకమల్లుని కాలమున మేడెయభట్టు వేయించిన శిలా శాసనము దగ్గర నున్నది. ఈ శాసనము కాకతిరుద్రదేవ మహారాజు కాలమున శకవర్షాలు 1189 ప్రభవసంవత్సర ఆషాఢ శుద్ధ పాడ్యమి గురువారమునాడు వేయింప బడినది. కాకతి రుద్రమాంబ రుద్రదేవమహారాజను పేర రాజ్య పరిపాలనము గావించెను. రుద్ర మాంబ పరిపాలనా కాలము క్రీ. శ. 1258-1296; రెండవ జగదేకమల్లుని కాలపు మేడెయభట్టు శాసనము వెలసిన నూట యిరువది సంవత్సరములకీ శాసనము వేయింపబడినది. ఈ రెండు శాసన ములును ప్రభవ సంవత్సరములో నీయబడినవి.

ఈ శాసనము శాసన శిలకు నాలుగు వైపుల చెక్కబడినది. శాసనాక్షరము లున్నంత వరకు నునుపుగా చెక్కబడి మిగిలిన భాగము గరుకుగా నుంచబడినది. శాసనము మొదటి వైపు 20 పంక్తులును, రెండవ వైపు 20 పంక్తులును, మూడవ వైపు 31 పంక్తులును ఉన్నవి. మొత్తము శాసనము 93 పంక్తులలో నున్నది.

శాసన స్తంభము పొడవు 1.45 మీటర్లు, వెడల్పు 0.30 మీటరు. శాసనము మూడవ ప్రక్క పై భాగమున సూర్యచంద్రుల చిహ్నములున్నవి.

ఈ శాసనమున కొన్ని అక్షరములు పెద్దవిగను, మరికొన్ని చిన్నవిగను ఉన్నవి. ఆంధ్రదేశమున పదమూడవ శతాబ్ది ఉత్తరార్ధమున వాడుకలో నున్న తెలుగు లిపి ఈ శాసన మున వాడబడినది.

మేడెయభట్టు శాసనమున పేర్కొనబడిన మైలారదేవుడే ఈ శాసనమున పేర్కొన బడిన మల్లయ దేవుడు. మైలారదేవుని పేరు మల్లయదేవునిగా మారియుండవచ్చును. ఇందు పేర్కొనబడిన వాడపత్త్రి భువనగిరి తాలూకాలో నున్న వడపర్తి గ్రామము; స్వయంభూదేవాలయ మీ గ్రామమున నుండి యుండవచ్చును.

ఈ శాసనము బొల్లేపల్లి గ్రామమును పేర్కొనుచున్నది. మేడెయభట్టు శాసన లిపికిని ఈ శాసన లిపికిని ఎంతో వ్యత్యాసమున్నది. నూట ఇరువది సంవత్సరముల కాలములో లిపి తన పూర్వ స్వరూపమునే కోల్పోయినది. ఈ శాసనలిపి ఆధునిక తెలుగు లిపి కత్యంత సన్ని హితముగా నున్నది.

తేజాల పడిండ్ల రడ్లు బొల్లేపల్లి మల్లయదేవునికి, ఒక మత్తురు నీరు నేల ముప్ఫయి మత్తుల వెలిపొలము నిచ్చు సందర్భమున ఈ శాసనము వేయించినారు. శాసనాంతమున స్థానా పతుల పేళ్ళు తెలుపబడినవి. శాసనాంతమున వ్యాసగీతాదులు కూడ లేవు. శాసనము పూర్తిగా బిరుదములు, ప్రశస్తితో నిండిపోయినది. కాకతీయుల కాలపు శాసనము కావున, ఈ ప్రశస్తి గల రెడ్డి వంశీయులకు సంబంధించిన ఇతర శాసనములు లభించిన వారి చరిత్రను సమన్వయ పరచుకొనుటకు తోడ్పడును.

# బోల్లేపల్లి శాసనము

( శాసనమూలము - ప్రతిబింబములు )

# బొల్లేపల్లి శాసనము - తేజాల ఏడిండ్లరెడ్ల శాసనము

## శాసనము-మూలము

### మొదటి ప్రక్క

1. స్వస్తిశ్రీ విజ
2. యాభ్యుదయ
3. శ్చ శకవరుషంబు
4. లు 1189 అగు
5. నేటి ప్రభవ
6. సంవత్సర ఆ
7. షాఢ శుద్ధ పా
8. ద్యమి గురు
9. వారాన స్వ
10. స్తిశ్రీ మను
11. మహా మం
12. డలేశ్వర కాక
13. తియ్య రుద్ర దేవ
14. మహారాజులు
15. ఉత్తరోత్తరాభి వృ
16. ద్ధిగాం బ్రిథిపీ రా
17. జ్యంబు సేయుచు
18 నుండంగాను
19. స్వస్తి సమస్తగుణ
20. గణాశ్రయ వీర ల

# రెండవ ప్రక్క

1. లక్ష్మీ నివాస బ
2. ంధు జన చిం
3. తామణి। దీన
4. జన కల్పవృక్ష
5. భగవతీ వరప్ర
6. సాద। లబ్ధ వి
7. జయుండు
8. ను। సంగీత వి
9. ద్యా వినోద
10. చతురుదధి
11. వసుంధర అర్థి
12. బిరుద నాయక
13. బంపి దేవండు
14. ను। అశిముశ
15. ల కణయ కంప
16. ణ తోమర ము
17. శండి భిండివా
18. ల ముద్గర కార్ముక
19 శాస్త్ర విద్యా పా
20. రంగతుండు.

## మూడవ ప్రక్క

1. పరనారీ దూరుం
2. డును। పతిహిత
3. గ డుండును : స
4. మరసౌపణ్ణుండు
5. ను। విడినాయక
6. గజకేసరి। బిరు
7. ద నాయక జీమూ
8. త పవనుండును।
9. గడిగొట మల్లండు
10. ను। సమర జయా
11. ర్జ్జ నుండును। సత్య
12. హరిశ్చంద్రుండును
13. విభవ దేవేంద్రు
14. ండును। విద్వజ్జన
15. రక్షకుండును। ప
16. ర బల శిక్షకుండు
17. ను తురకరివర
18. తుండును ఉదా
19. ర కర్ణ్ణుండును శ్రీ
20. మద్ నిజవంశ వా
21. ర్ద్ధి వర్ద్ధన సుధా
22. కరుండును.

## నాలుగవ పక్క

1. వాడపత్త్రి శ్రీ స్వయ
2. oభూదేవ దివ్య శ్రీపా
3. ద పద్మా రాధ కుం
4. డును। లాడింగ ము
5. స్నిలు వడల సగన గరు
6. డ నామాది సమ
7. స్త ప్రశస్తి సహితు
8. లైన శ్రీమతు తేలు
9. ల ఏడిండ్ల రడ్లున్ను
10. బొల్లెపల్లి మల్లయ
11. దేవునికి పురము పు
12. ర్ల యతి అంతవట్టు నిచ్చి
13. తిమి ప్రవిత్రినీరు నేల
14. మఱుతురున్ను వెలి
15. వొలము ముఫయి
16. మఱుతురున్ను కాత్రీ
17. కవైశాఖాల సర్వ్వా మా
18. న్యముగా నిచ్చితిమి।
19. ఇంతవట్టు లేద
20. న్నందప్పు గంగకత్తి
21. కవిలంబొడ్చిన పాప
22. ము॥ రాజ్యాలు ఎన్ని చె
23. దిరినాను మళ్లి సెట్టి
24. కాసూరి మనుమం
25. డు మల్లిమల్లె సెట్టి
26. పూజారి జాతగొండ
27. పూజారి రేవపలుని
28. పురమునకు స్థాన ప
29. తులు దిరుగారాన పా
30. రుహాచతు పాపా
31. తుకులు॥

# తాడువాయి శాసనము

ఈ శాసనము నల్లగొండ మండలము, హుజూర్‌నగర్ తాలూకా తాడువాయి గ్రామములోని శ్రీ చెన్నమల్లికార్జున మహాలింగదేవాలయ ఆవరణములో నుండెను. దేవాలయము శిథిలము కాగా, చాలాకాలము క్రిందట కీ. శే. శ్రీ రాజా నాయని వేంకటరంగారావు బహద్దరు వారు, తమ నడిగూడెం కోటలోనికి శాసనము నతి జాగ్రత్తగా తరలించి భద్రపఱచినారు. నడిగూడెం రాజాగారి కోటలో గోడప్రక్క ఈ శాసన మున్నది. శాసనము నల్లరాతిపై మూడు వైపుల చెక్కబడినది. ఇందు మొదటి రెండు వైపుల మారయ గణపయ రెడ్డిగారు వేయించిన శాసనమును, మూడవ వైపు చెఱకు అన్నయ రెడ్డిగారు వేయించిన శాసనమును చెక్కబడినవి.

## ఆకారాదికములు

నల్లరాతిపై చెక్కబడిన ఈ శాసనము త్రవ్వించి ప్రక్కకు నిలిపి ప్రతిబింబములు తీయవలసి వచ్చినది. శాసనారంభమున సూర్యచంద్రుల చిహ్నములు చెక్కబడినవి. శాసన శిలపొడవు 3' 4"లు. వెడల్పు 1.3. ప్రక్కలు 1' 2"లు. శాసన శిఖరముఎత్తు 10"లు. ఇది నల్లసరపు రాతిపై చెక్కబడిన శాసనము మొదటిప్రక్క 21 పంక్తులు రెండవ ప్రక్క 2? పంక్తులు. రెండవ శాసనము మూడవప్రక్క చెక్కబడినది. ఇందు 24 పంక్తులు గలవు. మొదటి శాసనమున కాకతి ప్రతాపరుద్రదేవ మహారాజు పేర్కొనబడినాడు.

## లిపి

ఈ శాసన శిలపై మూడువైపుల చెక్కబడిన రెండు శాసనములు తెలుగు భాషలో వేయింపబడినవి. శాసన లిపి, పదమూడు, పదునాలుగు శతాబ్దులలో ఆంధ్రదేశమున, ముఖ్యముగా తెలంగాణ ప్రాంతమున వాడుకలో నున్న లిపిలో వ్రాయబడినది. శాసనాక్షరము లందముగ లేవు. పంక్తులు వంకరగా నున్నవి. కొన్ని యక్షరములు చిన్నవిగను, మరికొన్ని పెద్దవిగను చెక్కబడినవి. శాసనారంభమున "ఓం" గుర్తు కలదు. కొన్ని సంయుక్తాక్షరములను విడదీసి వ్రాయుట జరిగినది. శాసనాక్షరములు కాకతిరుద్రమనాటి బొల్లేపల్లి[1] శక సంవత్సరము 1187 నాటి శాంఙ్గపాణి దేవరాజుల పానుగల్లు[2]. శక సంత్సరము 1214 నాటి ప్రతాపకుమార రుద్రదేవ మహారాజును పేర్కొను గంగిదేవని గణపవరము[3] శాసనాక్షరములను పోలియున్నవి.

---

1. భారతి–మార్చి 1969
2. తెలంగాణ శాసనములు Vol.I కా. శా. సం. 34
3. తెలంగాణ శాసనములు Vol. I కా. శా. సం. 43

### భాష

ఆంధ్రదేశము న 13, 14 శతాబ్దులలో వాడుకలోనున్న తెలుగుభాష ఈ శాసనములందు వాడబడినది. శిల్పి అక్షరములను కడు జాగరూకతతో చెక్కినాడు. శాసనమున,

త్రైలోక్య బదులు త్రయలోక్య

వర్షంబులు బదులు వరుషంబులు

శార్వరి బదులు శావ్వారి

కార్తీక బదులు కాత్తీక

మల్లికార్జున బదులు మల్లికాజ్జున

వ్రాయబడినవి. చక్కని తెలుగుభాషలో వ్రాయబడిన ఈ శాసనములు కాకతీయుల నాటి తెలుగు భాషాస్వరూపమును తెలిసికొనుటకు తోడ్పడుచున్నవి.

### శాసనముల విషయము

శాసనారంభమున శివుని స్తుతించు శ్లోకము కలదు. శ్లోకము తరువాత "స్వస్తి "వచనముతో శాసన మారంభమగుచున్నది. శాసనము 1222లో శార్వరి సం కార్తీకశుద్ధ 15న వేయింపబడినది. ఇందు మహామండలేశ్వర కాకతియ్య ప్రతాప రుద్రదేవ మహారాజు వర్ణింపబడినాడు. ప్రతాపరుద్రదేవ మహారాజు పరిపాలనలో చెఱకు జగద్దాడు మారయ గణపయ్యా రెడ్డికి పుణ్యముగాను, తాడువాయి శ్రీ చెన్నమల్లికార్జున మహాలింగ దేవునికి అందలి ప్రజలు-కేతులెంక, ఆచంద్రార్కముగా తాడువాయి సర్వాయములో మాడ పదిరెండు-12 బవిసుల రీతి నొసంగిరి. ఈ మహాదేవునికి, నేలమట్టి గ్రామీణులు ఆ యూరి సిద్ధాయమందు ఈ పద్ధతి ప్రకార మొసంగిరి. అగసాల దేవోజు-ఏటిమడి, వనము ఈ మహాలింగదేవున కొసంగెను. శాసనాంతమున దానము పాటించిన వారికి కలుగు ఫలము "స్వదత్తా ద్విగుణం" అను శ్లోకమును చెప్పబడినవి.

### శాసన కాలము

ఈ శాసనము శక సంవత్సరము 1222, శార్వరి కాత్తీక శుద్ధ పౌర్ణమి నాడీయబడినది. శ. సం. 1222 క్రీ.శ. 1300 కు సమానము. కాకతి ప్రతాపరుద్రదేవ మహారాజు ఓరుగల్లు పట్టణమును రాజధానిగా ఆంధ్రదేశమును పాలించు కాలమున చెఱకు వంశీయులు, వారి బంధువులు, సామంతులు నేటి నల్లగొండ మండలములోని, దేవరకొండ, మిర్యాలగూడ, హుజూర్ నగర్ ప్రాంతములను పాలించుచుండిరని తెలియుచున్నది. శాసనమున కాకతి ప్రతాపరుద్రుడు, చెఱకు వంశీయులు, కేతులెంక ప్రశంస కలదు.

ఈ శాసన శిల మూడవవైపు చెక్కబడిన 24 పంక్తుల శాసనమును, శక సంవత్సర 1228 ప్లవంగ శ్రావణ శుద్ధ ద్వాదశి గురువారమున మహాసామంతుడైన చెఱకు జగద్దాడు అన్నయ రెడ్డి పాలించు కాలమున అతని క్షేమము గోరి చెన్నమల్లికార్జున దేవునికి, మామిడితోట, పందుము పొలము, అల్లుసూరిరెడ్డి దానమిచ్చు సందర్భమున వేయించెను. మొదటి శాసనము వెలసిన ఆరు సంవత్సరముల తరువాత ఈ శాసనము వేయింపబడినది. ఈ శాసనమున పేర్కొనబడిన చెఱకు జగద్దాడు అన్నయరెడ్డి మొదటి శాసనమున పేర్కొనబడిన చెఱకు జగద్దాడు మారయ గణపయ రెడ్డి కుమారుడు కావచ్చును. ఈ శాసనము శ. సం. 1228 నాటిది కావున శాసన కాలము క్రీ.శ. 1306. శాసనారంభమునగాని చివరగాని శ్లోకములు లేవు శాసనాంతమున ధర్మము ప్రతిపాలించిన వారికి అన్ని ధర్మముల ఫలము కలుగునని తెలుపబడినది. మొదటి శాసనమున పేర్కొనబడిన తాడువాయి, నేలమట్టి గ్రామములు హుజూర్‌నగర్ తాలూకాలో నున్నవి. హైద్రాబాదు విజయవాడ రోడ్డుపై మునగాల, బరాకత్‌గూడ మధ్యననున్న సమితి రోడునుండి తాడువాయి, నేలమట్టి గ్రామములకు వెళ్ళవచ్చును.

# తాడువాయి శాసనము

## శాసనము-మూలము

### మొదటి పక్క

1. ఓం. నమస్తుంగ శిర
2. శ్చుంబి చంద్ర చా
3. మర చారయేత్।
4. త్రయిలోక్య నగ
5. రారంభ మూల
6. స్తంభాయ శంభ
7. వే॥ స్వస్తిశ్రీ శకవ
8. రుషంబులు 1222
9. అగు నేంటి శార్వ్వరి
10. సంవత్సర కార్తిక
11. క శు 15 శు 1 స్వస్తి
12. శ్రీ మను మహా
13. మండలేశ్వర కా
14. కతియ్య ప్రతాప
15. రుద్రదేవ మ
16. హారాజులు ప్రి
17. థివీ రాజ్యము సే
18. యు చుఃడం
19. గాను॥ స్వస్తిశ్రీ మం
20. న్మహాసామంత చెఱు
21. కు జగద్దాడు మార

## రెండవ ప్రక్క

1. సు గణపయరడ్డి వారికి
2. ం ఋణ్యముగాను తా
3. డువాయ శ్రీ చెన్నమ
4. ల్లి రాజ్ఞణాన మహాలింగ
5. దేవునికి అంచుల స
6. మస్త ప్రజాను కేతుతె
7. ంకం గారుంన్ను అచం ద్రా
8. ర్కాణస్థాయిగాను అంగరంగ
9. భోగానకుం దాడువాయ
10. సర్వాఙ్గాయ మందున్ను గట్టైనా
11. ను మాధ బదిరెండేసి బవి
12. సుల లెక్కను ఇచ్చిరి॥
13. ఇ దేవునికి సేంమత్తి స
14. మస్త ప్రజాను ఆ యూ
15. రి సిద్ధాయ మంద్దుంన్ను
16. యు క్రమానన ఇచ్చిరి
17. అగసాల దేవోజు తా
18. ంబెట్ని యేటిమడి తా
19. డివసము ఇ దేవుని
20. శేటి పొలకు ఇచ్చెను
21. ఇ ధమ్మ ఎవ్వరేని ఇట్టు ప్ర
22. తిపాలింప వారికి
23. అనేక ధమ్మాణాలు సేసిన ఫ
24. లము॥ స్వదత్తా ద్విగుణ
25. ంపుణ్యం పరదత్తాను
26. పాలనం। పరదత్తాను
27. హారేణ స్వదత్తా నిష్ఫ
28. లం భవేత్॥

## మూడవ పత్రిక

1. ఓం స్వస్తిశ్రీ శకవర్షా
2. లు 1228 అగు నేం
3. టి ప్లవంగ సంవత్సర
4. శ్రావణ శుద్ధ 12 గురు...
5. వారాన స్వస్తి శ్రీ మన్మహా
6. సామంత చెఱకు జ
7. గదాడు అన్నయ్య రడ్డివా
8. రు రాజ్యము సేయు
9. చుండంగాను చెన్నమల్లి
10. కార్జునా దేవునికి ఆచం
11. ద్రార్కా స్థాయిగాను అన్నయ
12. రెడికి రంగనాథ-ఎంగా
13. రిత్రవిత్తి పందుముం దలి
14. వొలము గొని ఇచ్చి ప్ర
15. తిపత్రము గార గొ
16. న్న చోనకె ఎమలలోని ప
17. ందుమును న 10 అందు
18. లోని మా-మిడి తోం
19. టను ఆచంద్రార్కా స్థాయి
20. గాను అల్లుసూరిరెడ్డి ఇ
21. చ్చెను॥ ఇ ధర్మ్మకాం
22. ప్రతిపాలించిన వారికి
23. సర్వ్వకామైన ధర్మ్మాకా లూం సే
24. సినట్టి ఫలం॥

# దుప్పల్లి శాసనము

**శాసనము :-**

నల్లగొండ మండలము రామన్నపేట తాలూకా దుప్పల్లి గ్రామమున శ్రీ కిసర వేంకట రామా రెడ్డిగారి ఇంటి ఆవరణములో ఈ శాసన మున్నది. ఇది నల్లసరపురాతిపై నాలుగు వైపుల చెక్కబడిన తెలుగు శాసనము. కాకతి ప్రతాపరుద్ర దేవ మహారాజు కాలమున వేయింపబడిన శాసనమిది దుప్పల్లి మూసీనదీ తీరముననున్న గ్రామము. వలిగొండ గ్రామము నుండి తొర్రూరు సర్వీసులో దుప్పల్లి గ్రామము చేరవచ్చును

మూసీనది తీరమున శిథిలమైన దేవాలయము లున్నవి. శిథిలరూపమున నున్న దుప్పల్లి గ్రామము మూసీనది నానుకొనియే యున్నది. ఇప్పటి దుప్పల్లి మూసీనదికి రెండు ఫర్లాంగుల దూరములో నున్నది. మూసీనది తీరమున పురాతనమైన దేవాలయములు, నగరములు, గ్రామములు, శిథిలరూపమున కనిపించు చున్నవి. సంగం, ఇంద్రపురి, వల్లిగొండ, వేములకొండ, లక్ష్మాపురం, దుప్పల్లి, నాగులబండ, సూరారం, మున్నగునవి శిథిలనగరములు, మూసీనది తీరమున నున్నట్టివి. రామన్నపేట తాలూకాలోనివి.

ఈ శాసనము మూసీనది తీరమున శిథిల శివాలయము చెంత భూమిలో పూడియుండెను మూసీనది నుండి, దుప్పల్లి చెఱువులోనికి నీటి కాలువ తీయించుచుండ ఈ శాసనము బయల్పడినది. శ్రీ కిసర వేంకట రామా రెడ్డిగారు శాసన శిలను భద్రముగా అచటి నుండి తరలించి, తమ ఇంటి ఆవరణములో పాతించిరి. శాసనము మొదటి ప్రక్క, అవు, లేగ, చిహ్నము ను, పానవట్టముతో గూడిన శివలింగము ను చెక్కబడినవి. శాసన శిల ఎత్తు 5', 8"; వెడల్పు 1'. 2"; 2 4 వైపుల 11 5" లు కలదు. శాసనము మొదటి ప్రక్క 16 పంక్తులు రెండవ ప్రక్క 16 పంక్తులు మూడవ ప్రక్క 21 పంక్తులు, నాలుగవ ప్రక్క 26 పంక్తులు మొత్తము 79 పంక్తులుగల శాసనమిది.

**లిపి**

ఆంధ్రదేశమున, 13, 14 శతాబ్దముల లో వాడుకలో నున్న తెలుగు లిపి ఈశాసనమున వాడబడినది. శాసనాక్షరములు మూడు ప్రక్కల ఒకే పరిమాణములోను, నాలుగవ ప్రక్క చిన్నవిగను చెక్కబడినవి. ఈశాసనములోని అక్షరములు, పెరూరు[1] దుద్దెడ[2] బొల్లేపల్లి[3] మల్లేపల్లి[4]

---

1 అప్రకటితము

2 అప్రకటితము

3 భారతి – మార్చి – 1969

4 భారతి – ఆగస్టు – 1970

శాసనాక్షరములను పోలియున్నవి. శాసనములోని కొన్ని పదములు, సం ‌‌_ముగా వ్రాయబడి నవి. శుద్ధ బదులు "శు" గురువారము బదులు "గు" కనిపించుచున్నవి. కొన్ని సంయుక్తాక్షర ములు విడగొట్టబడి వ్రాయబడినవి. శాసనములోని పంక్తులు చక్కని వరుసలలో నున్నవి.

**భాష**

ఈ శాసనమంతయు తెలుగు, శాసనము నాలుగవ ప్రక్క నాలుగవ పంక్తినుండి వ్యాసగీతా శ్లోకములు 17వ పంక్తివరకు వ్రాయబడినవి. ఇవి మూడు శ్లోకములు. 18వ పంక్తి నుండి శాసనాంతము అనగా 23వ పంక్తివరకుగల శాసనభాగము వచనములోనున్నది. ఇందు దాన మును విఘ్నముచేసిన వారికి గలుగు పాపము తెలుప బడినది.

ఇందు "ఱ" వాడబడినది "ఱ"కు పూర్వాక్షరము ద్విత్వముగా వ్రాయబడినది.

| | | |
|---|---|---|
| శకవర్ష | — | శకవరుష |
| సర్వమాన్యము | — | సవ్వఱమాన్యము |
| ధర్మసేతున్నృపాణాం | — | ధమ్మఱసేతున్నృపాణాం |
| పార్థివేంద్రాన్ | — | పాత్థిఱవేంద్రాన్ |
| షష్టిర్వర్ష | — | షష్టివ్వఱషఱ |

**శాసన విషయము**

ఈ శాసనమున కాకతి రెండవ ప్రతాపరుద్రుని ప్రశంసకలదు. శాసనారంభమున మహా మండలేశ్వరుడగు కాకతి ప్రతాపరుద్రదేవమహారాజు సుఖసంకథా వినోదంబుల పృధ్వీరాజ్యము చేయుచుండ శకవర్షము 1228 పరాభవ సంవత్సర ఆషాడ శుద్ధ పౌర్ణమి గురువారమునాడు దుప్పల్లి బొల్లమరాజు, 32 పాళ్ళును రంగయ రుద్రదేవుడు మూడు పాళ్ళును, నాయంకర మందు కాశ్మీర దేవరకు రంగభోగానకై అష్టాదశ ప్రజాను ఇరుగారుం పాఱునట్టి భూమిని సర్వ మాన్యముగా ధారవోసి యిచ్చిన విధము వర్ణింపబడినది.

పబ్బ సముద్రము వెనుక నేరెడచేను ముయ్యాడ్డాను, నాగుల తూమునను కుద్రుచేను మఱ్ఱురును, కాస్యని చెఱువు వెనుకను రావి చేను అడ్డాను, నారాయణ దేవర చెఱువు వెనుక తామరపడె చేను ముయ్యాడ్డాను మొత్తము నాలుగు మఱుతురులు అడ్డ దానమిచ్చిరి. తామరపడ చేనును ప్రతి క్షేత్రము సోమయకాలువ క్రింద ఇచ్చినట్లు శాసనమున నున్నది. దేవర భోగమునకు మాడలు పెట్టిరి. ఈ దానమునకు విఘ్నము చేసినవారు గంగ కఱుత గవిలలు బొడిచిన పాపానం బోవువారని వ్రాయబడినది. శాసనము నాలుగవ ప్రక్క 1. సామాన్యోయం ధమ్మఱ సేతున్నృఱ పాణాం 2. స్వదత్తా ద్విగుణం పుణ్యాం, 3. స్వదత్తం పరదత్తంవా, అను శ్లోకముల పిదప దానము విఘ్నము చేసిన కలుగు పాపఫలము తెలుపబడినది.

**కాల నిర్ణయము**

ఈ శాసనము కాకతి రెండవ ప్రతాపరుద్రుని పరిపాలనా కాలమున శక సంవత్సరము 1228 అనగా క్రీ. శ. 1306 పరాభవ సంవత్సర అషాఢ శుద పౌర్ణమి నాడీయబడినది.

దుప్పల్లి గ్రామము ఇందుపుకేల సీమలోనిది. కాకతి ప్రభువుల ప్రతినిధి ఇందుపుకేల సీమకు కేంద్రమైన ఇంద్రపాలనగరము నుండి పాలించుచుండెను. దుప్పల్లికి చేరువలోనున్న నాగులబండ, కూరెళ్ళ గ్రామములందు కాకతీయులకు సంబంధించిన శాసనము లున్నవి. అవి కాకతి రెండవ ప్రతాపరుద్రుని కాలమున వేయించినవే.

# దుప్పల్లి శాసనము

( శాసనమూలము - ప్రతిబింబములు )

# దుప్పలి శాసనము

## శాసనము - మూలము

### మొదటి ప్రక్క

1 స్వస్తిశ్రీ మన్మహామం
2 డలేశ్వర కాకతియ్య ప్ర
3 తాప రుద్రదేవ మ
4 హా రాజులు సుఖ
5 సంకథా వినోదం
6 బులంబ్రిథివి రాజ్య
7 ము సేయు చుం
8 డంగాను శకవరు
9 షంబులు 1228
10 అగు పరాభవ సంవ
11 త్సర ఆషాఢ శు 15 గు
12 దుప్పల్లి బొల్లమరాజు
13 ముప్పదియ ఒకపాలా
14 ను రంగయరుద్ర దేవం
15 డు మూండు పొల్లాను
16 నాయంకణము ఎలు

## రెండవ ప్రశ్న

1 తాండి ఆ కాశ్మీర దే
2 వరకు రంగ భోగా
3 నకై అష్టాదశ ప్రజా
4 ను పిలిచి ఇరుగాలి
5 ముం బాటకు స
6 వ్యాజ మాన్యముగా
7 ను ధార వోసిన దే
8 ను పబ్బ సముద్ర
9 ము వెనుక నెరదచేను
10 ముయ్యర్దాను నా
11 గుల తూమునను
12 కుద్రు చేను మత్తు
13 ధుంను కాస్పానిచె
14 ఉవ్వ వెనకను రా
15 వి చేను అడ్డాను నా
16 రాయణ దేవరచేని

## మూడవ ప్రక్క

1. చెఱువు వెనక దామ
2. రపడె చేను ముయ్యే
3. డ్డాను వెరసి నాలుగు
4. మఱుతురున్ను అడ్డ ఇ
5. ందుఱను అనిగడ్డన ని
6. మిత్తమై తామరపడె
7. చేను ముంపెనేని ఆ చే
8. నికై ప్రతి క్షేత్రము సో
9. మయకాల్వమోర

10 వాతను జలగ వారె

11 మఱుతురు ఇచ్చ

12 వారు ఊడ్లను రొల్లి త

13 మకుం జేసెడి వారు

14 బడి పలచము మాడ

15 ను చిన్న ముంబాదిక

16 వల్లాను మాడం బాడి

17 క గెజదేవర భోగానకై

18 ఇచ్చిరి ఈ మేరకు ఎవ్వరు వి

19 ఘ్నము చేసినాను వారు

20 గంగకఱతం గవిలం బొ

21 డిచిన పాపానం బోవువారు

## నాలుగవ ప్రక్క

1 మఱిన్ని దేవ బ్రాహ్మణ
2 ను గమయ ద్రోహనా
3 ను పడువారు ఇవిట్టిది,
4 సామాన్యోయం ధర్మ్మ సే
5 తుర్నృ పాణాం కాలే కాలే
6 పాలనియ్యోభవద్భిఃస
7 ర్వ్వానేతాన్ భావినఃపార్థి
8 వేంద్రాన్ భూయోభూ
9 యోయాచతే రామచంద్రః
10 స్వదత్తా ద్విగుణం పుణ్యం
11 పరదత్తాను పాలనం
12 పూర్వ్వ దత్తాపహారణం
13 స్వదత్తం నిష్ఫలంభవేత్॥
14 స్వదత్తాం పరదత్తాం వా
15 యోహరేతి వసుంధరా
16 షష్టిర్వ్వర్షసహస్రాణి
17 విష్ఠాయాంజాయతే క్రిమిః
18 సమస్తమైన ప్రజాను కూడిజెతి
19 పడిపాలకై విడిచిన పన్నుపట్టి
20 చందములందున్ను విలిచి
21 కొనెడివారు మూడను వీ
22 సముసేసి పెట్టువారు ఈ
23 ధర్మ్మానకు విఘ్నముచేసి
24 న వారు ప్రజకు వెలికి వా
25 సియముభిన్నము సేసి
26 న పాపానం బోవువారు

# కందుకూరు శాసనము

**శాసనము**

ఈ శాసనము నల్లగొండ మండలము దేవరకొండ తాలూకాలోని కందుకూరు గ్రామమున శిథిలమైన జనార్దన దేవాలయము ప్రక్కనగల రాళ్ళ మధ్య నున్నది. కందుకూరు గ్రామమును. జనార్దన కందుకూరని యందురు. కందుకూరి అష్టాదశ ప్రజలు, కరణాలు సోమనాథ దేవర అంగరంగ భోగములకు మాన్యము నిచ్చు సందర్భమున ఈ శాసనమును వేయించినారు. కందుకూరు గ్రామము, దేవరకొండ-కల్వకుర్తి రోడ్డు పైనున్న పడమటిపల్లి గ్రామమునకు ఆరు మైళ్ళ దూరమున ఏటియొడ్డున నున్నది. కందుకూరు గ్రామము చేరుటకు పడమటిపల్లి నుండి సమితి రోడ్డు కలదు.

**ఆకారాదికములు**

ఈ శాసనశిల కందుకూరి గ్రామమున శిథిలమైన ఆలయము ప్రక్క రాళ్ళ క్రింద పూడియుండ త్రవ్వి తీయించి శాసన ప్రతిబింబముల తీసికొనుట జరిగినది. శాసనము నల్లరాతిపై మూడు వైపుల చెక్కబడినది, శాసన శిల పొడుపు మూడు అడుగుల పదునొకండంగుళములు. శాసన శిఖరము ఎత్తు 5"లు. శాసన శిల వెడల్పు 11.5"లు. శాసనము మొదటి ప్రక్క 20 పంక్తులు, రెండవ ప్రక్క 27- పంక్తులు, మూడవ ప్రక్క 24 పంక్తులు, మొత్తము 71 పంక్తులు కలది. శాసనశిల నాలుగవప్రక్క గరుకుగానున్నది. శాసనము కాకతి రెండవ ప్రతాపరుద్రుని పరిపాలనా కాలమున వేయింపబడినది. శాసనము మొదటి ప్రక్క శివలింగము, సూర్యచంద్రుల ప్రతిబింబములు, వృషభము చెక్కబడినవి.

**లిపి:-**

ఆంధ్రదేశమున పదునాలుగవ శతాబ్ది ప్రథమార్థమున వాడుకలో నున్న తెలుగు లిపి ఈ శాసనమున వాడబడినది. ఈ శాసనాక్షరములు గుండ్రముగా నుండి చక్కని వరుసలలో చెక్కబడినవి. శాసనాక్షరములు, పదునాలుగవ శతాబ్దమున వెలసిన శాసనములలోని అక్షరములను పోలియున్నవి ముఖ్యముగా ఆ కాలమున వెలసిన కాకతీయులకు, వారి సమకాలికులకు సంబంధించిన శాసనాక్షరములను పోలియున్నవి. అగా మోతుకురు[1] చేకుమాల[2] నాగులపాడు[3] మేళ్ళ చెఱువు[4], మాచేడు[5], శాసనాక్షరములను ఈ శాసనాక్షరములు పోలియున్నవి.

---

1 భారతి - ఆగస్టు 1970

2 తెలంగాణా శాసనములు Vol. కాకతీయ శాసనములు-No. 48

3 ,, ,, 47

4 ,, ,, 50

5 ,, ,, 49

శాసనాక్షరములు చిన్నవిగను, అందముగను ఉండి. చక్కని వరుసలలో చెక్కబడినవి. శాసనమును చెక్కిన శిల్పి కడు జాగురూకత వహించినను దీర్ఘాక్షరములకు బదులు హ్రస్వాక్షరములు, హ్రస్వాక్షరములకు బదులు దీర్ఘాక్షరములు చెక్కినాడు.

**భాష :**

శాసనమంతయు తెలుగు భాషలో వ్రాయబడినది. మూడవ ప్రక్క దానఫలమును తెలుపు శ్లోకములున్నవి. శాసనాంతమున ప్రతాపరుద్ర నృపతి ప్రశంసగల శ్లోకమున్నది. శాసనశిల మూడవప్రక్క పదు శ్లోకములున్నవి. ఈ శాసనమున రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి "కాకతి పురాధీశ్వర" అని పేర్కొనబడినాడు. ఇందు భాషా విశేషములు కనిపించవు. కాని శకవషాణాలు.

| | | |
|---|---|---|
| సర్వ | — | సవ్వణ |
| చంద్రార్క | — | చంద్రాకర్కణ |
| స్థాయి | — | స్థాఇ ఆదులు |

కనిపించుచున్నవి. చిహ్నాలు, మఱుతుర్లు, గొల్లవారు, అష్టాదశ ప్రజ, కరణాలు, కోమటివారు గానుగువారు, చాకలి, కుమ్మరి మున్నగు కులములవారు పేర్కొన బడుటవలన, వివిధ వృత్తులు నవలబించువారు, అష్టాదశ ప్రజలు గ్రామమున నివసించు చుండిరనియు, వారు దానధర్మములకు సంబంధించిన కార్య కలాపములందు పాల్గొను చుండురనియు తెలియుచున్నది.

**శాసన విషయము :-**

ఈ శాసనమున మొదట కాకతి ప్రతాపరుద్రదేవ మహారాజు ప్రశంస కలదు. ఇందు కాకతి ప్రతాపరుద్రుడు "సమస్త భువనాధీశ్వర స్వయంభుదేవర శ్రీ పాద పద్మారాధక పరబల సాధక కాకతి పురవరాధీశ్వర కాకతియ్య ప్రతాపరుద్రదేవ మహారాజులు ఓరగంటి మొదలి పట్టణంబుగాను, సుఖ సంకథా వినోదంబుల పృథ్వీ రాజ్యము సేయుచుండంగాను" అని వర్ణింపబడినాడు. ఈ శాసనము శక సంవత్సరము 1238 ఆనందనామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ పాడ్యమి గురువారము వాడియబడినది. కందుకూరి అష్టాదశ ప్రజ, కరణాలు, కందుకూరి చెఱువుల వెనుక కాలువల ఊటనీరు మఱుతురు చిన్నం, గొల్లవారు, కోమటివారు, గానుగవారు, కుమ్మరివారు, మున్నగువారు కలసి భూమిని దానమిచ్చినారు రుద్ర సముద్రము వెనుక వృత్తి నీరు నేల రెండు శార్లు పండునట్టి పొలము నిచ్చిరి. శాసనాంతమున "సామాన్యోయం ధర్మ సేతు నృపాణాం" అది శ్లోకములున్నవి.

**కాలనిర్ణయము :-**

ఈ శాసనము శక సంవత్సరము 1238 ఆనందనామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ పాడ్యమి గురువారము వాడియ బడినది. శక సంవత్సరము 1238 క్రీ. శ. 1316కు సమానము. కాకతి రెండవ ప్రతాపరుద్రుని కాలమున కందుకూరు గ్రామము వంగూరు విషయములో నుండెను, వంగూరు

మహబూబునగర మండలము కల్వకుర్తి తాలూకాలోనున్న గ్రామము. పూర్వము వంగూరు విషయముగా ప్రసిద్ధి చెందినది. కందుకూరు గ్రామము వంగూరునకు పదినైదు మైళ్ళ దూరములో నున్నది. ఈ ప్రాంతమున కాకతి రెండవ ప్రతాపరుద్రుని కాలపు శాసనము లచ్చటచ్చట కనిపించుచున్నని. అప్పారెడ్డిపల్లి, చరికొండ, అమరాబాదు, ఉమామహేశ్వరము మున్నగు ప్రాంతములందు కాకతీయులకు సంబంధించిన శాసనములున్నవి ఈ శాసనమున దానమీయబడినట్లు పేర్కొనబడిన భూములు, కందుకూరు చెఱువుల క్రిందనున్నట్టివి. కందుకూరు చెరువులలోనికి కందుకూరు వాగునుండి కాలువలద్వారా నీరువచ్చును. కాకతి ప్రతాపరుద్రుని కాలమున వివిధ ప్రాంతములను పాలించు సామంతులు, దండ నాయకులు, ప్రజలు మహారాజు క్షేమముగోరి దేవాలయములకు భూములను దాన మిచ్చుచుండిరి. కందుకూరి అష్టాదశ ప్రజలు సోమనాధ దేవాలయములకు భూములు దానమిచ్చు సందర్భమున ఈ శాసనమును వేయించి తన భక్తిని ప్రకటించుకొనినారు.



# కందుకూరు శిలా శాసనములు

## శాసము - మూలము

### మొదటి పక్క

1 స్వస్తిశ్రీ సమస్త భువనాధీశ్వ
2 ర స్వయంభు దేవ దివ్య శ్రీ పా
3 ద పద్మా రాధక అనుమకుండ పు
4 ర వరాధీశ్వర కాకతియ్య ప్రతాపరు
5 ద్ర దేవమహారాజులు ఓరుగల్లు
6 మొదలి పట్టనంబుగా సుఖ సంక
7 థా వినోదంబున పృథివి రాజ్యంబు
8 సేయుచుండంగాను స్వస్తిశ్రీ జా
9 త శాభ్యుదయ శకవరుషాలు
10 1238 అగునేంటి ఆనంద సంవత్స
11 ర జ్యేష్ఠ శుద్ధ 1 గు. కందుకూరి సో
12 మనాథ దేవర అంగరంగభోగానకు
13 కందుకూరి అష్టాదశ ప్రజను కరణా
14 లున్ను స్వామ్యనుమతానం పన్ను వి
15 డిచింది కందుకూరి చెఱువుల వెను
16 క కాలువల ఊట సవ్వకాయవ నీరునేల
17 లాను స్త్రానమాన్యాల సహితము
18 మఱుతురుని చిన్నం దేవ బ్రా
19 హ్మణ వృత్తులను మఱుతురు
20 ని చిన్నం మగ్గాన చిన్నం మాల మ

## రెండవ ప్రక్క

1 గానను అడ్డుగు గొల్లవారు
2 డాందునను చిన్నంబండు
3 దొరణితానమతన చిన్నం
4 కాదుడివారు ఇందె చిన్నం గా
5 ణ్గవారు గానుగన చిన్నం దేవ గార
6 గు ఒకటి బాకులవారు రెండు చిన్నా
7 లు నడ్డుగు కనుమరోజులు రెం
8 డు చిన్నాలు వడ్డగొడులు రెండు
9 చిన్నాలు మంగఱజులు రెండు చి
10 న్నాలు కుమ్మరి సారె చిన్నం చొప్పు
11 న పవిడ్లు రెండు చిన్నాలు నడ్డుగు
12 మాదిగులు రెండు చిన్నాలు నడ్డుగు
13 ఇడగులు రెండు చిన్నాలు నడ్డుగు
14 ఉప్పంచిన మున చిన్నం తూము
15 నాయం అమ్మకముబడి నెవ్వరు
16 హరి మడెముయ్యేడ అర్ధవట్టి
17 సుంకాలవల్ల రెండు మాడలు
18 తూమునాయం వారు రెండు
19 మాడలు చొప్పున రెండు చిన్నాలు
20 నడ్డుగు రుద్రసముద్రము న
21 వేక విప్రత్తి నీరువేల ఇరుగారుం
22 బారు మఱుతురు ఇంత వ
23 ట్టు ఆ చంద్రార్క్క స్థాయిగ ఇచ్చి
24 నది॥ అరిబడిని మాడలు సగ
25 వెలివొలాన ఆయబడిని
26 వన్య తూము అగసాలలు
27 కుం పమారకింతాం

## మూడవ ప్రక్క

1 సామాన్యోయం ధర్మ్మ సేతు
2 నృపాణాం కాలే కాలే పాలనీ
3 యో భవద్భి సర్వ్వా నేతాన్భావిన
4 పార్థివేంద్రాన్భూయోభూయో
5 యాచతే రామచంద్రః॥ షష్టివర్వ్వ
6 ష సహస్రాణి విజ్ఞశ్వాన శతానిచ
7 వసంతీ నరకే మారే దేవద్రవ్యాప
8 హారిణా । స్వదత్తాంద్విగుణం పు
9 ణ్యంపర దత్తానుపాలనం పరదత్తా
10 ప హారేణ స్వదత్తం నిష్ఫలంభవే
11 త్ । శా స్త్రి మనస్తుతి మషామ
12 స్త స్త్ర పాతకినామసి దేవద్రవ్య పద
13 ణన్మునిమ్రిది ఇకే దాచన । స్వద
14 త్తాంపర దత్తంవా యోహరే
15 తనరాధమ ప్రాపయత్యాదు నర
16 కే రత్న ఖ —న్నక వింశతి॥ షష్టివర్ష
17 సహస్రాణి స్వర్గేతిష్టతిపాలక
18 ఆక్షేప్తా చానుమంతా చ తాన్యే
19 వనరకే వసేత్ భూయాదయం
20 భువన మంగళ నామధేయరా
21 మశ్చ సంచాన భూవరపి సపన
22 య శ్రీ వీరరుద్ర నృపతే వనశం
23 క భూపాల్య చూడామణి కృతద్గా
24 మాంశారజానకోనా॥

# కన్నెకల్లు శాసనములు

నల్లగొండ జిల్లా మిర్యాలగూడ తాలూకాలోని కన్నెకల్లు గ్రామము కాకతి రాజుల కాలమున ప్రసిద్ధిగన్న పట్టణము. నేడది పెద్దవూర సమితిలో గ్రామ పంచాయతీ గల పెద్ద గ్రామము.

మిర్యాలగూడ—నాగార్జున సాగర్ రోడ్డుపై వెంపాడు ప్రక్కనుండి కన్నెకల్లు గ్రామము వరకు జిల్లా పరిషత్తు రోడ్డు కలదు. మిర్యాలగూడ నుండి కన్నెకల్లు గ్రామము చేరుటకు సర్వీసు కలదు.

కన్నెకల్లు గ్రామము ప్రాచీనమైనది. గ్రామము వెలుపల పెద్ద కోట యున్నది. కోటలో శిథిలమైన శివాలయము లున్నవి. కోట నానుకొని యున్న విశాలమైన ప్రాంతము పూర్వము పట్టణముగా వర్ధిల్లినట్లు తోచును. సుమారు అరమైలుదూరము వరకు శిథిల నగర చిహ్నములు కనిపించు చున్నవి ఆ ప్రాంతమందే నాలుగు శిథిల శివాలయము లున్నవి. ఆ ఆలయముల నంటియే కన్నెకల్లు తటాక మున్నది. తటాకములో కొన్ని శిథిల మంటపముల ఛాయలు, స్తంభములు కనిపించు చున్నవి. శిథిలాలయముల ప్రాంతమున చెక్కు చెదరక నిలిచియున్న విగ్రహములున్నవి.

నల్ల రాతితో మలచబడిన రెండు నందులు, శిల్పకళా శోభితములై యున్నవి. అందొకదానికి పదమూడు మువ్వలు గల పెద్దగంటపట్టెడ ఎంతో అందముగా మలచ బడినది. కొమ్ముల చుట్టు పట్టెడ త్రాడు కలిగి కాళ్ళు మడచి కుర్చొని. శివాలయమున కభిముఖముగా నిశ్చల ధ్యానముతో నున్నట్లు కనిపించు నంది విగ్రహము చూపరుల నాకర్షించుచు, పూర్వ వైభవమును చాటుటకు నిలిచినట్లు కనిపించు చున్నది.

రెండవ నంది విగ్రహము మొదటిదానికన్న ఎత్తైనది నల్ల రాతితో మలచ బడినది. ఈ నంది ముక్కు కుడి రంధ్రము, దాని పై భాగము విరిగిపోయినది. ఈ నందికి, 24, 24 మువ్వల కన్న పెద్దగా కనిపించు గంటలతో పెద్ద గంటగల పట్టెడ, ఒకే గంటగల పట్టెడ, మామూలు పట్టెడలు, కొమ్ముల క్రింద మూడు పట్టెడ, త్రాళ్లు మూపురము పై నుండి తోక క్రింది వరకు చక్కని నగిషీ పనిగల పట్టెడ త్రాడు, చూచుట కందముగ కనిపించు చున్నవి.

ఈ నందులకు చేరువలో ఒక శిలపై పడగ విప్పి తక్కిన శరీరమును మెలికలుగా చుట్టుకొని గంభీరముగ కనిపించు మహానాగము చెక్కబడిన శిలకు దగ్గరలో దేవీ విగ్రహము చెక్కబడిన శిల యున్నది. ఆలయములకు చేరువులో శిథిలమైన ప్రాంతములందు భిన్నమైనపాన వట్టములు, శివ లింగములు కనిపించు చున్నవి. శిథిలమైన ఒక శివాలయము చెంత నల్ల రాతిపై మహిషాసుర మర్దని చెక్కబడినది. ఈ విగ్రహము చూడ ముచ్చటగా నున్నది. ఇచట వీరగల్లు కలదు. ఈ విగ్రహము ప్రక్కన విల్లు ధరించి, దక్షిణ హస్తమున విల్లు, వామహస్తమున అమ్ము ధరించి యున్న మన్మథుడు, మన్మథుని నడుముపై చేయివేసి నిలిచిన రతిదేవి చెక్కబడిన రాయి క్రింద పడి యున్నది. ఈ విగ్రహములు సర్వాలంకార శోభితములై యున్నవి.

గ్రామీణులు ప్రతి సంవత్సరము శ్రావణ మాసమున పూజించి జాతరలు చేయు ముత్యాలమ్మ విగ్రహము చిన్నగుడిలో స్థాపింప బడినది. విగ్రహము నిండ పసుపు కుంకుమతో బొట్లు పెట్టబడినవి. విగ్రహము చూచుటకు, గంభీరముగ నున్నది.

వామహస్తమున త్రిశూలము దక్షిణహస్తమున పరశువు వంటి ఆయుధము ధరించి నిలిచిన దిగంబర విగ్రహము చెక్కబడిన శిల, ఈ ఆలయ శిథిలముల కనతి దూరములో పడియున్నది. ఒక శిథిల శివాలయము చెంత ఎత్తైన గణపతి విగ్రహ మున్నది. గణపతి విగ్రహము ఉదరము చుట్టు మహానాగము చుట్టిబడినది. గణపతి కోరలు పెరికి వేయబడినవి. నల్లరాతితో మలచబడిన ఈ విగ్రహము చక్కని చెక్కడములతో వివిధాలంకారములతో శోభాయమానముగా నున్నది.

యుద్ధవీరుడు వామహస్తమున డాలు దక్షిణ హస్తమున పొడవైన బల్లెము ధరించి నట్లు ఆ బల్లెము చివర శత్రు సైనికుడు వ్రేలాడుచున్నటును చిత్రింప బడిన వీరగలు శిథిలాలయములకు చేరువలో నున్నది.

సప్త మాతృకలు, వారి వాహనములు, ఆయుధములు చెక్కబడిన శిల వినాయకుని విగ్రహమునకు ఏబది గజముల దూరములో నున్నది.

కన్నెకల్లు గ్రామమున భూమిలో మూడు పాళ్ళు క్రుంగిపోయిన దేవాలయ మున్నది. ఇది విశాలమైన మంటపము కలిగి యున్నది. గర్భగుడి, అంతరాళ మంటపము, మంటపము, ముఖ మంటపము కలిగి చక్కని శిల్ప సంపదతో కూడియున్న స్తంభములు కల ఈ ఆలయము జీర్ణావస్థలో నున్నది. ఈ ఆలయము భూమిలో పూడుకపోయి యుండుట వలనను, ఆలయము కనిపించనంతగా చుట్టు పెంటకుప్పలు, రాళ్లు, తుమ్మచెట్లు ఉండుటవలనను, తెలిసినవారు చెప్పుటను బట్టి ఆలయమున్నట్లు గ్రహింప వీలగుచున్నది. ఈ దేవాలయము సైతము పశ్చిమ చాళుక్యుల కాలమున నిర్మించి నట్టిదే.

ఆలయ కుడ్యములపై చెక్కబడిన రెండు శాసనములలో మొదటి శాసనారంభమున సూర్య చంద్రుల చిహ్నములు, శివలింగము చెక్కబడినవి. ఇది తెలుగు శాసనము. పదునాలుగు పంక్తులలో నున్నది. దేవాలయము నిర్మించి, శివుని ప్రతిష్ఠించిన పిదప, దేవర అంగరంగ భోగ దూపదీప నైవేద్యాదులకు భూమి దానమొసంగుచు వేయించిన శాసనము కానరాలేదు. శిథిల ప్రాంతములందు త్రవ్వించిన కన్నెకల్లు గ్రామమున మరికొన్ని ముఖ్యమైన శాసనములు బయలు పడ వచ్చును.

మొదటి శాసనము పదునాలుగు పంక్తులలో తెలుగు వచనములో వ్రాయబడినది. ఈ శాసనము కాకతిరుద్ర కుమారునికి పుణ్యముగా వేయింపబడినది. సర్వార్థశాలిని మల్లినాథదేవరకు అంగరంగ భోగాదులకు ఎఱంబల్లి ఆడ్ల వలనాను, రెండుకార్లు పండునట్టి భూమిని దానమిచ్చు సందర్భమును పురస్కరించుకొని ఈ శాసనమును వేయించెను. ఈ శాసనమున పేర్కొనబడిన ఎఱ్ఱబల్లి - కన్నెకంటికి దగ్గరలో నున్న ఎఱ్ఱబల్లి గ్రామము నేటికిని కనిపించు చున్నది. ఈ శాసనము క్రోధన సంవత్సరములో వేయింప బడినది.

రెండవ శాసనము కూడ క్రోధన సంవత్సరములో వేయింప బడినదే. ఇది అరు పంక్తులలో నున్న శాసనము.

ఈ రెండు శాసనములే గాక, కన్నెకంటి గ్రామము వెలుపల ఆంపనేయస్వామి దేవాలయమున తెల్లరాతిపై రెండు వైపుల నొక తెలుగు శాసనము చెక్కింపబడినది. ఈ శాసన శిల రెండవ వైపుగల అక్షరములు చదువుటకు వీలుగాకుండ చెదిరి పోయినవి.

కన్నెకల్లు గ్రామము పశ్చిమ చాళుక్య ప్రభువులకు సామంతులుగానున్న వంశీయులకు రాజధానిగా నుండెను. కాకతీయుల కాలమందును ఈ గ్రామము ప్రసిద్ధి కెక్కినదే. కాకతి రాజన్యుల దండనాథులు కాని, సామంతులుగాని కన్నెకల్లు గ్రామమున నివసించి, చుట్టుప్రక్కల ప్రాంతములను పాలించుచు ప్రభువులకు విధేయులై యుండిరని భావింప వచ్చును.



# కన్నెకల్లు శాసనములు

## మొదటి శాసనము

1 క్రోధన సంవత్సర చైయి
2 త్రి శుద్ధ 1 గుఋవారానా
3 స్వస్తిశ్రీ మన్మహాః మండ లే
4 శ్వర కాకతి రుద్ర కుమారు
5 నికి పుణ్యముగాను స్వస్తి
6 శ్రీమతు సవ్వా౯ద్ధి౯శాలి
7 ను మల్లమంచి రాజుగారు
8 కన్నెకంటి మల్లినాథ దేవర
9 కు ఎఱుంబల్లి అడ పఖినామ
10 సులు సేసి యి గాఋపక గ
11 ంప సహితముగాను ఈ దేవ
12 ర అంగరఁగ భోగానకు ఈచు
18 వారు దీని లేదని వారి
14 కి దోశ(ష)ము

## రెండవ శాసనము

1 క్రోధన సంవత్సర చైత్ర శు 1 లు గురు
2 వారాన ఇతఅ ఎఱ్ఱగూరయ ళ
3 క్షుండు తాడ్లవల్ని మల్లి నా
4 త దేవర భోగానకుంమా
5 ద చెఱకు మారయకు బో
6 ల్లియకు పుణ్యాముగాను—

# ఆంజనేయస్వామి ఆలయ శాసనము

## మొదటి ప్రక్క

1 వికార్దిసంవత్సర చైత్ర శుద్ధ
2 పంచమి గురువారమున స్వస్తి
3 శ్రీ గణపేశ్వర దేవరకు మగు
4 —ఖంలయ కనవరి దేవుండు
5 నీరు నే
6 ం మఱుతురు 1 అమవల క
7 ఌవ నీరు సమఱుగ 1 వెలి పొ
8 లము ఖ 1 కంద…—
9 ....................
10 ....................

# శనిగరం శిలా శాసనము

**శాసనము**

శనిగరం చెఱువు అలుగు ప్రక్క చెఱువు కట్టమీద కట్ట మైసమ్మ గుడికి ఎదురుగా గోలకొండ నవాబగు అబ్దుల్లా కుతుబ్షా కాలమున వేయింపబడిన శిలాశాసన మున్నది. ఈ శాసనము శనిగరం పెద్ద చెఱువు పొర్లు మత్తడి లేక అలుగు కట్టించిన సందర్భమున వేయింపబడినది. శాసనము శకసంవత్సరము 1786 అనగా క్రీ. శ. 1864 లో వేయింప బడినట్లు బడినది. కాని గోలకొండ రాజ్యము క్రీ. శ. 1687 లో మొగలు సామ్రాజ్యమున చేర్చబడినది. శాసనము చెక్కిన శిల్పి శ. సం 1786 ను. 1586 కు బదులుగా చెక్కినట్లు భావింపవచ్చును. శ. సం. 1586 క్రీ శ 1664 కు సమానము. కావున శ సం. 1586 అబ్దుల్లా కుతుబ్షా పరి పాలించిన కాలమునకు సరిపోవు చున్నది.

బహమనీ సామ్రాజ్యము మహమూదు సుల్తానుతో విచ్ఛిన్నమై బీజపూరు, అహమ్మద్‌నగర్ గోలకొండ, బెరారు, బీదరు రాజ్యములుగా నేర్పడినది. క్రీ. శ. 1512లో మలిక్ కులీకుతుబుల్ ముల్క్-సుల్తాన్ కులీ కుతుబ్షా అను పేరుతో రాజై గోలకొండ రాజ్యమును, పాలించుచు, గజపతులనోడించి, రాచకొండ, దేవరకొండ దుర్గములను జయించెను. కాని విజయనగరాధీశుడగు శ్రీకృష్ణదేవరాయలచే నోడిపోయెను. ఇతని పరిపాలనా కాలము క్రీ. శ. 1512-1548. తరవాత ఇతని కుమారుడు జంషీద్ కుతుబ్షా క్రీ శ. 1548-1550 వరకు పాలించెను జంషీద్ కుతుబ్షా తరువాత సుభాన్ కుతుబ్షా రాజయ్యెను. కాని జంషీద్ కుతుబ్షా తమ్ముడును, సుభాన్ కుతుబ్షాకు పినతండ్రియు నగు ఇబ్రాహీం కుతుబ్షా విజయనగరమున కేగి అళియరామరాజు సహాయమున గోలకొండ రాజ్య మాక్రమించి క్రీ శ. 1550-1580 వరకు పాలించెను. ఇత డాంధ్ర భాషాభిమాని. తెలుగుకవులను పోషించెను. ప్రజాసౌకర్యము లేర్పఱచెను. తల్లికోట యుద్ధమున రామరాజు మరణింప ఇబ్రహీం కుతుబ్షా పరిసర రాజ్యములను జయించి గోలకొండ రాజ్యమును విస్తరింప జేసెను. ఇత డనేక పండితులను పోషించెను మసీదులను కట్టించెను.

ఇబ్రహీం కుతుబ్షా అనంతర మతని కుమారుడు మహమ్మద్ కులీ కుతుబ్షా రాజయ్యెను. ఇతడు రాయలసీమ తూర్పుభాగమును జయించెను. ఈ రాజు భాగ్యవతి అను ప్రియురాలి పేర భాగ్యనగరమును నిర్మించెను. భాగ్యనగరమే నేటి హైదరాబాదు నగరము. క్రీ. శ 1599 లో కులీ కుతుబ్షా తన కుమారుడగు హైదర్ పేర భాగ్యనగరమునకు హైదరాబాదు అను పేరు పెట్టెను ఇతడు చార్‌మీనార్ మక్కామసీదు మొదలగు కట్టడములను నిర్మించెను. ప్రజలకు నీటివసతి కల్పించెను

మహమ్మద్ కులీ కుతుబ్షా తరువాత అతని సోదరుని కుమారుడు మహమ్మద్ కుతుబ్షా గోలకొండ నవాబయ్యెను. ఇతని పరిపాలన కాలము క్రీ శ. 1611-1626 ఆటు పిమ్మట అబ్దుల్లా హుసేన్ కుతుబ్షా సుల్తానయ్యెను. ఇతడు క్రీ శ. 1626 లో రాజ్యమునకువచ్చి సుమారు నలుబది సంవత్సరములు గోలకొండ రాజ్యమును పాలించెను. నేటి ఆంధ్రప్రదేశ్ ప్రాంతమంతయు ఈ సుల్తాను ఆధీనమందుండెను. ఇతని మంత్రి రాజ్యతంత్రజ్ఞుడైన మీర్‌జుమ్లా. ఇతడు ఢిల్లీ చక్రవర్తుల కొలువులో నుండి దక్కను చేరి గోలకొండ రాజ్యమునకు మంత్రి యయ్యెను. కాని రాజుతో ఇతనికి సరిపడలేదు. ఔరంగజేబు కుమారునితో మీర్‌జుమ్లా కుట్రచేసి గోలకొండ రాజ్యమును మొగలుల వశముచేయ బూనెను. సమయము కనిపెట్టి ఔరంగజేబు దండయాత్ర గావించి గోలకొండనవాబు తనకు సామంతుడుగా నుండునట్లు చేసెను.

అబ్దుల్లా హుసేన్ కుతుబ్షా అనంతర మతని అల్లుడు అబుల్ హసన్ కుతుబ్షా రాజయ్యెను. కాని క్రీ. శ 1687 లో ఔరంగజేబు గోలకొండను ముట్టడించి జయించి మొగలు సామ్రాజ్యమున చేర్చెను. ఇంతటితో గోలకొండ రాజ్య మంతరించెను.

**శాసనము - ఆకారాదికములు**

శనిగరం చెఱువు కట్టమీద ఉన్న ఈ శాసనము పొడవు 4 అడుగులు, వెడల్పు ఒక అడుగు. శాసనము తెలుగు భాషలో వేయింపబడినది. కాని ఇందు ఉరుదూ పదము లెక్కువగా నున్నవి. గోలకొండ నవాబుల పరిపాలనకాలమున వెలసిన తెలుగు శాసనము లన్నింటిలోను ఉరుదూ పదములు, అన్యభాషా పదములు విశేషముగ నున్నవి శాసనము తెల్లరాతిపై చెక్కబడినది. శాసనాక్షరము లున్నంతవరకు శాసన శిల నునుపుగా చెక్కబడినది. శాసనము రెండు ప్రక్కల మాత్రమే చెక్కబడినది. శాసన శిల పైభాగమున 'శ్రీ' గుర్తును తరువాత అడ్డుగీతను చెక్కబడినవి. శనిగరం చెఱువు చాలా పెద్దది. ఈ చెఱువు క్రింద సుమారు 500 ఎకరముల భూమి సేద్యమగుచున్నది. మానేరు నదికి ఉపనదియైన పెద్దవాగు లేక శనిగరం వాగుపై ఈ చెఱువు నిర్మింప బడినది. చెఱువునిండిన పిదప నీరు పొర్లిపోవుటకు వీలుగా మత్తడి, లేక కతువ లేక అలుగు నిర్మింపబడినది శనిగరం చెఱువు పొర్లు మత్తడి, దేవాలయముల రాతితో నిర్మింప బడినది. చెరువు నిర్మించిన ప్రాంతమున ప్రాచీనదేవాలయము లుండెను. అవి శిథిలముకాగా, ఆ దేవాలయముల స్తంభములతోను, రాతితోను అలుగు నిర్మింపబడినది, ఆ ప్రాంతమున దేవాలయ శిథిల చిహ్నములున్నవి. చెఱువులో అలుగు దగ్గర శిథిల దేవాలయ చిహ్నములు కనిపించుచున్నవి, దేవాలయముల అడుగులు. పునాదులు, స్తంభములు కనిపించుచుండుట వలన ఆ ప్రాంతమున పూర్వము శనిగరంపట్టణ ముండియుండునని భావింపవచ్చును.

శాసనారంభమున సూర్యచంద్రుల చిహ్నములు చెక్కబడినవి. శాసనము 34 పంక్తులలో చెక్కబడినది. మొదటిప్రక్క 16 రెండవప్రక్క 18 పంక్తులును ఉన్నవి. తెలంగాణమున పెద్ద పెద్ద చెఱువులు నిర్మింపబడినచోట్లు పూర్వము ప్రసిద్ధిగాంచిన పుణ్యక్షేత్రములు, నగరములు, దేవాలయములు శిథిలములైన ప్రాంతములందు తటాకములు నిర్మింపబడినవి. ప్రసిద్ధమైన స్థలము లెల్లప్పుడు ప్రజాహిత కార్యముల కుపయోగపడుచుండును. తెలంగాణమున ఓరుగల్లు మండలమున నున్న ప్రాచీన తటాకములలో పాకాల, రామప్ప లక్నావరం, ధర్మసాగరం ముఖ్యమైనవి. చారిత్రక దృష్టితో చూచినను ఆ ప్రాంతములు ముఖ్యమైనవే. అట్లే నల్లగొండ మండలమున ఇంద్రపాలనగర శిథిల ప్రాథితమున ఆసఫ్ నహర్ రిజర్వాయరు, పానుగల్లు సమీపమున ఉదయ సముద్రము, ప్రొద్దుటూరు ప్రాంతమున సంగం కతువ పేర్కొనదగినవి. నాగార్జున సాగర్. శ్రీశైలము, పోచంపాడు ప్రాంతములు, చరిత్ర ప్రసిద్ధి గన్నట్టివే. ఈ శాసనమున్న ప్రాంతము పూర్వము మహా సామంతాధిపతులకు రాజధాని నగరముగ వర్ధిల్లి యుండును.

**లిపి:-**

ఈ శాసనమున వాడుకలో పదునేడవ శతాబ్ది ఉత్తరార్థమున తెలుగుదేశమున వాడుకలో నున్న లిపి వాడబడినది. నేటి తెలుగు లిపికి సన్నిహితముగానున్న ఈ శాసన లిపిలో 'ఙ' వాడ బడినది. అవసరము లేనిచోట్ల ద్విత్వాక్షరములు వ్రాయబడినవి. శాసనము చిన్నది. శాసన విషయముకూడ కొద్దిది ఈ క్రింది పదములు గమనింప దగినవి.

| | |
|---|---|
| శకవర్ష బదులు | — శకవషఙ |
| ప్లవంగ | — ప్లవంగ్గ |
| సంవత్సర | — సంవ్వత్సర |
| కట్టించిన | — కట్టించ్చిన |
| పొర్లు | — పొలుఙ |
| బ్రాహ్మణ | — బ్రాంహ్మణ |
| నడ్పించవలె | — నడ్పించ్చవలె |

**భాష :**

ఈ శాసనము తెలుగు భాషలో వేయింపబడినది. శాసనారంభమున గాని, శాసనాంతముగాని, వ్యాస గీతా శ్లోకములుగాని, స్తుతి శ్లోకములుగాని లేవు శాసనమున ఉరుదూ పదము లెక్కువగా నున్నవి. ఆయా పదముల అర్థములు క్రింద వ్రాయబడుచున్నవి.

1 హజరతి సులుతాను = హజరత్ సుల్తాన్
హజరత్ = ప్రభువుకునగాని గొప్పవానికిగాని చెప్పబడెడు బిరుదు
సుల్తాన్ = రాజు లేక ప్రభువు
2 అబ్దుల్లా కుతుబుశాహ = అబ్దుల్లా కుతుబ్షాహ = గోలకొండ నవాబు
3 ఫర్మాను = ఫర్మాన్. రాజాజ్ఞ
4 సైదుముజాఫరు = సైదు (సయ్యద్) ముజఫర్ = వ్యక్తి పేరు
5 సరిఖెలు = సర్కిల్ = సరిఖైల్ = ఇష్టుడు = అనుగు
6 శాహి = శాహ్ = షాహ్ = ప్రభువు
శాహి = గొప్ప
7 శెలవు = సెలవు = అజ్ఞ
8 మెహది బెహుహవలుదారు = ఒక సైనికోద్యోగి లేక కరగ్రాహి = ఆరక్షాధిపతి
9 దివాణం = న్యాయస్థానము లేక ప్రభుత్వము
10 శిపాయి = సిపాయి = సైనికుడు
11 హొన్నులు = బంగారు నాణెము
12 స్న = సన్ = సంవత్సరము
13 అలఫు = వెయ్యి

**శాసన విషయము :**

ఈ శాసనము శనిగరం పెద్దచెరువు పొర్లు మత్తడి కట్టించిన సందర్భమున వేయింపబడినది, శాసనము క్రీ. శ. సం. 1586 ప్లవంగ సంవత్సర శ్రావణ మాసమున వేయబడినది. హజరత్ సుల్తాను అబ్దుల్లా కుతుబ్షా ఫర్మాను సెలవున సైదు ముజాఫరు శనిగరం చెరువుకట్టమీద శాసన శిల వేయించెను. ఇందు మత్తడి నిర్మాణమునకు 540 హొన్నులు ఖర్చైనట్లు తెలుపబడినది. నరసింహ క్షేత్రమున దేవబ్రాహ్మణ వృత్తులు ముప్పది పెట్టబడినవి. ఈ శాసనము 1070 ఫసలీలో వేయింప బడినది. ఎవ్వరు ప్రభుత్వముచేసినా ఈ ధర్మము నడపింపవలెనను కట్టడి చేయబడినది.

**కాల నిర్ణయము**

శాసనారంభమున "వర్తమాన వ్యవహార చాంద్రమాన శాలివాహన శకవర్షా 1786 అగు ప్లవంగ నామ సంవత్సర శ్రావణ మాసం" అని చెక్కబడినది. ఇందు శా శ, 1586 కు బదులు 1786 వ్రాయబడినది. అబ్దుల్లా కుతుబ్షా పరిపాలనా కాలము. క్రీ శ 1626-1672 శ. నం. 1586 క్రీ శ 1664 కు సమానమగును. కావున శాసనమున పేర్కొనబడిన శ సం 1786 క్రీ. శ. 1864కు సమానము. అప్పటికి గోలకొండ రాజ్యము పతనమై 177 సంవత్సరము లగుచున్నది. కావున శాసన లేఖకుని పొరపాటువలన 1586 కు బదులు 1786 వ్రాయబడినది.

# ఓ. చంద్రశేఖర రెడ్డి



తెభా. ౫
చంద్ర-మ

# మనకథ

# శనిగరం శిలాశాసనము

## అబ్దుల్లా కుతుబ్షా—శాసనము

### శాసనము - మూలము

### మొదటి ప్రక్క

1 వర్త్తమాన వ్య
2 వహార చాంద్ర
3 మాన శాలివా
4 హన శకవర్ష
5 1786[1] అగుష్ట
6 వంగ్గ నామ సం
7 వ్వత్సర శ్రావణ
8 మాసం 1 హజ
9 రతి సులుతా
10 ను అబ్దుల్లా కు
11 తుబు శా హ
12 ఫర్మాను శల
13 వున సైదు ము
14 జాఫరు సరిఖె
15 శాహి కా
16 ర కిర్దుణ నను

1. 1586.

## రెండవ ప్రక్క

1 కట్టించిన కస్గరం
2 పెద్ద చెరువు పొలుణ
3 మత్తడి మొహది బె
4 ను హవాలుదారు దివా
5 ణం శిపాయి హర కా
6 రాయర్కను కట్టించి
7 న లెఖ్ఖ హొన్నులు 540.
8 ను॥ స్న సమాను జు
9 త్తైను అలపు స్న 1070
10 య నరసింహ క్షేత్ర
11 మున దేవబ్రాంహ్మణ
12 ధర్మ వృత్తులు ము
13 ప్పయి పీల్లైనె యవ్వ
14 రు ప్రభుత్వం చేసి
15 నా నడ్పించ్చవలె
16 రాజా విభవ
17 ధర్మో జయతు
18 శవణాతాం॥

# ఉపయుక్త గ్రంథములు - Abbreviations

1. A P. Govt. A. S. : Andhra Pradesh Government Archaeological Series.
2. A. R. A. S. I. : Annual Report of the Archaeological Survey of India.
3. A. R. S. I. E. : Annual Report of the South Indian Epigraphy.
4. C. P. I. of A. P. Govt. Museum of Hyderabad : Copper Plate Inscriptions of Andhra Pradesh Government Museum of Hyderabad.
5. E. C. : Epigraphia Carnatica.
6. E. D. A. D. Early Dynasties of Andhra Desa.
7. E H. I. Early History of India
8 E. I. : Epigraphia Indica.
9 E I M. . Epigraphia Indo Moslemica.
10. E R Epigraphical Report.
11. G I (C I I ) Gupta Inscription s(Central India juscriptions)
12. H. A S Hyderabad Archaeological Series.
13. H O : History of Orissa
14. I. A : Indian Antiquary.
15 I. C · Indian Coins
16. I. I. : Indian Inscriptions.
17. J A. H R S Journal of Andhra Historical Research Society.
18. J. B. O. R. S. : Journal of Bengal Oriental Research Society.
19. J. B. O. B. A· S. : Journal of Bombay Branch of Asiatic Society.
20. J. I. H. : Journal of Indian History.
21. M. J. L. S. : Madras Journal of Literary Society.

22. R. A. D H. E. H. Nizam's Dominions  Report of Archaeology Department His Exaulted Highness of Nizam's Dominions.

23. S I. . Select Inscriptios.

24. S I. I. : South Indian Inscriptions.

# TELUGU

1 అ శా. : అముమకొండ శాసనము

2 ఆం. చ, : ఆంధ్రుల చరిత్ర.

3 ఆం. ప సం. సం : ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక

4 ఆం. సా ప, ప. : ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

5 క చ. : కళింగదేశ చరిత్ర

6 క. చా. శా. : కల్యాణీ చాళుక్యుల శాసనములు

7 తె శా. : తెలంగాణ శాసనములు

8 ప. చ. ; పండితారాధ్య చరిత్ర

9 భారతి.

10 వే. శా. : వేయి స్తంభాలగుడి శాసనము

11 శారద.

12 శి. సా. : శివతత్త్వ సారము



# ముఖ్య పదానుక్రమణిక



## ఆ



## ఇ

## య

## ర



## ల



## వ

